# హిందూ దేశ చరిత్రము

(హైస్కూలు విద్యార్థులకు)

(క్రొత్త 'ఏ' గ్రూపు సిలబసు ననుసరించి)

## మొదటి భాగము — హిందూమహాయుగము

---

Y73(Q2)2
35G3

గ్రంథకర్త:
...పల్లి సోమశేఖరశర్మగారు

15.0
15.

ఇండియన్ పబ్లిషింగ్ హౌస్ లిమిటెడ్
చెన్నపురి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హిందూదేశ చరిత్రము

(హైస్కూలు విద్యార్థులకు)

(క్రొత్త 'ఏ' గ్రూపు సిలబసు ననుసరించి)

మొదటి భాగము — హిందూమహాయుగము

---

గ్రంథకర్త:

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

1933.

ఇండియన్ పబ్లిషింగ్ హౌస్, లిమిటెడ్;

చెన్నపురి.

కాపీరైట్] [వెల రూ. 1.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పీఠిక

ప్రధానముగ ఈ గ్రంథము స్కూలు ఫైనలు విద్యార్థి కొఱకు వ్రాయఁబడినది. స్కూలు ఫైనలుతో చదువు మాను కొను విద్యార్థికి మనకళలు, విద్యలు, మతములు కొంతవఱకు బాగుగ తెలియవలెనని నా లక్ష్యము. ఇట్లని స్కూలు ఫైనలు చరిత్రప్రణాలిక నతిక్రమింపలేదు. ఇటీవల రాజకీయముగ మాఱుచున్నను మన దేశచరిత్రము మొదటినుండియు మత, సంస్కృతి ప్రధానమయినది; కాన మన సభ్యతకు పునాదు లయిన మతపరిణామాదుల కించుక ప్రాధాన్య మిచ్చితిని. ఆంధ్ర విద్యార్థుల కుద్దేశింపఁబడిన దగుట సంగ్రహముగ ఆంధ్ర దేశచరిత్రము నొసంగఁబడినది.

గ్రంథమును ముగించుటలో నెంతటి కాలవిలంబ మయి నను సహించి దీనిని ప్రకటించిన గ్రంథప్రకాశకులగు 'ఇండి యన్ పబ్లిషింగ్ హౌస్'వారికి నా కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథము విద్యార్థుల కెక్కువ యుపయోగపడు టకు చేయవలసిన మార్పులను, సవరణలను అనుభవజ్ఞు లయిన చరిత్రోపాధ్యాయులు దయతో తెలిపిన కృతజ్ఞుఁడను.

1 /11 ఆదెప్పమొదలి వీథి,<br>పురశవాకం, మద్రాసు;<br>శ్రీముఖ, శ్రావణము. — మల్లంపల్లి సోమశేఖరశర్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విషయసూచిక

## మొదటి భాగము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హిందూదేశ చరిత్రము



## మొదటి భాగము

### చరిత్రాధారములు

భరతవర్ష నామాంతరమునం బరఁగు హిందూదేశము మన జన్మభూమి: ప్రపంచమున తొలుదొలుత ముక్తి సాధము నకు సోపానములు కట్టినది మన జన్మభూమియే. ఇతరప్రపంచ మింకను గాఢసుషుప్తి నుండఁగనే మేలుకాంచిన మహాఋషుల నాళ మెఱుఁగని దివ్యగీతికలు వినఁబడిన విచటనే. బుద్ధుఁడు మొదలైన మహాత్ములును, చంద్రగుప్తాశోక విక్రమాదిత్యాది వీరకుమారులును ఉదయించిన దిచటనే. వారి జ్ఞానము వారి సంతతివారమైన మనలో జీర్ణించినది. మనలో అణువు అణు వునఁ బ్రసరించుచున్నది వారి రక్తమే. నివురుగప్పిన నిప్పు వలె వారి దివ్యప్రభావము మనలో అడఁగి మడఁగి యున్నది. ధన్యులము కదా మన మీ దివ్యపుణ్యక్షేత్రమున జన్మించి నందులకు !

మన దేశమును పూర్వము పాలించిన రాజు లెవరో, వారి ధర్మసాహసపరాక్రమకార్యములు, వారి రాజ్యపద్ధతులు, వారు పాలించిననాఁటి సాంఘికాచారనియమములు, జీవన విధానము, మతముల ఏర్పాటులు, విజ్ఞాన వైభవము, సభ్యత మొదలగున వెట్టివో తెలిసికొనుటకు మన పూర్వులు వ్రాసి పెట్టిన క్రమ చారిత్రములు లేవు; కాని యనేకములుగనున్న ఏతద్విషయకమైన చరిత్రమును దెలుపు నాధారములలో వాఙ్మయ, శాసన, నాణక, పురాణవస్తునిర్మాణములు ప్రధాన ములైనవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశీయమని, విదేశీయమని మన చరిత్రవాఙ్మయము ద్వివిధము. మన పూర్వీకు చారిత్రము నల్పస్వల్పముగనైన రాల్చు పురాణేతిహాసములు, పరంపరగవచ్చు గాథలను పొందు పఱిచి వ్రాసిన సింహళద్వీపగ్రంథములగు మహావంశ, దీప వంశాదులు, జైన బౌద్ధగ్రంథములు, మఠములలో భద్రప ఱచు గురుపరంపరను దెలుపు జైనపట్టావలులు, శైవ, వైష్ణవ గురుపరంపరలు మొదలైనవన్నియు దేశీయ వాఙ్మయ ములోనివే. ఇవి కాక సంస్కృతమున నున్న హర్ష చరిత్రము, కాశ్మీరదేశరాజతరంగిణి, విక్రమాంకదేవచరిత్రములవంటి వానితో పాటు దేశభాషలందును ప్రాచీన రాజచరిత్రములు కొన్ని కలవు. కులోత్తుంగచోడ విజయములను దెలుపు 'కళింగట్టుపరణి', విక్రమ చోడ విజయములను గీర్తించు 'విక్రమ చోళనూల' మొదలగు అరవ పుస్తకములును, 'కుమా రరామనుచరితె', 'బల్లాళరాయనుయుద్ధ' మొదలగు కర్ణాట గ్రంథములును, 'కాటమరాజు కథ', 'సిద్ధేశ్వరచరిత్ర', 'ప్ర తాపచరిత్ర', 'పలనాటి వీరచరిత్ర', 'దేశింగురాజు కథ','కృష్ణ రాయవిజయము', 'రామరాజీయము', 'రంగరాయచరిత్ర' మొదలగు ఆంధ్రగ్రంథములు నట్టివే. ఇవి మన దేశచరిత్ర రచనమున కమూల్యాధారములు.

విదేశములనుండి మన దేశమునకు పూర్వకాలమున వచ్చిన యాత్రికులు, వర్తకులు, చరిత్రకారులు, మతబోధకులు వ్రాసియుంచిన వృత్తాంతాదులు విదేశీయవాఙ్మయముగ జేర్ప డుచున్నవి.

ఇక రెండవతరగతికి చెందిన శాసనములు మన పూర్వులు చేసిన దానధర్మములను దెలుపును. ఇవి ముఖ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగ తామ్రశాసనములని, శిలాశాసనములని రెండు తెఱఁగులు: సాధారణముగ మొదటివి బ్రాహ్మణులకో, మతాచార్యులకో లేక మఠములకో చేసిన దానములను, రెండవవి దేవాలయములకుఁ జేసిన ధర్మములను దెలుపును. దాన ధర్మములు చేసిన కాలము, దాతపేరు, అప్పుడు పాలించు ప్రభువు పేరు మొదలైన విం దుండుటచే ఇవి చరిత్రరచనకు చాల సహకారులు.



పూర్వకాలపు నాణెములు

మూఁడవతరగతికి చెందిన నాణెములుకూడ మన పూర్వపు రాజులనుగుఱించియు, వారి మత, వంశ, లాంఛనాదులను గుఱించియు కొంత తెలుపును.

వాఙ్మయ, శాసన, నాణకాధారములు లేనినాఁటి చరిత్రకు పురాణవస్తు, నిర్మాణాదికములే యాధారము. వీనివల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననే క్రీస్తుకు వేలకొలఁది సంవత్సరములకుఁ బూర్వమే హిందూ దేశము గొప్ప సభ్యతతో అలరారుచుండినట్లు నేఁడు సిద్ధాంత మగుచున్నది.

మనము చదువు హిందూదేశచారిత్రము అనేక సంవత్సరములనుండి చరిత్రకారులును, పరిశోధకులును ఈ ప్రధానాధారముల సాయమున సాగించుచున్న చారిత్రకకృషి ఫలితమే. అయిన నిప్పటికిని సమగ్రమైన యనుస్యూత చారిత్రము కొంతగనే యున్నది.

---

## హిందూదేశ నిసర్గస్వరూపము

దేశముయొక్క నిసర్గస్వరూపమునుబట్టి దేశచరిత్రము కూడ దిద్దుబాటగుచుండును గావున ముం దందునఁగుఱించి యించుక తెలిసికొందము.

హిందూదేశమున కుత్తరమున నిరంతరము మంచు కప్పియుండు హిమవత్పర్వతములు పెట్టని కోటగోడలవలె పంక్తులు తీర్చియుండును. ఇవి మిక్కిలి యెత్తై దాఁటరాని వగుటచేత ఉత్తరదిశనుండి యన్యదేశవాసు లెవ్వరును హిందూదేశమునఁ బ్రవేశింప సాధ్యము కాకపోయెను. తూర్పు, పడుమటల ఈ పర్వతపంక్తులనుండి చీలి హిందూ దేశమునకు వాయవ్య, ఈశాన్య దిశలుగ వ్యాపించియున్న పర్వతశాఖలు కొన్ని కలవు. వాయవ్యదిశనున్న యీపర్వతముల నడుమ నడుమఁగల కనుమలలో బొలాన్, కైబరు కనుమలు పేరుకెక్కినవి. ఇట్లే ఈశాన్యదిశపర్వతములందును గనుమలు కలవు. హిందూదేశమునకు బహిర్ద్వారముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలెనున్న పీనిగుండ, అందు ముఖ్యముగ వాయవ్యదిశ నున్న కనుమలగుండ విదేశీయులు, విజాతీయులునైన పెక్కు తెగలవారు చాల ప్రాచీనకాలమున నిచ్చటికి వచ్చియుండిరి. హిందూదేశమునకు మిగిలిన పూర్వ, పశ్చిమ, దక్షిణ దిశల సముద్రము కలదు. క్రీస్తు శకము పదునాలు, పదునేడు శతాబ్దులలో వర్తకవ్యాపారమునిమిత్తము మన దేశమున కేతెంచిన యూరోపియనులు సముద్రములమీఁద వచ్చినవారే.

నిసర్గ స్వరూపము ననుసరించి మన దేశమును రెండు పెద్ద విభాగములు చేయవచ్చును: ఒకటి — హిందూస్థానమను పేర తూర్పు పడుమటలుగ వ్యాపించియున్న విశాలోత్తర భాగము; రెండవది — తూర్పున బంగాళాఖాతమును, పడుమట అరాబియా సముద్రమును, దక్షిణమున హిందూమహాసముద్రమును ఎల్లలుగాఁగల దక్షిణహిందూదేశద్వీపకల్పభాగము. ఈ రెండువిభాగములకు నడుమ నైరృతిదిశనుండి యీశాన్య దిశగ వింధ్యాదిపర్వతపంక్తులు వ్యాపించి యున్నవి. ద్వీపకల్పభాగమున తూర్పుసముద్రతీరముపొడవునను తూర్పు కనుమ లనుపేరను, పడుమటిసముద్రతీరము పొడవునను పడుమటికనుమ లనుపేరను గుట్టలచాలులు కలవు. ఈ రెంటిలో పడుమటికనుమలు చాల ఎత్తయినవి. తూర్పు పడుమటల ఈ చాలులకును, సముద్రమునకును నడుమ మైదానములు కలవు. వింధ్యపర్వతములకు దక్షిణమున ఈ చాలులకు మధ్యనున్న ప్రదేశము 'దక్కను' అను పేరుగల ఎత్తయిన పీఠభూమి. ఇది పడుమట మిక్కిలి ఎత్తుగ నుండి తూర్పువైపు పోను పోను ఎత్తు తగ్గుచుండును. పెక్కు గుట్టలవరుసలచే దక్కనునుండి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేఱగు ద్వీపకల్పమునందలి యత్యంత దక్షిణ భాగమునకు దక్షిణహిందూదేశ మని పేరు.

హిందూస్థానమంతయు హిమవత్పర్వతములలోఁ బుట్టు సింధు, గంగా, బ్రహ్మపుత్రా నదులును, వాని యుప నదులును బ్రవహించు గొప్ప మైదానము. నిరంతరజలసమృద్ధములైన నదు లిం దుండుటచేత ఇది సారవంతమై సస్యసంభరితమై పెంపెసఁగుచుండును. విదేశాగతుల పరాక్రమధాటికి మున్ముందుగ ఎదురొడ్డి నిలిచి వారిని నిలువరించుచు వచ్చిన భరతవర్ష మహాసంగ్రామక్షేత్ర మిదియే. హిందూదేశమున చరిత్రప్రసిద్ధిగల స్థలము లన్నిట ఇది నాయకమణి. ప్రాచీన కాలమున మహాసామ్రాజ్యములు మొట్టమొదట ఇచ్చటనే వెలసినవి.

ద్వీపకల్పభాగమునందలి సుప్రసిద్ధములైన తపతి, నర్మద, మహానది, గోదావరి, కృష్ణ, కావేరి నదులలో మొదటి రెండు మాత్రమే పడుమటఁ బ్రవహించి అరాబియాసముద్రమునను, మిగిలినవి తూర్పుగఁ బ్రవహించి తూర్పు కనుమలను ఛేదించుకొని బంగాళాఖాతమునను గల యుచున్నవి. సారవంతములైన యీనదీతీరప్రాంతములే హిందూదేశమున మానవుని మొట్టమొదటి నివాసభూములు.

వింధ్యపర్వతములును, నర్మదా తపతీ నదులును, మధ్యపరగణాలకు దక్షిణముననున్న దట్టముగఁ బెరిఁగిన కాఱడవులును దక్కను దేశమును హిందూస్థానమునుండి వేఱు పఱుచుచుండిన కారణమున ప్రాచీనకాలమున చాల శతాబ్దులవఱకు ఈ రెంటికి పరస్పరము సంబంధము లేకయుండెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇప్పటికి ఈ దక్షిణోత్తరవిభాగములు రెంటికి చరిత్రమతా చారవ్యవహారములలోఁ జాల వ్యత్యాసములు కలవు. తపతీ, నర్మదానదులు చాల చోటుల దాఁటఁదగియుండుటచేతను, వింధ్య పర్వతములు తూర్పు పడుమటి కొనల ఎత్తు తగ్గియుం డుటచేతను, అరణ్యములు కాలక్రమమున నశించుటచేతను కష్టసాధ్యమైనను ఉత్తర హిందూస్థానమున రాజ్యములు స్థాపించినవారు తమ యధికారమును దక్కను దేశముననుు వ్యాపింపఁజేసికొన వీలయ్యెను గాని లేనిచో ఈ విభాగములు రెంటికి వేఱ్పాటు శాశ్వతముగనే నిలిచియుండెడిది.

ఉత్తరహిందూస్థానమునందువలెనే దక్కను, దక్షిణ హిందూదేశములందుఁగూడ గొప్ప రాజ్యము లనేకములు వర్ధిల్లినవి. కాని పర్వతములు మొదలగు ప్రకృతిసిద్ధావరోధ ములమూలమున ప్రాచీనకాలమున దక్షిణహిందూ దేశరాజ్యములు దక్కనుపీఠభూమి నాక్రమించుట కాని, దక్కనురాజ్యములు ప్రాక్పశ్చిమసముద్రతీరపు మైదానము లను లోఁబఱుచుకొనుట కాని చాల కష్టసాధ్య మగుచుండెను. హిందూదేశవాయవ్యేశాన్యదిశల పర్వతపు కనుమలును, హిందూదేశ మధ్యభాగముననుు, ప్రాక్పశ్చిమసముద్రతీరము లను పర్వత పంక్తులును లేనిచో మన దేశచరిత్రము వేఱొకరీతి నుండి యుండును.

నిసర్గస్వరూప మిట్లుండుటచేతనే పూర్వము మన దేశమునంతను ఒక్క ఛత్రచ్ఛాయను నిలిపియుంచఁగల మహా స్సామ్రాజ్య ముదయింప నవకాశము లేకపోయెను. కావుననే మన దేశచారిత్రము ఆయాప్రాంతముల విలసిల్లిన వేఱు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేఱు రాజ్యములయొక్కయు, వానిని నెలకొల్పిన రాజుల యొక్కయు చరిత్రముమాత్రమే యైనది. ఏకైక సామ్రాజ్యచ్ఛాయను వర్ధిల్లినవారు కాకపోవుటచేతనే 'రాజకీయముగ మన మందఱము నొక్కరమే' యను జాతీయభావము పూర్వకాలమున హిందూదేశీయులకు లేకపోయెను. ఇది లోపించినను అసలు వారికి ఏకీభావము లేకపోలేదు; ఎట్లన, హిందూదేశీయులలో అత్యధిక సంఖ్యాకులకు వేదము లొక్కటే; పవిత్రభాష సంస్కృత మొక్కటే; పురాణేతిహాసము లొక్కటే; పుణ్యక్షేత్రములును, పుణ్య తీర్థములు నొక్కటే; కాళిదాసాది మహాకవులు, కావ్యములు నొక్కటే. శైవమైన నేమి, వైష్ణవమైన నేమి, మాధ్వమైన నేమి — హిందూమత మొక్కటే. ఈ విధమున సేతుహిమాచలపర్యంతముఁ గల హిందూదేశ నివాసులు ఒక్క సంస్కృతి*చే నిబద్ధులై ఐక్యము కలిగియుండిరి.

---

## ఆదిమ నివాసులు : అనార్యజాతులు

ఇదివఱకు వర్ణితమైనది ఇప్పటి హిందూదేశ నిసర్గ స్వరూపము: కాని యిందలి ద్వీపకల్పభాగమె అత్యంత పురాతనమైన దనియు, అది వేలకొలఁది సంవత్సరములకుఁ బూర్వము పశ్చిమమున దక్షిణఆఫ్రికాతోను, దక్షిణమున ఆస్ట్రేలియాతోను గలసియుండె ననియు భూగర్భశాస్త్రజ్ఞులు చెప్పెదరు. అంతియ కాక, వారి యభిప్రాయముప్రకారము మటుపెనుక పెక్కువందల శతాబ్దులనుండి అగ్నిపర్వతప్రకోపములు, భూకంపములు మొదలైన అనేకభౌతికవిప్లవము

* మానవుఁడు పరిపూర్ణుఁ డగుటకును, శ్రేయస్సు కలుగుటకును జేయు విజ్ఞాన, సంప్రదాయాత్మక మైన కృషినే సంస్కృతి యందురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లొకదానివెంబడి నొకటి సంభవించుచు వచ్చిన పిమ్మటనే ఇప్పటి సింధు, గంగానదుల మైదానము లేర్పడి హిందూదేశ మిప్పటి యాకృతిఁ దాల్చెను. కావున ద్వీపకల్పభాగమగు దక్కను దేశమే హిందూదేశమున మానవుని యాదిమనివాస స్థానము.

వేలకొలఁదిసంవత్సరములనుండి యీదేశమున కనేక జాతులవారు, అనేక భాషలవారు, అనేక సభ్యతలవారు వచ్చి యిచ్చట స్థిరనివాసము లేర్పఱుచుకొని యిచ్చటి వారితోఁ గలసిపోవుటచేత దక్కను దేశమున తొలుదొల్త నివసించిన ప్రజలను గుఱించి కాని, వారి భాషను గుఱించి కాని, సభ్యతను గుఱించి కాని తెలిసికొనుట చాల కష్టము. అయినను అట్టి వారు కొంద ఱుండి రనుటకు అత్యంతప్రాచీనములైన శ్మశాన వాటికలందును, వలసతావులందును గానవచ్చు పురాణవస్తు, నిర్మాణాద్యవశేషములే తార్కాణము. వీనియాధారము ననే అప్పటి జనుల సభ్యతను గుఱించి కొంత యూహింప వీలగుచున్నది.

ఆ వస్తు నిర్మాణాదులు కేవలము శిలామయములుగనే యుండుటవలన అప్పటి మనుష్యునికి శిల తప్ప లోహము లేవియుఁ దెలియవని వానినిగుఱించి తెలిసినవారి యభిప్రాయము. మొదట ఈ వస్తువులు చాల మోటుగను, కఱుకుగను ఉండెను. శతాబ్దులు కడచినకొలఁది మనుష్యుఁడు ఉన్నతి నంది తన పని ముట్లకు తీర్పు తీరికలు దిద్ది మెఱుఁగులు పెట్టెను. ఈ కాల మును నవీనశిలాయుగ మనియు, పనిముట్లు మోటుగఁ దయా రైన పూర్వకాలమును ప్రాచీనశిలాయుగ మనియు నందురు. ప్రాచీనశిలాయుగమునకు సంబంధించిన పనిముట్లు చెన్నరాజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

థానియందు, అందు ముఖ్యముగ చెంగల్పట్టు జిల్లాలో చాల దొరకినవి. నవీనశిలాయుగమునకు సంబంధించినవి హిందూ దేశమున పెక్కు రాష్ట్రముల, అందు ముఖ్యముగ చెన్నరాజ ధానియందలి సేలం, అనంతపురం, కర్నూలు, బళ్లారి జిల్లా లలో ఎక్కువగఁ గానవచ్చినవి.

ప్రాచీన శిలాయుగమున ఒక స్థిరమైన కాఁపురము లేక, ఒక స్థిరవృత్తి లేక అడవులఁ దిరుగాడుచు, కొండ గుహల తల దాఁచుకొనుచు వేఁటవలన జీవించుచుండిన మనుష్యుఁడు నవీన శిలాయుగమున అందందు వలస లేర్పఱుచుకొని స్థిరనివాసము చేయుచు వ్యవసాయమును సాగించెను. ప్రత్తి పండించి దూదితో నూలు తీసి బట్టలు నేసి, వానికి రంగులు వేయ నేర్చెను. చేతి తోనే కాక కుమ్మరిసారె కనిపట్టి దానితోఁగూడ కుండలు చేసెను. జంతువులను మచ్చికపఱిచి స్వలాభమున కుపయోగిం చుకొనెను. ప్రాచీనశిలాయుగమునందువలె శవముల నడవు లలో వదలివేయక కాల్చిన మట్టిపేటికలలోనుంచి కాని, బానలలో అస్థ్యాద్యవశేషములను పెట్టి పూడ్చిపెట్టి కాని సమాధులు కట్టి కాని తన పెద్దలయెడ గౌరవము చూపెను. ఇట్టి పేటికలు, బానలు చాలదొరకినవి. ఈకాలపు మనుష్యుఁడు బొమ్మలు గీయుట తెలిసికొనెను. సాధారణముగ వేఁటకు సంబంధించిన ఇట్టి బొమ్మలు అందందు కొండగుహాలలోఁ గానవచ్చినవి. ఇంతటి యపారాభివృద్ధి నొందిన నవీనశిలా యుగ మనుష్యుఁడు ప్రాచీనశిలాయుగ మనుష్యుని సంతతి వాఁడగునో కాదో తెలియదు కాని పురాణకాలమున మన మాతృభూమిని మనుష్యుఁ డెప్పుడు తన యుపకరణములకు అందచందములు దిద్ది సౌందర్యము నుపాసింపఁదొడఁగెనో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాఁటినుండియే హైందవసభ్యత యారంభ మగుచున్న దనుట నిశ్చయము.

ఇంకను శతాబ్దులు గడచి చాల అభివృద్ధి నందినపిదప మనుష్యునికి లోహముల యుపయోగము తెలిసెను. ఈ కాలమున పనిముట్లకు ఉత్తరహిందూదేశమున రాగియు, దక్షిణ హిందూదేశమున ఇనుమును వాడుకలోనికి వచ్చెను. ఈ లోహ యుగమునందలి వారు నవీనశిలాయుగమనుష్యుల సంతతి వారే యని కొందఱు చరిత్రకారుల యభిప్రాయము.

లోహ యుగమునందలి జనులకంటె ఆర్యులు హిందూదేశమునఁ బ్రవేశించునాఁటి కిచ్చటనుండిన కొలేరియనులు, ద్రావిడులు, మంగోలియనులు అను ముప్వురు ప్రధానజాతుల వారినిగుఱించి మనకు బాగుగఁ దెలియును.

కొలేరియనులు హిందూదేశమున కీశాన్యదిగ్భాగమున నున్న హిమవత్పర్వతపుఁ గనుమలగుండ వచ్చియుందురని పెక్కుమంది చరిత్రకారు లందురు. వేఁట వీరి ప్రధాన జీవనాధారము: వీరు వ్యవసాయమున నిపుణులు. భూతములును, దయ్యములును అడవులలోను, పురాతనమహావృక్షములలోను ఉండునని నమ్మి, యవి తమకు హాని చేయకుండుటకై తేనె, పాలు మొదలగు వాని నుపహారములుగ నొసంగి చిన్న జంతువులను బలియిచ్చి వానిని గొలుచువారు. వీరిలోఁ బెక్కుకులములు కలవు. కట్టుబాటు లేర్పఱుచుకొని యొక్కొక్కకులమువా రొక్కొక్క గూడెమున నివసించుచుండిరి. వీరి సంతతివా రిప్పటికిని పశ్చిమటి బంగాళమునను, ఛోటానాగపూరులోను, ఓఢ్రదేశమునను, మధ్యపరగణాలలోను గలరు. 'ముండా' భాషలు మాటలాడు వీరిని 'ముండేరియను'లనియు అందురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంఖ్యయందును, సభ్యతయందును కొలేరియనులకంటె అధికులు ద్రావిడులు. వీరు వాయవ్యదిశ నున్న కనుమల గుండ ఈ దేశమున కరుదెంచి యచ్చట అదివఱకు నివసించు చుండిన కొలేరియనులను పర్వత ప్రాంతములకుఁ దఱిమివైచి ఉత్తర హిందూదేశము నాక్రమించుకొనిన విదేశాగతులని కొందఱు, దేశీయులేయని కొందఱు నందురు. పెక్కులుగ నున్న యిట్టి వాదముల నింకను సత్యము నిర్ధారితము కాలేదు.

ద్రావిడులు అడవులను నఱికి, భూమిని దున్ని, సేద్యము చేయుచు గ్రామముల నివసించు గొప్ప వ్యవసాయకులు. ఓడలు, బియ్యము, మల్లుసెల్లాలు, పిప్పళ్లు, చందనము, దంతము, నెమళ్లు, కోతులు మొదలగువానితో అంతటి పురాణ కాలముననే సముద్రములమీఁద సాహసికులై దేశాంతరములకు, ద్వీపాంతరములకుఁ బోయి వర్తకము నడపినవారు. వీరిలో నేర్పరులైన శిల్పులు, వడ్రంగులు, నేఁతపనివాండ్రు మొదలగువా రుండిరి. ఒక్కొక్క గ్రామమునకు ఒక్కొక్క యధిపతి యుండెను. గ్రామస్థు లాతని యాజ్ఞలకు విధేయులై నడచుకొనుచుండిరి. అంతటి ప్రాచీనకాలముననే ద్రావిడులు రాజ్యములు నిర్మించుకొని రాచఱికమును సాగించుచుండిరని కొంద ఱందరు. వీరు నాగులను బూజింతురు. భూమిని దేవతగఁ గొలుతరు. తమ దేవతలకు జంతువులను బలియిత్తురు.

చాల శతాబ్దులకుఁ దరువాత ఈ దేశమునకు వచ్చిన యార్యులకును, ఈద్రావిడులకును పెక్కుయుద్ధములు జరగెను. తుదకీ యెుత్తిడిమూలమునను, ఆర్యులతోడి పోటమిమూలమునను వీరు దక్షిణమున కరుదెంచి తుద కచ్చటనే యుండిపో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిరి. నేఁడు దక్షిణహిందూదేశమున నున్న తమిళులు, ఆంధ్రులు, కర్ణాటులు, మలయాళులు ఆ ద్రావిడుల సంతతి వారే. వీరు మాటాడు భాషలకు ద్రావిడభాష లని పేరు. ఆర్యులకు వీ రోడిపోయినను వీరితోడి సంపర్కమున ఆర్యుల మత, సంఘ, భాషాదివిషయములఁ బెక్కు మార్పులు కలిగెను.

ఇఁక మంగోలియనులు హిమవత్పర్వతముల కుత్తర మున నున్న తిబెత్తు, చీనా దేశముల నివసించుచుండినవారు. సరాసరిగ ఉత్తరముననుండి యీ దేశమునఁ బ్రవేశించుటకు పర్వతపంక్తు లవరోధములుగ నుండుటచేత ఈశాన్యదిగ్భా గమున నున్న పర్వతపుఁ గనుమలగుండ వీ రీదేశమునకు వచ్చి యుందురని చరిత్రకారు లూహించుచున్నారు. వీరి సంతతి వారు నేఁడు బర్మా, అస్సాము, నేపాలు, బూటాను ప్రాంత ములఁ గానవచ్చెదరు.

ఈ పూర్వోక్త జాతులకుఁ దరువాత హిందూదేశమున కరుదెంచినవారు ఆర్యులు. వీరి యాగమనముతో హిందూ దేశచారిత్రమునకు రూపురేఖ లేర్పడుచున్నవి. ఏనాఁడు ఆర్యుల పవిత్రయజ్ఞాగ్నిహోత్ర మీ భరతవర్ష వేదికను ప్రజ్వరిల్లెనో నాఁటినుండియే విజ్ఞానకాంతులు దశదిశల వెల్లి విరిసెను. హైందవజాతీయపరిణామమునకు మూలకారకులైన వీరినిగుఱించి ప్రత్యేకము తెలిసికొందము.

సింధు, గంగాది మహానదులచే సారవంతమై, బం గారు వెండి మొదలగు అమూల్యఖనిజములచే భాగ్యవం తమై పరిఢవిల్లిన మన హిందూదేశమునకు ఆర్యుల యనంత రము 'నాటు'ననో, సముద్రముమీఁదనో నివాసయోగ్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లైన సుక్షేత్రముల నన్వేషింపనో, రాజ్యమును సంపాదింపనో, మతవ్యాపనదీక్షనో, వర్తకవ్యాపారాకాంక్షనో పారసీలు, యవనులు, శకులు, పహ్లావులు, హూణులు, మహమ్మదీయులు, యూరోపియనులు మొదలగు వేఱు వేఱు జాతులవారనేకులు వచ్చిరి. సాధారణముగ అన్యదేశాగతులైన విజాతీయులకును, దేశీయులకును సమరసంఘట్టనములు ఉత్తర హిందూస్థానముననే సంభవించుచు వచ్చినందున గొప్ప జాతీయసమ్మేళనముమాత్రమే కాక అప్పటికి నిప్పటికి రాజకీయములైన గొప్ప పరిణామములును 'ఉత్తరాది'ని సంభవించుచుండ దానికిఁ గడుదవ్వుల నున్న 'దక్షిణాది' సాంఘికాచారవ్యవహారములఁ దన వ్యక్తిత్వమును నిలుపుకొనుచు, ఆర్యసంస్కృతికి మెఱుఁగులు దిద్దుచు వచ్చుచున్నది.

---

## సింధునదీప్రాంతసభ్యత

ఆర్యులు హిందూదేశమున కేతెంచి సింధునదీప్రాంతముల నాక్రమించునాఁటికే అచ్చట గొప్ప సభ్యత వర్ధిల్లుచుండినట్లు సింధుదేశములోని మోహెంజోదారో, దిగువ పంజాబుదేశములోని హరప్పగ్రామముల సమీపమునఁ గానవచ్చిన భూగర్భవిశేషములనుబట్టి తెలియనగును. కడచిన ఏడెనిమిది సంవత్సరములనుండి గౌనర్మెంటు పురాతత్త్వశాఖవారు సాగించుచున్న త్రవ్వుపనివలన భూగర్భముననుండి అనేక చిత్రవిచిత్రములు బయలుపడినవి.

కొంచెము లోఁతు త్రవ్వఁగనే క్రీస్తుశకము రెండవ శతాబ్దినాఁటి బౌద్ధనిర్మాణావశేషములు, అప్పు డాప్రాంతములఁ బాలించిన రాజుల నాణెములు, వాడుకలో నుండిన లిపులశాసన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చిత్రలిపి ముద్రికలు

ములు, రంగువస్తువుల యవశేషములు కనఁబడినవి. ఇంకను ఝాల లోఁతుగ త్రవ్వఁగా వేఱు వేఱు మట్టి తెరలలో భూగర్భమునఁ బూఁడిపోయిన పెద్ద పట్టణములే బయలుపడినవి. వీనిలో ఇప్పటి నగరములలోవలెనే తీర్చి దిద్దిన పెద్ద వీథులు, వానినుండి చీలిన సందులు గొందులు, ఇటుకతోను, సున్నముతోను, ఱాతితోను గట్టిన ముఱికినీటి పెద్ద తూములు, ఆవమునఁ గాల్చినట్టి కాని, ఎండ కెండఁ బెట్టినట్టి కాని యిటుకలతోఁ గట్టిన పెద్ద భవనములు, చిన్నయిండ్లు కలవు. ప్రతి పెద్ద భవనమునకు మోఱుఁగు దిద్దిన నునుపైన యిటుకలతో 'చప్టా' చేసిన చావడులు, నీరు ప్రవహించుటకు ఖండగొట్టములతోడి స్నానముల గదులు కలవు: ఇటుకలతోనో, మట్టి యొఱల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోనో తీర్చి కట్టిన బావి కాని, చిన్నకోనేరు కాని కలదు. ఈ పట్టణములందు చేతితోను, కుమ్మరిసారెమీఁదను జేసిన రక రకములైన కుండలు, కాఁపురమున కవసరమైన యితర వస్తువులు, రకరకముల యాభరణములు, నాణెములు, పాచికలు,



భూగర్భమున దొరకిన కుండలు, ప్రతిమలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మట్టితోను, సున్నపు జాతితోను జేసిన స్త్రీ పురుష ప్రతిమలు, జంతువుల బొమ్మలు, చదరములైన ముద్రికలు మొదలైనవి చాల దొరకినవి.

అక్షరములకు బదులు చిత్రములనే లిపిగ నుపయోగించిన యిచ్చటి ముద్రికలమీఁద ఖడ్గమృగము, వృషభము మొదలగు జంతుస్వరూపములుకూడఁ గలవు. ఇట్టి చిత్రము లింతవఱకు హైందవకళలో నెందును, ఎచ్చటను గానరావు. ఇంతవఱకుఁ దెలిసిన దేశీయలిపులలో ఇట్టి లిపియు నెఱుఁగరాదు. హిందూదేశమునకుఁ బశ్చిమమున నున్న మెసొపొటేమియా దేశమున క్రీస్తుకు నాలుగు, మూఁడువేల సంవత్సరములకుఁ బూర్వము అస్సీరియా, బాబిలోనియాసామ్రాజ్యములు వర్ధిల్లినచోటుల పాటిదిబ్బలు త్రవ్వఁగా ఇట్టి చిత్రలిపి ముద్రికలే బయలుపడినవి. ఈ కారణమునను, మఱి కొన్ని యితర హేతువులవలనను ఈ భూగర్భస్థపట్టణాదికములవలన బహిర్గతమైన విస్మృత సభ్యతయు నంతటి ప్రాచీనమైనదే యగునని పురాతత్వవిదుల యభిప్రాయము.

ఇవియే సత్యమగుచో, క్రీస్తుకు మూఁడువందల సంవత్సరములకంటెఁ బూర్వపు నిర్మాణము లింతవఱకుఁ గాన్పింపని హేతువున కడు ప్రాచీనమైనదని దృష్టాంతపూర్వకముగఁ జెప్పరాని హైందవసభ్యత యీ విశేషములమూలమున క్రీస్తుకు అధమము మూఁడువేలసంవత్సరములనాఁటికె గొప్పదిగ నుండినట్లేకాక యీ ప్రాంతముల నివసించుచుండిన యప్పటి జనులు గొప్పనగరములు నిర్మించి నాగరికులుగ నుండినట్లుకూడ నిశ్చయ మగుచున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇయ్యది యార్యులకుఁ బూర్వము వర్ధిల్లిన సభ్యత యనియు, ఈవిస్మృతసభ్యతామహితులైన జనుల మతము శైవమనియు నేఁడు నిర్ధారిత మగుచున్నది. భూగర్భ బహిర్గతములైన యీ నూతన విశేషముల ననుసరించి చూచినచో అనార్యు లనఁబడువారికి నాఁడు శిల్పకళాద్యనేకవిషయములఁ గల విజ్ఞానపరిజ్ఞానములు నేఁటి మనకు విస్మయజనకములు కదా!

---

## ఆర్యులు : వారి సభ్యత

ఇదివఱలో ఆర్యులు హిందూదేశమునకు దేశాంతరము నుండివచ్చిరని చదివియుంటిమి. ఆర్యులను గుఱించి తెలుపు ఏకైక గ్రంథము ఋగ్వేదమున ఇట్టి వాదమున కాధారములు లేవు; కాని పండితులు కొందఱు ఆర్యభాషయైన సంస్కృతమునకును, గ్రీకు రోమను ఫ్రెంచి జర్మను ఇంగ్లీషు లాటిను మొదలగు కొన్ని యూరోపియను భాషలకును గల పరస్పర శబ్దసాదృశ్యాదులను పరిశోధించి ఇట్లు సిద్ధాంతము చేసిరి. ఈ యుభయభాషలు మాటలాడువారి పూర్వులును వేలకొలఁది సంవత్సరములకు పూర్వ మెప్పుడో ఒక్క సామాన్యభాష మాటాడుచు, ఒక్క కుటుంబముగ నుండిన యార్యులే. వీరిలో కొందఱు ఏకారణముననో అత్యంతప్రాచీన కాలముననే యూరోపు ఖండములోని వేఱు వేఱు ప్రాంతములకుఁ బోయిరి; వేఱొకకొందఱు ఆసియాఖండదేశములకు వచ్చిరి. ఇట్లు చెప్పువారిలోఁగూడ ఆర్యులయాదిమ నివాసస్థానమును గూర్చి పెక్కు అభిప్రాయభేదము లున్నను అది యూరోపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లోని ఇప్పటి ఆస్ట్రియా, హంగేరీ, బొహిమియాలు ఆక్ర మించిన ప్రదేశమే యని చాలమంది నిర్ణయించిరి; అచ్చటి నుండి యూరోపుఖండదేశముల కరిగినవారికి 'యూరోపియను ఆర్య'లను సంకేత ముంచిరి. పూర్వోక్త పండితుల సిద్ధాంతము ప్రకారము ఆసియాఖండదేశముల కరుదెంచినవారు ఆసియామైనరు, పారసీకములగుండ పారసీక దేశమునకు వచ్చి అటఁ గొంతకాల ముండిపోయిరి. అచ్చట నుండఁగా వారిలో వారికిమతవిభేదములమూలమునవివాదములు సంభవించి రెండు తెగలై, యొకతెగవా రచటనే నిలిచిపోయి పారసీకార్యులైరి; రెండవతెగవారు హిందూదేశమునఁ బ్రవేశించి హిందూర్యులు నాఁబరఁగిరి. పారసీ కార్యులకు 'జెంద్-అవెస్తా' యును, హింద్వార్యులకు 'ఋగ్వేదము'ను ప్రధాన మతగ్రంథములు.

ఆర్యు లన్యదేశాగతులు కారని చెప్పువారుకూడ పరిశోధక పండితులలోఁ బెక్కురు కలరు. వీరిలోఁ గొందఱు ఆర్యానార్యభేదము నంగీకరింపక, యుభయులు నొక్కజాతి వారనియే వాదించెదరు. అగ్నికర్మవిహితులైన ఆర్యు లనఁబడువారికిని, తద్రహితులైన ఆర్యేతరులకును ఒక్కసంస్కృతి యందే భేదము కలదని వీరి యభిప్రాయము. వీరిలోఁ గొందఱి యుద్దేశముప్రకారము కాశ్మీరమును, వేఱొకకొందఱి యభిప్రాయము ప్రకారము సప్తసింధుదేశమును ఆర్యుల యాదిమ నివాసస్థలము. ఇన్ని వాదములకుఁ దోడు కీర్తిశేషులైన లోకమాన్య శ్రీబాలగంగాధరతిలకుగారు జ్యోతిశ్శాస్త్రాధారమును బట్టి ఆర్యుల మొదటినివాసస్థానము ఉత్తరధ్రువప్రాంతమని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మఱియొక వాదమును బయలుదేఱఁ దీసిరి. పరస్పరవిరుద్ధ ములుగ నున్న యీ వాదముల కంతము కనఁబడదు. ఇప్పటి కింకను ఆర్యులు విదేశాగతు లనువాదమే చెల్లుచున్నది.

పైనుండి వచ్చిన ఆర్యులకును, అదివఱ కిచట నివసించు చుండిన అనార్యులకును పెక్కు యుద్ధములు జరిగియుండుట సహజము. అనార్యులుకూడ ఆర్యుల కంత తేలికగ భూమిని విడిచినవారు కారు. దస్యులనియు, దాసులనియు, రాక్షసు లనియు పేర్కొనఁబడిన యీ యనార్యజాతులతో ఆర్యులకు జరిగిన యుద్ధములనుగుఱించిన సూచనలు ఋగ్వేదమునఁ జాలచోటులఁ గలవు. అది రెండుజాతులకుమాత్రమే కాక విశేషాంతరము కల రెండు సభ్యతలకు జరగిన సంఘర్షము. క్రమక్రమముగ దస్యుల నోడించుచు ఆర్యులు కొంత కొంత ప్రదేశము నాక్రమించుచు వచ్చిరి. ఓడిపోయిన దస్యులు అర ణ్యములందును, కొండవఱువులందును దాఁగియుండి తఱి వేచి ప్రశాంతములైన యార్యగ్రామములపైఁ బడి దోఁచుకొనుచు, వారి పశువులను దొంగిలించుకొని పోవువారు. వందలకొలఁది సంవత్సరము లీవిధమున 'దస్యు' లార్యులతోఁ బోరాడుటయే కాక, వారి దేవతల నేవగించుచు వారి యజ్ఞయాగాదులను విధ్వంసముచేయుచు, వారి ధనమును కొల్లకొట్టుచు చాల బాధలు పెట్టిరి. తుట్టతుదకు ఆర్యులు విజయులై క్రమక్రమముగ ఉత్తర హిందూస్థానమున వ్యాపించినకొలఁది అనార్యజాతుల వారు దక్షిణ హిందూదేశమునకుఁ బోయి తుద కచ్చటనే స్థిర నివాసము చేయఁజొచ్చిరి. అనార్యులు తమ క్రతువులను విధ్వంసము చేయుచుండినను విజయులైన యార్యులు వారిని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వినాశముఁ గావింపక క్రమముగ లోఁబఱుచుకొని అన్యోన్యతఁ గలిగి మెలఁగుటచేత ఉభయులును పరస్పరసంపర్కమున సంస్కృతి, సభ్యతల నభ్యుదయము నొంది కాలక్రమమున నొక్క మహాజాతినిర్మాణమునకుఁ గారకు లైరి. ఆర్యుల యుదారాశయమున కిది నిదర్శనము కదా!

అట్టి యార్యుల వాఙ్మయమునందలి ప్రప్రథమగ్రంథము ఋగ్వేదము. ఋక్కులన మంత్రములు. అట్టివి కొన్ని కలసిన యొక సూక్తమును, అట్టి కొన్నిసూక్తములు కలసిన యొక యనువాకమును అగును. పెక్కు అనువాకముల కూర్పునకు మండల మని పేరు. ఋక్సంహితలో నిట్టివి పదిమండలములు కలవు. ఈ వేదమంత్రము లీశ్వరప్రోక్తము లనియు, అపౌరుషేయము లనియు హిందువుల గాఢవిశ్వాసము. తమ తపోబలమువలన వీనిని కనిపట్టి విని ప్రకటించిన ఋషులను మంత్రద్రష్ట లందురు. వారిచేత వినఁబడ్డవి కావుననే వేదములకు శ్రుతులని పేరు. మంత్రద్రష్టలలో పురుషులే కాక స్త్రీలు కూడఁ గొందఱు కలరు.

నాఁటి యార్యుల సాంఘికాచార వ్యవహారములు, కళలు, పరిశ్రమలు, వ్యవసాయము, వారి మత విశ్వాసములు, మతకర్మలు మొదలగువానిని ఋక్సంహితవలనఁ దెలిసికొననగును. అంతియ కాక యందు ఆర్యుల మనోరథములు, ఆశయములు, దానము నిచ్చినవారినిగూర్చియు, దేవతలను గూర్చియు స్తుతులు, దేవతాప్రార్థనములు మొదలగున వనేక విషయము లుండుటచేత ఆర్యసభ్యతను గుఱించి తెలిసికొనుట కది యమూల్యగ్రంథము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఋగ్వేదకాలమునాఁటి యార్యులు సింధు, వితస్త (జేలం), అసిక్ని (చీనాబ్), పరుష్ణి (రావీ), శతద్రు (సత్‌లజ్), సరస్వతీ, దృషద్వతీ నదులు ప్రవహించు సప్తసింధుదేశమున నివసించుచుండిరి. దేశము స్వాధీనమైన వెంటనే ఆర్యులు అడవులు నఱకి, భూమిని కృషియోగ్యముగను, వాసయోగ్యముగను జేసిరి. నదులు ప్రవహించు మైదానములనతికాలముననే గ్రామములతోను, నగరములతోను బ్రకాశించినవి.

పవిత్రాగ్నిహోత్రసన్నిధానమున ఏకపత్నీవ్రతము నవలంబించి భార్యను పరిగ్రహించిన యార్యుఁడు తన కుటుంబమునకుఁ దానే పెద్దయై తన కుటుంబమునందలి యితరులు తన యాజ్ఞకు విధేయులై నడచుకొనుచుండ సమష్టికుటుంబపద్ధతిని గృహపరిపాలనము నిర్వహించుచుండెను. ఏకపత్నీపరిగ్రహణమే అప్పటి యాచారమైనను బహుభార్యలను గట్టుకొనిన సంపన్నులును, ప్రభువులుఁగూడ నుండిరి. భార్య భర్తకార్యముల సమానముగఁ బాల్గొనుచు, క్రతుకర్మాదికములకు సోమరసమును సిద్ధముచేయుచు, అగ్నిహోత్రమునుగూర్చి అత్యంతము శ్రద్ధాళువై యుండెడిది.

ఆర్యులు వెదురుతోను, కఱ్ఱతోను కట్టిన యిండ్లలో నివాసము చేయుచుండిరి. ఆర్యజనసామాన్యమునకు విశు లని పేరు. వీరిలో పెక్కు కుటుంబముల వారు కలసి యాక్రమించుకొన్నప్రదేశ మొకగ్రామము. గ్రామకార్య నిర్వహణమునకు 'గ్రామణి' యను పేర నొకయధిపతి యుండెను. ప్రతిగ్రామమున వడ్రంగి, నేత నేయువాఁడు, కమ్మరి, స్వర్ణకారుఁడు మొద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లగువా రుండి గ్రామస్థుల కవసరములైన పనిముట్లు మొదలగు నవి తయారుచేసి యిచ్చుచుండిరి.

రక్తసంబంధము కలసిన పెక్కు కుటుంబములవా రొక్క కులముగను, పెక్కు కులములవా రొక్క తెగగను ఏర్పడిరి. ఆనాఁటి తెగలవారిలో భరతులు, త్రిత్సువులు కడుప్రసిద్ధులు. ఒక్కొక్క తెగవా రాక్రమించిన ప్రదేశము రాజ్య మయ్యెను. ఒక్కొక్కరాజ్యమున కొక్కొక్కప్రభు వేర్పడి పలువు రార్య వృద్ధులతోఁ గూడిన సమితియొక్కయు, సభయొక్కయు తోడ్పాటుతో పరిపాలనము సాగించుచుండెను. ఇట్టి రాజ్యములు సప్త సింధుదేశపు మైదానముల అనేకములు విలసిల్లినవి. ఈ కాల మున వీరిలో వీరికి జరగుచుండిన యుద్ధములను గుఱించికూడ ఋగ్వేదమున సూచనలు కలవు. వీనిలో త్రిత్సువులకును, భర తులకును శతద్రునదీతీరమున జరగిన యుద్ధము ప్రసిద్ధమైనది.

శిరస్త్రాణములను, కవచములను ధరించి రథారూఢులై ఆర్యులు యుద్ధభూమి కరుగుచుండిరి. రథబలమును, కాల్బల మును అప్పటి సైన్యాంగములు. సర్వ సైన్యములకు అధిపతి సేనాని. యుద్ధముల విల్లమ్ములు, బల్లెములు, ఈఁటెలు, కత్తులు, ఒడిసెలలు మొదలగు నాయుధముల నుపయోగించు చుండిరి.

ఆర్యుల ప్రధానవృత్తి వ్యవసాయము. అది ముఖ్య ముగ వర్షాధారమున జరగుచుండెను. అయినను వారు అర కలు కట్టి సేద్యము చేసి యొక్కొకప్పుడు నూతులనుండియు, కాలువలనుండియు నీరు పాఱించికూడ పైరులు పండించు వారు. యవలును, గోధుమలును ప్రధానములైన పంటలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుక్కి దున్నుటకు గుఱ్ఱములను, ఎడ్లను ఉపయోగించుచుండిరి. గోవులు, వృషభములు, గొఱ్ఱెలు, మేఁకలు వారి మందలు. వీనిలో ప్రధానమైనది గోవే. నాణెమునకు బదులుగ దానినే ధనముగ పరిగణించుచుండిరి. గోగణ మెంత యెక్కువగ నుండిన నంత ధనికత. దానములకును, దక్షిణలకును గోవే. వ్యవసాయము కాక మిగిలిన వృత్తులలో ప్రధానమైనది పశు పాలనము.

ఆర్యసంఘమున నూలితోను, నారతోను, ఉన్నితోను బట్టలు నేయు నేతగాం డ్రుండిరి. వడ్రంగులు ఇండ్లు కట్టి, ఇంటికి కావలసిన దారుపాత్రలను, సామానులను తయారు చేయుచుండిరి. రథములు, బండ్లు, పడవలు, ఓడలు నిర్మించు వారును గలరు. కమ్మరకొలుములందు కొడవండ్లు, బల్లె ములు, కవచములు, గండ్రగొడ్డళ్లు, కత్తులు, నాఁగటి కఱ్ఱులు మొదలైనవి తయారగుచుండెడివి. వెండి, బంగారులతో ఆభరణములను తయారుచేయు స్వర్ణకారు లుండిరి. నిష్క మను పేరుగల స్వర్ణవిశేషము ఆభరణముగను, నాణెముగను కూడ నుపయోగపడుచుండెను.

వర్తకవ్యాపారము 'నాటు'నను, సముద్రముమీఁదను వస్తువులను మార్చి యిచ్చి పుచ్చుకొను వినిమయపద్ధతిని సాగు చుండెను. ప్రధానముగ ఉన్నితోను, నారతోను, నూలితోను నేసిన వస్త్రములు ఇతర దేశముల కెగుమతి యగుచుండెను.

ఆర్యులు ప్రధానముగ కృషి, పాశుపాల్యముల మీఁదనే యాధారపడినవా రగుటచేత సృష్టియందలి సూర్యుఁడు, చం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్రుఁడు, భూమి, ఆకాశము, మేఘము, గాలి మొదలగు ప్రకృతిశక్తుల విలువను వారు బాగుగ గ్రహించిరి. అవి యుండవలసిన రీతి నుండనియెడలను, సుస్థితి నతిక్రమించి విజృంభించినయెడలను తమ సుఖజీవనమునకు అనర్థము వాటిల్లు నని తమకుఁ, దమ కుటుంబముఁనకుఁ, దమ పశువులమందల కును అపాయము వొరయకుండ రక్షించి శ్రేయోభివృద్ధులు కలుగఁజేయుటకై వానిని ప్రార్థించి యారాధించుచుండిరి. కాలక్రమమున ఆర్యపుత్రుఁడు వట్టి యా సృష్టి విచిత్రములందు దివ్యభావమును కుదురుకొల్పెను. ఋగ్వేదమునందలి దేవత లందఱు తొలుదొలుత నీ విధమున ఆర్యభావమున దేవ త్వము నొందిన ప్రకృతిశక్తులే. భూమ్యాకాశములు ద్యావా పృథివీదేవత లయ్యెను. ఝంఝామారుతములు మరుత్తులుగ మాఱెను. మిత్రావరుణులు దివారాత్రముల కధిపతులైరి. ప్రభాతకాంతి ఉష స్సయ్యెను. ఇట్టి యార్యదేవతలను భూమికి, వాయువునకు, ఆకాశమునకు సంబంధించినవారని మూఁడు రకములుగ విభజింపవచ్చును. పృథివి, అగ్ని, బృహ స్పతి మొదలగువారు మొదటి రకమునకుఁ జెందినవారు. ఇంద్రుఁడు, రుద్రుఁడు, మరుత్తులు, వాయువు, పర్జన్యుఁడు మొదలగువారు రెండవరకమునకు సంబంధించిన వాయుదేవ తలు. వరుణుఁడు, ఉషస్సు, అశ్వినులు, మిత్రుఁడు మొద లైనవారు మూఁడవరకమునకు సంబంధించినదేవతలు. కాల క్రమమున దేవతాభావన పురికొని, ఆ దేవతలకు విశేషణ పదములు పెరిఁగినకొలఁది వానిలోఁ గొన్ని యేయే ప్రకృతి శక్తుల కవి దేవత్వములో విస్మృతమయ్యెను. అంతియే కాక,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆర్యుల భక్తిభావము ముదిరి, ఆయా దేవతలకు సర్వాం తర్యామిత్వమును, సర్వశక్తిసంపన్నత్వమును గలిగి తుట్ట తుదకు వీ రందఱు ఒకే మహాశక్తియొక్క వేర్వేఱు రూపము లైరి. ఏపేర్లఁ బిలిచినను అసలు దేవుఁ డొక్కఁడే యని అంతటి ప్రాచీనకాలముననే ఆర్యులు గుర్తించియుండుట చాల అద్భుతావహము కదా!

ఆర్యజీవితమున నొకవ్యవస్థితి కల్పించినది అగ్నిహో త్రము. అది లేనిగృహము కాని, మతకర్మము కాని యుండెడిది కాదు. సమస్తమును బవిత్రముచేయు విచిత్రశక్తి యది. సర్వ యజ్ఞములకు అది మూలము. అగ్నిహోత్రుఁడు దేవత లకు పురోహితుఁడనియు, అతనిద్వారమున నొసంగినదెల్ల వా రికి ముట్టుచుండుననియు విశ్వసించి, తనకుఁ గావలసిన సమస్త ము నీభూతలమున వారి కృపచేతనే యుపలబ్ధ మగుచున్నదని వారిని ప్రసన్నులం జేసికొని యభ్యుదయ పరంపరల నందుటకై ఆర్యపుత్రుఁడు మొట్టమొదట కృతజ్ఞతాముగ్ధములైన భక్తి ప్రపత్తులతో క్రతువు సంకల్పించి, తదగ్నిహోత్రమున తన కున్న భోజ్యాదుల శ్రేష్ఠమైనవి ఆహుతిచేయఁజొచ్చెను. పాక యజ్ఞములని, హవిర్యజ్ఞములని, సోమయజ్ఞములని యజ్ఞములు ప్రధానముగ త్రివిధములుగ నుండెను. ఇవి కాక ఇతరము లును కొన్ని కలవు. సోమరస మనునొకవిధమగు పానీయము దేవతల కత్యంతప్రీతి యని యార్యులు భావించుచుండిరి. క్రమక్రమముగ కొన్ని కొన్ని గకముల యజ్ఞముల జంతుబలి యధికమగుచుండెను. ఈవిధముగ ఆరంభమైన క్రతువు రాను రాను ప్రాముఖ్యము హెచ్చి, యద్భుతమగు నొకరహస్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శక్తి కలదై, యార్యుల మతకర్మకే కాక మతమునకును గూఁకటి వేఁఱయ్యెను.

మరణించినవారు నిత్యతేజోవంతమును, అనంతమును, అవ్యయమును, అనశ్వరమును అయిన స్వర్గమునకుఁ బోయి యచ్చట శాశ్వతానందసౌఖ్యముల ననుభవింతురని యార్యుల విశ్వాసము. దేవలోకమైన స్వర్గమునకుఁ బోవుటకు మృతుల కగ్నికార్యము సంకల్పితమయ్యెను. కావుననే ఈ యగ్ని సంస్కారముకూడ అంత్యేష్టి యను నొక యజ్ఞము నాఁబరఁ గెను.

క్రతువులు తాము చేసి, ఇతరులచేత చేయించు ఋషులని, పరిపాలనాదులు నెఱపుయోధులని ఆర్యసంఘ మున ఆ కాలమున రెండు తరగతులవా రుండిరి. కాని ఋషి వంశములవారు బ్రాహ్మణులను పేరఁ గాని, యోధకులముల వారు క్షత్రియులను పేరఁగాని అంకితులై యుండలేదు. అప్పటికే క్రతుకార్యాదుల పౌరోహిత్యము ఋషివంశములలో పారం పర్యముగ నేర్పడుచు, వర్ణవ్యవస్థకు దారి చక్కఁబడి జన సమ్మత మగుచుండెను. పురోహితులు కాని, యోధులు కాని నిషేధము లేక యెల్లవృత్తులను అవలంబించుచుండిరి. ఆర్యు లచే జయింపఁబడిన దస్యులు దాసులను పేర ఆర్యజాతి కొక యనుబంధసంఘముగ నేర్పడిరి. కాలక్రమమున నీమూఁడు తరగతులవారినుండియే చతుర్వర్ణములు వ్యవస్థితము లయ్యెను. ఋగ్వేదకాలముననే చాతుర్వర్ణ్యవ్యవస్థ కలదని కొందఱందురు కాని చాలమంది దీని నంగీకరింపరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ విధమున ఆర్యులు సప్తసింధుదేశమున చిన్న చిన్న రాజ్యములను సంస్థాపించి, ఒకేభాషను మాటాడుచు, ఒకేవిధములైన మతకర్మల నాచరించుచు, నడుమ నడుమ వారిలో వారు పోరాడుకొనుచుండినను ఒక గొప్ప జాతీయానుబంధము కలిగి వర్ధిల్లుచుండిరి.

---

## ఆర్య రాజ్యములు

ఆర్యులు చాలకాలము సప్తసింధుదేశమున కంటిపెట్టుకొని యుండలేదు. క్రమక్రమముగా వారు ప్రాగ్దిశ కరిగి గంగా, యమునానదులు ప్రవహించు మైదానముల వ్యాపించిరి. ఆర్యానార్యసంగ్రామము లంతరించి, దేశాక్రమణమునను, రాజ్యస్థాపనమునను ఆర్యులలో ఆర్యులకే మహాసంగ్రామములు జరగుచువచ్చెను. సప్తసింధుదేశమునందువలెఁ గాక ఈ ప్రాంతముల మహాసామ్రాజ్యములు వెలసినవి. మహానగరములు నిర్మితములైనవి. గొప్ప దుర్గములను నిర్మించి మహారాజులు రాజ్యములను పాలించుచుండిరి. ఈ కాలమునందలి తెగలలో కురు, పాంచాల, కాశీ, కోసల, విదేహ నామములం బరఁగున యైదు తెగలు ప్రముఖములైనవి. ఇవి యాక్రమించిన దేశములును వానిపేరనే ప్రసిద్ధములయ్యెను. కురుదేశమునకు హస్తినాపురమును, పాంచాలమునకు కాంపిల్య నగరమును, కాశికి వారణాసియు, కోసలమున కయోధ్యయు, విదేహకు మిథిలయు రాజధానులు. ఈ రాజ్యములనుగుఱించి విశేషము మనకుఁ దెలియదు; కాని యీ నాఁటి కోసల విదేహులకును, కురు పాంచాలురకును సంబంధించినగాథలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అటుతరువాతఁ జాలకాలమునకు సంస్కృతభాషను శ్రీవాల్మీకి, వ్యాసమహర్షులచేత రచియింపఁబడిన మన రామాయణ, మహా భారతముల పొందుపఱుపఁబడినవి.

రామాయణకథానాయకుఁడైన శ్రీరాముని అవతార పురుషునిగ హిందువులు పరిగణించుకారణమున అది వారికి పవిత్రమైన పారాయణమతగ్రంథమయ్యెను. హృదయరంజకములైన పెక్కు ఉపకథలతోఁగూడిన మహాభారతము ఆర్యుల నీతి, ధర్మములకు పెద్దగనివంటిది. కావున ఈ రెండును ఆర్య భూమియైన మన హిందూదేశమునకు జాతీయమహాకావ్యములయ్యెను. దానంజేసి యివి ప్రతిదేశభాషలోనికి నను వదింపఁబడినవి. అంతటి ప్రాచీనకాలమునుండి నేఁటివఱకు నివి గొప్ప యాదర్శములను ముందుంచి, ధర్మపథమును జూపుచు హిందూజీవితమునకు తీర్పు తీరికలు దిద్దుచు, కష్టసుఖములందును, దుఃఖసంతోషములందును హిందువుల కెంతయో మనశ్శాంతి నొసఁగుచు, అద్వితీయప్రభావమును గలిగియున్నవి. ప్రతిహిందువుఁను తప్పక చదివి తీరవలసిన యుద్గ్రంథము లివి.

రామాయణ, మహాభారతకథ లెల్లరికిఁ దెలిసినవే కావున మరల నిచ్చట వానినిగూర్చి వ్రాయుట యనవసరము. రామాయణకాలమునాఁటికే ఆర్యులు కొందఱు దక్షిణమున కేఁగి, అరణ్యముల నాశ్రమములు నిర్మించుకొనుచు, ఆర్య సభ్యతను ఆర్యమతమును వ్యాపింపఁజేయుచుండిరి. వింధ్యపర్వతములకు దక్షిణముననున్న దేశ మప్పుడు అనార్యజాతులవారగు వానర, రాక్షసులకు ఆవాసభూమియై దండకయను మహారణ్యముఁగనుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డెను. అందు ప్రధానముగ వానరజాతులు కిష్కింధను, రాక్షస జాతులు లంకాద్వీపమునను నివాసముచేయుచుండిరి. క్రతు కర్మాదులకు శత్రువులైన రాక్షసులు విమతస్థులైన యార్యులను హింసించుచు, వారి యజ్ఞయాగాదులను పాడొనరించుచుండిరి. శ్రీరాముఁడు ఆర్యజనులను బాధించినరాక్షసులను జయించి వైదికమతమును గాపాడిన గాథయే రామాయణము. దక్షిణదేశము నాక్రమించి ఆర్యులు వేదమతవిరుద్ధములైన కొన్నిజాతులను జయించియు, మైత్రి పాటించి కొన్ని జాతులను లోఁబఱుచుకొనియు తమ సభ్యతను, తమ మతమును హిందూదేశమునం దంతట వ్యాపింపఁజేసి రనునదియే మనము రామాయణకథవలనఁ దెలిసికొనవలసిన చరిత్రాంశము.

కురు, పాంచాలు రాకాలమున పరస్పరవిరోధు లను విషయము భరతసంతతివారైన కౌరవ, పాండవుల సంగ్రామ చారిత్రమగు మహాభారతమువలనఁ దెలియును. ఆ మహా సంగ్రామమున పాంచాలురు పాండవపక్షము వహించిరి. ఇందు పాండవులు విజయము నొంది రనువిషయము ఎల్లరికిఁ దెలిసినదియే. విజయలక్ష్మిని జేపట్టిన ధర్మరాజు హస్తినాపురి సింహాసనము నధిష్ఠించి అనుజులైన భీమార్జున నకుల సహదేవుల తోడ్పాటుతో కురురాజ్యమును బాలించెను.

మహాభారతమువలన ఆకాలమునకు సంబంధించిన పెక్కు విషయములు తెలియుచున్నవి. మహారాజులు గొప్ప రాజ్యములను జయించి కప్పములు గైకొనుచుండిరి; దిగ్విజయముచేసి రాజసూయాశ్వమేధయాగముల నొనర్చుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామంతరాజులనుండి కప్పములను, కానుకలను గొనుచుండిరి. రాజసైన్యమున రథములని, గజములని, తురగములని, బంట్లని చతురంగము లుండెను. ఇదివఱకువలెనే రాజులు రథారూఢులై యుద్ధమున కరిగి, వ్యూహములు పన్ని అస్త్రములతోను, శస్త్రములతోను సమర మొనరించుచుండిరి. రాజు ముఖ్యముగ భూమినుండి పన్ను గ్రహించి, పురోహిత, మంత్రి, సేనాపతుల సాయమున రాజ్యమును పాలించి ప్రజలను రక్షించుచుండెను. వేఁటయు, జూదమును రాజకుమారుల వేడుకలు. శిల్పులు చక్కని భవనములను నిర్మించుచుండిరి. ప్రభువులు విద్యాపోషకులై కీర్తి గాంచుచుండిరి.

ధర్మరాజానంతరము అర్జున పౌత్రుఁడును, అభిమన్యు పుత్రుఁడునగు పరీక్షిత్తు రాజ్యభారము వహించెను. పరీక్షిత్తు కొడుకు జనమేజయుఁడు. ఇతఁడు పరాక్రమవంతుఁడై పెక్కు దేశములను జయించి కురురాజ్యమును పశ్చిమోత్తరమున గాంధారమువఱకు వ్యాపింపఁజేసెను. పంజాబులోని రావల్పిండి జిల్లాయును, వాయవ్యపు పరగణాలలోని పెషావరు జిల్లాయును ఆక్రమించిన ప్రదేశమునకే గాంధారమని పేరు. అఫ్ఘానిస్థానములోని కాబూలుజిల్లాకూడ ప్రాచీనకాలమున గాంధారదేశములోనిదే యని కొందఱి మతము. ఈకాలమున గొప్ప విద్యాపీఠమని పేరువడసిన తక్షశిలానగరము ఈ గాంధారములోనిదే. జనమేజయుని యనంతరము రాజ్యభారము వహించినవా రంత సమర్థులు కాకపోవుటచేత కురురాజ్యప్రాభవము క్రమక్రమముగ క్షీణింపఁ జొచ్చెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కురురాజ్యము క్షీణించుచుండినతఱి పైకి వచ్చినది విదేహారాజ్యము. శ్రీరాముని కాలమునుండియు ఈ రాజ్యమును జనకమహారాజు వంశమువారు పాలించుచుండిరి.

ఈ కాలమునందలి ప్రభువు లెల్లరు ఆర్యవిద్యాభిమానులై ఆర్యసంస్కృతికి దోహదము సలుపుచుండిరి. ప్రభువుల యాస్థానములు విద్వద్గోష్ఠులతోను, వేదాంతచర్చలతోను మాఱుమ్రోఁగుచుండెను. ఆర్యానార్యసంగ్రామములు క్రమక్రమముగ ప్రాఁతకాలపు కట్టుకథలయ్యెను. అనార్యు లార్యసంపర్కప్రభావమున వారిపద్ధతుల నవలంబించుచు, తెలిసియు తెలియకయు వారి జీవితవిధానము ననుకరించుచుండిరి. పాఁడిపంటలతో దేశము సుభిక్షమై బహుజనాకీర్ణ మయ్యెను. నూతనగ్రామము లనేకములు మొలకలెత్తినవి. యమునా, గంగానదీతీరప్రాంతములు పుర, దుర్గాభిశోభితములై దర్శనీయము లయ్యెను.

---

## మతపరిణామము : వేదవాఙ్మయము

ఆర్యమత పరిణామమున కురు, పాంచాలదేశములు ఒక మహా ఘట్టము వంటివి. ఆర్యు లిచ్చట నివసించుచుండిన కాలమున వేదచోదిత మతకర్మ లతిశయిల్లెను. ఎట్టి స్వల్ప కష్ట దుఃఖములను నివారించుకొనుటకైనను, ఎట్టి యల్పసుఖ సంతోషములను బడయుటకైనను, తుదకెట్టి వాంఛాలేశమునకైనను గూడ అగ్ని నాధానముచేసి యొనరించు క్రతువే సాధకమయ్యెను. అంతియేకాక, ఋగ్వేదకాలమున స్వతశ్శక్తి సంపన్నులని తలంపఁబడుచుండిన దేవత లిపుడు క్రతుకారణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునసే శక్తిమంతులును, తేజస్వంతులునై శత్రువులను సంహ రించి, తమకు శ్రేయము లొడఁగూర్పఁ గలుగుచుండిరను భావ మార్య సంఘమున ప్రబలెను. ఋగ్వేద కాలమున అంత యధి కతఁ గాంచని విష్ణు, రుద్రాది దేవతలు కొందఱి కీకాలమున గొప్ప ప్రాముఖ్యము కలిగెను. ఆర్య హృదయమునఁ గలిగిన యీ మార్పుతో క్రతు సంఖ్య విపరీతముగఁ బెరిఁగిపోవుటయే కాక ఎట్టి చిన్న క్రతువునకైనను పెద్ద 'తదంగ' మేర్పడి, ప్రతిక్రియాచరణమున ఈవఱకు ఉపేక్షితములైన యత్యల్ప విషయములకును మహత్త్వ మబ్బెను. స్వర్గశ్రేయోవాప్తికి క్రతుకర్మాదికముల నెట్టి యల్పక్రియనైన నెక్కుడు శ్రద్ధతో యథావిధిగ నిర్వర్తించుట యత్యావశ్యక మయ్యెను. అంత వఱకు ఒక్క యర్థమును సాధించుట కొక సాధనముగ నుండిన క్రతువు ఈ విధమున పుట్టుకనుండి గిట్టుకవఱకు జీవితమునే సమగ్రముగ ఆవరించి తుదకు అదియే యొక పరమార్థ మయ్యెను.

శతాబ్దులు కడచిన కొలఁది వేర్వేరు విధములగు యజ్ఞ ముల సంఖ్య క్రమముగఁ బెరుఁగుటతో మంత్రముల సంఖ్యయు హెచ్చిపోయెను. ఇట్లు పెరిఁగిన మంత్రములను వాని స్వభావ మునుబట్టి యజుస్సంహిత, సామసంహిత, అథర్వసంహితయని మూఁడు సంహితలుగఁగూర్చిరి. యజుస్సంహితయందు వేఱు వేఱు క్రతువుల విధి విధానములగూర్చియు, బలులను గూర్చియు ఉండును. సామ సంహితలోని చాల మంత్రములు స్వరసహితములైన ఋక్కులే. ఇవి యొకవిధముగ దేవతాస్తు తులకు సంబంధించిన గేయములు. స్వభావమునుబట్టి పైను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డివినవాని కించుక భిన్నమైనది అథర్వసంహిత. దుఃఖకరము లని, శ్రేయస్కరములని సాధారణముగ ఇందలి మంత్రములు ద్వివిధముగ నుండును. ఇవి హింసార్థమును, కృతదోషనివార ణార్థమును, రోగనివారణార్థమును, ఆయుష్య, సౌఖ్య, వి యాభ్యుదయముల నిమిత్తమును జేయవలయు కర్మాదులన గుఱించి తెలుపును.

ప్రతియజ్ఞ కార్యమున హోతలని, అధ్వర్యులని, ఉద్గా లని వరుసగా ఋగ్యజుస్సామసంహితలకు సంబంధించిన మం ముల నధ్యయనము చేయువా రుందురు. హోత దేవతల నాహ్వా నముచేసి స్తోత్రమంత్రములఁ బఠింపుచు, హోమముచేయును యజుర్మంత్రముల నధ్యయనముచేయుచు అధ్వర్యుఁడు య కర్మల నాచరించుచుండును. ఉద్గాత దేవతాప్రీత్యర్థము సా మంత్రములను గానముచేయును. బ్రహ్మయను పేర ఋత్విజు కందఱికి పెద్దయొకఁ డుండి యజ్ఞమును సంరక్షించుచుండును

ఆర్యజీవిత మీవిధమున క్రతువులో పుట్టి, క్రతువుల పెరిఁగి, క్రతువులో లయమగుచుండెను. సంపన్నులయి మహారాజులు మొదలగువారు బ్రాహ్మణుల కపరిమిత దక్షి లొసంగుచు, ఆఱువది, డెబ్బది, వందయేండ్లుకూడ పట్టున మహాయజ్ఞములను సాగించుచుండిరి. తెరలు తెరలుగ మబ్బు క్రమ్మిన యజ్ఞాగ్నిధూమపటలిచ్ఛాయను కురు, పాంచా భూములు ఋత్విజులయొక్కయు, ఇతర బ్రాహ్మణులయొ క్కయు వేదఘోషముతో మాఱుమ్రోఁగుచుండెను. ఋత్వి జులు మొదలగువారు కొందఱు కొందఱు ఆయావేదములక సంబంధించిన యజ్ఞకర్మాది విశేషములనుగుఱించియు, మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రార్థములననుగుణించియు చర్చించుచు తమ జీవితములను పూర్తిగ ఇట్టి మహాసత్రయాగములకడనే కడపుచుండిరి. ఇట్టి యజ్ఞములకడ వందలకొలంది సంవత్సరములనుండి జరపుచు వచ్చిన ప్రసంగములును, చర్చలును కాలక్రమమున బ్రాహ్మణములను గ్రంథములుగ నేర్పడెను. ప్రతి వేదమునకు వేఱు వేఱు బ్రాహ్మణము లిట్టి వనేకము లుండును.

ఈ బ్రాహ్మణములు ఆయా యజ్ఞకర్మలనుగూర్చిన విధానములు, వాని నట్లుచేయుటకుఁగల కారణములు, అట్లు చేసినఁ గలుగు విశేషములు, తత్కర్మ, మంత్రార్థముల చర్చలు, పురాతనకాలమున వేఱువేఱు ఫలముల నిమిత్తము యజ్ఞముల నొనరించినవారి గాథలు, ఆయాయజ్ఞకర్మల స్తోత్రోత్కర్షములు, పూర్వము గొప్ప యజ్ఞ యాగాదులు చేయించిన శ్రోత్రియులయొక్కయు, యాజకుల యొక్కయు, యజ్ఞాదుల భూరిదక్షిణ లొసంగిన బ్రాహ్మణులను దనిపిన రాజులయొక్కయు కథలు, తత్కారణమున వారికి సిద్ధించిన కార్యములు, విజయములు మొదలగువానినిగూర్చి తెలుపును. అటుతరువాతి పురాణ, కావ్యాదుల కుపక్రమములు ఈ బ్రాహ్మణములందే కలవు. అంతియకాక వీనిలోని యర్థవాదములందే మన తత్వశాస్త్ర, వ్యాకరణ శాస్త్రములకు బీజములు కలవు.

ఈ బ్రాహ్మణములు పుట్టిన కురు, పాంచాల మహాప్రదేశమునకు బ్రహ్మవర్తమని పేరు. ఇది కొంచె మించుమించుగ నిప్పటి యమునా, గంగానదుల నడుమఁగల యంతర్వేదియని చెప్పనొప్పును. మంత్ర, బ్రాహ్మణములు కలసినదానికే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేదని పేరు. ఋగ్యజుస్సామాథర్వవేదములు నాలుగిం టిలో క్రతుకర్మాదికముల మొదటి మూఁటికి అధిక ప్రాము ఖ్యము కలుగుటచేత వానికి 'త్రయీవిద్య' యను పేరు కలి గెను. ఈ నాలుగు వేదములకు శ్రుతులని పేరుండుటచేత వాని సంబంధించిన కర్మలు శ్రౌతకర్మ లనఁబరఁగెను.

క్రతు విభేదముల సంఖ్య హెచ్చిరిల్లుటతో ఆర్యసంఘ మున గొప్ప మార్పు కలిగెను. వేదకర్మ లతిశయించుటచేత పురో హితుల జీవితమంతయు వానితోనే సరిపోవుచు, ఇతర వృత్తు కవకాశమే దొరకకుండెను. ఈ కారణమున ఆర్యసంఘము కావశ్యకములైన వేలువేలు కార్యములన్నియు నిరంతరాయ ముగ కొనసాగుచుండుట కేరుపడినదే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రు లను చతుర్వర్ణముల వ్యవస్థ. యజన, యాజన, అధ్యయన, ఆధ్యాపన, దాన, ప్రతి గ్రహములన నవి ఆర్యసంఘ పురోహితులైన బ్రాహ్మణుల ధర్మము ల య్యెను. యజన, అధ్యయన, ప్రజారక్షణములు యోధులై క్షత్రియుల ధర్మములు. కృషి, వాణిజ్య, పశుపాలనము ఆర్యజన సామాన్యమైన విశుల ధర్మమై వారు వైశ్యుల నాఁబరఁగిరి. సేవాధర్మము దాసుల దయ్యెను. వీరికి శూద్రు లని పేరు కలిగెను. ఈ విధమున మొట్టమొదట సంఘ క్షేమార్థ మేర్పడిన కార్య విభజన వ్యవస్థ ముదిరి, కాలక్రమ మున కరుడు కట్టెను. అంతటితో ఒక వర్ణము అన్యవర్ణ ధర్మము నవలంబించుట అనర్థకమైన ప్రతిషిద్ధకార్య మయ్యెను. సంఘక్షేమమునకును, స్వర్గ సౌఖ్యావాప్తికిని శ్రౌతకర్మలు కారణమగుటచేతను, అవి బ్రాహ్మణుల యధీనమున నుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉండుటచేతను సంఘమున బ్రాహ్మణునికి విశేషగౌరవము కలిగెను. ఈ కారణముననే బ్రాహ్మణుని రక్షింపవలసిన బాధ్యత మిగిలిన వర్ణములవారిపైఁ బడెను. బ్రాహ్మణుఁడు చేయింపని యజ్ఞము నిరర్థకమనియు, బ్రాహ్మణుని భూరిదక్షిణల సంతర్పితుంజేయని యజ్ఞకర్మ స్వర్గప్రదముకాదనియు చెప్పు మంత్రములు పుట్టి వానిని ఆకాలమువారు విశ్వసించుటచేత బ్రాహ్మణుఁడు భూలోకదేవతయని ప్రసిద్ధిఁగాంచెను.

సంఘావశ్యక కార్యముల నిమిత్తము వర్ణవ్యవస్థ యేర్పడినట్లే క్రమపద్ధతిని వేదవిద్యను పరిరక్షించి, వేదకర్మల నన్నిటిని నియతి తప్పక ఆచరించుటకును ఒక యేర్పాటు అవసరమయ్యెను. అదియే బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాస ఆశ్రమ వ్యవస్థ. ఆర్యులు జీవితకాలమును ఇట్లు ఆశ్రమములనుపేర నాలుగు విభాగములు కావించి, ఆచరింపవలసిన వేదకర్మల నన్నిటిని మొదటి మూఁటిపై పంచిపెట్టిరి. సన్యాసాశ్రమము వేదకర్మ విరహితమైనది. ఉపనయనముతో నారంభమగు మొదటి యాశ్రమమైన బ్రహ్మచర్యమున తదాశ్రమోచితవ్రతము ననుష్ఠించుచు, గురుకులమున వేదాది విద్యల నభ్యసించుచు ఆర్య పుత్రుఁడు తనకు నియతములైన వేదకర్మల నొనరించుచుండవలెను. ఇది యాతని విద్యార్థిదశ. వివాహముతో నీ యాశ్రమము కడముట్టి గృహస్థాశ్రమమారంభమగును. గృహస్థు ప్రజా క్షేమార్థము శ్రౌతకర్మలు, ఆత్మ కుటుంబ క్షేమార్థము గృహ్యకర్మలు అను రెండు తెఱఁగులగు కర్మల నాచరించవలసియుండును. వృద్ధుఁడైన వెనుక గృహస్థుఁడు తన జ్యేష్ఠకుమారుని ఇంటికి యజమాని గావించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తాను వనముల కరిగి వానప్రస్థుఁడై తనకింక కొలఁదిగ శేషించి యున్న వైదికకర్మల నాచరించుచు ఎక్కువ కాలము తప స్సునఁ గడపవలెను. కడపటి యాశ్రమమున ఇఁక నాపరిమిత కర్మాదికమునుగూడ పరిత్యజించి, వేదార్థరహస్య విశేషము విచారించుచు, జీవితావశేషమును గడపవలెను. ఏతద్విషయ ముల వానప్రస్థులును, సన్యాసులును జేసిన విచారణ ఫలిత ములు ఆరణ్యకములు, ఉపనిషత్తులు. ఇవి బ్రాహ్మణముల కను బంధములే కావున వానివలెనే ఒక్కొక్క వేదమునకు ప్రత్యేక ఆరణ్యకములును, ప్రత్యేక ఉపనిషత్తులును ఉండును. వేద వాఙ్మయమున ఉపనిషత్తులు అంతిమ గ్రంథము లగుటచేత ఇందలి విషయమునకు వేదాంతమని పేరు కలిగెను. కర్మపర తంత్రమైన జీవితమున ఇంచుక విశ్రాంతిని బడసిన వానప్రస్థు లును, సన్యాసులును ప్రశాంతములైన యరణ్యవాటిక నేకాంత జీవనముఁ గడపుచు వేదార్థ రహస్యములను గుఱించి మాత్రమేకాక, చరాచర ప్రపంచముయొక్క ఉత్పత్తి, స్థితి, లయాదులను గుఱించియు విచారణ సలుపఁదొడఁగిరి. ఆర్యుల కర్మాభినిరతి బ్రాహ్మణములలోఁ బ్రతిఫలించుచుండ, వారి జ్ఞానగరిమ యుపనిషత్తులఁ బ్రకాశించుచున్నది. మూఁడువేల సంవత్సరములకు పూర్వమే ప్రపంచమునందలి యే యితర జాతికి ఇట్టి విషమములైన యద్భుత విషయములనుగూర్చిన యోచనాజ్ఞానమే లేని కాలమున ఆర్యులు భావనావీథి ననంత పథమున నిర్భయముగ విహరించుచు, అతిగహనములైన విష యములనుగూర్చి తర్కవితర్కములు చేయుచుండుటయే వారి ప్రతిభకు తార్కాణము. కాలక్రమమున బ్రాహ్మణముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుండి కర్మయోగము రేకెత్త, ఉపనిషత్తులనుండి జ్ఞానయోగము వికసించి ఆర్యభూమిని సురభిళము కావించెను. ముక్తి యను గమ్యస్థానమును చేరుట కీవేదభూమి నాఁటికిని, నేఁటికిని ఈ రెండును రాజమార్గములై వెలసియున్నవి.

ప్రపంచమునందలి ప్రతి వస్తువునకు మార్పు కలదు. అంతము కలదు. వస్తువులన్నియు ప్రాఁతరూపములు జార్చివైచి నూతనాకృతులఁ దాల్చుచుండును. కాని శాశ్వతమైనది, ఆద్యంతములు లేనిది ఒకటి కలదు. వేదాంతులు దానిని పరబ్రహ్మమనియు, పరమాత్మయనియు నందురు. ఈ చరాచర ప్రపంచము సకలము దానినుండియే యుద్భవించి, దానివలననే సాగుచు, తుదకు దానియందే లయమగుచుండును. ప్రతి జీవియు ఆ బ్రహ్మము నంశమున తా నీలోకమునఁ జేసికొను కర్మల కనురూపమైన జన్మముల నెత్తుచు, సంసార బంధమునఁ దగుల్కొని నవయుచు, గిట్టుచు, తుదకు ఆ బ్రహ్మముననే కలసిపోవును. దీనినే యుపనిషత్తులు మనకు బోధించును. క్షణ క్షణ పరివర్తనమునకు లోనగు నీ సృష్టిలోఁగూడ అంతర్నిహితమైన యేకత్వము కలదను నిత్యసత్యమును మూఁడు వేల సంవత్సరములకు పూర్వమే మన పూర్వులు కనిపెట్టి దానిని పునర్జన్మ, పరమాత్మ సిద్ధాంతముల వివరించియుండుట ఆశ్చర్యకరముకదా!

---

## సూత్రయుగము

మహాభారత యుద్ధకాలముననుండి క్రీస్తుశక మాఱవ శతాబ్దివఱకుఁ గల హిందూదేశ రాజకీయ చారిత్రము పురాణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కథలలో మఱుఁగుపడి యింకను మనకు సుస్పష్టముగఁ దెలియ రాకున్నది. పౌరాణికరాజవంశము లనేకము లాకాలమున బరిపాలనము నెఱపినట్లు మాత్రమే మనకుఁ దెలియును.

మహాభారత యుద్ధానంతరము కురువంశజులు కొంత కాలము ప్రభుత్వము చేసినట్లును, వారి రాజ్యము క్షీణించు చుండినతఱి విదేహరాజ్యము ప్రముఖత వహించినట్లును ఇదివఱకే తెలిసికొనియున్నాము. విదేహరాజ్యమును పాలించిన పెక్కుమంది రాజుల పేర్లు తక్క వారిని గుఱించి యెక్కువ విశేషములు తెలియరావు. ఈ విదేహప్రాభవమైనను ఎక్కువ కాలము సాగలేదు.

ఈ రాజ్యము క్షీణదశకు వచ్చుచుండిన కాలమున నర్మదా నదికిని, హిమవత్పర్వతములకును నడుమనుండు దేశమున పెక్కు తెగలవారు వాసయోగ్యములైన ప్రదేశములను జూచికొని అరణ్యములను నఱికి అధివాసముల నేర్పఱుచుకొనిరి. ఇవి కాలక్రమమున ఆయా తెగలపేరనే జనపదము లనఁబరగెను. మఱికొంద ఱార్య సంతతులవారు వింధ్యపర్వతములను దాటి దక్షిణమునకుఁ బోయి యచ్చట వలస లేర్పఱుచుకొని తమ విజ్ఞానమును, మతమును వ్యాపింపఁజేయుచుండిరి. దాక్షిణాత్యదేశముల కార్యవిజ్ఞానమును గొనివచ్చినది అగస్త్యమహర్షి యని ప్రతీతి. వింధ్యకు దక్షిణదేశముల అగస్త్యుఁడు మొదలైన యార్య సంతతులవారి యాశ్రమము లుండినట్లు దక్షిణదేశస్థల మాహాత్మ్యముల ననుసరించి తెలియనగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దక్షిణ హిందూదేశమున నివసించుచుండిన దేశీయులు ఆర్య సభ్యతతో సంసర్గము కలిగి, ఆర్యుల ధర్మముల నవలంబించుచు, అనేక విధముల వారి ననుకరించుచుండిరి. దాక్షిణాత్య భూపతులుకూడ ఆర్యుల మతబోధల నంగీకరించి, వారి సంస్థల నాదరించుచుండిరి. ఆర్య సంసర్గమున దేశీయులలో మార్పు కలిగినట్లే వారి సహవాసమున ఆర్యుల యాచారవ్యవహారములయందును పెక్కుమార్పులు కలిగెను. అశ్వత్థ ప్రదక్షిణములు, గ్రామ దేవతాది పూజనములు, భూత ప్రేత పిశాచాదులనుగూర్చిన నమ్మకములు ఈ మొదలగు అనార్యాచారవిశ్వాసములు ఆర్యసంఘమునగూడ స్థిరముగ నెలకొనినవి. ఈ విధమున ఆర్యులు ఖడ్గసాధనమునఁగాక ప్రేమమైత్రుల మూలముననే దేశీయులను లోఁబఱుచుకొని, వారికిఁ దమ మతవిజ్ఞానముల నొసంగియు, వారి సంస్కృతిని దాము నొంత యాదరించి వారి విశ్వాసములను గొన్నిటిని స్వీకరించియు తుదకు సేతు శీతనగ మధ్యస్థమైన దేశమునంతయు నాక్రమించి, తమ సభ్యతను బ్రవహింపఁజేసి, తమ సంస్కృతిని పైరు పెట్టిరి. జాతివిభేదపరిష్కారమునకును, సంఘాభ్యుదయ కారణమైన కార్యవిభజనమునకును ఉత్తర హిందూస్థానమున నేర్పాటుచేసిన వర్ణవ్యవస్థను దక్షిణదేశములందుఁగూడఁ బ్రవేశపెట్టి యైక్యత సాధించి యార్యానార్య భేదము లంతరింపఁజేసిరి. అనతికాలముననే దక్షిణ హిందూదేశమునను నూతనహిందూధర్మ సంప్రదాయము లనేకములు వెలసినవి. ప్రజలెల్లరు హిందూవిద్య నేర్చి, హిందూమతము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవలంబించిరి. విశాలమైన యీ భరతవర్షమంతయు ఇట్లు హిందూప్రపంచ మయ్యెను.

ఈ విధమున క్రీస్తుకు పూర్వము ఆఱవశతాబ్దినాటికి హిందూదేశమునం దంతట ఒకటే విధమైన సభ్యతయు, ఒకటే విధమైన సంస్కృతియు పరివ్యాప్తమయ్యెను. హిందువు లెల్లరు ఒకటే విధమైన యాదర్శములను ముందుంచుకొని యున్నతాశయములతోఁ బ్రవర్తింపఁ దొడఁగిరి.

ఈ కాలమున వింధ్యకు దక్షిణమున దక్కను దేశమున కళింగులు, ఆంధ్రులు, భోజులు, శబరులు, పుళిందులు, మూతిబులు మొదలగు తెగలవారు ప్రత్యేకప్రదేశముల నాక్రమించిరి. ఆయాప్రదేశము లాయాతెగల పేరున కళింగాంధ్రాది జనపదము లనఁబరగెను ఓఢ్రదేశమునందలి వైతరణీనది మొదలు ఆంధ్రదేశమువఱకు వ్యాపించియున్న సముద్రతీరస్థదేశము కళింగము. దీని రాజధాని దంతపురము. కృష్ణా, గోదావరి నదీ పరిసరముల ఆంధ్రు లాక్రమించిన ప్రదేశము ఆంధ్రదేశము. ఆంధ్రులు తత్పూర్వము వింధ్యపర్వతప్రాంతముల నివసించుచుండిన తెగలలో నొకరు. వీరు కళింగమునకుఁ బశ్చిమ దిశను బ్రవహించి మహానదిలోఁ గలయు తెలివాహానదీప్రాంతములగుండ కృష్ణా, గోదావరి నదీ పరిసరములకరుదెంచిరి. క్రీస్తుకు పూర్వ మాఱవశతాబ్దిని తెలివాహానదీ తీరస్థమైన అంధపురము వారికి రాజధానిగ నుండెను. అనేకములుగనుండిన భోజరాజ్యములఁ బ్రసిద్ధికెక్కినది విదర్భ. మధ్యరాష్ట్రములలోని కొంతభాగమును, బేరారును గలసిన ప్రదేశమే ఈ పేరఁ బరగుచుండెను. కుండిననగరము దీనికి రాజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధాని. కళింగము కూడ భోజరాజ్యమేయని కొందరు అందరు. శబర, పుళింద, మూతిబులు ఆంధ్రజనపద పరిసరముల నివసించుచుండిరి.

వీరు కాక ఇంకను దక్షిణమున చోళులును, పాండ్యులును, కేరళులును నివసించుచుండిరి. చోళరాజ్యమునకు ఒరయూరును, పాండ్యరాజ్యమునకు మధురయు, కేరళుల చేర రాజ్యమునకు వంజినగరమును రాజధానులుగ నుండెను.

ఉత్తరహిందూస్థానమునఁగూడ నిట్టి జనపదము లనేకము లుండినట్లు ఇదివఱకే తెలుపఁబడినది. క్రీస్తుకు పూర్వమేడవ శతాబ్దినాఁటికి (౧) కాశీ (౨) కోసల (౩) మగధ (౪) అంగ (౫) వజ్జి (౬) మల్ల (౭) చేది (౮) వత్స (౯) కురు (౧౦) పాంచాల (౧౧) మత్స్య (౧౨) శూరసేన (౧౩) అస్సక (౧౪) అవంతి (౧౫) గాంధార (౧౬) కాంభోజము లనఁబరగు మహాజనపదములు పదునాఱు విలసిల్లుచుండెను. వీనిలోఁ గొన్ని రాజాధీనములు; కొన్ని గణాధీనములు.

రాజాధీనములైన వానిలో క్రీస్తుకు పూర్వ మేడవశతాబ్ది యంతిమభాగమున కోసల, మగధ, వత్స, అవంతి రాజ్యములు రాజకీయరంగమున ప్రముఖములుగ నుండెను. ఈ దేశముల నేలుచుండినరాజులు పరస్పరము వివాహసంబంధములు కలుపుకొనుచు వచ్చినను ఎవరికి వారే గొప్ప సామ్రాజ్యమును నిర్మింపవలెనను నాకాంక్షతో నుండినకారణమున వైరములు పెరిగి వీరిలో వీరికి తఱచుగ సంగ్రామములు జరగుచుండెను. ఎవరికి వారే యిరుగు పొరుగుల హీనబలులయియున్న చిన్న రాజ్యములను కబళించి తమ రాజ్యమును విస్తరింపఁజేసికొనఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రయత్నించుచు వచ్చిరి. మహాభారతకాలమున ప్రసిద్ధములై యుండిన కురు, పాంచాల, కాశీ, మత్స్యాది రాజ్యము లీకాలమునఁగూడ నుండినను అవి నామమాత్రములయిన చిన్న రాజ్యము లయ్యెను.

పశ్చిమమున పాంచాలమునకు, తూర్పున విదేహకు, ఉత్తరమున నేపాలదేశ పర్వతములకు, దక్షిణమున స్యందికా నదికి నడుమనున్న దేశము కోసలము. దీనికి మొదట సాకేతమును, పిదప శ్రావస్తియు రాజధానులు. ఇక్ష్వాకు వంశజులీరాజ్యమును పాలించుచుండిరి. క్రీస్తుకు పూర్వ మాఱవ శతాబ్ది యుత్తరార్ధమున ఈ రాజ్యమును ప్రసేనజిత్తు ('పసేనది') అను నతఁ డేలుచుండెను. ఇతఁడు తక్షశిలావిద్యాపీఠమున విద్య నభ్యసించి సకలకలాపారంగతుఁ డయ్యెను. ఇతఁడు విద్వాంసులకును, తత్త్వవిదులకును ఆశ్రయ మొసంగిన ఆర్యవిద్యాపోషకుఁడు; బహుధర్మనిరతుఁడు; బౌద్ధుల కసదృశదానములను జేసి బౌద్ధమతము నాదరించి కీర్తి గడించినవాఁడు. ఇతని సోదరియైన కోసలాదేవి బింబిసారునిభార్య. ఇప్పటి బీహారురాష్ట్రమునందలి పాట్నా, గయా జిల్లా లాక్రమించిన ప్రదేశమునకే ప్రాచీనకాలమున మగధ యని పేరు. మహాభారతయుద్ధకాలమున బృహద్రథ వంశజులైన జరాసంధాదులు దీనిని పాలించుచుండిరి. రాజగృహ నామాంతరమునం బరగిన గిరివ్రజపురము దీని రాజధాని. బృహద్రథుల యనంతరము శిశునాగవంశజు లీరాజ్యమున కేలికలైరి. వీరిలోని యైదవరాజగు బింబిసారుఁడు ప్రసేనజిత్తునకు సమకాలికుఁడు. వంశరాజ్యనామాంతరమునం బరగు వత్సరాజ్యము అవంతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుత్తరమున యమునానదీతీరమున నుండెను. పౌరవులు దీనిని పాలించుచుండిరి. కౌశాంబిపట్టణము దీనికి రాజధాని. ఈ రాజ్యము నేలిన పరంతపకుమారుఁడైన యుదయనుఁడు బింబిసార, ప్రసేనజిత్తు లకు సమకాలికుఁడు. అవంతి రాజ్యమునకు ఉజ్జయినీ నగరము రాజధాని. పైనుడివిన రాజులకు సమకాలికుఁడై యీ రాజ్యమును పాలించుచుండిన రాజు ప్రద్యోతుఁడు. ఉదయనుఁ డీతని యల్లుఁడు*. ఈ యవంతి రాజ్యమే తరువాతికాలమున మాళవమను పేరఁ బ్రఖ్యాతమయ్యెను.

ఇఁక గణరాజ్యములలో నీ కాలమునఁ బ్రసిద్ధములైనవి వజ్జి, మల్ల, శాక్యరాజ్యములు. పెక్కురు నాయకులు కలసి పరిపాలించు రాజ్యమునకే గణరాజ్యమని పేరు. వజ్జి జనపదము నెనిమిది కులములవారు కలసి పరిపాలించుచుండిరి. వీరిలో విదేహులు, లిచ్ఛవులు, జ్ఞాతృకులు, వజ్జులు (వృజులు) ముఖ్యులు. ఏ కులమున కాకులమునకే వేర్వేఱు రాజధానులుండినను జనపదమున కంతకు ప్రధానరాజధానిగ నుండినది వైశాలీనగరము. మల్లరాజ్యమునకు కుశినారమును, పావాయును ప్రధాన నగరములు. శాక్యులకు కపిలవస్తు నగరము రాజధాని. బౌద్ధమత స్థాపకుఁడైన సిద్ధార్థుఁడు శాక్యవంశజుఁడే. లిచ్ఛవులును, మల్లులునుగూడ బౌద్ధమత వ్యాపనమున కెక్కువగఁ దోడ్పడిరి.

---

* ఈ యుదయనునికిని, ప్రద్యోత తనూభవయైన వాసవదత్తకును, మగధరాజాత్మజయైన పద్మావతికిని జరగిన వివాహగాథలే తరువాతి కాలపుభాసమహాకవి కృతని 'ప్రతిజ్ఞాయౌగంధరాయణ', 'స్వప్నవాసవదత్త' నాటకములకు కథావస్తువు లయ్యెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పై నుడివినయట్లు క్రీస్తు పూర్వ మాఱవశతాబ్ది ఉత్తరార్థమున నుత్తరహిందూదేశరాజకీయరంగ మంతయు రాజ్యలోభముతోడను, వైరములతోడను సంగ్రామములతోడను చాల సంక్షుభితమై యుండెను. సామ్రాజ్య నిర్మాణమునకై రాజాధీనరాజ్యము లొండొంటికి జరగిన సంగ్రామపరంపరలలో ఒకప్పుడు మగధయు, వేఱొకప్పుడు కోసలమును క్రిందుమీఁదగుచువచ్చినను తుదకు మగధయే విజయశంఖమును పూరించి, విజయధ్వజమును పాదుకొల్పెను. బుద్ధుని కాలమున ఉత్తరహిందూస్థానమునందలి ప్రధానరాజ్యమైన మగధను పాలించుచుండిన రాజు బింబిసారుఁడు.

ఈ కాలమున పరిపాలనమునకే కాక సమస్తమైన పౌరోద్యమములకును గ్రామమే పునాదిగ నుండెను. ప్రజ లెల్లరు సాధారణముగ గ్రామముల నివసించుచుండిరి. బ్రాహ్మణులు ప్రత్యేకగ్రామములం దుండువారు. ఇట్లే నిషాదులకును ప్రత్యేకగ్రామము లుండెడివి. గ్రామమునకు సంబంధించిన పరిపాలనాది వ్యవహారములను గ్రామణి చక్కఁబెట్టుచుండెను. ప్రజ లెల్లరును గలసి యతని నెన్నుకొనుచుండువారు. నగరములును నాఁడు వెలయుచుండినను అవి చాలకొలఁదిగ నుండెను. బుద్ధుని కాలము నాఁటికి ఉత్తరహిందూదేశమున ప్రసిద్ధికెక్కిన పట్టణము లైదు మాత్రమే. అవి యేవన (౧) శ్రావస్తి, (౨) చంపానగరము (అంగరాజధాని), (౩) రాజగృహము, (౪) సాకేతము, (౫) వారణాసి (కాశీరాజధాని). నాఁడు నగరము లున్నత ప్రాకారములతోను, చతుర్దిశలఁ జతుర్ద్వారములతోను, ద్వారోపరిభాగముల నిప్పటి గోపుర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములవలె నుండు యామికాగారములతోను విలసిల్లుచుండెను. ఈ యగారములయం దుండి యామికులు (తలారులు) నగరములను గావలి కాయువారు. కొన్ని కొన్ని నగరములకు ముప్పది రెండు ద్వారములుకూడ నుండెడివి.

కొన్ని రాజ్యము లిదివఱలో నుడివినట్లు గణాధీనములుగ నుండినను పలురాజ్యముల రాచఱికమే సాగుచుండెను. ప్రజల యంగీకారముమీఁదనే రాజు రాజ్యభారము వహించువాఁడు. పండిన పంటలో రాజునకు ఆఱవ పాలు పన్ను రూపమున చెల్లుచుండెను. ఈ కారణముననే రాజు 'షష్ఠభాగభాక్క'ను వాడుక కలిగెను. ఇట్లే వర్తకము మీఁదను, ఇతర వృత్తులమీఁదను రాజు పన్ను గైకొనుచుండెను. ధనధాన్యముల రూపమున పన్ను చెల్లింపలేని శిల్పులు మున్నగువారు రాజునకు మాసమున కొక్కదిన ముచితముగ ఊడిగము సేయవలసియుండెను. అట్టిదినముల వారి భోజనమున కగువ్యయమును రాజు భరించువాఁడు. రాజు ప్రజలనుండి ఎట్టి పన్నులను గ్రహించినను వానిని పువ్వు నలుగకుండ మధుపము మకరందమునుబోలె గ్రహింపవలెననియు, పన్ను రాజునకు ప్రజారక్షణము నిమిత్త మేర్పడిన వృత్తియనియు ధర్మనిర్ణేతలమతము. వర్ణాశ్రమ ధర్మములను, వృత్తులను, తదాధారములను రక్షించుట రాజధర్మము. చాతుర్వర్ణ్య వ్యవహారములకు సంబంధించిన ధర్మాధర్మముల నిర్ణయమును, వాని యనుపాలనవిధానమును ధర్మజ్ఞులు సూత్రరూపమునఁ జేసినైచిరి. ఏతద్ధర్మసూత్రముల కనుగుణముగ వ్యవహారమును జక్కఁబెట్టుట మాత్రమే రాజునకు విధికృత్యముగ నుండెను. ఈ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విధమున రాజు ధర్మనిర్వాహకుఁడు మాత్రమే యగుటచేత రాజాధికారము పరిమితమై యాతని నిరంకుశపరిపాలనమున కవకాశములు సంకుచితము లయ్యెను.

ఈ కాలమున వర్ణవ్యవస్థ యింకను పురిమెక్కి బిగిసి పోయెను. సంఘమున తొలుదొలుతటి గౌరవపదము బ్రాహ్మణునిది. సంఘక్షేమాభ్యుదయ దాయక ములగు యజ్ఞయాగాదులు బ్రాహ్మణాధీనము లగుటవలనను, బ్రాహ్మణుఁడే ధర్మనిర్ణేత యగుటవలనను ఆతనికి ప్రత్యేక స్వాతంత్ర్యములు, హక్కులు నేర్పడినవి. ధనముసంచయమును, కృషివాణిజ్యములును బ్రాహ్మణునికి నింద్యకర్మ లయ్యెను. సంఘక్షేమాభిలాషియై కడమ వర్ణములవారి కాదర్శప్రాయముగ జీవనముఁ గడపుచు, షట్కర్మనిరతుఁ డగుటయే బ్రాహ్మణుని పరమ ధర్మము. సంఘమున బ్రాహ్మణుని పిదప క్షత్రియుఁ డధికుఁడు. బ్రాహ్మణుని పురోహితునిగఁ గైకొని దేశారిష్టా ద్యుత్పాతముల యుపశాంతి కాతఁడు చెప్పినచొప్పున యజ్ఞయాగాది కర్మలం జేయుచు, ప్రజలనుండి ఆఱవవంతు పన్నును గ్రహించుచు, భూరిదక్షిణలమూలమునను, ధానధర్మముల మూలమునను విప్రులను బోషించుచు ప్రజారక్షణముచేయుట రాజునకు వేదవిహితమైన పరమధర్మము. మొదటి మూఁడు వర్ణముల వారికి ఆపత్కాలమునఁ దక్క స్వధర్మపరిత్యాగము నింద్య కృత్య మయ్యెను. తృతీయవర్ణము వారిలోని భాగ్యవంతులు శ్రేష్ఠు లనఁబరగుచుండిరి. వీరిలో ధర్మనిరతులైనవారు నగర చతుర్ద్వారములయొద్దను, నగర మధ్యమునను, తమ భవనముల కడను ధర్మశాలలను నెలకొల్పి పేదలను దానధర్మములఁ దను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పువారు. వైశ్యులు సముద్రతీరస్థదేశములతోనే కాక సింహళ, సువర్ణద్వీపాది సముద్రాంతర దేశములతోఁగూడ నౌకల మీఁద వర్తక వ్యాపారము నడపుచుండిరి. నాటున కాశీ, కోసలము, అంగ, మగధ మొదలగు దేశముల నడుమఁగూడ బండ్లమీఁద గొప్ప వర్తక వ్యాపారము సాగుచుండెను. అప్పుడు వెండి, బంగారములేకాక పశువులును ధనముగనే పరిగణింపఁబడుచుండెను. ఈ కాలమున నెక్కువగ వాడుకలో నుండినట్లు తెలియవచ్చు నాణెములకు కార్షాపణములనిపేరు.

ఈ కాలమునను వ్యవసాయమే జీవనాధారమగు ప్రధాన వృత్తిగ నుండెను. చేతిపనులు మొదలైనవికూడఁ గొందఱకు జీవికలుగ నుండెను. ఇట్టివానిలో దంతపుఁబని, శిల్పము, వడ్రంగము, బట్టలనేత, నౌకానిర్మాణము, చిత్రలేఖనము ప్రధానములైనవి. ఆ కాలమున తక్షశిలానగరము వైదికవిద్యకును, శిల్పములకును చాల ప్రసిద్ధికెక్కిన విద్యాపీఠము. కాశీ, కోసల, మగధ దేశములనుండి సైతము రాజకుమారులు విద్యాభ్యాసము నిమిత్తము తక్షశిల కరుగుచుండువారు.

రాజకీయాది విషయముల నెటు లున్నను ఇది ప్రధానముగ విద్యా, సంస్కృతులకు పేరుపడిన కాలము. ఈ కాలమున వేదార్థవిజ్ఞానము సులభగ్రాహ్యమును, సుపరిరక్షితమును అగుటకు శిక్ష, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, కల్పము అను నాఱు వేదాంగములు పుట్టినవి. వేదమంత్రోచ్చారణవిధమును దెలుపునది 'శిక్ష'. వైదిక శబ్దముల పరస్పర సంబంధాదులు తెలుపునది 'వ్యాకరణము'. వేదార్థము సుబోధముఁ గావించునది 'నిరుక్తము'. వేదమం


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రములందలి అక్షరగణాదుల నియతిని దెలుపునది 'ఛందస్సు'. క్రతుకర్మాదికముల నొనరింప యోగ్యమగు కాలాదులఁ దెలుపు నది 'జ్యోతిషము'. శ్రౌత, గృహ్యకర్మలనుగుఱించి తెలుపు నది 'కల్పము'. వీనికి షడంగములనియుఁ బేరు. వీనియందలి విషయమెల్ల సూత్రరూపమున నున్నది. విపులవ్యాఖ్యానము వలనఁ దెలిసికొనఁదగిన విషయముయొక్క క్లుప్తరూపము సూత్రము. సూత్రరూపమున నీవాఙ్మయ మెల్లఁ బుట్టిన కా మగుటచేత దీనికి చరిత్రకారులు సూత్రయుగమని పేరిడిరి.

శ్రౌతసూత్రములని, గృహ్యసూత్రములని, ధర్మసూత్రము లని వేదాంగములలోని కల్పసూత్రముల మూఁడు విభా ములు కలవు. శ్రుతులకు సంబంధించిన కర్మలన్నియు శ్రౌ సూత్రములందును స్మృతికి సంబంధించిన (స్మార్త) కర్మ లన్నియు గృహ్యసూత్రములందును, చతుర్వర్ణములవారికి సం బంధించిన యాచార, వ్యవహార ధర్మములన్నియు ధర్మసూత్ర ములందును పేర్కొనఁబడినవి. బ్రాహ్మణారణ్యకోపనిషత్తు వలెనే ఒక్కొక్క వేదమునకు ప్రత్యేక కల్పసూత్రములు కలవు.

పై నుడివినదియేకాక 'దర్శనము'లను పేరఁ బ్రసిద్ధమై వేఱొక విధమగు వాఙ్మయముకూడ విలసిల్లెను. ఉపనిషద్ జ్ఞాన జన్యములు దర్శనములు. సాంఖ్య, యోగ, న్యాయ వైశేషిక, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంసలని అవి ఆఱు. ప్రాచీనార్యుల తత్త్వవిచారము పండించిన పంట లివి సృష్టి, జీవాత్మ, పరమాత్మలకుఁ గల పరస్పర సంబంధములను గూర్చియు, జీవాత్మ సంసారబంధ విమోచనమార్గమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గూర్చియు పరిణత బుద్ధులును, ప్రతిభాశాలులును అయిన విజ్ఞానధనులు చేసిన చర్చ లీ దర్శనముల నుండును.

ఈ విధమున విస్తరిల్లిన వేదవిద్య యంతరింపకుండ పోషించి పరిరక్షించుటకు బ్రాహ్మణులయందు నొకరీతి విభజన మావశ్యక మయ్యెను. క్రతుకర్మాదికములఁ బాల్గొను ఋగ్వేదాధ్యేతలు ఋగ్వేదులు, యజుర్వేదాధ్యాయులు యజుర్వేదులు, సామవేదమును గానముచేయువారు సామవేదులు, తక్కినవారు అథర్వవేదులునని బ్రాహ్మణులు నాలుగు శాఖలుగ చీలిరి. ఏవేదమునకు సంబంధించినవారు ప్రధానముగ ఆ వేదమును, దానికి సంబంధించిన ఆరణ్యకోపనిషత్తులను కంఠస్థముఁ గావించుకొని, వంశపారంపర్యముగ అధ్యయనముఁ జేయుచు, ఆ వేదములకు సంబంధించిన కల్ప సూత్రములఁ దమకు నియతములైన కర్మల నాచరించుచు, వేద విద్యావల్లరిని బ్రోదిసేయుచు వచ్చిరి. ఈ రూపమున అయిదువేల సంవత్సరములనుండి యిప్పటివఱకు వేదవిజ్ఞానతంతువు తెగిపోకుండ కాపాడుచు వచ్చిన మన పూర్వుల ప్రజ్ఞావైభవ మసదృశము కదా!

బ్రాహ్మణుఁడైనను, క్షత్రియుఁడైనను వైశ్యుఁడైనను, ఆర్యకుమారుఁడు విద్యార్థియై గురుకులవాసము చేసి యీ వాఙ్మయమును కంఠస్థముచేసికొని *, తరువాతికాలమున ఆయా

* మనపూర్వు లీవాఙ్మయమునంతను గ్రంథరూపమునఁగాక కంఠస్థముఁ గావించుకొనియే భద్రపఱచియుంచిన కారణమున కొందఱు పాశ్చాత్య పరిశోధకపండితులు మంత్ర, బ్రాహ్మణములకాలమున ప్రాచ్యులకు లిపియే లేదనియు, ఈ హిందూదేశములో [illegible] విదేశీయవర్తకు

JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
Jangamawadi Math, Varanasi
Acc. No. 78[illegible]

సూత్రార్థముల కనుగుణముగఁ దన జీవితమును నడపుకొను చుండువాఁడు. హిందువులలో ఎన్ని వర్ణములవా రున్నను ఎన్ని శాఖలవా రున్నను వారందఱు కల్పసూత్రముల ప్రకారము నడచుకొనవలసినవారలే. ఎల్లరును వేదములను, వైదిక క్రతువులను పరమ ప్రమాణములుగ నంగీకరింపవలసినవారలే. ఈ రీతిని ఒకటే విధమయిన మతము మూలమునను, ఒకటే విధమయిన కర్మమూలమునను, ఒకటే విధమయిన ధర్మము మూలమునను ఆర్యహిందూచారిత్రము దిద్దఁబాటయి, సంఘమంతయు ఆర్యసంస్కృతిబంధమున వర్ధిల్లుచుండెను.

కాలక్రమమున వేదవిద్యనుండియే హిందూశాస్త్రములనేకములు మొగ్గ తొడిగినవి. వేలు వేలు యజ్ఞయాగాదులకు వేలు వేలు కొలతలు, ఆకృతులు కల యజ్ఞవేదులు నిర్మింప వలసిన యావశ్యకము కలిగి ఆర్యులు రేఖాగణిత (Geometry), త్రికోణమితి (Trignometry) సిద్ధాంతములు గనిపెట్టిరి. తదుపకారకముగ బీజగణితమును (Algebra) అంకగణితాంతర్గతమగు దశమాంశ (Decimal) గణితము

లగు 'ఫొయనీషియను'లే దానిని క్రీస్తు పూర్వ మేడవ శతాబ్దిని ఈ దేశమునఁ బ్రవేశపెట్టిరనియుఁ దెలుపుదురు కాని యిది విశ్వసనీయమైనది కాదు; ఏలయన గొప్ప విద్వత్పరిశోధకులే కొందఱు ఆర్యులు లిపి నెఱుఁగుదురనుటకు వేదములందే సూచనలు కలవని, వానినుండియే యుదాహరణముల నిచ్చియున్నారు. కావున తద్వాఙ్మయమును గ్రంథస్థము కావింపకపోవుటకు కారణము లిపి కొఱంత కాదు; అది పవిత్రవాఙ్మయమైన కారణముననే దానిని అచేతనములైన గ్రంథపేటికలఁగాక అత్యంత శ్రద్ధాభక్తులతో పూర్వులు సచేతనములైన హృదయాగారములందే భద్రపఱుచుచుండి యుందురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గనిపెట్టిరి. తరువాతఁ దరువాత దశమాంశ గణితమును హిం దువుల కడనుండి అరబ్బులును, వారినుండి యూరోపియను లును నేర్చుకొనిరి. ఈ విధమున నేడు సర్వ ప్రపంచము సొత్తయిన యీ విజ్ఞానము అసలు హిందూప్రతిభామూల కము. వేదాంగములైన శిక్షా, వ్యాకరణ, జ్యోతిషములనుం డియే హిందువుల స్వర (Phonetics), శబ్ద (Grammar), శబ్దకోశ (Lexicography), జ్యోతిష శాస్త్రములు పుట్టినవి. జ్యోతిషము మరల గణితస్కంధము (Astronomy) జాతక స్కంధము (Astrology) నని రెండు శాఖలుగ విడివడినది. కల్పసూత్ర ధర్మములే కాలక్రమమున ఆచార, వ్యవహార, ప్రాయశ్చిత్తకాండములను పేర మూఁడు భాగములుగ విడి వడి ధర్మశాస్త్ర వాఙ్మయము (Legal Literature) అనఁబరగినది. సామవేదమునుండి గాంధర్వవిద్యయనుపేర విశ్రుతమైన సంగీత (Music) తరంగిణి ప్రవాహిల్లెను. ఆయుర్వేదము (Medicine) నకు అథర్వవేదము మూలము. ఇట్లే శరీరస్థూల నిర్మాణ శాస్త్రము (Anatomy), పిండోత్పత్తి శాస్త్రము (Embryology) గూడ వేదవిజ్ఞాన మూలకములు. రాజ్యపరిపాలనావిధానము కూడ కాలక్రమమున వికాసముఁ జెంది యొక్క శాస్త్రముగఁ బరిణమించెను. దీనికి అర్థశాస్త్రమని పేరు.

ఈ రీతిని హిందువుల శాస్త్రములన్నియు వేద వాఙ్మ యమునసుండి అంకురిల్లి, క్రమముగ మహారాజపోషణమును గాంచి అనంతశాఖోపశాఖా మండితములైన మహావృక్షము లుగ మిన్నుముట్టినవి. హిందూవాఙ్మయ మెట్టిదైనను అది ధర్మ, అర్థ, కామ, మోక్షము లనెడు చతుర్విధ పురుషార్థము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను సాధించుటకే యయినది. పైనుడివిన యీ వాఙ్మయమెల్ల
ఆర్యుల పవిత్ర భాషయైన సంస్కృతముననే కలదు. ఈ సం
స్కృతప్రాబల్యమున దేశభాషలు తలయెత్తి ప్రబలఁ జాలక
పోయినవి.

ఈ విధమున వేదమే హైందవ విజ్ఞాన, సభ్యతలకు
మూలకందమగుటను భరతవర్షము కర్మభూమి నాఁబర
గినది. ఏతత్కారణమున హిందువుల జీవితమేకాక సర్వవిధ
ములైన హిందూద్యమములును మత ప్రధానములై అప్పటికి
నిప్పటికిని ఆధ్యాత్మికప్రతిపత్తితో నలరారుచున్నవి.

---

## నూతన మత సంస్థాపన యుగము

క్రీస్తు పూర్వ మేడవ శతాబ్ది చివరను, ఆఱవ
శతాబ్దిని హిందూసంఘహృదయము అత్యంత అశాంతి సంఘ
రితమై కలతఁనొంది యుండెను. వర్ణవ్యవస్థ మూలమున
ఆర్యులు సంఘమునంతను ఒక్క యావరణములోనికిఁ దెచ్చి
సంస్కృతి పూర్వకమైన యైక్యమునకు పునాదులు వైచినను
వైదిక కర్మలకును, వైదిక విజ్ఞానమునకును అధికారము
త్రైవర్ణికులైన తమయందే యుంచుకొని, వేదాధ్యయనము
వేదోక్తకర్మాచరణము చతుర్థవర్ణమువారికి నిషేధించుట
వలన వారియందు నీయశాంతి బీజములు నాటుకొని క్రమ
క్రమముగా నంకురించి పెరుఁగుచుండెను. మఱియు సంసారతరణ
సాధనములైన పారమార్థిక క్రియలన్నియు బ్రాహ్మణాధీనములే
యగుట దానికింకను దోహదమయ్యెను. సాంఘికాచారధర్మ
ముల బ్రాహ్మణులే యనుశాసకులై యితర వర్ణములవా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంటెఁ దమ కెక్కువగౌరవ మర్యాదల నిలుపుకొని సాంఘికు లందఱిలో నాధిక్యమును గడించుకొనుచుండిరి. కాలక్రమా గతమైన యీ నూతన గౌరవాధిక్యములతో బ్రాహ్మ ణుల ప్రవర్తనమునసే మార్పు కలుగుచుండెను. బ్రాహ్మణు లలో ప్రాచీనకాలమున నుండిన ఆత్మనిగ్రహము, ఇంద్రియ నిగ్రహము ఇప్పుడు కొఱవడుచుండెను. బ్రాహ్మణోపదిష్టులై రాజులు రాజసూయాశ్వమేధాది బహువిధాధ్వరముల నొన రించుచు దక్షిణలరూపమున బ్రాహ్మణులకు పశుధనము నే కాక వెండి బంగారములనుగూడ అమితముగ నొసంగుచుండుటవలన భాగ్యవంతులైనకొలఁది బ్రాహ్మణులలో తృష్ణ హెచ్చిరిల్లు చుండెను. పూర్వము ప్రతిగ్రహలబ్ధమైన ధనముతో ధర్మ మాచరించుచు, వైదిక కార్యాచరణాసక్తులైయుండిన బ్రాహ్మణు లిప్పుడు ధనాశాపీడితులై లోభు లగుచుండిరి. గుణములకంటెను జన్మమే అగ్రవర్ణమువారికి శ్రేష్ఠత్వనిరూపణ కారణ మగు చుండెను. సచ్చరిత్రమునకు, సారళ్యమునకు, సత్యమునకు, ధర్మ మునకు, క్షమకు, కరుణకు, సౌమ్యతకు, సాధుత్వమునకు మాఱుగ వైదికకర్మలకే యాధిక్యము కలిగెను. అసలు భావమునకం టెను, తత్త్వమునకంటెను నియమాచారములకును, వ్యవస్థల కును అత్యంతప్రాధాన్యము కలిగి సంఘము కానిదారిని బట్టు చుండెను. ఈ విధములైన హెచ్చు తగ్గులను చక్కఁబఱిచి, సంఘమును సరిదిద్దుట యత్యంతావశ్యక మయ్యెను. ప్రధాన ముగ ఏతత్సంస్కరణమహాకార్యనిర్వహణార్థ మవతరించిన మహనీయులు వర్ధమాన, సిద్ధార్థులు : ఒకరు జైనమతమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంస్కరించి పేరు గడించినవారు; ఇంకొకరు బౌద్ధమతమును సంస్థాపించి లోకవిఖ్యాతి నార్జించినవారు.

సంఘమునందలి పై నుడివిన యశాంతికిఁ దోడు వేఱొక విధమైన మానసికమగు నసంతృప్తికూడ ప్రబలుచుండిన కాలమది. ఉపనిషత్తుల కాలముననే వేదచోదితక్రియాకలాపమునకుఁ గల మోక్షప్రదాయక శక్తినిగూర్చి ధీమంతులైన తత్త్వవేత్తల కనుమానము జనించెను. తత్వవిచార మధికమైన కొలఁది నీ యజ్ఞయాగాదివైదికక్రియలు, పశువిశసనము (పశువధ)లు నిరర్థకములను నభిప్రాయము ప్రబలెను. కర్మరహితమై, తత్వవిచారమున కెక్కుడవకాశము నిచ్చు సన్యాసిజీవితమే యుత్కృష్టము, నవలంబనీయము నను విశ్వాసము అవరవర్ణముల వారియందు వృద్ధినొందుచుండెను. ఈ ప్రపంచ, సంసారముల యలజడినుండి తప్పించుకొని, సన్యాసులై బంధనములను ద్రెంచుకొని చావు పుట్టుకలు లేని మార్గమును వెదకికొనుచు ప్రశాంతముగ కాలముఁ గడుపుదమన్న, సాంఘిక ధర్మముల ననుసరించి యది యగ్రవర్ణులకే కాని తదితరుల కధర్మ మయ్యెను. ప్రతిభాశాలులైనవారలు సంఘమున కంతకు సర్వదుఃఖనివారకములును, మోక్షప్రదాయకములునైన మార్గాంతరముల నన్వేషింపఁ జొచ్చిరి. ఈ జిజ్ఞాసకు ఫలముగ నీ కాలమున అఱువదిమూఁడు మతము లేర్పడెను. వీనిలోఁ గొన్ని యవైదికములు : కర్మప్రధానమైన బ్రాహ్మణ మతమునకుఁ బ్రతికూలములైనవి. అన్నిటిలో ప్రజానుమోదమును గాంచి ప్రధానముగ నిలఁబడి వర్ధిల్లినవి రెండు: జైన, బౌద్ధమతములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇవి ప్రబలము లగుటతో మిగిలిన వానిలోఁ గొన్ని సన్నగిల్లెను; మఱికొన్ని వీనిలోఁ జేరిపోయి యంతరించెను.

## జైన మతము

బ్రాహ్మణమతమునెడలఁ గల యసంతృప్తితో దానిని గర్హించుచు క్రొత్తగ నేర్పడిన పూర్వోక్త ప్రధానమతములు రెంటిలో జైనము మొదటిది. ఈ మతమువారు తమ మత మత్యంత పురాతనమైనదని చెప్పెదరు కాని యట్లు విశ్వసించుటకుఁ దగిన యాధారములు లేవనియు, వర్ధమానుఁడే మహావీరుఁ డనఁబరగి యీ మతమును కట్టుదిట్టములకు లోఁబఱిచి, బాగుగ వ్యాపింపఁజేసినాఁడనియు చరిత్రకారు లందురు; కాని యీ మహావీరునికిఁ బూర్వముకూడ ప్రజ లీవిశ్వసాగరమును తరించుటకై తీర్థము (రేవు) లను నిర్మించిపోయిన మహాత్ము లిరువదిమువ్వురు కలరని జైనులు విశ్వసించి, తీర్థంకరు లనుపేర వారిని ఆరాధింతురు. ఈ తీర్థంకరులలో మొదటివాఁడు ఋషభదేవుఁడు. ఇరువది మూఁడవవాఁడు పార్శ్వనాథుఁడు. కల్పితపురుషుఁడు కాక యీతఁడు వర్ధమానునికిఁ బూర్వము వర్ధిల్లిన చరిత్రపురుషుఁ డనియు, ఈతఁడు స్థాపించిన మతమునే మహావీరుఁడు సంస్కరించెననియు చరిత్రకారు లందురు. ఇది యెట్లున్నను ఈ సంస్కారము నొందిన మతమే జైనమని ప్రసిద్ధిగాంచుటచేత జైనులచే ఇరువదినాలుగవ తీర్థంకరుఁడుగ పరిగణింపఁబడు వర్ధమాన మహావీరునిగుఱించి మనము తెలిసికొనవలసియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రీస్తుకు పూర్వ మాఱవశతాబ్దిని గణరాజ్యముగ నుండిన విదేహకు వైశాలీనగరము రాజధాని. ఈ రాజ్యమును పరి పాలించుచుండిన నాయకులలో చేతకుఁ డొకఁడు. ఇతనికి త్రిశల యను సోదరియు, 'చెల్లన' యను కూఁతురును గలరు. అతఁడు తన కూఁతురిని మగధరాజ్యాధిపతియైన బింబిసారున కిని, త్రిశలను వైశాలికి సమీపస్థమగు కుండగ్రామమున నివ సించుచుండిన యొక సామంతుఁడైన సిద్ధార్థునికి నిచ్చి పరిణ యముఁ గావించెను. ఈ త్రిశలా సిద్ధార్థులకు నందివర్ధన, వర్ధ మానులను కొమారులును, సుదర్శనయను కూఁతురును గలి గిరి. సిద్ధార్థుని ద్వితీయపుత్రుఁడైన వర్ధమానుఁడే జైనమత సంస్థాపకుఁడు.

ఇతఁడు చిన్నతనముననే యెల్లవిద్యలయందును బ్రవీణుఁ డయ్యెను. యుక్తవయస్సున తలిదండ్రు లాతనికి అనురూపగుణ శీలవతియగు యశోదయను కన్యను పెండ్లిచేసిరి. కాని యాతఁ డెప్పుడును తత్వవిచారముననే నిమగ్నుఁడై ప్రజల నీయైహిక బంధములనుండి తప్పించి శాశ్వత సౌఖ్యము నొడఁగూర్పఁగల మార్గముకొఱ కన్వేషించుచుండెను. భోగలాలసత్వమున మరగి, సుఖముగ గృహమునఁ గూరుచుండిన నిట్టి మార్గము పొడఁగానరాదని చింతించి, అతఁడు తలిదండ్రుల మరణానంతరము ముప్పదిసంవత్సరముల ప్రాయమునఁ దన రాజ్యమునందలి ప్రజల యొక్కయు, అగ్రజుఁడైన నందివర్ధనునియొక్కయు అంగీకార మును బడసి భోగములను పరిత్యజించి త్యాగియై, వీతరాగియై పార్శ్వనాథ మతము నవలంబించి రెండేండ్లు గడపెను; కాని యా మతముతోఁ దనివి సనక దానిని విడిచిపెట్టి, ప్రపంచబంధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములనన్నిటిని సంపూర్తిగ ఛేదించుకొనినందులకు గుర్తుగ వస్త్రములనుకూడ నూడ్చివైచి, నిర్గ్రంధుఁడయి (అనఁగా బంధరహితుఁడయి) భిక్షాటనమున మనుగడఁ గడపుచు దేశసంచారము చేయఁజొచ్చెను. వర్థమానుఁడటుపిదప దీక్షాకంకణముఁ గట్టి, నిరతోపవాసకృశీభూత శరీరుఁడై మహాఘోరతప మాచరించెను. ఇట్లు బహువిధప్రయత్నోపలబ్ధమైన యనుభవజ్ఞానము మూలమునను, నిర్వికల్పధ్యాన యోగసమాధిమూలముఁనను తుద కాతని నలువది రెండవయేట నిర్వాణమార్గము గోచరించెను. అంతనుండి యతఁడు జినుఁడు (జయించినవాఁడు), మహావీరుఁడు (ఆధ్యాత్మిక విజయమును బడసినవాఁడు), కేవలి (సమస్తముఁ దెలిసినవాఁడు)అను పేరుల బ్రసిద్ధుఁడయ్యెను. పార్శ్వనాథ సంస్థాపితమైన మతమును సంస్కరించి మహావీరుఁడు మగధ, విదేహా, కోసలములందలి పల్లెలఁ బట్టణములఁ బర్యటనముచేయుచు, ఈ నూతనమతమును ప్రజలకు బోధించుచు తన డెబ్బది రెండవయేట శరీరయాత్ర చాలించువఱకు మతవ్యాపనము చేయుచునేయుండెను. ఇతఁడు క్రీస్తుకు పూర్వము ౫౯౯ లో జన్మించి ౫౨౭ లో నిర్వాణము నొందెనని చెప్పుదురు.

జైనమతావలంబకులకు ప్రాచీనకాలమున నిర్గ్రంధులని పేరు. కాలక్రమమున వీరికే జినుని మత మవలంబించినవారగుట జైనులని పేరు కలిగెను. జినునిమతమే జైనము నాఁబరఁగెను. హిందూసంఘమున నప్పటికే మతవిషయకమైన యశాంతి ప్రబలియుండుటచేతను, అగ్రవర్ణమువారికడ నుండి వర్ణమువారివఱకు నీ మతము సులభమును, సుగమమునయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండుటచేతను, బంధుత్వముమూలమున మహావీరుడు విదేహా, మగధరాజులందు పలుకుబడి గలిగియుండుటచేతను ప్రజాదరణమును, రాజాదరణమును బొంది యనతికాలముననే జైనమతము విదేహా, మగధాది రాజ్యముల బాగుగ వ్యాపించెను.

జైనము బ్రాహ్మణమతమును గర్హించి, దానిని నిరాదరించుటవలన ఏర్పడినదగుటచేత జైనులు వేదముల ప్రామాణ్యమునుగాని, వైదికకర్మల ప్రామాణ్యమునుగాని యంగీకరింపరు. ఆత్మానాత్మ సంయోగమే సృష్టి. ఐహికబంధములనుండి యాత్మ విమోచనము నొందుటయే మోక్షము-నిర్వాణము. జన్మపరంపరలఁగాని యిది సిద్ధింపదు: అనఁగా జైనులు పునర్జన్మ సిద్ధాంతము నంగీకరింతురు. నిర్వాణోపలబ్ధికి వేదాధ్యయనముకాని, వైదికకర్మలుకాని సహకారులుకావు. 'సమ్యక్ దర్శనము', 'సమ్యక్ జ్ఞానము', 'సమ్యక్చరిత్రము' అను వీని మూలముననే యిది సాధ్యము. వీనిని త్రిరత్నము లందురు. ఇవి యాత్మ నాశ్రయించియుండును గాన ఆత్మయే ముక్తినిగాంచునది. జినునియందలియు, జైన తత్వమునయందలియు విశ్వాసమునకే సమ్యక్ దర్శనమని పేరు. ఇది మోక్షసాధనమునకు మొదటి సోపానము. సంశయ, మోహా, విభ్రమదోష వివర్జితమును, ఆత్మ పరస్వరూప గ్రహణ శీలమునైనది సమ్యక్ జ్ఞానము. అశుభకార్య నివృత్తియు, శుభ భకార్య ప్రవృత్తియుఁ గలిగియుండుట సమ్యక్ చరిత్రమనఁబడును. సమ్యక్చరిత్రమున అహింస, సత్యము, అస్తేయము (దొంగతనము చేయకయుండుట) బ్రహ్మచర్యము, అపరిగ్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హాము అను నీ పంచమహావ్రతములు ప్రధానములయినవి. జైనమతమున పురుషుల కెల్లరకు సన్యాసాశ్రమ స్వీకారమున కధికారముకలదు. సచేతనమయినను, అచేతనమయినను జగత్తంతయు ప్రాణవంతము. ఇవి జైనధర్మ సిద్ధాంతములు.

అత్యంతపురాతనములగు జైనమత గ్రంథములకు పూర్వములని పేరు. ఇవి పదునాలుగు. జైనమతగ్రంథములు వేదముల నిరసించునవియగుటచేత సంస్కృతమునఁ గాక దేశభాష (ప్రాకృతము) అయిన అర్ధమాగధినిఁ గలవు. జైన సన్యాసులకు యతులనియు, జైనమతధర్మముల ననుసరించి జీవనముఁ గడపు సామాన్యులకు శ్రావకు లనియు పేరు.

మహావీరనిర్వాణానంతరము జైనమతాచార్యపీఠము నధిష్ఠించినవాఁడు సుధర్ముఁడు. ఇతని వెనుక నలువురు గురుపట్టము నందినపిదప సంభూతవిజయ, భద్రబాహువు లనువారు జైనసంఘమున కాచార్యులైరి. ఇంచుమించుగ వీరి కాలముననే, అనఁగా మహావీర నిర్వాణానంతరము రెండువందల సంవత్సరములకు మతాచార వ్యవహార విషయముల నభిప్రాయభేదము కలిగి జైన మతావలంబకులు శ్వేతాంబరులని, దిగంబరులని రెండు శాఖలుగఁ జీలిపోయిరి. శ్వేతాంబరుల మత గ్రంథములకు సిద్ధాంతములని పేరు. వీనికి ఆగమములనియు నామాంతరము కలదు. వీనియందు అంగములు, ఉపాంగములు అను విభాగములు కలవు. స్త్రీలుకూడ సన్యాసినులగుటకు శ్వేతాంబరు లంగీకరింతురు. శ్వేతాంబరులు ధౌతవస్త్రధారులు. దిగంబరులు దిసమొలవారు. క్రీస్తుకు మూఁడువందల సంవత్సరములకుఁ బూర్వము భద్రబాహువుకాలమున జైనులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దక్షిణాపథమున కరుదెంచిరి. నాఁటినుండి క్రీ. శ. ౧,౦౦౦ సంవత్సరముల పయివఱకు జైనమతము దక్షిణ హిందూదేశమున బాగుగ వర్ధిల్లెను. జ్యోతిష గణిత శాస్త్రములందును, సంస్కృత ప్రాకృత భాషలందును జైనులు కృషిచేసి గొప్ప పండితులై చక్కని ఉద్గ్రంథములను వ్రాసియుండిరి. అంతియ-కాక తమిళ, కర్ణాటాది వాఙ్మయములనుగూడ వీరు చాల వృద్ధి నొందించిరి. పాశ్చాత్య సభ్యతా సంపర్కమున హైందవసభ్యత ముదిరినకొలఁది దిగంబరజైనశాఖలోని దిగంబరత్వ మంత రించుచున్నది. నేఁటికి నెక్కువగ దిగంబరశాఖకుఁ జెందిన జైనులు 'దక్షిణాదిని', శ్వేతాంబరశాఖకుఁ జెందినవారు 'ఉత్తరాది'ని గానవచ్చెదరు. ఇప్పటికి గుజరాత్, కఠియా వాడ, రాజపుత్ర స్థానము, మైసూరు మున్నగు ప్రాంతముల నీ జైనమతము సజీవముగానున్నది. ఢిల్లీ, అజ్మీర్, జయపూర్ మథురా నగరము లుత్తర హిందూస్థాన జైనుల ఆచార్యపీఠస్థానములు. దక్షిణ హిందూదేశమున కాంచీనగరమున నొక ప్పుడు జైనమతము వర్ధిల్లుచుండె ననుటకు ఆ నగరమునఁ గొంత భాగమునకు జినకంచియనుపే రుండుట తార్కాణము. ఇది యిప్పుడు 'తిరుప్పటి తికున్ర' మనుపేరఁ బరగుచున్నది. ఇదికాక మైసూరు రాజ్యమునందలి శ్రవణ బెల్గొళాయును, ఉడిపి సమీపముననున్న కారకల్లును దక్షిణ హిందూదేశమునందలి పవిత్రజైన క్షేత్రములు. పూర్వ మెప్పుడో నిర్మింపఁబడిన ఏఁబది యేడడుగుల యెత్తుగల గొప్ప జైన విగ్రహ మొకటి జైనశిల్పవిజయధ్వజము వలెఁ బ్రకాశించుచు శ్రవణ బెల్గొళాలోఁ గలదు. గొమ్మటేశ్వరుఁ డనుపేరం బరగు ముప్పదియా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అడుగుల దర్శనీయమైన జైనవిగ్రహ మొకటి కారకల్లులోఁ గలదు.

ఒకప్పు డాంధ్రదేశమునను జైనమతము బాగుగ వర్ధిల్లినది. అచ్చటచ్చట గ్రామములందుఁ గానవగు జైన విగ్రహములు ఇందుకు తార్కాణము. ఆంధ్రదేశము నేలిన వేంగీ చాళుక్యులు జైనమతము నాదరించి తదభివృద్ధికిఁ జేయూఁత నొసఁగిరి. వారికాలమున నిప్పటి కృష్ణామండలమునందలి బెజవాడయు, గుంటూరు మండలమునందలి ధర్మవరమును, కడప మండలమునందలి పెద్దముడియమును ప్రధాన జైనక్షేత్రములయినట్లు ప్రాచీనశాసనములవలనఁ దెలియనగును.

---

## బుద్ధుఁడు : బౌద్ధ మతము

కోసల దేశమున కీశాన్యముగ హిమాలయ ప్రాంతముల పశ్చిమనేపాళమున గౌతమగోత్రులైన శాక్యవంశక్షత్రియులు పాలించుచుండిరి. వారికి కపిలవస్తు నగరము రాజధాని యని యీవఱకే తెలుపఁబడినది. క్రీస్తుకు పూర్వ మాఱవ శతాబ్ది నీరాజ్యమును శుద్ధోదనుఁడను రాజు పరిపాలించుచుండెను. మహామాయ యతని పట్టమహిషి. సంతానార్థులై యా దంపతులు పెక్కుదేవతల నారాధించిరి. తుదకు సకలలోక సంత్రాతయైన భగవానుఁడే వెల్లయేనుఁగు రూపమునఁ దన గర్భమున కవతరించుచుండినట్లు మాయాదేవి యొకప్పుడు స్వప్నము గాంచెను. అంత నామె గర్భము దాల్చెను. నెలలు నిండినవెనుక ఆమె కపిలవస్తు నగరమునకు చేరువ గ్రామమున నున్న తన పుట్టినింటి కరుగుచు, మధ్యేమార్గమునం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గల సాలవనమున నొకసాలవృక్షచ్ఛాయ నించుకతడవు విశ్రాంతిఁ గైకొనెను. ఇచ్చట నుండ నొప్పులు వచ్చి యామె యొక మగపిల్లవానిం గనెను. తరువాతి కాలమున నవతారమూర్తిగ నెన్నఁబడిన బుద్ధుఁ డీశిశువే. ఈ సాలవనము బౌద్ధగాథలందు లుంబినీవన మనుపేరఁ బరఁగుచున్నది. ఇందు బుద్ధుఁ డుదయించినచోట జ్ఞాపకచిహ్నముగఁ దరువాతఁ గొంతకాలమునకు మగధసామ్రాజ్యాధినేతయైన అశోకచక్రవర్తి యొక శిలాస్తంభమును బ్రతిష్ఠించి, దానిపై నొక శాసనమును జెక్కించెను. ఆ శాసనస్తంభ మిప్పటికి నా సాధువతంసుని స్మృతికిఁ దెచ్చుచు అచ్చటనే నిలిచియున్నది.

అత్యంతసంతోష సంభరితుఁడయిన శుద్ధోదనభూపతి నగరమున నతి వైభవముతో పుత్రోత్సవములు నడపి, యా శిశువున కయిదవదినమున సిద్ధార్థుఁడని నామకరణముఁ గావించెను. ఆ మహోత్సవమున కరుదెంచిన దైవజ్ఞశిఖామణులు తన పుత్రుఁడు విశ్వమునంతను ఏకచ్ఛత్రముగఁ బరిపాలింపఁగల మహాచక్రవర్తియో, దుఃఖనివారణమార్గోపదేశకుఁడై విశ్వము నుద్ధరింపఁగల మహాసన్యాసియో కాఁగలఁడనియు, సన్యాసియే యగుచో నందుల కస్థిరములును, దుఃఖకరములునగు నైహికదృశ్యములే కారణములు కాఁగలవనియు జోస్యము చెప్పుటచేత నాఁటనుండియు నట్టి దృశ్యము లాతని కంటఁబడకుండ తగు నేర్పాటులను జేయుచు శుద్ధోదనుఁడు పుత్రాభ్యుదయము విషయమున నత్యంతశ్రద్ధాళువై యుండెను.

సిద్ధార్థుఁడు జన్మించిన యేడవనాఁడే యాతని తల్లియైన మహామాయ కాలధర్మము నొందెను. అప్పటినుండి యతని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సవతి తల్లియైన మహాప్రజాపతిగౌతమియే యాతనిని బెంచి పెద్దవానిఁ జేసెను.

సిద్ధార్థుఁడు పెరిఁగి పెద్దవాఁడయి పెక్కురు బ్రాహ్మణ గురువులయొద్ద విద్య నభ్యసించెను. కాలక్రమమున నతఁడు క్షత్రియోచితములైన రణవిద్యలయందును సాటిలేనివాఁడని పేరున కెక్కెను. పదునాఱవయేఁట నాతఁడు సుప్రబుద్ధుఁడు తన కూఁతురైన యశోధరవివాహముకొఱ కేర్పాటుచేసిన ధనుర్విద్యాపరీక్షయందు తోడిశాక్యకుమారుల నందఱ నోడించి మించి, అసమాన రూపలావణ్య గుణశీలవతి నాసుందరిని జేపట్టెను.

తనయుఁడు పెద్దవాఁ డగుచుండినకొలఁది జోస్యము జ్ఞాపకము వచ్చి శుద్ధోదనునికి పుత్రుని భావిదశనుగూర్చిన యాందోళనముతోపాటు జాగరూకతయు హెచ్చుచుండెను. సిద్ధార్థుఁ డైహికదుఃఖముల సడి యెఱుంగక యెల్లప్పుడు సౌఖ్య సంతోష నిమగ్నుఁడై, నిరంతర భోగలాలసుఁడైయుండు నట్లు చేయుటకు శుద్ధోదనుఁడు ప్రత్యేక మాతనికి ఋత్వనుగుణములైన భోగానుభవముల కనుకూలముగనుండు రమ్యహర్మ్యములను గట్టించి, నృత్తగీత వాద్యాదులఁ గడుఁజతురలైన విలాసవతుల నాతని పరిచర్యకు నియమించెను. ఈ రీతిగ పది సంవత్సరములకు పైఁగా నాతఁడు సకల భోగముల ననుభవించెను. ఈ కాలమున సయితమాతఁడు తన భోగవిలాసజీవితపరమార్థమునుగుఱించి యెడనెడఁ దన్నుతానే ప్రశ్నించుకొనుచుండువాఁడు. ఒక్కొకప్పుడు జరా, రోగ, మృత్యువులనుగూర్చి తలపోయుచు, నివి ప్రతి మనుష్యునకు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సహజములైనను వీనింగూర్చి ప్రజలేల భీతిల్లవలెనని వితర్కించు
చుండువాఁడు. వేఱొక్కతటి వృద్ధి క్షయములకును, జన
మరణములకును, రోగ విచారములకును వశవర్తియైన తాన
మరల నట్టివానికిలోనైనవానినే పడయుట కెందులకుఁ బ్రయ
త్నింపవలెనని చింతించుచుండువాఁడు. అయినను సంతతా
నందసంధాయకములైన భోగవిలాసము లాతని తత్త్వజిజ్ఞా
బహిర్గత మగుట కవకాశ మొసంగలేదు.

సిద్ధార్థుని కట్టియవకాశ మనతికాలముననే లభించెను
ఒకానొకప్పు డతని కుద్యానవనవిహారము సేయ వేడుక కలు
నతఁడు తన యభిమతమును దండ్రికి విన్నవించెను. శుద్ధ
దను డందుల కనుమతి యొసంగి యొక్కదిన మేరుపా
కావించి, నగరమంతయు మనోహరముగ నలంకరించునట్లు ప
జనుల కాజ్ఞ యొసంగి యమంగళదృశ్య మేదియు మార్గమ
రాజకుమారుని కంటఁబడకుండఁ గట్టడచేసెను. కాని నియ
తదివసమున సిద్ధార్థుఁడు రథారూఢుఁడై సారథియైన చెన్ననితో
నగరరథ్యలగుండఁ బోవుచుండ దైవనిర్ణయముకతన జరాభా
పరిపీడితుఁ డొక్కఁ డారాజకుమారునికిఁ గానవచ్చెను. వె
టనే, అంతవఱకు నిత్యరమణీయప్రకృతిసందర్శనమున క
వాటుపడిన యాతని లలితహృదయ మావికలాంగుఁడగు ము
కనిఁ గాంచినంతన కలఁతఁజెందెను. వృద్ధసందర్శనమును గూర్చి
సంభాషణమున 'వయస్సు వచ్చినకొలఁది యౌవన మంతరి
వార్ధక్యము కలుగుట ప్రకృతిస్వభావ' మని తన సారథి యాడి
మాటలను సిద్ధార్థుఁడు తలపోయుచు ఉద్యానవనవిహా
రాపేక్ష వీడి స్వగృహోన్ముఖుఁ డయ్యెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ వృత్తాంత మంతయుఁ దెలిసి విషణ్ణహృదయుఁ డయి శుద్ధోదనుఁ డిల్లే మరి మూఁడుతడవలు సిద్ధార్థుఁ డుద్యానవనమున కరుగు దినముల నిట్టి దృశ్యము లాతని కంటఁ బడకుండున ట్లెంతయో కట్టడచేసి జాగరూకత వహించెను. అయినను ఒకపరి జ్వరపీడితుఁడై కృశాంగుఁడైన యొక రోగియు, నింకొకతడవ నొకశవమును వేఱొకమా ఱొక సన్న్యాసియు నా రాజకుమారుని దృష్టిపథమునఁ బడిరి. ఈ యమంగళదృశ్యములను బ్రత్యక్షముగఁ జూచినపిదప సిద్ధార్థునికి మఱింత కలవరము హెచ్చెను. హృదయమున శాంతి సంతోషము లంతరించెను. యౌవనము నంతరింపఁ జేయు వార్ధక్యమునకును, ఆరోగ్యమును తుదముట్టించు రోగములకును, ప్రాణములనే హరించు మృత్యువునకును వశవర్తి యైన యీ పాడుజీవనమున సౌఖ్యానందములకు స్థాన మెచట నని యాతఁడు దీర్ఘాలోచన చేయఁదొడఁగెను. భోగవిలాసము లంతరించి యీ యాలోచన బలమైనకొలఁది తత్త్వజిజ్ఞాస వికసించెను.

ఆ కాలమున భాగ్యవంతులును, కులీనులును గూడ కొంతకాలము సుఖముల ననుభవించి తురీయమైన సన్న్యాసాశ్రమమును స్వీకరించి యాధ్యాత్మిక విషయములఁ దర్కవితర్కములఁ జేయుచు తాము గడించిన విజ్ఞానమును ప్రజలకు బోధించుటకై యూరూరఁ దిరుగుచు, కాలము గడపుచుండుట పరిపాటిగ నుండెను. ఇట్టి సన్న్యాసులు కొందఱు ఒక్కొక్క గురువునొద్దఁ జేరి యాతని మతము నవలంబించి, ఆ మతధర్మములను ప్రజలలో వ్యాపింపఁజేయుచుండిరి. ఇట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మతము లానాఁ డఱువదిరెండు కలవని బౌద్ధగ్రంథములవలనఁ దెలియవచ్చెడిని.

సిద్ధార్థునికిఁగూడ నీ సన్న్యాసముమీఁదికే దృష్టి పోయెను. కారాగారమునవలె గృహమున బద్ధుఁడై వినశ్వరములైన సౌఖ్యోపభోగముల ననుభవించుటకంటె సన్న్యాసియై యీ విశాల ప్రపంచమున కరికి యజ్ఞాతమైన దుఃఖసంతాప మార్గము నన్వేషింపవలెనని యాతఁడు సంకల్పించుకొనెను. తండ్రి యీ విషయము నెఱింగి పుత్రసంకల్పమును వికల్పము జేయఁ బ్రయత్నించియు విఫలమనోరథుఁ డయ్యెను.

ఇట్లు వజ్రసంకల్పముతోఁ దన పూన్కికి రక్షాబంధము కట్టి సిద్ధార్థుఁడు తన యిరువదితొమ్మిదవయేఁట పురము నిర్గమింప నుద్యుక్తుఁడైననాఁడె యాతనికి రాహులుఁ డనుకుమారుఁడు కలిగెను. పుత్రోదయ మాతని కానంద సంధాయమగుటకు మాఱు దుఃఖప్రదమే యయ్యెను. తన లోకోత్తర ప్రయత్నమున కియ్యది పరీక్షార్థమైన సంకెలగా గుర్తించి సంకల్పచ్యుతుఁడుకాక సిద్ధార్థుఁడు నాఁటి యర్ధరాత్రముననే పుర నిర్గమనమునకు రథము నాయితముచేయ చెన్నని కాజ్ఞాపించియు, పుత్రప్రేమము హృదయమున రేకెత్తుచుండుటచే రథ మాయితమై వచ్చునంతలో కుమారు నొక్కమాఱు కన్నులారఁ గాంచి వత్తమని పురిటింటిలోని కరిగెను. అచట లావణ్యనిధియైన యశోధర నిండుమనమున దన ముద్దుబిడ్డను ముసఁ జేయానిచి నిద్రించుచుండెను. పుత్రావలోకనము ప్రేమార్ద్రిహృదయుఁడైన సిద్ధార్థుఁ డాశిశువు నెత్తికొని యొకపరి ముద్దాడఁ గోరెను. ఇంతలో నిశితమైనకార్యదీక్ష స్మరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కి వచ్చి, శిశువును గదిపినఁ దల్లికి మెలఁకువ వచ్చి తన ప్రయత్న మున కవరోధము కలుగునని, దీక్షా ప్రేమభావములు దండడి గొన్న డెందముతో మెలమెల్లన నటనుండి మఱలిపోయెను. పిదప కంటక మనునశ్వమును బూన్చి తెచ్చిన రథము నధి రోహించి చెన్ననితో సిద్ధార్థుఁడు లోకహితైషియై తల్లిదం డ్రులను వీడి, ఆలుబిడ్డలను వీడి, రాజ్యసర్వస్వమ్ములను వీడి, సర్వసంగపరిత్యాగియై నాఁటి యర్ధరాత్రమున కపిలవస్తు నగరముననుండి కదలిపోయెను.

అట్లు కొంతదూర మరిగిన పిదప సిద్ధార్థుఁడు తన యమూల్యాభరణముల నన్నిటిని దీసివైచి చెన్నని కిచ్చి, కంట కమును, రథమును దీసికొని పురమునకు మఱలవలసినదని చెప్పి, 'వచ్చితినా జరామరణాది దుఃఖసంతరణమార్గమును గనిపెట్టిరానే వచ్చెదను; లేదేని తత్ప్రయత్నమునఁ జచ్చెదను. ఇదియే నాదీక్ష' యని తండ్రికి వార్త నంపెను.

అటుపిదప నాతఁడు తన శిరోజములను ఖండించుకొని, కాషాయాంబరధారియై తిరిగి తిరిగి, తనకు మనస్సంతృప్తికర ముగఁ దత్త్వరహస్య ముపదేశింపఁగల బ్రాహ్మణప్రవరు లుండవచ్చు ననునాశతో మగధరాజధానియైన రాజగృహ మున కరిగెను.

రాజగృహమున సిద్ధార్థుఁడు భిక్షుకవృత్తి జీవనముఁ గడపుచు, ఆ నగరమునను, తత్ప్రాంతములను ఆ కాలమునఁ బ్రసిద్ధివహించిన బ్రాహ్మణమతబోధకులను, తత్త్వవేత్తలను, ఆశ్రమవాసులైన యోగులను సందర్శించి, వారి శుశ్రూషచేసి జ్ఞానము నార్జించుచుండెను. ఆ కాలమున జ్ఞానసముపార్జన మనలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నది జ్ఞాపక శక్తికిని, అధ్యయనమునకును సంబంధించిన విద్యగ మాత్రమే యుండలేదు. అది యనుభవమునకుఁ దెచ్చుకొని జీవింపవలసినదియే. కావున నీ జ్ఞానసముపార్జనమున సిద్ధార్థు డెట్టి కఠిన నియమములకును, శ్రమలకును బాలైనది యూహిం పనే సాధ్యము. ఇంతటి కష్టజీవితమునకు సహించినను విజ్ఞా నమువిషయమున నతనికి సంతృప్తి కలుగలేదు.

అటుపిదప నతఁడు వేద, వేదాంగవిదులైన బ్రాహ్మ ణులవలనను, యోగులవలనను బడసిన శిక్షణమును, యోగ విజ్ఞానమును ఆధారములుగఁ జేసికొని యీ తత్త్వరహస్య మును స్వయముగ నన్వేషింప దొరఁకొనెను. ఈ ప్రయత్న మున ఆరూఢమైన హృదయముతో ధ్యానసమాధినిఁ గూర్చుండి ఇంద్రియములను నిగ్రహించెను; ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములను బంధించెను; ఆహారమును వర్జించెను. ఇట్లాతఁడు మహాఘోర మైన తప మాచరించెను. ఇట్లు చేసినమీఁదట ఆతని కన్నులు దించుకొనిపోయెను; వెన్నెముక త్రాటివలె వ్రేలాడెను; అంగ ములు కృశించెను. ఆతఁడు శల్యగతప్రాణియై నడువ సత్తువలేక తూలిపోయెను. శిరోజములకుదుళ్లుకూడ ఊల్లి తాఁకిన నూడి వచ్చుచుండెను. ఇట్టి కఠినతప మాచరించినను తుద కాతఁ డందువలన సంతృప్తిఁ బడయఁజాలకపోయెను. అంతటితో నతఁడు విసువుచెంది కృశీభూతమై, బలహీనమైన శరీరముతో దివ్యత్వమును, దివ్యజ్ఞానమును బడయుట యసాధ్యమని మరల నెప్పటివలె భిక్షుకవృత్తి నవలంబించి మనుగడఁ గడపఁజొచ్చెను.

అటుపిదప నతఁడు బుద్ధగయకు సమీపమున నున్న యురువెలా గ్రామపరిసరారణ్యమున నొక్క యశ్వత్థవృక్ష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ్ఛాయ నధివసించి తన శరీరము కృశించినను, రక్తమాంసములు హరించినను తాను పరమజ్ఞానమును బొంది కాని లేవనని దీక్షపట్టి ధ్యానసమాధి నుండెను. ఇచ్చట మారుఁడు సిద్ధార్థుని సమాధినిష్ఠను, ఏకాగ్రతను చలింపఁజేసి, యాతనినై



హికభోగలోలుపునిగఁ జేయ ననేకప్రలోభనములఁ గల్పించి పెక్కువిధముల హింసించి, యాతని దీక్షను పరీక్షించినట్లు బౌద్ధులు విశ్వసించెదరు. బౌద్ధులకు మారుఁడు శనివంటి వాఁడు. అచంచలహృదయుఁడై సిద్ధార్థుఁడు తదేకనిష్ఠ దిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు గడపఁగా గడపఁగా తుద కాతనికి మార్గము పొడ కట్టెను. దుఃఖరహస్యమును, తన్నివారణోపాయమును దెలిసిన నాఁటనుండియే సిద్ధార్థుఁడు బుద్ధుఁడయ్యెను. అంతటినుండి యాతఁ డీరహస్యమును ప్రజలకు బోధింపఁ బల్లె లనక, పట్టణము లనక దేశమంతటఁ బర్యటనముఁ గావించెను.

కాశి కాఱుమైళ్లు దూరమున నున్న మృగదావ మను వనమున మొట్టమొదటిమాఱు బుద్ధుఁడు ఈ ధర్మ బోధ కావించెను. ఈ మృగదావమునకే ఇప్పుడు 'సారంగనాథము' (సార్నాథ్) అని పేరు. బుద్ధుని ధర్మబోధప్రచారణమునకే బౌద్ధగ్రంథముల 'ధర్మ చక్రప్రవర్తన' మని పేరు. తుద కతఁడు కపిలవస్తునగరమునకుఁగూడ నరిగి శాక్యుల నందఱను దనమతమునకుఁ ద్రిప్పెను. తండ్రియైన శుద్ధోదనుఁడును, భార్యయైన యశోధరయు, కొడుకు రాహులుఁడునుగూడ నతని మతము నవలంబించిరి. బుద్ధుఁడు ప్రవర్తింపఁజేసిన ధర్మమతమునకే బౌద్ధమతమని పేరు. కొందరు క్రీ. పూ. ౫౪౩ లోను, మఱి కొందరు క్రీ. పూ. ౪౮౭ లోను బుద్ధుఁడు నిర్వాణము నొందినట్లు చెప్పెదరు. దీనినే బౌద్ధులు మహా పరినిర్వాణమందురు.

బ్రాహ్మణులవలె సంస్కృతమునఁగాక మహావీరునివలెనే బుద్ధుఁడును దన మతధర్మములను ప్రజలకు సుబోధమగునట్లు దేశభాషలందే బోధించెను. ఆకారణమున బుద్ధబోధసుధ నాస్వాదింపఁ బ్రజాసామాన్యమున కవకాశము కలిగి యత్యంతశీఘ్రకాలముననే యీ మతము ప్రజలలోఁ బ్రాకిపోయెను. యజ్ఞ యాగాదులతోఁ గాని భూరిదక్షిణలతోఁ గాని పనిలేనిదియు, ఈవర్ణ మావర్ణ మనక ఎల్ల వర్ణముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారికి సులభమైనదియు నగుటచేత నది అనతికాలముననే జనాదరణపాత్ర మయ్యెను. సామాన్యజనదుర్గ్రహములైన వేదాంతవిషయములు లేకపోవుటచేత బుద్ధుని బోధలు ప్రజాహృదయమును రంజింపఁజేసెను. అట్టి విషమసమస్యలను బరిష్కరింప బుద్ధుఁడు తలపెట్టియుండలేదు. ప్రపంచమునందలి దుఃఖమును నివారించుటెట్లనునదియే యాతఁడు పరిష్కరింపఁదలఁచిన సమస్య. ప్రాణి విధివశమైనంతమాత్రమున దుఃఖము నివారణ మగునది కా దనియు, జన్మపరంపర యున్నంతవఱకు నిది వదలనిదే యనియు నాతఁడు కనిపెట్టెను. జన్మాంతర దుఃఖముకూడ నంతరించుటయే ముక్తి లేక నిర్వాణము. దీనిని సాధించుటెట్లు? తుట్ట తుద కాతఁ డన్ని సంవత్సరములు పలువిధములైన సాధనలు చేసి చేసి సకలవిధములైన కష్టములు పడి పడి సాధించిన దీదుఃఖరహస్యజ్ఞానమునే.

బుద్ధుఁ డీరహస్యమంతయు నాలుగు సత్యములయందిమిడి యున్నదని కనిపెట్టెను. అవియేవన (౧) పుట్టుక దుఃఖము; బ్రదుకు దుఃఖము; వయస్సు దుఃఖము; చావు దుఃఖము: సర్వము దుఃఖమయము. (౨) దుఃఖ సముత్పాదకము తృష్ణ; అనఁగా కోరికవలన దుఃఖము సంభవించుచున్నది. జీవింపవలెను, సంపాదింపవలెను, అనుభవింపవలెను అను కోరికలన్నియు దుఃఖకారకములే. (3) ఆశవిడిచిన, కోరిక తగ్గిన దుఃఖనిరోధము కలుగును; ఇదియే నిర్వాణము. (౪) దుఃఖ నిరోధమునకు త్రోవఁజూపునది ఆర్యాష్టాంగ మార్గము. పూజ్యమైన యీ యష్టాంగమార్గమున నెవ్వారు నడచెదరో వారికి దుఃఖనిరోధము, అనగా నిర్వాణము (జన్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాహిత్యము) కలుగును. బుద్ధుఁడు కనిపెట్టిన వీనికే చతురార్య సత్యము లనిపేరు. బుద్ధుఁ డుపదేశించిన యష్టాంగమార్గము నందలి యష్టాంగము లివి: (౧) సమ్యగ్దృష్టి (దృఢ విశ్వాసము); (౨) సమ్యక్సంకల్పము (మంచి యుద్దేశము); (౩) సమ్యగ్వాక్కు (మంచి మాట); (౪) సమ్యక్కరణము (మంచి పని): ఈ కడపటి మూఁటిని మనోవాక్కర్మముల శుద్ధి అనఁగా త్రికరణశుద్ధి యందురు; (౫) సమ్యగాజీవము (సరియైన పద్ధతిని జీవనముఁ గడపుట); (౬) సమ్యగ్వ్యాయామము (సరియైన ప్రయత్నము); (౭) సమ్యక్ స్మృతి (సరియైన భావన); (౮) సమ్యక్సమాధి (సరియైన ధ్యాన ధారణములు). కేవలము భోగలాలసత్వముకాని కేవలము తపోపవాస యజ్ఞ యాగాదులుకాని ప్రయోజనకరములు కానియు, ఆజ్యాదుల వేల్చినఁ గార్యము లేదనియు, కామక్రోధాదులను వేల్చి మనుష్యుఁడు శీలవంతుఁడు కావలెననియు, దానశీలములవలననే పుణ్యము కలుగుననియు బుద్ధుని మతము.

బుద్ధుఁడుకూడ మహావీరునివలెనే యజ్ఞ యాగాది వైదిక కర్మ భూయిష్ఠమైన బ్రాహ్మణమతమును, వేద ప్రామాణ్యమును నిరసించి తన మతమునుగూడ సన్న్యాసాశ్రమము మీఁదనే యాధారపఱిచి నిర్మించెను. బౌద్ధ సన్న్యాసులకు భిక్షువులనియు, శ్రమణులనియుఁ బేరు. పురుషులతోపాటు స్త్రీలకుఁగూడ సన్న్యాసాశ్రమ స్వీకారమున కధికార మొసంగఁబడుటచేత అపూర్వముగ దొరకిన యీ నూతనావకాశము నూఁతగాఁ గొని పురుషులతోపాటు పెక్కురు స్త్రీలును బౌద్ధమతావలంబినులై ధర్మపతాక చేఁబూని బుద్ధసందేశమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రచారముఁ గావించిరి. మతబోధకులైన యీ భిక్షుసమూహమును సంఘ మందురు. సంఘ మంతయు సోదరభావమున నిబద్ధమై యుండెను. లోకసంగ్రహార్థ మేఁటేట నెల్లకాలము దేశదేశముల నూరూర సంచారము చేసి బుద్ధబోధసుధను ప్రజల కందించి బౌద్ధమతమును వ్యాపింపఁజేయుచు వర్షకాలమునమాత్ర మెచ్చటనో యొకచోట నావాసము నేర్పఱుచుకొని బౌద్ధధర్మము నధ్యయనము చేయుట ఈ భిక్షువుల విధి. బౌద్ధధర్మముల ననుసరించి జీవనముఁ గడపు సామాన్యజనులకు ఉపాసకులని పేరు. బౌద్ధమతావలంబులకు బుద్ధుఁడు, ధర్మము, సంఘము ననునవి శరణ్యములు. బౌద్ధులు వీటినే త్రిరత్నము లందురు. బుద్ధుని యభీప్సితముననుసరించి బౌద్ధధర్మబోధ దేశభాషలందే జరగుటచేత ఈ బౌద్ధయుగమున దేశభాషలు చివురు దొడిగినవి.

బుద్ధనిర్వాణానంతరము బౌద్ధభిక్షువులెల్లరు బుద్ధుని ధర్మబోధలను గ్రంథస్థముఁ గావించుటకు సమావేశమై యొక మహాసభ జరపిరి. ఇట్టిమహాసభకు బౌద్ధగ్రంథములందు 'సంగీతి' యని పేరు. ఇట్టిసభలు 'రాజగృహము'నం దొకటియు, వైశాలియం దొకటియు, పాటలీపుత్రమునం దొకటియు వరుసగా మూఁడు జరగినవి. వీనిలో రాజగృహమునందు జరగిన సంగీతియే మొదటిది; ఇది బుద్ధుఁడు నిర్వాణము నొందిన కొలఁదికాలముననే జరగినది; కడమవి చాల తరువాతివి. వీనియందు బౌద్ధమతాచార్యపరిష్కృతములైన బుద్ధుని ధర్మసిద్ధాంతములును, బోధలును వినయ, సుత్త (సూత్ర), అభిధమ్మము (అభిధర్మము) లను మూఁడు గ్రంథములఁ బొందుపఱుపఁబడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యున్నవి. బౌద్ధులకు వేదములవంటివగు వీనికే 'త్రిపిటకము' లని పేరు. ఇవి యన్నియు 'పాలీ' యను గ్రాంథిక ప్రాకృత భాషను గలవు. వీనిలో మొదటిదగు వినయపిటకమున బౌద్ధ భిక్షువు లాచరింపవలసిన విధులు, జీవనమును గడపవలసిన విధానమును ఉండును. ఇది యొకవిధముగ హిందువుల ధర్మ శాస్త్రములందలి యాచార ప్రాయశ్చిత్త కాండలవంటి గ్రంథము. రెండవదగు సుత్తపిటకము బుద్ధుని ధర్మోపదేశములను, బోధలను దెలుపును. మూఁడవదియగు అభిధర్మపిటకము బౌద్ధుల వేదాంతమునుగూర్చి తెలుపును. ఇది పై రెండు గ్రంథములకంటెఁ జాల తరువాతిదియని కొందఱ యభిప్రాయము. ఇవి యుత్తరహిందూస్థానముననే గ్రంథస్థము కావింపఁబడినను పూర్వకాలముననుండి సింహళము, బర్మా, సయాములందు మాత్రమే భద్రపఱుపఁబడియున్నవి.

బౌద్ధవాఙ్మయము చాల గొప్పది. బౌద్ధమతము వ్యాపించిన దినములలో కడుప్రజారంజకములైనవి సుత్తపిటకములోని జాతకకథలు. ఇవి బుద్ధుని పూర్వజన్మ వృత్తాంతములను దెలుపును. సిద్ధార్థుఁడు పూర్వజన్మములందు దయాదాన ధర్మములకు లక్ష్యములైన మంచి కార్యములను జేసి చేసి తుద కీజన్మమున నిర్వాణపథమును దెలిసికొని బుద్ధుఁ డయ్యెను. ఈ జాతక కథలవలన బుద్ధునికాలమునాఁటి సాంఘికస్థితియు, నాటి ప్రజల యాచార వ్యవహారములును, విశ్వాసములును దెలియఁ గలవు. ప్రపంచమున నిప్పుడు వాడుకయందున్న పిట్టకథ లన్నిటిలో నివియే కడు ప్రాచీనములైనవని వీనిని సవిమర్శముగఁ జదివిన పండితుల యభిప్రాయము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## మగధరాజ్య విజృంభణము

అది యొక మహాయుగము. పవిత్రమూర్తులైన బుద్ధ, మహావీరుల మత విషయకబోధల మూలమున సంఘమున అపూర్వ సంచలనము రేఁగెను. బ్రాహ్మణులు మొదలు కడ జాతులవారివఱకు ఎల్లరు ఆత్మపరిశోధనఁ గావించుకొన మొదలిడిరి. సత్యస్నిగ్ధములైన యీ నూతనబోధల గొప్ప వెలుతురున అప్పటి పరిస్థితులయందలి లోపాలోపములు ప్రస్ఫుటముగఁ గానవచ్చెను. సంఘజీవనవల్లిక నవవసంతాగమమునవలె ఉద్దీపనమును బొంది సత్త్వవంతమై మారాకు తొడిగెను. పొంగులు దేరుచుండిన యీ సంఘబలమును సహకారిగఁ గైకొని గొప్పసామ్రాజ్యనిర్మాణమునకుఁ గడంగినవాఁడు శైశునాగ బింబిసారుఁడు.

## బింబిసారుఁడు

### (క్రీ. పూ. ౬౦౧—౫౫౨)

బింబిసారుఁ డసమానమేధావి: గొప్పపరాక్రమశాలి. పదునైదవ యేఁటనే యతనికి రాజ్యాభిషేకము జరగెను. చిన్నవాఁడైనను చిన్ననాఁటనుండియు గొప్పపథకముల నల్లుచు అతఁడు మగధరాజ్యమును విస్తరింపఁజేయ నభిలషించుచుండెను; దేశమునం దుదయించిన నూతన శక్తిని గమనించుచుండెను. నీతికుశలుఁడై యతఁడు మున్ముందు వైశాలి లిచ్ఛవి వంశనాయకుఁడైన చేటకుని సోదరి చెల్లన దేవిని, కోసల దేశాధిపతియైన మహాకోసలుని తనయ కోసలదేవిని, మద్రభూపతి కూఁతురైన క్షేమాదేవిని పరిణయమాడి తన రాజ్యస్థితిని భద్రపఱుచుకొనెను. తననాఁట వర్ధిల్లుచుండిన గణనీయులైన యీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జననాథులతో వియ్యమును, నెయ్యమును గలిపి యతఁడు మగధకు 'మంగళతోరణములు' కట్టెను. కోసలేశునితోఁ గలిసిన యీ సంబంధము మూలమున అంతవఱకు కోసల రాజ్యాంతర్భాగముగ నుండిన కాశీరాజ్యగ్రామము కోసల దేవి కరణముగ వచ్చుటచేత తద్రాజ్యమునఁ గొంత భాగము మగధరాజ్యాంతర్గత మయ్యెను.

ఈ విధమునఁ దనయిరుగున నున్న రాజ్యముల తోడి సంబంధమును చక్కఁబఱిచిన పిదప బింబిసారుఁడు తన దృష్టిని అంగరాజ్యమువైపు త్రిప్పెను. పొరుగున తూర్పుసరిహద్దున నున్నరాజ్య మగుటచేత అంగతో మగధకు రాజకీయములైన పెక్కు విషయములఁ బెక్కుతడవలు పోరాటము సంభవించుచుండెను. అందువలన నిట్టి విషమస్థితిని చిట్టచివరసారి చక్కఁబఱుపఁ దలఁచి బింబిసారుఁడు శ్రేణులు తీర్చిన తన యనంత సైన్యముల నడపించుకొని, యంగరాజ్యముపై దాడి వెడలెను. అనతిక్రమమున నతఁ డాదేశమును జయించి, దానిని యౌవరాజ్యముఁ గావించెను. చంపానగరము దానికి రాజధాని

తన యోపినమట్టుకు రాజ్యమును విస్తరింపఁజేసి రాజ్య వ్యవస్థను జక్కదిద్ది బింబిసారుఁడు రాజగృహము రాజధానిగ మగధను ఏఁబదిరెండేండ్లు జనరంజకముగఁ బరిపాలించెను. ఈతని రాజ్యమున ఎనుబదివేల గ్రామము లుండెను. తద్గ్రామాధిపతులైన 'గ్రామికు'లు వ్యవహారములను పరిష్కరించుటకై ఒక మహాసభగ సమావేశ మగుచుండువారు. రాజ కార్యములను నిర్వహించు ఉన్నతోద్యోగులను మహామాత్రులనువారు. వీరు మూఁడు తెఱఁగులు: (౧) సర్వార్థకులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామాన్య కార్యముల నన్నిటిని చక్కఁబెట్టువారు (౨) వ్యావహారిక మహామాత్రులు—న్యాయము దయసేయువారు (౩) సేనానాయకమహామాత్రులు—సైన్యాధిపతులు. వీరియొక్కయు మంత్రులయొక్కయు తోడ్పాటుతో బింబిసారుఁడు రాజ్యతంత్రమును సాగించుచుండెను. ఇతనియొద్ద సైన్యము లెక్కువగ నుండె నన్న కారణమున ఇతనికి శ్రేణిక బింబిసారుఁడనియు పేరు కలిగినట్లు చెప్పుదురు.

రాజధానియైన రాజగృహ మీతని కాలమున పేరు మోసిన మహానగరములలో నొకటి. ఈయది ముప్పదిరెండు మహాద్వారములతోను, అఱువదినాలుగు వాకిళ్లతోను ఒప్పుచు, ఉత్తర దక్షిణములుగఁ గొంచె మిఱుకుగను, తూర్పు పడుమఱలుగ విశాలముగను వ్యాపించియుండెను. నగర రథ్య లన్నియు పసిఁడివన్నె పూలతోఁ బ్రకాశించు కర్ణికార వృక్షములతో నలరారుచుండెడివి. నగరమునం గల యిండ్లన్నియు రాజగృహములవలెనే యుండుటచేత దీనికి రాజగృహమని పేరు కలిగె నందురు. ఇది మాంధాతృ నిర్మితమని ప్రతీతి. దీనిచుట్టును పర్వతము లనేకము లుండుటచేత గిరివ్రజమనియు దీనికి నామాంతరము కలదు. ఇది వేణువనము, తపోదారామము మొదలగు ననేకవనారామములతో విలసిల్లుచుండెను. రాజగృహ సమీపమునంగల వనారామములును, పర్వతములును బౌద్ధవాఙ్మయమున కడుఁ బ్రసిద్ధములు. ఈ నగరసమీపమునంగల గృధ్రకూటపర్వతాదులును, వనారామాదులును బుద్ధునికిని, తన్మతావలంబులైన భిక్షువులకును ఇష్టసంచారభూములుగ నుండెడివి. నగరము రత్నరాసులతోను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధనధాన్యములతోను తులదూగుచు అత్యంతభాగ్యవంతమై యుండెను. రాజువలెనే ప్రజలును ధర్మనిరతులై బౌద్ధభిక్షువులు మొదలగువారిని దానాదికములఁ దనుపుచుండిరి. జైన, బౌద్ధ మతములు రెంటికిఁగూడ ఈ నగరము ప్రధాన స్థానముగ నుండెను.

బింబిసారుఁడు జైన, బౌద్ధ మతములు రెంటిని సమా ముగ నాదరించినను బౌద్ధమునే ఎక్కువగ నభిమానించుచు డెను. బుద్ధుఁడు గృధ్రకూటమునందును, ఇతరారామముల దును రాజగృహసమీపమున నివసించుచుండిన కాలమున బిం సారుఁడు పెక్కుతడవ లమ్మహాత్ముని సందర్శించి, యనేక విధముల నాతనిని సమ్మానించెను. అత్యంత సౌందర్యవతి యైన క్షేమాదేవి మొట్టమొదట బుద్ధుని సందర్శనమునే యే గించి నిరసించినను, తుదకు పతిప్రేరణమున ఆ మహాత్ముని కడ కరిగి, యాతని పాదముల కెఱఁగి, ఆతని మతబోధముల విని భిక్షుణియయ్యెను. రాజగృహము నిరంతరము బుద్ధ, మహా వీరుల బోధలతో ప్రతిధ్వనించుచుండెను. బింబిసారుని కుమా రులలో నొకఁడైన నందిసేనుఁడు మహావీరుని బోధల నా ర్ణించి, జైనమతము నవలంబించెను. బింబిసారుని మతసహ మునకును, సర్వమతసమాదరణమునకును ఈ యుదాహరణ ములు చాలు.

ఇంతటి యోగ్యుఁడైనను బింబిసారుని జీవితము కడ కంట నొక్కరీతిని గడవదయ్యెను. అతని వార్ధకమంతయు కడగండ్లలోఁ గడచిపోయెను. బింబిసారునికి కుమారులు పెక్కురు కలరు. వారిలోఁ గోసలదేవివలన జనించిన అజా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శత్రు వొకఁడు. అంగరాజ్యమును జయించిన పిదప బింబిసారుఁ డీతనిని యావరాజ్యంబున కభిషేకించి యంగదేశమున కధిపతిఁ గావించెను. కాని తండ్రి పెక్కువర్షములు భూమిని పాలించు టయు, తనకు సర్వరాజ్యాధిపత్యము లభింపక పోవుటయు అజాత శత్రునికి చాల అసంతృప్తిని గలిగించెను. ఇది రాఁజి రాఁజి జ్వాల యయ్యెను. తత్ఫలితముగ బింబిసారుఁడు కారాగార నిబద్ధుఁడయ్యెను. చెఱ నున్న బింబిసారుని కన్నపానీయాదు లొసంగుటకు అజాతశత్రుని యాజ్ఞ లేకపోవుటచేత తుద కా మహారాజు మల మల మాఁడి యసువులం గోలుపోయెను. అతఁడంత్యకాలమున దారుణ క్రూరవధకుఁ బాల్పడె ననియు బౌద్ధ గ్రంథములు నుడువుచున్నవి.

## అజాతశత్రువు

### (క్రీ. పూ. ౫౫౨—౫౧౮)

బింబిసారుని యనంతరము రాజ్యమునకు వచ్చినవాఁడు అజాత శత్రువు. ఈతనికి కుణిక అజాత శత్రు వనియు నామాంత రము కలదు. ఈతఁడు సింహాసన మెక్కిన దినముననే యిత నికి పుత్త్రోదయము కలుగుటయు, తండ్రి మరణించుటయు సంభవించెను. మంత్రివరులు ముం దజాతశత్రునికి పుత్త్రో దయవార్త నెఱింగించిరి. వెనువెంటనే యాతని హృదయ మున పుత్త్రవాత్సల్యము ద్రవించి, తండ్రికిఁదనపైఁ గల వాత్స ల్యాభిమానములు స్ఫురణకు వచ్చి, చిత్తము వికలమయ్యెను. అతఁడు తా నొనరించిన యకార్య కరణమునకుఁ బశ్చాత్తాప పడెను. తండ్రియైన బింబిసారుని వెంటనే చెఱ విడిపింప వలసినదని యతఁడు తన మంత్రుల కుత్తరువు చేసెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంత వారతనికి మహారాజు మరణవార్త నెఱింగించిరి. అజాత శత్రు వావార్త విని కడు ఖిన్నుఁడయ్యెను. తండ్రికిఁ దనపైఁ గల యుత్కట వాత్సల్యమునకు తార్కాణముగ తల్లి కోసల దేవి చెప్పిన తన చిన్ననాఁటి గాథలను దలఁచుకొని మిక్కిలి వాపోయెను. కాని యేమి చేయుటకు నప్పటికే కార్యము మించిపోయెను. అంతటినుండి యాతఁడు మనశ్శాంతి లేక చాల బాధపడుచువచ్చెను.

ఇట్లుండ భర్తృమరణవ్యథాపీడితయై, క్రుంగి కృశించి కోసలదేవి యనతికాలముననే మృత్యువువాతఁ బడెను. ఆమె మరణానంతరమునఁగూడ, ఆమె కరణముగ వచ్చిన కాశీరాజ్య గ్రామము నాదాయమును అజాతశత్రువే యనుభవించుచుం డెను. పితృవధకారకుఁడైన యజాతశత్రు వీగ్రామాదాయము ననుభవించుట కోసలదేవి సోదరుఁడును, కోసలాధీశ్వరుఁడునైన పసేనది (ప్రసేనజిత్తు) మహారాజున కనిష్టమయ్యెను. పసేనది బింబిసారునికిని, అజాతశత్రునికినిగూడ సమకాలికుఁడు. చాల పరాక్రమవంతుఁడు. శాక్యరాజ్యమునుగూడ జయించి లోఁబఱుచుకొనిన దండిమగఁడు. అతఁడాగ్రామమును దనకు మరల నొసంగవలసినదని అజాతశత్రునికి వార్త నంపినను అందు కతఁ డంగీకరింపకపోవుటచేత కోసల మగధదేశములకుఁ గల పూర్వపు మైత్రి చెడి, రెంటికిఁ దఱచు సంగ్రామములు జరుగు చుండెడివి. అజాతశత్రువుకూడ సామాన్యుఁడు కాఁడు. రణ విద్యయందు కడు కుశలుఁడు. ఉభయులును సరిసమానులైన పరాక్రమశాలులగుటచేత ఒకప్పుడు కోసలాధీశ్వరుఁడైన పసే నదియు, మఱియొకప్పుడు మగధాధిపతియైన అజాతశత్రువును పరాజయము నొందుచు వచ్చిరి. పసేనది యొకమాఱు స్వప్రా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంరక్షణార్థము సంగ్రామరంగమునుండి పాఱిపోవలసి వచ్చెను. కడకు భయంకరమైన మహాయుద్ధమున పసేనదియే అజాత శత్రువు నోడించి యాతని బందీకృతునిం గావించెను. ఇరుగు పొరుగుల నున్న రాజ్యముల కీవిధమైన కలహములు సముచిత ములు కావనియు, అజాతశత్రునివంటి పరాక్రమశాలితో వైరము పాటించుట యనుచితమనియు తలపోసి పసేనది తుదకు తన కూఁతురైన వజిరా రాకుమారిని చెలఁనున్న యజాత శత్రుని కిచ్చి పరిణయముఁ గావించి, కాశీరాజ్య గ్రామ మును మరలఁ దనకూఁతున కరణమొసంగి యల్లుని విడిచి పుచ్చెను.

ఈ కాలముననే మగధకును వైశాలికినిగూడ సంగ్రా మము సంభవించెను. ఒకానొక రతనాలగని విషయమున లిచ్ఛవులకును అజాతశత్రునికిని పోరపులు సంభవించెను. ఇందువలన అజాతశత్రు వెటులైన వైశాలిరాజ్యమును సాధించి పగఁదీర్చుకొనవలెనని తఱివేచి యుండెను. ఇటు వైశాలి లిచ్ఛ వులే కాక అటు అవంతిరాజ్యము నేలుచుండిన ప్రద్యోతుఁడు కూడ చాల బలవంతుఁడుగ నుండెను. వీరివలన నుపద్రవము నాశంకించి అజాతశత్రువు పాటలీగ్రామమునొద్ద సేనానివేశ మున కనుకూలముగ నుండునట్లు ఒకకోట కట్టించెను. ఇచటనే అటుతరువాతికాలమున హిందూదేశచరిత్రయం దత్యంత ప్రసిద్ధి నందిన పాటలీపుత్రనగరము వెలసెను.

ఈ రీతిని యుద్ధమునకు సర్వమును సన్నద్ధముఁ గావించు కొని అజాత శత్రువు తరుణమున కెదురుచూచుచుండ నదియు సిద్ధించెను. వైశాలినాయకుఁడైన చేటకుని తనయయైన చెల్లన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవివలన బింబిసారుని కిరువురు కుమారులు కలిగిరి. కొ
కులపై నత్యంతాభిమానముగల బింబిసారుఁడు వారికిఁ ద
పట్టపు టేనుఁగును, పదునెనిమిది పేటలుగల చక్కని యనర్ఘ
రత్నహారమును ఒసంగెను. భార్యయైన పద్మావతీదేవిచే
ప్రేరితుఁడై అజాతశత్రువు వానిని దన కిచ్చివేయవలసినదని
తన సవతితమ్ముల నడిగెను. వారందులకు సమ్మతింపక వాని
దీసికొని వైశాలికి పాఱిపోయిరి. ఇది యొక సాకు చేసికొని
అజాతశత్రువు విదేహరాజ్యమును కబళింప నెంచెను. పాఱి
పోయి వచ్చి వైశాలిలో దాఁగియున్న తన సోదరులను దన
స్వాధీన మొనరింపవలసినదని అజాతశత్రువు వైశాలినాయకు
లను గోరియు ప్రయోజనము లేకపోవుటచేత తుదకు వారితో
యుద్ధమునకుఁ గడంగెను. వెంటనే విదేహరాజ్యమును
బాలించుచుండిన గణాధిపతులు సమావేశమై తుద కజా
శత్రు నెదిరించుటకే నిశ్చయించి యుద్ధరంగమునకు వెడలి
ఉభయకక్షులవారికి పదునాఱు సంవత్సరములు ఘోరసంగ్రా
మము ప్రవర్తిల్లెను. తుదకు అత్యంత నీతికుశలుఁడై
అజాతశత్రువే విజయి యయ్యెను. వైశాలి లిచ్ఛవు లతని
యాధిపత్యము నంగీకరించి, యతని కేఁటేటఁ గప్పము కట్టు
కొడంబడిరి. అటుపిదప నతఁడు అవంతినిగూడ సాధింపఁదల
చెను గాని సఫలమనోరథుఁడు కాఁజాలఁడయ్యెను.

ఈ విధమున అజాతశత్రువు తండ్రివేసిన పునాదు
నాధారము చేసికొని తన సామ్రాజ్యమును విస్తరింపఁజేసెను
ఈతని రాజ్యపరిపాలనాంత్యకాలమునాఁటికి కాశీ, కోసల,
వైశాలి రాజ్యములు మగధసామ్రాజ్యాంతర్భాగము లయ్యెను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్య మెంత విస్తరించినను తండ్రి మరణించినప్పటి నుండి యజాతశత్రునికి మనస్స్వాస్థ్యము లేకపోయెను. తండ్రిని వధియించిన ఘోరపాతక మాతనిని బట్టి పీడించుచునే యుండెను. కంటినిండ నిద్ర యాతనికి కఱవయ్యెను. ఇంచుక కునుకు పట్టినా, భయంకర స్వప్న ప్రపంచమున సంచరించుచుండు వాఁడు. సంతత వేదనాపరితప్తమైన యాహృదయమునకు శ్రమణ, బ్రాహ్మణసంగతి శాంతిప్రదాయకమని యాతనికిఁ దట్టెను. రాజున కిట్టి యభిప్రాయము కలదని జీవకునికిఁ దెలియ వచ్చెను.

జీవకుఁ డాకాలమునందలి మహాభిషగ్రత్నము; అతడు తక్షశిలా నగరముకరిగి యచ్చటి విద్యాపీఠమున వైద్యవిద్య నభ్యసించి విశారదుఁడై జన్మభూమియైన మగధ కేతెంచియుండెను. వచ్చుచు మార్గ మధ్యమున నాతఁడు కాశీ, సాకేతములందును, ఉజ్జయినీ నగరమునను గొప్ప శ్రేష్ఠులయొక్కయు రాజుల యొక్కయు ఘనవ్యాధులను మాన్పి తన వైద్యకళాప్రవీణతను జాటి, వారివలనఁ బెక్కు సంస్తుతు లందెను. ఈతని వైద్యకళా వైదుష్యమును గుర్తించి బింబిసారుఁ డీతనిని మగధరాజాస్థానమున రాజవైద్యునిగ నేమించి గౌరవించెను. అంతియ కాక యతఁ డీతనిని బుద్ధునికిని, బౌద్ధ భిక్షువులకునుగూడ వైద్యునిగ నేర్పాటుచేసెను. నాఁటినుండి యాతఁడు మగధరాజ వంశమును గనిపెట్టుకొని విశ్వాసపాత్రుఁడై మెలఁగుచుండెను. ఈతఁడు అజాతశత్రునికిఁగూడ వైద్యుఁడుగ నుండుటచేత ఆతని క్షేమమును శ్రేయస్సును గోరి, బుద్ధునికడ కరిగిన నీ మానసిక వ్యథ యంతరించి శాంతి కలుగఁగలదని ఆతనికి బోధించి, బుద్ధుని గుణగణములను బ్రస్తుతించెను. మొట్టమొదట భయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడినను తుదకు సాహసించి యజాతశత్రు వా మహనీయుని కడ కరిగి, తాను జేసిన పాపకార్యము నెఱింగించి, పశ్చా త్తాపము నొందితన్నుద్ధరింపవలసినదని యాతనిని వినయపూర్వ కముగఁ బ్రార్థించెను. పరమదయాళువైన బుద్ధుఁ డాతని ప్రార్థన నంగీకరించి, పెక్కు ధర్మములు బోధించి యాతని హృదయ సంతాపముఁ బాపెను.

మగధ సామ్రాజ్యముగ పరిఢవిల్లుటచేత మాత్రమే కాక అజాతశత్రుని పరిపాలనకాలము వేఱొక గొప్ప విష యమువలనను జాల ప్రాముఖ్యము నందెను. లోకమునకు దుఃఖ నివారణోపాయమును దెలిపి, నిర్వాణ మార్గమును జూపి, సర్వవర్ణావలంబనీయమైన యొక నూతన మతమును ప్రసాదించిన కరుణాసింధువు బుద్ధుఁ డీ యజాతశత్రుని రాజ్య కాలమున అష్టమ వర్షమున (క్రీ. పూ. ౫౪౪) మల్లరాజ్యమునకు రాజధానియైన కుశీనగరమునందు మహాపరినిర్వాణము నందెను. ఆ నగర పరిసరముననే బుద్ధునికి దహనాద్యంత్యక్రియలు జరి గెను. అనంతర మా మహాత్ముని అస్థ్యాది శరీరావశేషములను మాగధులు, వైశాలి లిచ్ఛవులు, కపిలవస్తు శాక్యులు మొదలగు వారు పంచుకొని, తమ తమ రాజధానులకుఁ గొనిపోయి, చక్కని కట్టడములందుఁ బదిలపఱిచిరి. తనవంతునకు నచ్చిన భాగము నజాతశత్రువుకూడ భక్తి ప్రపత్తులతో రాజగృహమునకుఁ గొని వచ్చి, చక్కని నిర్మాణమున పదిలపఱిచి, పూజింప మొదలి డెను. బుద్ధుని శరీరావశేషములను పదిలపఱిచిన యిట్టి నిర్మా ణములకే చైత్యములని పేరు. అట్టి యవశేషములను ధాతువు లందురు. చైత్యనిర్మాణమున ధాతువు లుండు ప్రత్యేక భాగ మునకు ధాతుగర్భమని పేరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధ నిర్వాణానంతర మేడు మాసములను అజాత శత్రుని యాదరపూర్వక సమాహ్వానము ననుసరించి, బుద్ధుని సందర్శించినట్టియు, బుద్ధుని యుపదేశములను స్వయముగ వినినట్టియు భిక్షువు లైదువందలమంది రాజగృహమునందలి సప్తపర్ణగుహాయందు వర్షాకాలమున సమావేశమై మొదటి 'సంగీతి'ని జరపిరి. ఈ ప్రథమ సంగీతికి బుద్ధుని శిష్యులలో నగ్రగణ్యుఁడైన మహాకశ్యపుఁ డధితిగ నుండెను.

అజాతశత్రువు తన రాజధానియైన రాజగృహముచుట్టు పెక్కు ధాతు చైత్యములను నిర్మించెను. అంతియ కాక బుద్ధుని మహాపరినిర్వాణానంతరము రాజగృహమునందలి పదునెని మిది మహావిహారములు బౌద్ధ భిక్షువులచే పరిత్యక్తములై పాడువడి యుండఁగా, వాని నాతఁడు విశేషధనమును వ్యయపఱిచి బాగుచేయించెను. ఈతఁడు ఇరువదినాలుగేండ్లు రాజ్యమేలినట్లు బౌద్ధగ్రంథములు తెలుపుచున్నవి. తన పరిపాలనాంత్యకాలమున తుద కీతనికిని దన తండ్రికి పట్టిన దుర్గతియే పట్టెను. ఇతఁడు ఉదయిభద్రునిచే వధియింపఁబడెను.

## ఉదయిభద్రుఁడు

## (క్రీ. పూ. ౪౮౩—౪౬౭)

బౌద్ధ వాఙ్మయము ననుసరించి చూచినచో ఉదయిభద్రుఁడు అజాతశత్రుని తనయుఁడు. ఇతఁడు తన తండ్రి పరిపాలనాంత్యకాలమున యువరాజుగ నుండి చంపానగరము రాజధానిగ అంగరాజ్యమును పాలించుచుండెను. పురాణములవలన దర్శకుఁ డజాతశత్రుని పుత్రుఁడనియు, ఉదయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భద్రుఁడు పౌత్రుఁడనియుఁ దెలియుచున్నది. ఇం దేది నిజమో యెఱుఁగరాదు. అజాతశత్రుని తనయుఁడు దర్శకుఁడే య యంగీకరించినను ఆతనిని గుఱించి యేమియుఁ దెలియరాదు కాని చాలమంది చరిత్రకారులు బౌద్ధవాఙ్మయప్రమా ము నే యంగీకరించి అజాతశత్రుని యనంతరము మగధ సిం సనము నధిష్ఠించినది యతని తనయుఁడు ఉదయిభద్రుఁ యని సిద్ధాంతము చేయుచున్నారు.

ఉదయిభద్రుఁడే చరిత్ర ప్రసిద్ధమైన పాటలీపుత్ర మ నగరము నిర్మాత. ఇది గంగా, శోణనదీ సంగమ ప్రదేశము గలదు. కుసుమపుర మనియు, పుష్పపురమనియు దీని నామా తరములు. అజాతశత్రువు కట్టిన కోటచుట్టు లేచిన దీ మహా రము. పాటలీపుత్రమును నిర్మించిన పిదప ఉదయిభద్రుఁడు త రాజధానిని రాజగృహముననుండి యచ్చటికి మార్చెను. ఇప్పు పాట్నా నగరమే పూర్వపు పాటలీపుత్రమని పురాతత్త్వవిదు గుర్తించియున్నారు. ప్రాఁతనగరము శిథిలమైనందున తత్ సరముననే యీ నూతన నగరము వికసించినది.

కాశీ, కోసల, వైశాల్యాది రాజ్యము లన్నియు మ ధలోఁ జేరిపోవుటవలన మగధ, అవంతులు ఇరుగు పొరు రాజ్యము లయ్యెను. ఈ కారణమున అజాతశత్రుని నా నుండి ఆరంభమైన పోరాట మీ యుదయిభద్రుని కాలమ నను సాగుచుండియుండును. కాని మన కీతని రాజ్యపా విశేషములను గుఱించి కాని, యీతని యనంతరము మగ నేలిన ప్రభువులను గుఱించి కాని—వారి పేరులు తక్క—మ కేమియుఁ దెలియదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదయిభద్రుని తరువాతి రాజులలో పేర్కొనఁదగిన వారు నందివర్ధన, మహానందులు. ఈ వంశమునందలి కడపటి భూపతులకాలమున (క్రీ. శ. ౪౪౦) వైశాలీనగర కూటాగారమున బౌద్ధుల ద్వితీయసంగీతి జరగెను. కాలాశోకుఁడు రాజ్యమేలుచుండిన కాలమున నిది జరగినట్లు బౌద్ధగ్రంథములు తెలుపుచున్నవి. నందివర్ధనుఁడే కాలాశోకుఁడని కొందఱు పరిశోధక పండితుల యభిప్రాయము.

## శైశునాగులు: శిల్పకళ

ప్రతిమా శిల్ప చారిత్రమున నీశైశునాగవంశజుల పరిపాలన కాలము చాల ముఖ్యమైనది. ఈ వంశమునందలి కుణిక అజాత శత్రునియొక్కయు, ఉదయిభద్రునియొక్కయు, నందివర్ధనునియొక్కయు శిలాప్రతిమలు (Statues) ఇటీవలనే ౧౯౧౯-వ సంవత్సరమునఁ గనిపట్టఁబడినవి. ఉదయిభద్ర, నందివర్ధనుల శిలాప్రతిమలు కలకత్తా చిత్రవస్తు ప్రదర్శనశాలయందును, కుణిక అజాతశత్రుని శిలాప్రతిమ మధురానగర చిత్రవస్తు ప్రదర్శనశాలయందును గలవు. ఇవి యాయా శాలలయందు చాలకాలమునుండి యున్నను వానిని ఫలాన ప్రతిమలని ౧౯౧౯ వఱకెవ్వరును గుర్తింపఁజాలరైరి; కాని యా సంవత్సరమున మన దేశమునందలి యైతిహాసిక పరిశోధకాగ్రగణ్యులలో నొక్కరగు శ్రీయుత కే. పి. జయస్వాలు పండితులు ఆ ప్రతిమాశిలలమీఁదఁగల శాసనములను జాగ్రత్తగఁ బరీక్షించి యాప్రతిమలు పూర్వోక్త శైశునాగ నృపాలురవని నిరూపించిరి. ఈ నిరూపణమువలన, పాషాణములను మూర్తిమంతములుగఁ దీర్చుట హిందూదేశము పాశ్చాత్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశములనుండి నేర్చిన విద్యయని స్వదేశాభిమానసంపన్ను లయిన పాశ్చాత్య పండితులు కల్పించిన ప్రవాదము పటాపంచ లైనది. పూర్వోక్త ప్రతిమాపాషాణముల క్రియామాధుర్యమును (Exquisiteness of Execution), భావగతియు (Expression), ఆకృతియు (Portrait form) అంతటి ప్రాచీనకాలముననే మన దేశమునందలి శిల్పు లెంతటి సిద్ధహస్తులో తెలియఁజేయుచున్నవి. ఇతరోదాహరణములు మన కింతవఱకుఁ దెలియరాకపోయినను ఈ ప్రతిమలను బట్టియే శైశునాగవంశజులు శిల్పుల నాదరించి, శిల్పకళకుఁ జేయూఁత నిచ్చియుందురని నిశ్చయింపవచ్చును.

## నందవంశజులు

బింబిసార వంశజుల యనంతరము మగధను పాలించిన వారు నందవంశీయులు. వీరిలో మహాపద్మనందుఁడు ప్రథముఁడు. ఈ నందవంశజుల కాలమున ప్రాక్సముద్రతీరస్థమైన కళింగముకూడ మగధాధికారమును శిరసావహించెను. భరతవర్షమునకు వాయవ్యదిశ నున్నదేశము నాక్రమించి రాజ్యమేలుచుండి పారసీకులను జయించి మహాపద్మనందుఁడు తన రాజ్యమును అటు తక్షశిలవఱకు విస్తరింపఁజేసి యుత్తర హిందూస్థానము నంతను ఏకచ్ఛత్రముగ పాలించెను. ఇతఁడు తన యంత్యకాలమునఁ దన కుమారులకు విశాలమైన గొప్ప సామ్రాజ్యమునే కాక, గొప్ప సైన్యమును, ధన సమృద్ధమైన మహాకోశమును గూడ నొసంగి పోయెను.

ఇతని యనంతరము నందు లను సామాన్యనామమునఁ బరఁగు నితని కుమారులు రాజ్యమునకు వచ్చిరి. ఈ వంశము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారికి కడవఱకు పాటలీపుత్రమే రాజధానిగ నుండెను. నంద వంశమునందలి కడపటిప్రభువుకాలముననే యవన భూపతి యగు అలెగ్జాండరు హిందూదేశముపై దండెత్తి వచ్చినది.

---

## పారసీకులు : యవనులు

మగధ సామ్రాజ్యము విజృంభించుచుండిన కాలమున హిందూదేశమునకుఁ బశ్చిమమున నున్న దేశములందు గొప్ప రాజకీయ పరివర్తనములు సంభవించుచుండెను. హిందూదేశమునకును, దానికిఁ గడు పశ్చిమమున మధ్యధరాసముద్రమునకును నడుమ నున్న, ఇప్పటి అఫ్గానిస్తానము, బలూచిస్తానము, పెర్షియా (పారసీకము), మెసొపొటేమియా, అరాబియా, అంగోరా మొదలగు దేశము లాక్రమించు భాగము ప్రాచీనసభ్యతలకు పంటపొలము; ప్రాచీనసామ్రాజ్యములకు పుట్టినిల్లు. అస్సీరియా, బాబిలోనియా, చాల్డియా మొదలైన సామ్రాజ్యము లన్నియు క్రీస్తుకు పూర్వ మిచట వర్ధిల్లియుండెను. మగధరాజ్యలక్ష్మి విహారమునకై యొఱనుండి కత్తి దూసి బింబిసారుఁడు నాలుగుదెసల రాజమార్గముల నిర్మించుచుండిన కాలముననే పారసీక మహాయోధుఁడైన సైరస్ అంతవఱ కాప్రాంతముల వర్ధిల్లుచుండిన బాబిలోనియను సామ్రాజ్యమును గూలఁద్రోసి, ఆసియా ఖండమున వాయవ్యదిశ నున్నదేశము లనేకములను జయించి, పారసీక సామ్రాజ్యమునకు పునాదులు వైచెను. దీనినే అకిమినియన్ సామ్రాజ్య మందురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హిందూదేశమునందలి సింధు, గాంధారాది దేశముల కును, బాబిలోనియా మొదలగు దేశములకును వెండి, బం గారు వైఢూర్యములు, దంతము, మంచిగంధపు చెక్క, రవసెల్లాలు మొదలగువానితో నాటున ఎడారి దారులను కొండదారులను ఒంటెలమీఁదను, గుఱ్ఱములమీఁదను, సముద్రమార్గమున సింధునదీముఖద్వారముననుండి పారసీక సింధుశాఖమీఁదుగ ఓడలమీఁదను వర్తకవ్యాపారము సాగు చుండుటచేత భాగ్యభోగ్యములకు పేరువడసిన హిందూదేశము పై పారసీకులు కన్ను వేసిరి. అనతికాలముననే క్రీ. పూ. ౫౧౮-వ సంవత్సరము ప్రాంతమున సైరస్‌వంశజుఁడైన మొదటి డెర యస్ భూపతి పారసీక సైన్యముల నడిపించుకొని భారతభూమి పై దాడివెడలివచ్చెను. చరిత్రకుఁ దెలిసినంతవఱకు రాజ్య లాభాకాంక్షతో పరరాజఖడ్గము భారతీయుల కర్మభూమిని తళతళలాడుట కదియే మొదటిసారి. అంతవఱకు మగధ సామ్రా జ్యపతాక నీడకు రాకుండ తన స్వాతంత్ర్యమును పదిలముగ దాఁచుకొనిన గాంధారము డెరయస్ విక్రమధాటికి లోఁగిపోయి పారసీకరాజు నధికారము నౌదలఁ దాల్చెను (క్రీ. పూ. ౫౧౫).

డెరయస్ పారసీకదేశపు రాజులలో చాల గొప్పవాఁడు. శాసనములం దితఁడు 'దర్యవుష్ విష్టాష్ప' డని పేర్కొనఁబడి యున్నాఁడు. ఇతని సైన్యాధిపతియైన 'స్కైలాక్స్' అనునతఁడు గాంధారముననుండి దక్షిణమున సింధునదీముఖద్వారమువఱకుఁ గల దేశము నంతను స్వాధీనపఱచుకొని పారసీక సామ్రాజ్య మునఁ జేర్చెను. ఇదియు నంతవఱకు మగధరాజ్యమునఁ జేరక తన స్వాతంత్ర్యమును గాపాడుకొనుచు వచ్చినప్రాంతమే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పారసీకులకు స్వాధీనమైన దేశ మిది యని సరిగా సరి హద్దులు నిర్ణయించి చెప్పుట కష్టమైనను, గాంధారముతోఁ గూడ సింధునది కుభయపార్శ్వములం గల పడుమటి పంజాబు, సింధు దేశములు వైదికమత ప్రతికూలురైన పారసీకుల పరిపాల నము క్రిందికి వచ్చెనని యూహింపవచ్చును. పారసీకులు రాజ్యాంగ నిర్మాణమునఁ జాల నేర్పరులు. జయించిన దేశముల నన్నిటిని పరగణాలుగ విభాగించి, ఒక్కొక్క పరగణా కింత కప్పము చెల్లవలెనని వా రేర్పాటు కావించిరి. వారి ఇరువది మూఁడు పరగణాలలో ఏడవది పారసీక హిందూరాజ్యము. పారసీక సామ్రాజ్యమున కన్నిపరగణాలనుండి చెల్లు మొత్తము కప్పములో ఏకాంశమో తక్కువగ సగము మొత్తము ఈ యొక్క పరగణానుండియే చెల్లుచుండెనఁట! అదియును బం గారు రూపముననే. నూతనోపార్జితములైన యీ రాజ్య విభాగములను పరిపాలించుటకు డెరయస్ అధిపతులను నియ మించెను. వీరికి 'క్షత్రపావను' లని పేరు. ఈ క్షత్రపావన పదమే తుదకు 'క్షత్రప' గ మారుటచేత రాజప్రతినిధులగు పాలకులకు క్షత్రపు లని వ్యావహారికనామ మయ్యెను.

పారసీకుల యీ విజయములతో పశ్చిమదేశముల కును హిందూదేశమునకును రాకపోకలును, వర్తక వ్యాపార మును విస్తరించెను. పారసీక భూధవుల దండులో హిందూ దేశీయులుకూడ సైనికులుగఁ జేరుచుండిరి. పరస్పర సమాశ్ర యమున పారసీక, హిందూదేశ కళాసంస్కృతులలో మార్పులు కలుగుచుండెను. పారసీక శిల్పులు హిందూదేశమునకును, హిందూదేశ శిల్పులు పారసీకాది పశ్చిమ దేశములకును బోయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తమ విద్యలందు ప్రజ్ఞా కౌశలములఁ జూపుచు వచ్చిరి. హిందూ నిర్మాణముల పారసీక శిల్పకళా రీతిసంప్రదాయము కనుపేర్పడెను. 'ఖరోష్ఠి'యను లిపి పారసీకుల యాగమనముతో హిందూదేశమునకు వచ్చెనని కొందఱి యభిప్రాయము. కాదిది యిచ్చటిదే యని మఱికొంద ఱందురు. ఇది యిప్పటి పారసీక, అరబ్బీలిపులవలెనే, మనము వాడుకగ వ్రాయునట్లు ఎడమవైపుననుండి కుడివైపునకుఁ గాక, కుడివైపుననుండి ఎడమ వైపునకు వ్రాసెదరు. హిందూదేశపు పశ్చిమోత్తర దిశల నున్న సింధు, గాంధారాది దేశముల నీలిపి రమారమి క్రీస్తు శకము నాలుగైదు శతాబ్దులవఱకు వాడుకయం దుండెను.

మూఁడవ డెరయస్ (క్రీ. పూ. 33౫–330) కాలము వఱకు గాంధారాది హిందూదేశ విభాగములు పారసీకుల క్రిందనే యుండెను. కాని యా కాలమున అలెగ్జాండరు అను యవనవీరుఁడు మధ్యధరాసముద్రమువఱకు వ్యాపించిన పారసీక సామ్రాజ్యముపై దండెత్తుచు, ఒక్కొక్కటిగ నందలి దుర్గములను జయించుచు వచ్చెను. సామ్రాజ్యమున గొప్ప సంక్షోభము కలిగెను. ఇదియే తగినయదనని హిందూదేశ విభాగములు పారసీకాధికారభారమును త్రోసిపుచ్చి స్వాతంత్ర్యమును ప్రకటించెను.

## అలెగ్జాండరు దండయాత్ర

అలెగ్జాండరు తుదకు క్రీ. పూ. 330-వ ప్రాంతమున మూఁడవ డెరయస్ నృపతిని జయించి, పారసీక సామ్రాజ్యమును స్వాధీనపఱుచుకొనెను. హిందూదేశైశ్వర్య వర్తకములను గుఱించి పారసీకులవలన విన్నవారగుటచేత యవన వీరుల దృష్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హిందూదేశమువైపు తిరిగెను. అపజయము నెఱుంగని తన వీరవాహినిని నడపించుకొని అలెగ్జాండరు హిందూదేశముపై నెత్తి వచ్చెను.

యవన సైన్యము హిందూదేశమునకు వచ్చునప్పటికి పశ్చిమోత్తర దిగ్భాగమున గాంధారము మొదలు సింధునదీ ముఖద్వారమువఱకు ఆ నది కుభయపార్శ్వములఁ గల దేశమున పెక్కు తెగల వారు చిన్న చిన్న స్వతంత్ర రాజ్యములు స్థాపించుకొని యేలుబడి నెఱపుచుండిరి. అశ్మక, పుష్కరావతీ, తక్షశిలా, అభిసార, ఉరస, గాంధార, సౌభూతి, సివి రాష్ట్రి, క్షుద్రక, మాళవ, అంబష్ఠాదు లన్నియు నట్టి స్వతంత్ర రాజ్యములే. తమకు రథ, గజ, తురగ, పదాతి సైన్యము లెంత యెక్కువగ నుండినను, పరస్పరము కలహించుచుండిన కారణమున సంఘీభావము లేక ఈ రాజ్యములవారు ఉద్ధతితో వచ్చు అలెగ్జాండరు విజయవాహినికి త్రోవ యొసంగి యొదిగి యుండవలసినవారైరి.

క్రీ. పూ. ౩౨౭-వ సంవత్సరమున 'అట్టాక్' నగర ప్రాంతమున అలెగ్జాండరు ఎనుబదివేల కెక్కుడు మందితో సింధునదిని దాఁటి తక్షశిలా రాజ్యమునఁ బ్రవేశించెను. ఆ కాలమున ఆ రాజ్యమున కధిపతియైన ఆంభీ నృపాలునికిని అభిసార, పౌరవ భూపతులకును వైరానలము ప్రజ్వరిల్లుచుండెను. అభిసారము తక్షశిల కెగువ నున్న పొరుగు రాజ్యము. జేలం, చీనాబు నదుల మధ్యదేశము పౌరవునిది. ఈ పౌరవ పదమునే యవనులు 'పోరస్' అని వ్యవహరించిరి. అలెగ్జాండరు కాలమున వర్ధిల్లుచుండిన పై స్వతంత్రరాజ్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లన్నిటిలో పౌరవ రాజ్యమే గొప్పది. ఇందు మూఁడువందల నగరము లుండె ననియు, పౌరవ సైన్యమున నూటముప్పది యేనుఁగులును, వేయిరథములును, మూఁడు వేల గుఱ్ఱములును, ఏఁబదివేల కాల్బలము నుండె ననియు తెలియుచున్నది. ఆ కాలమున అభిసార పౌరవ రాజ్యములు రెండును సఖ్యముతో నుండి యిరుగు పొరుగు రాజ్యములపై కత్తి దూయుచుండెను.

ఈ కారణమున అలెగ్జాండరు తన రాజ్యమునఁ బ్రవేశించుటతోడనే ఆంభీభూపతి అతనికడ కరిగి సామంతుఁడయి, కప్పముఁగట్ట నంగీకరించి, యతని యధికారమునకుఁ దల యొగ్గెను. స్వార్థలాభ ప్రేరితుఁడై తోడి దేశీయ సోదరుని పై కత్తి గట్టి హిందూదేశీయుఁడు యూరోపియను ఖడ్గమునకుఁ బ్రణమిల్లుట కదియే మొదటి తడవ.

అలెగ్జాండరు ఆంభీభూపతి కభయహస్తము నొసఁగి, తనకు సామంతుఁడై కప్పము కట్టవలసినదని తక్షశిలనుండియే పౌరవునికి సందేశ మంపెను. మహాభిమాని పౌరవుఁడు కోపోద్దీపితుఁడై తత్సందేశమును నిరసించి నిందించి, యతఁడు తన సైన్యముల నాయితపఱచి, యవన బలముల నెదిరింప జేలం నదీతీరమున సిద్ధమయ్యెను. ఆంభీభూపతి తన సైన్యమునుగూడ అలెగ్జాండరు వశ మొనర్చి యాతనిని పౌరవుని పైకిఁ బంపెను. పెక్కుసైన్యములను గూర్చుకొని అలెగ్జాండరుకూడ జేలమ్ నదీతీరమున కరుదెంచెను. అప్పటికే నది యావలియొడ్డున రథ, గజ, తురగ, పదాతి బలములతో పౌరవసేన పోరున కాయిత్తమై యుండెను. తత్సేనావిన్యాస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున ముందటి భాగమున నొండొంటికి రమారమి నూఱేసి యడుగుల యంతరమున ఏనుఁగులు బారులు తీరియుండెను. ఏనుఁగులకు నడుమ నడుమను, వానికి వెనుకను ధానుష్కమగు కాల్బల ముండెను. దానికి పిఱుఁద రథములును, వాని వెనుక అశ్వ సైన్యము నుండెను. ఈ వ్యూహ మంతయు నొక నగరము ననుకరించుచుండెను. ఏనుఁగులు కోట బురుజులవలెను, వానికి నడుమ నున్న కాల్బలము కోట గోడలవలెను ఉండెను. ఒక్కొక్క రథమున నాలుగురు యోధు లుండిరి. వారియందు రథమున కిరుపార్శ్వముల నంగరక్షకు లిరువురు; అరిగవాండ్రిరువురు; మిగిలిన యిరువురు రథికులు. ఇట్టి సైన్యమునకుఁ దోడు తరింప వీలు కాని నది. వఱదలు వచ్చుటచేత నది సుళ్లు తిరిగి నురుఁగులు గ్రక్కుచు ప్రవహించుచుండెను.

ఈ నది నుత్తరించి, యెదుట నున్న భయంకరమగు పౌరవుని వ్యూహమును మార్కొనుట కష్టమని అలెగ్జాండరు తలంచెను. అందువలన, సంగ్రామము భయంకరమయి, పర సైన్య మించుక చిందఱవంద అయినపుడు ఆకస్మికముగ వచ్చి దానిని జుట్టు ముట్టుట కతఁడు కొంత సైన్యమును మఱువుల నందందు నిలిపియుంచెను. తక్కిన సైన్యములతో నాతఁడు పౌరవుఁ డెఱుంగకుండ నదీతీరస్థారణ్యమార్గముల ఎగువ కరిగి, యచ్చట రహస్యముగ నదిని దాఁటి శత్రువు రాక కాత్రముతో నెదురు చూచుచుండిన పౌరవసైన్యములను తటాలున ముట్టడించెను.

ఇట్లు తాఁకిన యుభయ సైన్యములకు నెనిమిది గంటల సేపు మహాభయంకరయుద్ధము ప్రవర్తిల్లెను. సమరము తుముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మయ్యెను. కొంత తడ వైన పిదప పౌరవసేన కలఁగఁబాఱెను. యవనులు పౌరవులపయిఁ గవిసిరి. అత్తఱి నది కావల మన్నవుల నుండిన యవనబలములు నదిని దాఁటి పౌరవానీకము పయిఁ బడెను. తేరికొని తన వరూథినిని సరికూర్చుకొనుటకైన పౌరవుని కవకాశము లేకపోయెను. అతని సైన్యమున కలవర మెక్కుడయ్యెను. అది యదనుగ శత్రుసేన విక్రమించెను. పౌరవదళమున రథము లనేకములు కూలినవి. ఏనుఁగులును, గుఱ్ఱములును మడిసినవి. వీరవరేణ్యు లనేకులు వీరశయనముల నలంకరించిరి. ఇట్లు సైన్యము మడియుచుండినకాలమది పౌరవుఁడు తెంపరియై శత్రువీరుల బాణపరంపరల నోంచెను. కుంతములఁ గ్రుచ్చెను. పిఱికికండ నింతయేనియుఁ జూపక పోరు సలిపి యాతఁడు క్షతగాత్రుఁడై తుదకు స్మృతి తప్పి నేల కొఱఁగెను. యవనవాహిని విజయశంఖము పూరించెను. స్మృతి తప్పి పడియున్న పౌరవుఁడు యవనచక్రవర్తికి బందీయయ్యెను; కాని అలెగ్జాండరు అతని శౌర్యపరాక్రమముల కెంతయు నలరి, యాతని రాజ్యమును మరల నాతని కొసంగి తన సామంతుని గావించి గౌరవించెను.

జీలమ్‌నది కుభయతటముల నీ సంగ్రామము జరగిన చోట అలెగ్జాండరు రెండు నగరములను గట్టించెను.

గాంధారము, మొదలు రావి, బియాస్ నదులవఱకుఁ గల యుత్తరపు పంజాబుదేశ మా యవనవీరునికి స్వాధీన మయ్యెను. బియాస్‌నదికిఁ దూర్పున నున్న దేశము మగధ సామ్రాజ్యము. దాని నప్పుడు నందవంశజులు పాలించుచుండిరి. అలెగ్జాండ రాసామ్రాజ్యమునుగూడ జయింప నాసపడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాని మండలేశ్వరుఁడైన పౌరవునితోడి పోరాటమున భారతీయధనుర్ధరుని సూటి తప్పని కఱకుటమ్ముల వ్రేటు బాగుగ నెఱిఁగినవాఁ డగుటచేత ఆతనికిఁ గొంత గుండె బెదురు కలిగినది. కృతహస్తుఁడయిన హిందూధనుష్మంతుఁడు ప్రత్యాలీఢపాదుఁడయి సంగ్రామరంగమున నిలిచి, ధనువును భూమిపై మోపి, నారి సారించి టంకారము సేసి బాణము నేయుచో డాలు, కవచము నున్నగు రక్షణసాధనము లేవియు దానిని నిరోధింపఁజాలవని అలెగ్జాండరు దండయాత్ర నభివర్ణించిన రెండవ శతాబ్దినాఁటి చరిత్రకారుఁడు ఏరియాన్ పేరుకొనినాఁడు. నాఁటి హిందూయోధుల తిరుగు లేని బాణములు యవనుల యెముకల నంట నాటినవి. దానం జేసి వార లిఁక నచటినుండి ముందఱి కడుగిడ వెఱచిరి. అదియునుం గాక యాతరుణమున గంగానది కుభయతటములఁ గల మగధాది ప్రాచ్యరాజ్యముల రాజులు ఆఱువేల గజములను, ఎనుబదివేల గుఱ్ఱములను, రెండు లక్షల కాల్బలమును సమకూర్చుకొని యవనబలముల నెదిరింపఁ దరలి వచ్చుచున్నారని వార్త వచ్చెను. అంతట వారిని జయింప అలెగ్జాండరునకు పట్టుదల యెక్కుడయ్యె తన సైన్యములను వారిపైఁ దరల పురికొల్పెను. కాని యతని సైనికులాతని యాజ్ఞను మన్నింపరయిరి. చేయునది లేక అలెగ్జాండరచ్చటినుండి వెనుకకు మఱలెను. తన విజయాభిలాష నెట్లో తీర్చుకొను తలంపున నతఁడు నౌకాదళమును సమకూర్చుకొని, జీలమునదీమార్గమున సింధునదిని బ్రవేశించి ముఖద్వారమువఱకుఁ బోయి, యానది కిరువయిపులఁ గల వేర్వేరు రాజ్యములను జయింపఁ బూనుకొనెను. తోడనే నౌకాదళము నాయత్తము చేసికొని నదీమార్గమున అలెగ్జాండరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రయాణము సాగించెను. ఆ దళమున కపాయము బొరయ కుండఁ గాపాడుట కుభయతటములఁ గొంత సైన్యము గా నియమించెను.

ఇట్లు నదిపయిఁ బ్రయాణము చేయుచు అలెగ్జాండరు మార్గమధ్యమునఁ గల రాజ్యములను ముట్టడించి, లోబఱుచు కొనుచువచ్చెను. ఈ దండయాత్రయందును అశ్మక, మాళవ, క్షుద్రకాది రాజ్యముల రాజులు పలువురు అలెగ్జాండరు నెదిరి పోరాడిరి; కాని వారికిఁ బరస్పర మైకమత్యము లేకపోవుట చేత నాతని నిరోధింపఁజాలరయిరి. అశ్మకరాజ్యమున ప్రధాన దుర్గములలో నొకటి యగు 'మస్సగ'మును అలెగ్జాండరు ముట్ట డించినపుడు సమరమున నిహతులైన భారత యోధుల యా యుధములను పరిగ్రహించి, భారత నారీమణులుకూడ యవన వీరులతోఁ బోరాడి వెఱపు గొలిపిరి. తుదకు పడుమటి పం జాబు, సింధుదేశము అలెగ్జాండరు ధాటికి పరాభూతము లయినవి.

తరువాత అలెగ్జాండరు తన సేనను మూఁడు భాగములు చేసి, రెండింటిని నాటు మార్గమునను, మూఁడవదానిని నౌకల మీఁదను సింధునదీముఖద్వారముననుండి అరాబియా సము ద్రమును, పారసీకసింధుశాఖను దాఁటి పారసీకదేశమునకు వచ్చి తన్నుఁ గలసికొనఁ గట్టడచేసి యటనుండి తరలిపోయెను.

అలెగ్జాండరు హిందూదేశదండయాత్ర యీ విధమున ముగిసినది. హిందూదేశమున నాతఁడు మూఁడేఁడులయిన నుండినవాఁడు కాఁడు. ఆయున్నకాలమున సగము సింధునదికిఁ దూర్పుదిశను యుద్ధములందే కడచినది. అయినను ఆ కాలము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననే యాతఁడు నగరములను గట్టించెను. నదీతీరముల వర్తకమున కనుకూలములైన చోటుల నోడరేవులను గట్టించుట కేర్పాటులు చేసెను; తాను జయించిన హిందూదేశపు పారసీక రాజ్యములయందు పూర్వాచారము ననుసరించి, పారసీకులనే కాక యవనులనుగూడ క్షత్రపులుగ నియమించెను; హిందూ రాజ్యముల కదివఱ కుండిన పరిపాలకులనే మరల నధిపతులం జేసెను; అన్నిరాజ్యములందును యవనసైన్యమును గాఁపుంచెను. తక్షశిలాధిపతియు, ఆంభీభూపతియు, పౌరవుఁడును క్షత్రపు లయిరి. పౌరవుని కదివఱకుఁ గల రాజ్యమును, తాను జయించినఁ రాజ్యమునఁ గొంతయు నొసంగి అలెగ్జాండ రతనితో స్నేహబంధమును గట్టిచేసెను.

ఇట్లు అలెగ్జాండరు హిందూదేశమునఁ దన రాజ్యము స్థిరముగ యవనపరిపాలనమున నుండున ట్లెన్నియో కట్టుబాటులను జేసి, హిందూదేశమును విడిచి వెళ్లిపోయెను. అతఁడు క్రీ. పూ. 3౨3 నందు బాబిలోను నగరమున మరణించెను. అంతట భారతభూమిని నిర్మించిన యవనరాజసౌధమును మౌర్య చంద్రగుప్తుఁడు పునాదులకంటఁ గూలఁద్రోయించెను. ఈతఁడే తరువాత నందవంశమును నిర్మూలించి యుత్తర హిందూ దేశము నేకచ్ఛత్రముగఁ బాలించినవాఁడు.

ఈ యవన దండయాత్రవలనఁ గూలిపోయిన పంజాబు దేశరాజ్యముల నన్నిటిని గలుపుకొని చంద్రగుప్తుఁడు సుకరముగ సామ్రాజ్యమును బ్రతిష్ఠించుకొనఁ గలిగెను. అంతియ కాక యీ దండయాత్రవలన పశ్చిమ దేశములకును, హిందూ దేశమునకు రాకపోకలును, వర్తకమును అతిశయించెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యవనులకుఁ గలిగిన హిందూతత్వశాస్త్రపరిజ్ఞానమువల్ల యవనసంస్కృతియందును, భావములందును మార్పు కలిగెను. హిందూవిద్వాంసులు గ్రీసు, ఆసియామైనరు మున్నగు దేశముల కరుగుచుండిరి. హిందువుల మతాభిప్రాయములు పశ్చిమ దేశములందు వ్యాపించుచుండెను. బౌద్ధజాతక కథలు కొన్ని పాశ్చాత్యదేశములఁ బ్రచారముఁ గాంచినవి.

---

## మౌర్య సామ్రాజ్యము

ప్రచండమైన తుపానువలె అలెగ్జాండరు దండయాత్ర కడచిపోయెను. హిందూదేశపు పశ్చిమోత్తర ప్రదేశములందలి రాజులు పరస్పర కలహములకును, ఐకమత్యాభావమునకును దగిన ఫల మనుభవించిరి. దాస్యజీవన మెంతటి దుర్భరమయినదో వారి కపుడు తెలిసెను. అందువలన వారు పారతంత్ర్యపుటురులను ఛేదించుకొని బయలఁబడుట కదను వేచియుండిరి. అట్టి యవకాశ మనతికాలముననే లభించినది.

### చంద్రగుప్తుఁడు

### (క్రీ. పూ. 3౨౨ — ౨౯౮)

అలెగ్జాండరు మరణవార్త తెలియుటతోడనే యారాజులందందు విజృంభించి యొక్కుమ్మడి యవనులమీఁదఁ దిరుగఁబడిరి. ఈ యవకాశమునఁ బైకి వచ్చినవాఁడు మౌర్య చంద్రగుప్తుఁడు.

చంద్రగుప్తుఁడు లేఁబ్రాయమువాఁడు; తేజోవంతుఁడు. ఇతఁడు మగధ నేలిన కడపటి నందునికి మురయను శూద్ర యువతియందు జనించినవాఁడని యొక ప్రవాదముకలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మౌర్యవంశక్షత్రియుఁడని బౌద్ధవాఙ్మయమునుబట్టి తెలియ నగును. పాటలీపుత్రసింహాసనము నాశించుటచేత చిన్నతన మున నే యితఁడు మగధ రాజ్యముననుండి వెడలఁగొట్టఁబడెను.

స్వదేశబహిష్కృతుఁడైన యితఁడు అలెగ్జాండరు దండయాత్ర నాఁటికి పంజాబు ప్రాంతముల నుండెను. ఇతఁ డొకప్పుడు అలెగ్జాండరును సందర్శించి, యాతనిని మగధ రాజ్యముపై దాడివెడలఁ బ్రోత్సహించెనని అలెగ్జాండరు చరిత్ర రచియించిన క్రీస్తు శకము మొదటి శతాబ్దపు చరిత్ర కారులు వ్రాసిరి. ఈ వ్రాఁత ప్రమాణమని నిశ్చయింపవలను గాకున్నది. అలెగ్జాండరు ఈ లేఁబ్రాయపు జోదుపలుకు లాలించి యాతని నాపాదమస్తకముఁ బరిశీలించెను; ఇతఁడు గూఢ చారియని యనుమానము పొడముటఁ గాఁబోలు నితనిని బట్టి వధింప నాజ్ఞాపించెనఁట!

హిందూదేశమునందలి పశ్చిమోత్తర ప్రదేశములు మహాసముద్రమువలె అలెగ్జాండరు మరణముతో సంక్షోభము చెందినవి. భుజబలముగల ప్రతి సాహసికుఁడును నాయకుఁడై యవనరాజ విద్రోహమునకు బలములఁ జేకూర్చుచుండెను. దేశము భయంకరరణోత్సాహముతో తీవరించియుండెను. అదియే తగినయదనని చంద్రగుప్తుఁడు ఖడ్గమాత్ర సహాయుఁడై స్వాతంత్ర్యపతాక నల్లార్చుచు, తన యదృష్టము నన్వేషింప సంగ్రామరంగమున కురికెను. పారతంత్ర్యవిమోచనమును హిందువుల కతఁడు లక్ష్యముచేసెను. వందలు వేలు అతని స్వాతంత్ర్యధ్వజచ్ఛాయను జేరిరి. బహుళసైన్యసమేతుఁ డయి యతఁడు ఇంకను వెలిచి పఱవక నిలిచిన యవనవా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హినిపైఁ గవిసెను. యవన సైన్యములను మార్కొనిన చోటుల నెల్ల విజయలక్ష్మి యాతనినే వరించెను. అనతికాలముననే అలెగ్జాండరు కట్టిన యవనరాజ్యసౌధ మంతరువ్వలంతరువులుగఁ గూలిపోయి నేలమట్టమయ్యెను. ఇప్పుడు హిందూదేశపు పశ్చిమోత్తరప్రదేశములకు చంద్రగుప్తుఁడే యధిపతి యయ్యెను.

ఈవిజయముతోఁ దన బలమును దాను గుర్తెఱిఁగి చంద్రగుప్తుఁడు తన దృష్టిని మగధపైఁ ద్రిప్పెను. కాని మగధరాజ్య మతి విస్తారమయినది. చతురంగసమేతమైన నంద సైన్యము కడుపేరున కెక్కినది. స్వామిభక్తిపరాయణులు, ప్రజ్ఞావంతులునైన మంత్రులు నందునికిఁ గుడిభుజమువలె నుండి రాజ్యమును కంటిని రెప్పవోలెఁ గాపాడుచుండిరి. సుపరిరక్షితమైన యిట్టి నందరాజ్యమును జెనకుటయన్న చంద్రగుప్తునికి సుకరముకాదు; కాని దైవ మాతనికిఁ దోడుపడెను.

నందవంశ నృపాలురు ప్రజలను పలుబాములఁ బెట్టుచు, వారి ధనమును దోచుకొనుచు, నిరంకుశులయి స్వార్థపరులయి భోగలాలసులై, ప్రజాకంటకులై నెగడుచుండిరి. దేశమున ధర్మ మడుగంటెను. రాజవృత్తము దోషదూషిత మయ్యెను. ప్రజలకు దినమొక గండముగ నుండెను. నాఁడు సంఘమున నత్యంత గౌరవపదమునం దుండిన వేదవిదులగు పండితులకు పరాభవము లనుదినసంభవము లయ్యెను. కడపటి నందునిపరిపాలనమున మగధ యిట్లు తుక తుక యుడికిపోవుచుండెను. రాజ్యతంత్రనిష్ణాతుఁడును, వేదవేదాంగ విదుఁడునగు విష్ణుగుప్తుఁడను బ్రాహ్మణుఁడు నందరాజపరాభూతుఁడై నంద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వంశనిర్మూలనమునకయి ప్రతినవట్టెను. ఈ విష్ణుగుప్తునికే చాణక్యుడనియు, కౌటిల్యుఁడనియు నామాంతరములు కలవు.

దైవతంత్రమున నీ విష్ణుగుప్తుడును, చంద్రగుప్తుఁడును కలసికొని తమ యాశయములు సఫలము లగుటకు పథకములఁ బన్నిరి. ఈ సంహారకార్యమున విష్ణుగుప్తుఁడు మంత్రవాది కాఁగా చంద్రగుప్తుఁడు తదాజ్ఞాపరిపాలకుఁడయిన ఖడ్గవాది యయ్యెను. మంత్రపూతమయిన యీ కార్యారంభమున చంద్రగుప్తుఁడు తన విజయవాహినిని నడిపించుకొని, యమునా గంగాతటప్రదేశముల స్కంధావారముల నిర్మించి, రణభేరి మ్రోయించెను.

ఇరువాగుల వారికి పెక్కుచోటుల సంగ్రామములు జరిగినవి. తంత్ర ప్రతి తంత్రములతో నుభయబలములు పెక్కుదినములు ఘోరముగఁ బోరినవి. రాజ్యతంత్రకుశలుఁడగు విష్ణుగుప్తుని ప్రజ్ఞ చంద్రగుప్తునకు శ్రీరామరక్షయియి కాపాడుచుండుటవలన నాతనికి విజయము చేకూరెను. నందవిజేతయగు చంద్రగుప్తునకు మగధ రాజ్యము పాదాక్రాంతమయ్యెను. తాను బట్టిన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొని, విష్ణుగుప్తుఁ డొక్క శుభముహూర్తమున మౌర్యచంద్రగుప్తుని మగధ సామ్రాజ్యమున కభిషిక్తునిం గావించి కృతకృత్యుఁ డయ్యెను. మహారాజయిన చంద్రగుప్తుఁడు విష్ణుగుప్తుని ప్రధానామాత్యునిగఁ జేసెను.

విష్ణుగుప్తుని యాదేశానుసారముగ చంద్రగుప్తుఁడు తన రాజ్యపరిపాలనవిధానమును దీరిచి, ప్రజారంజకుఁడై పరిపాలన మొనరించుచుండెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సింహాసనాధిష్ఠితుఁడైన అనతికాలముననే చంద్రగుప్తుఁడు పశ్చిమహిందూదేశమునందలి సౌరాష్ట్రము పై దాడి వెడలి దానిని గూడ జయించి, తన రాజ్యమును పశ్చిమ సముద్రతీరమువఱకు విస్తరింపఁ జేసెను. సింధు, కాఠియవాడ్, గుజరాత్, మాళవదేశము లన్నియు నాతని రాజ్యమునఁ జేరిపోయెను. చంద్రగుప్తుఁ డీపశ్చిమరాజ్యములకు పుష్యగుప్తుని అధిపతిగ నియమించెను.

ఈ విధమున నుత్తరహిందూస్థాన మంతయు నిదివఱ కెన్నఁడులేని రీతి నొక్కచక్రవర్తి యేలుబడిక్రిందికి వచ్చెను.

కొంకణముననుండి పశ్చిమసముద్రతీరముననే కావేరి పల్లపు భూములఁ బడి తమిళదేశమునందలి తిరునెల్వేలివఱకు మౌర్యులు దండెత్తి వచ్చినట్లు తమిళవాఙ్మయమునఁ గొన్ని సూచనలు కలవు. కడు ప్రాచీన కాలమున మైసూరు సంస్థానపు టుత్తరప్రాంతములకు మౌర్యచంద్రగుప్తుఁడు వచ్చినట్లు తత్ప్రాంత శాసనములఁ దెలుపఁబడియున్నది. ఈ కారణములవలన మౌర్యులు — చంద్రగుప్తుని కాలమున — వింధ్యకు దక్షిణమునఁగల దేశమును గూడ నాక్రమించిరని చరిత్రకారులు విశ్వసించుచున్నారు.

చంద్రగుప్తుఁడు మగధ నేలుచుండిన కాలమున సెల్యూకస్ హిందూదేశము మీఁదికి దండెత్తి వచ్చెను. ఇతఁడు అలెగ్జాండరు సేనాధిపతులలో నొకఁడు. అలెగ్జాండరు మరణానంతర మాతని సామ్రాజ్యముకొఱకు నాతని సేనానులు పరస్పరము పోరాడిరి. తుదకు అలెగ్జాండరు సముపార్జించిన ప్రాగ్దేశరాజ్యములు సెల్యూకస్ వశ మయ్యెను. రాజ్య కార్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములను చక్కఁబెట్టుకొనుట కతఁడు పూనుకొనెను. అలెగ్జాం డరు మరణానంతరము కలిగిన సంక్షోభముసమయమున తిరు గఁబడిన రాజ్యములనెల్ల జయించి స్వాధీనము చేసికొనుచు తన విజయవాహినితో నతఁడు హిందూదేశమున కరుదెం చెను. అతఁడు సింధునదిని దాటి హిందూదేశమున నడుగిడు నప్పటికే అసంఖ్యాకములైన తన సైన్యములను దీసికొని చంద్రగుప్తుఁ డాతని నెదిరించెను.

ఉభయులకును ఘోరమగు మహాసంగ్రామము ప్రవర్తి ల్లెను. అందు సెల్యూకస్ సంపూర్ణముగ పరాజయము నొంది, తుదకుఁ దన రాజ్యక్షేమమునకయి చంద్రగుప్తునితో సంధి గావించుకొని, వివాహసంబంధమును గలుపుకొనెను. ఈ సంధికారణముగ పూర్వకాలమున పారసీకుల యధికార మున నుండిన సింధుపరిసరప్రాంతమేకాక యా నదికిఁ బశ్చి మమున కాబూలునదివఱకుఁగల రాజ్యముకూడ చంద్ర గుప్తునికొసంగఁబడెను. తద్రాజ్యలాభమున కెంతయు నలరి చంద్రగుప్తుఁడు సెల్యూకసునకు ఏనూఱేనుఁగుల నిచ్చి బహూ కరించి యతనిని బంపివేసెను.

నాఁటనుండి హిందూదేశమునకుఁ బశ్చిమమున నున్న రాజ్యముల మౌర్యసామ్రాజ్యము పేరు మ్రోసెను. శక్తిమం తములయిన నాఁటి రాజ్యములలో మౌర్యసామ్రాజ్య మొక్క టియని పశ్చిమదేశవాసులు గుర్తించిరి. అది మొదలు చం ద్రగుప్తుని యాస్థానమునకు సిరియా, ఈజిప్టు మొదలగు పశ్చిమరాజ్యములనుండి రాయబారు లేతెంచుచుండిరి. ఇట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారిలో సెల్యూకస్ చేతఁ బంపఁబడిన మెగాస్థనీసు మొదటి
వాఁడు.

ఉత్తరహిందూరాజ్యముల నన్నిటిని ఐక్యము కావించి
పరరాజుల బారినుండి దేశమును రక్షించి దేశ స్వాతంత్ర్య
మును గాపాడిన మొదటి ప్రభు వీచంద్రగుప్తుఁడే; హిందూ
దేశపు మొదటిచక్రవర్తియు నీతఁడే.

జైనవాఙ్మయమువలన చంద్రగుప్తుఁడు జైన మతా
వలంబకుఁడని తెలియుచున్నది. భద్రబాహుయతీంద్రు
డీతని మతాచార్యుఁడు. ఆగతానాగతవేత్తయగు నీయ
తీంద్రుఁడు ఒకప్పుడు దేశమున ద్వాదశవర్షక్షామము సం
భవింపనున్నదని తెలిసికొని చక్రవర్తి కీవార్త నెఱింగించి తా
జైనసంఘమును దీసికొని 'దక్షిణాది'కి వచ్చెను. చంద్ర
గుప్తుఁడుకూడ సింహాసనమును దన కుమారుఁడైన బిందు
సారునికి వదలి, మునియై తన యాచార్యు ననుసరించి దక్షిణ
దేశమున మైసూరు రాజ్యమునందలి శ్రవణబెళ్గొళాయను
చోటికి వచ్చెను. అచ్చట భద్రబాహువు నిర్వాణము నందెను.
చంద్రగుప్త మునిపతి తన యాచార్యుని నిర్వాణానంతరము
పండ్రెండేండ్లు జీవించి, తజ్జీవితావశేషమును తపశ్చర్యఁ గడి
తుదకు నిరశనవ్రతము నవలంబించి జీవయాత్ర చాలించెను.
ఇప్పటికి శ్రవణబెళ్గొళాయందలి చంద్రగిరి, చంద్రగుప్తబస్తీ
ఆ చక్రవర్తిని స్మృతికిఁ దెచ్చుచు వెలయుచున్నవి.

అవైదికమతము నవలంబించిన వాఁడగుటచేతఁ గా
బోలు చంద్రగుప్తునిగుఱించి సంస్కృతవాఙ్మయమున నేమియు
లేకపోయినను జైన, బౌద్ధవాఙ్మయముల నందందు నీ చక్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్తికి సంబంధించిన సంగతులు కలవు. అయినను ఈతని పరాక్రమకార్యములకును, చాణక్య ప్రజ్ఞకును సంబంధించిన గాథలు దేశమునఁ బరంపరగ వచ్చుచుండినట్లు క్రీస్తుశక మేడవ శతాబ్దినాఁటిది కాఁదగు విశాఖదత్త కవికృత ముద్రారాక్షసనాటకమువలనఁ దెలియనగును. నందవంశనిర్మూలనానంతరము చాణక్యుఁడు స్వామిభక్తిపరాయణుఁడును, రాజకార్యనిపుణుఁడునైన కడపటి నందమహారాజమంత్రి రాక్షసుని, తక్కుంగల శత్రుశేషమును సాధించి లోఁబఱుచుకొని, చంద్రగుప్త సామ్రాజ్యమునకు సుస్థావాప్తిం జేకూర్చుటయే యానాటకమునందలి కథానకము.

పరంపరగ వచ్చు చంద్రగుప్తునినాఁటి గాథను గ్రంథస్థముఁ గావించిన పూర్వోక్తనాటకము కాక నాఁటి హిందూదేశ స్థితిగతులనుగుఱించి తెలుపు గ్రంథము లేక రెండు కలవు. వీనిలో రాయబారియైన మెగాస్థనీసు వ్రాసిన హిందూదేశ వృత్తాంత (Indica) మొకటి. మెగాస్థనీసు పాటలీపుత్రమున నివసించుచు, తఱచు చంద్రగుప్త చక్రవర్తిని సందర్శించుచు వచ్చెను. ఈతఁడు పాటలీపుత్రమున నుండిన కాలమునసే ప్రజల వృత్తమును, దేశముయొక్క స్థితిగతులను జక్కఁగ గమనించి పై గ్రంథమును వ్రాసెను. ఈ గ్రంథ మంతయు సంపూర్ణముగ లభింపకున్నను అందలి కొన్ని భాగములు మాత్రమే శేషించి యున్నవి. వానివలన నాఁటి హిందూదేశ రాజకీయ, సాంఘికాద్యనేకవిషయములు తెలియుచున్నవి. ఇఁక రెండవది చాణక్యుని యర్థశాస్త్రము. ఇది పూర్వోక్త గ్రంథములు రెంటికంటెను ప్రముఖమును, ప్రశస్తమును నైనది. చాణక్యుఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంత్రియై తన యర్థశాస్త్రసిద్ధాంతముల కనుగుణముగ చంద్రగుప్తుని పరిపాలనవిధానమును దిద్ది తీర్చియుండవలెను యూహింపవచ్చును. మెగాస్థనీసు అభివర్ణనముకూడ యూహకుఁ జేయూఁత నిచ్చుచున్నది.

మగధ సామ్రాజ్యమునకు పాటలీపుత్రము రాజధాని. ఇది గంగా, శోణానదుల సంగమస్థలమున చతురస్రము నిర్మితమయినది. దీని పొడువు తొమ్మిది మైళ్లకు మించి యుండును; వెడల్పు రమారమి మైలునర. నగరము చుట్టు దారుమయప్రాకారము కలదు. దీనికి లోపలనుండి ధాను ష్కులు వెలుపలివారి పై బాణము లేయుటకు నిందు రంధ్ర ములు కలవు. ఈ ప్రాకారము చుట్టును దుర్గసంరక్షకము నలువది యడుగుల లోఁతును, రెండు వందల యడుగుల వె ల్పునుగల కందకము గలదు. నగరమునందలి మురికి రంతయు నీ కందకములోనికిఁ బ్రవహించుచుండును. ప్రాకా రము పొడుగునను ఏనూటడెబ్బది బురుజులును, అరు నాలుగు ద్వారములు నుండెను. నగరపరిపాలనమునకు ముప్ప మంది సభ్యులు కలయొకపరిష త్తుండెను. వ్యవహారసౌకర్య మున కీసరిషత్సభ్యులు అయిదుగురేసి చొప్పున ఆఱు సంఘ ములుగ నేర్పడి నగరమునందలి వేర్వేరు పనులను జక్కఁబె చుండువారు. నగరాధిపతికి నాగరకుఁడని పేరు. పరిపాలన నిర్వాహణమున నీతనికిఁ దోడ్పడుటకు స్థానికులు, గోపులు అను నుద్యోగు లుండువారు. ఆ కాలమున నితరపట్టణము లందును ఇట్టి విధానమే వాడుకయం దుండియుండవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యమునకు చంద్రగుప్తుఁ డధిపతి. చారచక్షువయి, యతఁడు రాజ్యమున నడచు సంగతులనెల్లఁ గనుఁగొనుచుండు వాఁడు. మంత్రి పురోహితుల సాయమున నతఁడు వేర్వే రధికరణములకు (రాజకీయశాఖ) అమాత్యుల నియోగించి, రాజకార్యముల నిర్వహించుచుండును. దూరదేశములకు సంబంధించినవియు, ప్రధానములైనవియు నగు రాజకార్యముల విషయమున నతఁడు మంత్రులతో నాలోచించువాఁడు. అత్యావశ్యకములగు కార్యములందు అతఁడు మంత్రులను మంత్రిపరిషత్తును సమావేశపఱిచి, వారితో మంత్రాంగము నెఱపుచుండును. పరిషన్మంత్రులసంఖ్య దేశకాలములను, కార్యములను బట్టి హెచ్చుచు, తగ్గుచు నుండెడిది. క్రొత్త పనులను దలపెట్టుట, తలపెట్టిన పనులను సఫల మొనరించుట, చేసిన పనులవలనఁ గలిగిన విశేషమును దెలిసికొనుట, ప్రధానాధికరణములకు, రాష్ట్రములకుఁ దగినవారిని నియోగించుట— ఈ మొదలగువానినిగుఱించి మంత్రి పరిషత్తు ఆలోచించు చుండును. ఆయావిషయముల రాజు పరిషత్సమావేశమునకు వచ్చినవారితో స్వయముగను, రానివారితో నుత్తరముల ద్వారమునను యోజించి వారి యభిప్రాయమును దెలిసికొని, అధికసంఖ్యాకు లెట్లు నిర్ణయించిన నట్లు చేయువాఁడు.

రాజ్య మంతయు జనపదములుగను, అవి రాష్ట్రములుగను, అవి దుర్గములుగను, అవి గ్రామములుగను విభజింపఁబడి యుండెను. వైదికయుగమునందువలెనే పరిపాలనమునకంతకు గ్రామమే పునాదిగ నుండెను. గ్రామమునకు సంబంధించిన వ్యవహారములలో గ్రామస్థులదే పెత్తనము. 'గ్రామపంచాయతీ' సంఘముయొక్కయు, గ్రామమునందలి పెద్దల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్కయుఁ దోడ్పాటుతో గ్రామణి గ్రామ వ్యవహారములను చక్కఁబెట్టువాఁడు. గ్రామమునుండి చెల్లవలసిన సిస్తు రాజునకు గ్రామణిద్వారమున చెల్లుచుండెడిది. గ్రామణిపైన గోపుఁడును అతనిపైన స్థానికుఁడు నుండువారు. గోపుఁడయిదేసి, పదేసి గ్రామములను, స్థానికుఁ డొక్కొక్కసీమను పరిచూచువాఁడు. సేద్యమగు భూమి, సేద్యముకాని భూమి, ప్రజల యాస్తి, ఆయము, వ్యయము మొదలగువానికి సంబంధించిన లెక్కలను సిద్ధపఱుచు బాధ్యత వీరిది. సన్నిధాత, సమాహర్తలనువారు రాజకీయనియుక్తులలోఁ గొప్పవారు. కోశగృహము (ధనాగారము), పణ్యగృహము (వర్తకపు సరకుల నిలువచేయు నిల్లు), కోష్ఠాగారము (ధాన్యాదికము నిలువచేయు నిల్లు), ఆయుధాగారము, బంధనాగారము (కారాగృహము) మొదలగువానిని బరీక్షించుచు, ధనమును గాపాడవలసినవాఁడు సన్నిధాత. దుర్గములను, రాష్ట్రములను, గనులను, సేతు వన వ్రజ వణిక్పథములను బరిశోధించుచు, ఆయవ్యయముల నెఱింగి, యాదాయమును వృద్ధినొందించుచు, వ్యయమును తగ్గించుచు, కోశమును వృద్ధి నొందింపవలసినవాఁడు సమాహర్త. వీరిక్రింద అధ్యక్షులు మొదలగు నుద్యోగులు పెక్కు రుండువారు. సన్నిధాత, సమాహర్తల పిదప దుర్గాధిపతులు, అంతపాలురు ముఖ్యులు. దుర్గముల నేలువారు దుర్గాధిపతులు. సరిహద్దుసీమలను సంరక్షించుచుండువారు అంతపాలురు. ఇట్లు సువ్యవస్థితమైన అధికారవర్గముతో చంద్రగుప్తుఁడు సామ్రాజ్యమును పాలించుచుండెను.

దుర్గము, రాష్ట్రము, గని, సేతువు, వనము, వ్రజము, వణిక్పథము అనునీయేడు మార్గములు రాజ్యాయము తీయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాఁడు: అనఁగా సుంకములు, దండుగలు (జరీమానా), వర్తక సంఘములపై విధింపఁబడిన పన్నులు, భూమి, ధాన్యము, ద్రవ్యము, అడవిపంట, కలప, గనులు, తోఁటలు, నిర్మాణములు, గోవులు వృషభములు మొదలగు జంతువులు, వర్తకము సాగు జల స్థలమార్గములు — వీని యన్నిటినుండియు రాజున కాదాయము వచ్చుచుండెను. ఎన్నివిధముల రాజు పన్ను తీసినను ప్రజలకు నొప్పి కలుగకుండెడిది. 'ప్రజలకు హితమైనదే రాజునకు హితము కాని స్వప్రియము హితము కాదు; ప్రజలు సుఖించిన రాజునకు సుఖము'. అని చాణక్యుని సిద్ధాంతము.

సామ్రాజ్యమును సంరక్షించుటకు చంద్రగుప్తుఁడు గొప్ప చతురంగబలము నేరుపాటు చేసెను. ఆతని సైన్యమున తొమ్మిదివేల గజములును, ఎనిమిదివేల రథములును, ముప్పదివేల గుఱ్ఱములును, ఆఱులక్షల పదాతులు నుండిరి. ఈ మహావాహిని యంతయు సేనాధిపతివశమున నుండెడిది.

రాజ్యవ్యవహారములను బరిష్కరించుటకయి రాజు అహోరాత్రముల నెనిమిదేసి భాగములు చేసి, యొక్కొక్క భాగమున నియతముగఁ గొన్నికొన్ని కార్యములను జక్కఁ బెట్టువాఁడు.

కట్టుదిట్టమగు నిట్టి పరిపాలనమువలన దేశము సుభిక్షముగ నుండెను. సామ్రాజ్యమున పట్టణము లనేకములు వెలసినవి. రాజధానీనగరముననుండి వేర్వేరు పట్టణములకు చక్కని బాట లుండెడివి. పట్టణము లొండొంటికిఁ గల దూర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును దెలుపుచు, బాటలపయి యోజనమున నాటివవంతు దూరమున కొన్కొ క రాయి యుండెడిది.

పెద్ద పట్టణములఁ బెక్కు వృత్తులవా రుండిరి. వర్తకులు రాజపణ్యద్రవ్య నియుక్తులుగనో, క్రయ విక్రయ మూల్యాది పరీక్షాధికారులుగనో, బేహారులుగనో యుండిరి. వీరిలో భాగ్యవంతులకు శ్రేష్ఠులని పేరు. వర్తకసంఘములకు శ్రేణులని పేరు. శ్రేణిముఖ్యులు రాజుమన్ననలకు పాత్రు లగుచుండిరి. కర్మాగారములందును, కారాగారములందును పనులు చేయుటకు శిల్పుల నియమించువారు. కారాబద్ధులను నియమితకాలమున కొన్కొక తడవ వదలివేయువారు. వితంతువులు, అంగవిహీనులు, సన్యాసినులు, సేవచేయలేని దేవదాసీజనము మొదలగు ననాథలచేత త్రాళ్లు పేనుట, నూలు వడకుట మొదలగు పనులను జేయించి, ప్రభుత్వమువారు వేతనము లిచ్చి పోషించువారు. ఇందులకు ప్రభుత్వపు కర్మాగారము లుండెడివి.

వర్తకము విరివిగాను, చురుకుగాను సాగుచుండెను. బంగారము, వెండి, సుగంధద్రవ్యములు, అంగరాగములు హిందూదేశమునందలి పలుతావులనుండి పాటలీపుత్రమునకు వచ్చు నమూల్యమగు పణ్యద్రవ్యములు. నగలును, మంచి ముత్యములును దక్షిణహిందూదేశము, సింహళము, సముద్రాంతర దేశములనుండియు, అంశుకములు (పలుచని — సన్నని వస్త్రములు), దూది, పట్టు చీనాదేశముననుండియు హిందూదేశమునకు ప్రాగ్దిశఁగల దేశములనుండియు, గుఱ్ఱములు సింధుదేశముననుండియుఁ దానికిఁ బశ్చిమమునఁగల దేశములనుండియు వచ్చుచుండినవి. నగరద్వారసమీపమున శుల్క (Toll

శాలలుండెడివి. దొంగతనముగ సుంకరులవలననుండి తప్పించుకొని, సరకులను గొనిపోవువారిని బట్టుకొనుటకు చారు లుండువారు. తూనికలను, కొలతలను రాజాధికారులు పరీక్షించువారు.

ప్రజ లాడంబరములేని సామాన్య వేషమును ధరించువారు. నూలుబట్టలను నారబట్టలను గట్టువారు. పిక్కలవఱకు వచ్చు నంగరేకు (చొక్కాయ) తొడిగి, పై నుత్తరీయము ధరించువారు; తలకు కోక చుట్టువారు. భాగ్యవంతులు దంతపు కర్ణాభరణములను ధరించువారు; గొడుగులు వేయువారు; జిలుఁగుపని చేసిన పాద రక్షలను దొడుగువారు. ధనవంతులు సువర్ణ, రత్న భూషణాద్యలంకృతులై రంగు రంగుల యుడుపులను దాలుచుచుండిరి. సరిగతోనో, పట్టుతోనో పువ్వుల పల్లిన మల్లుసెల్లాలకు విక్రయ మెక్కుడుగ నుండెను.

ఎప్పుడో కొన్ని మత విధులందుఁ దక్క ప్రజలు మద్యమును ద్రాగువారు కారు. బియ్యము ప్రధానాహార పదార్థము. ప్రజలెల్లరు సత్యవంతులుగను మర్యాదగలవారుగను ఉండిరి. వ్యాజ్యము లరుదు. ధన మిచ్చి పుచ్చుకొనుటకు సాక్షులుకాని ముద్రలుకాని యనావశ్యకములు. పరస్పర విశ్వాసమున వ్యవహారము సాగుచుండెను. దొంగతనము లరిది. బహుభార్యత్వమును, సహగమనమును నాఁటి యాచారములు. ఏనుఁగులయు, వృషభములయు, ఖడ్గ మృగములయు పోరాటములు జరగుచుండెడివి. రథములకు గుఱ్ఱములను, ఎడ్లను కట్టి పందెమునకు విడుచువారు; విశేషముగ ధనము నొడ్డువారు. రాజులును, రాజోపజీవులు నిందుకు మార్గదర్శకు లగుచుండిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రజలలో నధికసంఖ్యాకులు కర్షకులు. వీరికి యుద్ధములతోఁ బనిలేదు. రాజు బహుద్రవ్యమును వెచ్చించి, జలాశయములు మొదలగువానిని నిర్మించి, 'సేటిపాఱుదల' కానుకూల్యములు కల్పించి వ్యవసాయాభివృద్ధికిఁ దోడ్పడుచుండువాఁడు. కర్షకులు రాజునకు తమ వశమున నున్న భూములకు నియతమైన పన్ను చెల్లించువారు.

హిందూదేశమున సాటిలేని మహా సామ్రాజ్యమును నిర్మించిన చంద్రగుప్తునినాఁటి రాజకీయ, సాంఘిక పరిస్థితులట్టివి. మౌర్యవంశజులు పాలించుచుండినంతకాలము నివి కొంచెమించుమించుగ నిట్లే యుండెనని చెప్పవచ్చును.

## బిందుసారుఁడు

(క్రీ. పూ. ౨౯౮ — ౨౭౩)

చంద్రగుప్తుని యనంతరము ఆతని తనయుఁడు అమిత్రఘాత నామాంతరముగల బిందుసారుఁడు మగధసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుఁ డయ్యెను. ఇతని కాలమునఁగూడ సిరియా, ఐగుప్త (ఈజిప్టు) రాజులు మగధచక్రవర్తులతో మైత్రి నెఱపుచు, రాయబారుల నంపుచుండిరి. సెల్యూకస్ కుమారుఁడైన ఆంటియోకస్ సిరియానుండి మగధరాజాస్థానమునకు డైమేకస్ అనువానిని రాయబారిగఁ బంపెను. ఐగుప్తదేశమునుండి పాటలీపుత్రమునకు వచ్చిన రాయబారి డియోనిసియస్.

బిందుసారుని రాజ్యపరిపాలనవిశేషములనుగుఱించి మనకేమియుఁ దెలియరాదు. తన తండ్రి పద్ధతినే యవలంబించి, యీతఁడును సామ్రాజ్యమును విస్తరింపఁ జేసె ననుట కవకా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శము కలదు. ఇతని కుమారుఁడగు అశోకుఁడు రాజ్యము నకు వచ్చునప్పటికి మౌర్యసామ్రాజ్యము దక్షిణాపథమున నిప్పటి మైసూరు రాజ్యమువఱకు వ్యాపించియుండుటచేతను, అశోకుఁడు తాను జయించి మగధ సామ్రాజ్యమునకుఁ జేర్చిన దొక్క కళింగమే యగుటచేతను దక్కనుదేశ మీ బిందుసారుని కాలముననే మగధాధిపతులకు వశమయి యుండవచ్చును. మైసూరురాజ్యము పర్యంతము దక్షిణమునకు మగధరాజ్యమును విస్తరింపఁ జేసినవాఁడు బిందుసారుఁ డనియే తలంపవలసి యుండును.

బౌద్ధగ్రంథములవలన తక్షశిలానగరమునందలి ప్రజ లీతనికాలమునఁ దిరుగఁబడినట్లు తెలియుచున్నది. ఈ తిరుగఁబాటు నణఁచుట కీతఁడు తన తనూభవుఁడయిన అశోకుని బంపెను. ఇతఁడు సైన్య సమేతుఁడయి తక్షశిలను సమీపింపఁగనే ఆ నగరమునందలి ప్రజ లశోకుని కెదురేఁగి, తాము రాజపుత్రుఁడయిన అశోకునికిఁ గాని, చక్రవర్తియయిన బిందుసారునికిఁ గాని ప్రతికూలురము కామనియు, జలగలవలెఁ బట్టుకొని తమ్ము పీడించుచుండిన దుష్టామాత్యుల బాధలు పడలేకుంటి మనియు విన్నవించుకొనిరఁట. పరిపాలనమునఁ గల యిట్టి లోపములను సవరించుటకు కాఁబోలు అశోకుఁడు తన తండ్రికాలమునఁ గొంతకాలము తక్షశిలానగరమున రాజ ప్రతినిధిగఁ బనిచేసెను.

బిందుసారుఁ డిరువదియైదు సంవత్సరములు పరిపాలించి క్రీ. పూ. ౨౭౩-వ సంవత్సరమున కాలధర్మము నొందెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అశోకుఁడు

(క్రీ. పూ. ౨౭౩ — ౨౩౨)

బిందుసారుని యనంతరము మగధ సింహాసనము నధిష్ఠించినవాఁడు అతని కుమారుఁడయిన అశోకవర్ధనుఁడు. అశోకవర్ధనుని గుఱించి తెలిసికొనుటకు బౌద్ధగాథలు, సింహళద్వీపవృత్తాంతములుమాత్రమే కాక యాతని శాసనములే యనేకములుగఁ గలవు. హిందూదేశమునఁ గానవచ్చు మొదటి రాజశాసనము లీతనివే. కావున, సీతఁడే, తాను తక్షశిలానగరమునం దుండిన కాలమున డెరయస్ మొదలగువారు శిలాలిపులను జెక్కించుట మెఱింగియున్నవాఁడగుటచేత వారి మార్గము ననుసరించి, శిలాశాసనములు వేయు పద్ధతిని మన దేశమునఁ బ్రవేశపెట్టెనని చరిత్రకారులు కొందఱ యభిప్రాయము. తన రాజ్యమున కేవలము ధర్మమును బ్రవర్తింపఁ జేయుటకే వీనిని జెక్కించిన కారణమున అశోకవర్ధనుఁడే వీనికి ధర్మలిపు లని పేరిడెను. ఈ ధర్మ లిపులందు అశోకుఁడు 'దేవానాం ప్రియ* ప్రియదర్శి రా' జనియు, 'దేవానాం ప్రియరా' జనియు, 'ప్రియదర్శి రా' జనియు వ్యవహరింపఁబడియున్నాఁడు. అశోక శాసనములు ధర్మలిపులే యైనను వీని వలననుండియే ఆతనికిని, ఆతని పరిపాలనమునకును సంబంధించిన

---

* ఆయుష్మంతుఁడు, దీర్ఘాయువు–ఇట్టి పదములవలెనే పాణిని, పతంజలులనాఁటి కడుప్రాచీనకాలమున దేవానాం ప్రియుఁడనునది గౌరవవాచకముగ నుండెననియు, దేవతలకు ప్రియుఁడని దాని యర్థమనియు, కాలక్రమమున దానియర్థము మాఱిన దనియు కొందఱ యభిప్రాయము. ఇటీవల నీ పదమునకు మూర్ఖుఁడని యర్థము కలిగినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషయములు వాఙ్మయమునుండికంటె నెక్కువగఁ దెలియ వచ్చుచున్నవి.

బిందుసారునికిఁ గుమారు లనేకులు కలరు. తండ్రి మరణానంతరము సోదరులలో సోదరులకు సింహాసనమునకయి భయంకరమగు పోరాటము సంభవించెననియు, అందు అశోకవర్ధనుఁడు విజయియై యొక్కని తక్క తక్కిన సోదరుల నందఱ వధియించి రాజ్యమునకు వచ్చెననియు బౌద్ధగాథలు నుడువుచున్నవి. కాని యిది విశ్వాసపాత్రముగఁ గన్పట్టదు: ఏలయన, అశోకవర్ధనుని ధర్మలిపుల ననుసరించియే యతని పరిపాలనకాలమున నతని సోదరులు పెక్కురు రాజధాని యగు పాటలీపుత్రముననే కాక యితర ప్రాంతములఁగూడఁ గలరనియు, వారియెడ నాతని కధికమగు ప్రేమ గౌరవము లుండె ననియు విదితమగుచున్నది. సింహాసనము నాక్రమించు కొనుట కొకవేళ కలహము సంభవించినను అశోకవర్ధనుఁడు వారిని నిర్జించి, పిదప వారిని శాంతపఱచి మైత్రి పాటించి యుండునే కాని వధింపలేదని మాత్రము ధర్మలిపులు ఋజువు చేయుచున్నవి. ఈ విధమయిన కలహములవలనఁ గావచ్చు, అశోకవర్ధనుఁడు రాజ్యమునకు వచ్చిన నాలుగేండ్లకుఁ గాని యతనికి పట్టాభిషేకము కాదయ్యెను.

రాజ్యమునకు వచ్చిన పండ్రెండేండ్లవఱకు అశోకవర్ధనుని గుఱించిన వృత్తాంత మేదియుఁ దెలియదు. అంధకారము క్రమ్మిన హిందూదేశ చారిత్రక యుగములలో నిది యొకటి. పండ్రెండవయేఁట, నన఼గా పట్టాభిషిక్తుఁడయిన యెనిమిది సంవత్సరముల కశోకవర్ధనుఁడు తన పూర్వులవలెనే విజిగీషువై కళింగదేశముపయి దాడి వెడలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కడు ప్రాచీన జనపదములలో కళింగ మొకటి. బుద్ధుని కాలమునాఁటికే ఆర్యు లీదేశమునఁ బ్రవేశించి తమ సభ్యత నచట పాదుకొలిపిరి. అయినను నూతనముగ ఆర్యత్వమును బడసి, వైదికాచార మింకను సుప్రతిష్ఠితము కాని దేశమగుట చేత నిది బ్రాహ్మణులకుఁ బ్రవేశింపరాని, నివసింపరాని జన పదముగఁ బరిగణింపఁబడెను. వైదిక బ్రాహ్మణ మతమున కంటెను జైన, బౌద్ధమతములే శీఘ్రకాలమున ప్రజాహృదయ మును వశపఱుచుకొని, జన సమ్మతము లయ్యెను. బుద్ధుని కాలముననుండియు నీ కళింగదేశము చక్కని యుల్లిపొర రవసెల్లాలకు ప్రసిద్ధికెక్కినది. ఇవి యీ దేశముననుండి దక్షిణదేశమున కెక్కువగ దిగుమతి యగుచుండినందున ప్రాచీన తమిళ భాషను వస్త్రమునకు కళింగ మన్న పేరు కలిగెను. కళింగదేశాధిపతి బుద్ధుని మిత్రుఁడయిన కోసలభూపతి 'పసే నది'కి ఉల్లిపొరకంటెను బలుచనగు సొగసయిన చీరను బహు మానముగఁ బంపెనఁట! అది యటుండ, మహాభారత కాల మునాఁటనుండియు నీ దేశము రణవ్యాపార ప్రసిద్ధములయిన గజములకును, ఇంద్రవనకము లనుపేరుగల యమూల్యములగు వజ్రములకును, కళింగకమను నొక విధమయిన యోషధికిని విఖ్యాతిఁగాంచెను. వైద్య విద్యయెడల నేతద్దేశీయులు ప్రత్యే కాభిమానమును గనఁబఱుచుటవలన కొలమానములఁ గళింగ పద్ధతి యని యొకప్రత్యేక పద్ధతి యేర్పడెను. కళింగదేశమం తయు సముద్రతీరముననే యుండుటచేత కాళింగులు నౌకా యానమున నారితేరిన సాహసులయి, ద్వీపాంతరములకు, దూర దేశాంతరములకు సబురులుచేసి, వస్త్రములు వజ్రములు మొదలగువానితోఁ గొప్ప నౌకా వర్తకమును సాగించుచు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశమును భాగ్యవంతముగఁ జేయుచుండిరి. బుద్ధనిర్వాణానంతరము కళింగదేశస్థులు బుద్ధుని దంతమును దెచ్చి, దానిపయి నొక చైత్యమును నిర్మించి, దానికి బంగారురేకు తొడిగి రత్నస్థగితముఁ గావించి, మంచి ముత్యముల పేరులతో దాని నలంకరించి పూజించుచుండిరఁట. ఈ దంతచైత్యము గలచోటనే మహానగరము వెలసి, దంతపుర మనుపేరఁ బ్రఖ్యాతమై, కళింగమునకు రాజధానియయ్యెను. అత్యంత వైభవాభిరామ మగు నీ కళింగరాజ్యముసంపద అశోకవర్ధనునికి కన్నుకుట్టెను. నందవంశజుల పరిపాలనానంతరము వారి యధికారశృంఖలములను ఛేదించివైచి, స్వాతంత్ర్యపతాక విప్పి మగధసామ్రాజ్యముననుండి వేఱుపడి కళింగము తన గజసైన్యము నభివృద్ధిచేసికొనుచుండెను. ఇట్టి బలవంతమైన రాజ్యము తన పొరుగున నుండిన మగధ కెప్పటికైన ముప్పు రాఁగలదని అశోకవర్ధనుఁడు కళింగముపయి కత్తిదూసెను.

అనతికాలముననే అశోకవర్ధనుని సైన్యములకును, కళింగసైన్యములకును మహాభయంకర సంగ్రామము ప్రవర్తిల్లెను. ఈ మహాయుద్ధమున లక్షమంది యోధులు వీరస్వర్గమును జూఱఁగొనిరి. లక్షయేఁబదివేలమంది చెఱఁబెట్టఁబడిరి. యుద్ధకారణముగఁ గలిగిన దుర్భిక్షాదులవలన నింక ననేకులు నశించిరి. ఈ పరిగణనము ననుసరించియే కళింగ మప్పటి కెంత బలవంతమును, జనసమృద్ధము నగురాజ్యమో తెలియఁగలదు.

ఈ మహాసంగ్రామమున విజయలక్ష్మి అశోకవర్ధనునే వరించెను. కళింగము మౌర్యమగధసామ్రాజ్యమున నంతర్భాగ మయ్యెను. లోకోపద్రవకరమయిన యీ భీకరప్రవిదార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ణము మహారాజు హృదయమును కలగుండుపఱిచి, యాతని నత్యంత సంతాపతప్తుని గావించెను. తన మూలమునఁ గలిగిన యీ మహాజనసంక్షోభమునకుఁ బరితప్తమైన యా దివ్యమానవహృదయపు వగపు వఱ్ఱోడి దివ్యామృత పదరూపమున శిలాలిపిగ కరడుకట్టెను. యుద్ధానర్థములను దలఁచి తలఁచి బిట్టువగచిన యా రాజహృదయపు విషాద విలాపము యుగయుగములనుండి యిప్పటికి నీ క్రింది పంక్తుల సముద్రఘోషమువలె వినిపించుచునే యున్నది:

దేవానాంప్రియుఁడగు ప్రియదర్శిరాజు పట్టాభిషిక్తుఁడైన యష్టమ వర్షమున కళింగ రాజ్యమును జయించెను.

అందు, లక్షయేఁబది వేల జనము చెఱఁబెట్టఁబడిరి. లక్షమంది వధింపఁబడిరి. ఇంతకంటె నెన్నియోరెట్లు జనము మడిసిరి.

అటుతరువాత, నూతన లబ్ధమైన యీ కళింగరాజ్యమున నిప్పుడు దేవానాం ప్రియుఁడు తీవ్రముగ ధర్మపాలనమును, ధర్మకామనమును, ధర్మానుశాసనమును జేయుచున్నాఁడు.

కళింగమును జయించినమీఁదఁ గలిగిన యనుతాప మిది దేవానాం ప్రియునికి. అవిజితమయిన దేశము జయింపఁబడినప్పుడు ప్రజలు వధియింపఁబడుటవలనను, మరణించుటవలనను, చెఱగొనిపోవఁబడుటవలనను దేవానాంప్రియుని కత్యంతము బాధయు, వేదనయుఁ గలిగినది.

ఇంతకంటెను శోచనీయమైన దేమన, అగ్ర వృద్ధ శుశ్రూషయు, మాతా పితృ శుశ్రూషయు, గురు శుశ్రూషయు, మిత్ర, పరిచిత, సహాయ, జ్ఞాతి, దాస, భృత్యులందు దృఢభక్తి గౌరవములును విహితముగాఁగల బ్రాహ్మణులు, శ్రమణులు, ఇతర మతస్థులు, గృహస్థులు నట్టి దేశమున నివసించుచుందురు.

వారికి యుద్ధమున హానియు, వధయు, తమకుఁ బ్రేమాస్పదులగువారి నుండి యెడఁబాటును సంభవించును.

వారు సుస్థితి నుండినను, తఱుగని ప్రేమయే కలవారయినయెడల తమ మిత్రులు, పరిచితులు, సహాయులు, జ్ఞాతులు వ్యసనపీడితులగుచో వారును దెబ్బతిన్నవారే యగుచున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ దుఃఖ మందఱకు సమమే: దేవానాంప్రియుని కిది సంతాపకరము; ఏలయన, ఒక్క యవనజనపదమునఁ దక్క శ్రమణ, బ్రాహ్మణనికాయములు లేని జనపదమే లేదు. ఏ జనపదమునఁగాని యేదో యొకమతము నవలంబించినవారు లేని స్థలమే లేదు.

కళింగదేశము జయింపఁబడినప్పుడు వధియింపఁబడినట్టియు, మరణించినట్టియు, చెఱగొనిపోవఁబడినట్టియు జనమున నూఱవ వంతుగాని వేయవ వంతుగాని జన మట్లయినను ఇప్పుడు దేవానాం ప్రియునికి సంతాపము కలుగును.

ఇంతే కాదు; ఎవరయినఁ దన కపకారము చేసినప్పటికి శక్యమగు నంతవఱకు సహించి క్షమింపవలసినదని దేవానాంప్రియుని యభిమతము.

దేవానాంప్రియునిచేత అటవీజనము జయింపఁబడిరి. అయినను, శిక్షింప సమర్థుఁడగుటచేత తన కోరికప్రకారము వారు ప్రవర్తించునట్లు చేయఁగలిగినను వారు తాము చేసిన దోషములకు పరితాపము నొందవలెనని, వారు తనచే వధింపఁబడక యుండవలెనని దేవానాంప్రియుఁడు వారిని అనునయించి, తన ధర్మమునకుఁ ద్రిప్పి, తనతోపాటు వారు అనుతాపము నొందునట్లు చేయుచున్నాఁడు; ఏలయన, దేవానాంప్రియుఁడు సర్వభూతములకు అహింసయు, సంయమమును (నిగ్రహముఁ గలిగియుండుట), సమచర్యయు (సమభావముతో నాదరించుట), సమ్మోదమును గోరుచున్నాఁడు.

విజయము లన్నిటిలో దేవానాంప్రియుని యీ ధర్మవిజయమే ముఖ్యమయినది.

* * * *

ఈ విధముగ సర్వత్ర లభించిన విజయము ప్రీతికరమయినది.

ఈ ధర్మవిజయమువలనఁ గలిగిన ప్రీతి గాఢమయినది. అయినను ఇది కూడ అంత గొప్పది కాదు. పరలోక సంబంధమయిన ఫలమే మహాఫలమని దేవానాం ప్రియుని యభిప్రాయము.

ఈ ధర్మలిపిని లిఖించిన ప్రయోజన మిది: నా పుత్రులుకాని, పౌత్రులుకాని ఎవరయినను క్రొత్తవిజయములు చేకూర్పఁ దలంపక యుందురుగాక! ఒకవేళ బాణప్రయోగ సాధ్యమగు విజయమునందయినను సాధ్యమగునంతవఱకు శాంతినే యవలంబించి, కొద్దిపాటి శిక్ష విధింపనే యభిలషింతురుగాక! ధర్మవిజయమే అసలు విజయ మని తలంతురుగాక! ఇఁదుమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లన ఇహమును, పరమునుగూడఁ గలదు. సమస్తమయిన పూనికయు ధర్మోద్యమమందు లగ్నమయినది అగుఁగాక! ఇదే కదా ఇహమునకు, పరమునకు!

నూతనముగ జయింపఁబడిన కళింగ రాజ్యమునకు 'తోసలీ' నగరము రాజధాని యయ్యెను. ఒరిస్సా, పూరీ జిల్లా, ఖుర్దా తాలూకాయందలి ధౌలి గ్రామమునే చరిత్ర పరిశోధకులు 'తోసలీ' నగరముగ గుర్తించిరి. అశోకవర్ధన చక్రవర్తి 'తోసలీ' నగరమునఁ దన ప్రతినిధి నొకనిని నియమించి, యీ నూతన రాజ్యమందును, దానికి సరిహద్దులయందును నున్న ప్రజల నెట్లాదరించి పాలింపవలయునదియుఁ దెలుపుచు ప్రత్యేక ధర్మ లిపులను రెంటిని జెక్కించెను. వీనికి 'కళింగ ధర్మలిపు' లని పేరు. వీనిలో నొకటి ధౌలిగ్రామమునందును, మఱియొకటి గంజాముమండలమునందలి జౌగడగ్రామమునందును ఇప్పటికిని గలవు. కళింగసంగ్రామానంతర మా చక్రవర్తి నవనీత కోమల హృదయ మెట్లు ద్రవించి కరుణారసతరంగిత మయ్యెనో కళింగధర్మలిపులయందలి యీ క్రింది పంక్తులు సహస్రజిహ్వాలతో వర్ణించుచున్నవి:

మానవులందఱు నా సంతానము. నా సంతానమున కిహలోకమునను, పరలోకమునను శ్రేయస్సును, సౌఖ్యమును ఎట్లు కోరుదునో అట్లే వానిని మనుష్యు లందఱకునుగూడఁ గోరుచున్నాను...నా రాజ్యమున కిరుగుపొరుగులందు నాచేత జయింపఁబడకయున్న వారు 'రాజు మే మేమి చేయవలెనని కోరుచున్నాఁ' డని యన్నచో దానికి ప్రత్యుత్తర మిది: వారు తనకు భయపడ నక్కఱలేదు; తనయందు విశ్వాసము కలిగియుండవలయును; వారు తనవలననుండి దుఃఖమును గాక సౌఖ్యమునే పడయుదురు. ఎంతవఱకు క్షమింప శక్యమగునో యంతవఱకు వారిని తాను క్షమించును; కాని ఇహము పరముకూడఁ దక్కునట్లు వారు తనకొఱకు ధర్మము నాచరింపవలయునని దేవానాంప్రియుని కోరిక యని వారు గ్రహింపవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కళింగ విజయముతో మగధ అసదృశమును, అశ్రుత పూర్వమును అయిన మహాసామ్రాజ్య మయ్యెను. వాయవ్యముగ నిది తక్షశిలను దాఁటి యవన రాజ్యము సరిహద్దులవఱకు వ్యాపించెను: అనఁగా కాంభోజ, గాంధార దేశములు అశోకవర్ధన సామ్రాజ్యమున వాయవ్యదిశయం దుండెను. కాశ్మీర, పశ్చిమ నేపాళాది హిమవత్పర్వత ప్రాంతము అశోక సామ్రాజ్యమున కుత్తరపు సరిహద్దు. అశోక చక్రవర్తియే కాశ్మీరమున కిపుడు రాజధానిగనున్న శ్రీ నగరమును గట్టించెనని ప్రతీతి. కటకము గంజాములు ఈ సామ్రాజ్యపు ఆగ్నేయదిశ సరిహద్దులు. దక్షిణదిశ నీ సామ్రాజ్యము దక్కను పీఠభూమిమీఁదుగ కొంచె మించుమించుగ మైసూరువఱకు వ్యాపించెను. కాఠయవాడ పడమటి యెల్ల. అశోకుఁ డిట్లు పశ్చిమమున అరాబియా సముద్రమున నుండి తూర్పున బంగాళాఖాతము వఱకును, ఉత్తరమున హిమవత్పర్వతముననుండి దక్షిణమున మైసూరు వఱకును దన సామ్రాజ్యమును విస్తరింపఁజేసెను.

పెక్కుజనపదములతోను, దుర్గములతోను విలసిల్లుచుండిన యీ మహా సామ్రాజ్యమును అశోకుఁడు తన పితామహుఁడయిన చంద్రగుప్తునినాఁటివలెనే మంత్రి పరిషత్తు తోడ్పాటుతో పాలించుచుండెను. జనపదములలో తక్షశిల, ఉజ్జయిని, తోసలి, సువర్ణగిరి రాజధానులుగఁ గల జనపదములు చాల ముఖ్యమయినవి. సామ్రాజ్యమునందలి దక్షిణ జనపదమునకు సువర్ణగిరిపాలకుఁ డధిపతి. ప్రముఖములయిన యీ జనపదములకు రాజకుమారులు కాని, ఆర్యపుత్రుల నఁబరఁగు రాజబంధువులు కాని పాలకులుగ నియుక్తులగుచుఁడువారు. సామ్రాజ్యమునందలి మధ్యమప్రదేశమునకు పాటలీపుత్రమే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజధానియై యది చక్రవర్తిచేతనే పరిపాలిత మగుచుండెను. ఒక్కొక్క కోటక్రిందఁ జెల్లుచుండిన భాగమునకు కోట విషయ మని పేరు. కిరాతకులు మొదలగువారివలన ప్రజల కుపద్రవము కలుగకుండ దుర్గాధిపతులు సంరక్షించుచుండు వారు. పరిపాలనసౌకర్యముకొఱకు ఒక్కొక్క జనపద మిప్పటి జిల్లాలవంటి 'ఆహారము' లను పేరుగల విభాగము లుగ విడఁదీయఁబడెను. వీనికి మహామాత్రు లధిపతులు. గొప్ప నగరములందును మహామాత్రు లను పేర నొప్పు నుద్యో గులే నగర వ్యవహారములను జక్కఁబెట్టువారు. సరిహద్దు రాజ్యములందలి ప్రజలను సంరక్షించి పరిపాలనము నెఱపు వారికి 'అంతమహామాత్రు' లని పేరు. 'రజ్జుకు' లను పేరంబరగు మఱియొక తరగతి యుద్యోగులు కలరు. ప్రజ లను నేరములకు శిక్షించుటకును, సత్కార్యములకు బహు మానించుటకునుగూడ వీరి కధికార ముండెను. ప్రతివేదకులు, యుక్తులు, ఆయుక్తులు అని మఱికొంద ఱుద్యోగు లుండువారు. దేశమున జరగుచుండిన వ్యవహారములను కాలస్థలనియమ ములులేక ఎప్పుడయినను, ఎక్కడనయినను రాజునకు నివేదిం చుట ప్రతివేదకుల ధర్మము. యుక్తులును, ఆయుక్తులును మహామాత్రులు మొదలగు ఉన్నతోద్యోగుల కార్యస్థానము లందు లేఖకులుగనుండు ఇప్పటి 'కార్యదర్శు'ల వంటివారు. వీరుకాక, ఇంకను పెక్కు రుద్యోగులు కలరు. ఈ యుద్యోగి వర్గముద్వారమున రాజ్యపాలనము చక్కఁగ సాగుచుండెను.

కళింగదేశ విజయముతో అశోకుని జీవితముననే కాక, హిందూదేశ చారిత్రముననే యొక గొప్ప మార్పు సంభవిం చెను. ఖడ్గసాధనమున రాజ్యమును విస్తరింపఁజేయుట అశోక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వర్ధనునికి అసురకృత్యముగఁ దోఁచెను. రాజధర్మలక్ష్యము మాఱెను. నూతన శక మారంభమయ్యెను. విశ్వప్రేమ సంపాదనము రాజు నాదర్శ మయ్యెను. తన కన్నసంతానము వంటి ప్రజలు ఐహిక, ఆముష్మికముల నొందుటకుఁ దోడ్పడుటయే తన కర్తవ్యమని అశోకుఁడు విశ్వసించి, అందులకుఁ అహింసాప్రధానమైన బౌద్ధమతమును, ధర్మమును ఆలంబముగఁ జేసికొని, ధర్మపతాక నెత్తెను. భేరీఘోషము ధర్మఘోషముగ మార్పు చెందెను. 'ధర్మమూల మిదం జగ' త్తను సత్యమును అశోకుఁడు లోకప్రవర్తితము కావించెను. ధర్మము, అహింస, విశ్వప్రేమ — ఇవియే యారాధ్యము లయ్యెను.

అశోకుఁడు ప్రజలకు బోధించి, లోకమున వ్యాపింపఁజేసిన ధర్మమిది: జీవహింస చేయఁగూడదు. పెద్దలయెడ భక్తికలిగి యుండవలెను. తలిదండ్రులకు శుశ్రూష చేయవలెను. దాసులయెడలను, భృత్యులయెడలను ప్రతిపత్తి కలిగి యుండవలెను. శ్రమణులను, బ్రాహ్మణులను దానములచేతఁ దనుపుచుండవలెను. జ్ఞాతులు, మిత్రులు, పరిచితులు మొదలగువారియెడల గౌరవము కలిగియుండవలెను. అపకారము చేసినవారిని క్షమింపవలెను. నిగ్రహము కలిగి సమస్తభూతములయెడల సమబుద్ధితోఁ బ్రవర్తింపవలెను. ధర్మము, దానము, సత్యము, శౌచము అనునవి కల్యాణగుణములు. వీని నలవఱుచుకొనఁ బ్రయత్నింపవలెను. ఈర్ష్యాక్రోధములును, నైష్ఠుర్యమునుగూడదు. పాపమునకు భీతిల్లవలెను. భావశుద్ధియు, సంయమమును కలిగియుండవలెను. తమ మతమును, శాఖను పొగడుకొనుటయు, ఇతర మతములను, శాఖలను నిందించుటయుఁ గూడదు. వాఙ్నిగ్రహము కలిగియుండవలెను. అశోక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వర్ధనుఁడు లోక కల్యాణము నభిలషించి వ్యాపింపఁజేసిన యీ ధర్మము సర్వోత్తమ మతసార మనఁదగును.

అహింసాప్రధానమును, శీలాధారము నయినదగుటచేత బౌద్ధమతము అశోకవర్ధనుని హృదయము నెక్కువగ ఆకర్షించెను. కళింగదేశ విజయానంతరము అశోకుఁడు మొదట ఉపాసకుఁడుగనుండి, పిదప బౌద్ధసంఘమునఁజేరి బౌద్ధమతమును స్వీకరించి భిక్షువై, బౌద్ధధర్మవ్యాపనమున కత్యంతము పాటుపడెను. ఉపగుప్తుఁ డీతని బౌద్ధగురువు. సర్వభోగములను, సర్వ సౌఖ్యములను పొందఁగలిగిన సమ్రాట్టు విశ్వశ్రేయముకొఱకు సర్వసంగపరిత్యాగియై, రాజభిక్షువై ధర్మప్రవర్తకుఁ డగుట ప్రపంచ చారిత్రమున నపూర్వముకదా!

మార్పునొందిన యశోకవర్ధనుని లక్ష్యముతో రాజకీయోద్యోగివర్గమంతయు ధర్మ పరతంత్ర మయ్యెను. రజ్జుకులు, యుక్తులు, మహామాత్రులు అయిదేసి సంవత్సరముల కొకసారి రాజ్యమునఁ బర్యటనముచేయుచు, ఇతర రాజకార్యములతోపాటు ధర్మమును బోధించుచు, ధర్మవ్యాపనము చేయుచుండవలెను. మహామాత్రులు మొదలగువారు తమ ధర్మమును సరిగ నిర్వర్తించుచున్నదియు లేనిదియు కనిపట్టుచు, ప్రజాహితము నభిలషించి రాజునకుఁ దెలుపవలసిన సంగతులున్నయెడల కాలస్థలవివక్ష లేక ప్రతివేదకులు రాజున కెఱింగించుచుండవలెను. ఉన్న యుద్యోగి వర్గముతోఁ దృప్తినొందక అశోకుఁడు ప్రజల ఆధ్యాత్మిక, ఆధిభౌతిక అభ్యుదయమును విచారించి ప్రత్యేకము ధర్మప్రవర్తనము కావింప ధర్మ మహామాత్రులను క్రొత్తయుద్యోగులను నియమించెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అశోకచక్రవర్తి

(ప్రమోదకుమార ఛటర్జీగారి త్రివర్ణచిత్రమునుండి, వారియనుమతితో)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్యాయమును విచారించుట, దయాధర్మములను ప్రజలలో వృద్ధినొందించుట, దానముల నేర్పాటుచేయుట, వేఱువేఱు మతములవారిలోఁ బరస్పరము సామరస్యమును బెంపొందించుట — ఇవి ధర్మమహామాత్రుల ముఖ్యకర్తవ్యములు. ప్రజలు రాజప్రవర్తితమయిన ధర్మము నాచరణయందుఁ బెట్టుచున్నది లేనిది కనుఁగొనుచు, ధర్మసంస్థాపనముకొఱకును, ధర్మనిరతులైనవారి సౌఖ్యహితములకొఱకును వారు పాటుపడవలెను. అంతియ కాక, కారాబద్ధులు సంతానవంతులైనచో నట్టివారికి ధన మొసంగి పోషించుట, వయస్సు కడచిన వృద్ధులను, పిచ్చి యెత్తినవారలను కారాబంధవిముక్తులం జేయుటకూడ వారు చేయవలసిన పనులు. ఈ విధమున వారు అశోకుని రాజ్యము నందే కాక సరిహద్దుల నున్న రాజ్యములందును, పశ్చిమ దేశము లందునుగూడ పాటుపడుచు ధర్మమును వ్యాపింపఁ జేయుచుండిరి. ఈ ధర్మోపదేశకులవలన అష్టదిక్కులందును యోజనశతములవఱకు పరిసర ప్రదేశములందు ధర్మవిజయము కలిగినట్లు అశోకుఁడు తన ధర్మలిపులందుఁ దెలిపియున్నాఁడు.

తాను ప్రజల కాదర్శప్రాయుఁడుగ నుండినఁ గాని ప్రయోజనము లేదని అశోకవర్ధనుఁడు తన వృత్తమును సంస్కరించుకొనెను. అశోకునికిఁ బూర్వము రాజులు మృగములను వేటాడుటకై విహారయాత్రలకు వెడలుట యాచారముగ నుండెను. అశోకుఁ డట్టి విహారయాత్రలను మాన్పించి, వానికి బదులుగ ధర్మయాత్రల నేర్పాటు చేసెను. ఈ యాత్రలందతఁడు అన్నిమతముల యతులతోను, సన్యాసులతోను గలసి తిరుగుచు, 'ధర్మము'ను వినుచు, రోగులను జూచి వారి నాదరించుచు, రిక్తులను అర్థులను దానాదికములఁ దనుపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుండువాఁడు. గురువయిన ఉపగుప్తునిఁ బురస్కరించుకొని అశోకవర్ధనుఁడు బుద్ధునికి జన్మస్థానమయిన లుంబినీవనమున కును, పిదప, శైశవక్రీడారంగమయిన కపిలవస్తు నగరమున కును, బుద్ధుఁడు పరమజ్ఞాన ప్రబోధము నొందిన బుద్ధగయకును, మొట్టమొదటిమాఱు ధర్మచక్రప్రవర్తనముఁ గావించిన సారంగ నాథమునకును, చాల సంవత్సరములు జీవితమును గడపిన శ్రావస్తికిని, మహాపరినిర్వాణము నొందిన కుశనగరమునకును యాత్రలుచేసి యీ ధర్మక్షేత్రములందు ధనము నెక్కువగ వెచ్చించి దానముల నొసంగి తనయాత్రకు స్మృతి చిహ్నము లుగ కీర్తిస్తంభములను బ్రతిష్ఠించి వానిపై ధర్మలిపులు చెక్కించెను. ఈ యాత్రలయం దశోకవర్ధనుఁడు ప్రజల సాధక బాధకములను విచారించి, వారికి తన 'ధర్మము'ను బోధించు వాఁడు. నోరులేని జంతువులను మతముపేర కాసి, ఆహారము కొఱకని కాని హింసించుట, చంపుట తనకు దుస్సహమై యాక రుణాఘుఁడగు చక్రవర్తి ఆహారముకొఱకు రాచనగళ్లయందు జరగుచుండిన నూర్లకొలఁది, వేలకొలఁది జీవజంతువుల వధను మాన్పించెను. అంతియ కాక ప్రజ లెవ్వరు కాని కొన్ని కొన్ని రకముల పక్షులను, జంతువులను దన రాజ్యమున వధియింప రాదని శాసించెను.

అశోకుని ధర్మనిరతిని భూతదయను దెలుపు కార్యము లనేకములు కలవు. అతఁడు ధర్మవ్యాపనమున కాటంకము లుగ నుండిన కొన్ని యుత్సవములను నిషేధించెను. ప్రజ లలో ధర్మాభిరతి నుద్దీపింపఁ జేయుటకుఁ దోడ్పడు నని 'విమా నదర్శనము', 'హస్తి దర్శనము' మొదలగు క్రొత్త యుత్సవ ముల నేర్పాటుచేసెను. వ్యాధులు సంభవించినప్పుడును పుత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుత్రికాజనన, వివాహ సమయములందును, ప్రయాణసమయ ములందును ప్రజలు మూఢవిశ్వాసములకు లోనయి నిరర్థకములయిన వ్రతములు మొదలగునవి చేయుచుండువారు. అట్టి వ్రతములు వ్యర్థములును అనుచితములు ననియు, ధర్మ వ్రతమే ముఖ్యమయిన దనియు అశోకుఁడు చాటించెను. మనుష్యుల కొఱకును, జంతువుల కొఱకును ప్రత్యేకచికిత్సాశాలలు రాజ్యమునం దంతట స్థాపించెను. చికిత్సోపయుక్తములైన యోషధులు లేనిచోట్ల వానిని తెప్పించి నాటించెను. మార్గములందు బాటసారులు మొదలగువారి కుపయోగకరములుగ నుండునట్లు అందందు బావులు త్రవ్వించి బాటలప్రక్క పుష్పచ్ఛాయామనోహరములైన వృక్షములను వేయించెను.

తనయుద్దిష్టధర్మము ప్రజలకు బోధపడుటకై అశోకవర్ధనుఁడు తన ధర్మానుశాసనములను శిలలమీఁదను, శిలాస్తంభములమీఁదను, శిలాఫలకములమీఁదను జెక్కించెను. శిలాలిపు లని, స్తంభలిపు లని, గుహాలిపు లని అశోకుని శాసనములు మూఁడు తెఱఁగులు. శిలాలిపు లన్నియు సామ్రాజ్యము సరిహద్దు రాష్ట్రములందుఁ గానవచ్చినవి. ఇవి పదునాలుగు కలవు. ఈ పదునాలుగింటికి (౧) షాబాజ్ గఢీ (పెషావరు-జిల్లా), (౨) మాన్‌సహ్రా (హజారా జిల్లా: వాయవ్యపు సరిహద్దు పరగణాలు), (౩) కాల్సీ (డేరాడూన్ జిల్లా: సంయుక్తరాష్ట్రములు), (౪) గిర్నార్ (జూనాగఢము) (కాఠయవాడ), (౫) సోపార (ఠాణా జిల్లా: బొంబాయి), (౬) ధౌలి (పూరీ జిల్లా: ఒరిస్సా), (౭) జౌగడ (గంజాము జిల్లా) అను నీ యేడు స్థలములందు ఏడు ప్రతులు కలవు. ఇటీవల కర్నూలు జిల్లా ఎఱ్ఱగుడిపాడు గ్రామమున (గుత్తి దగ్గఱది) అశోకశాసనములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొన్ని కానవచ్చినవి. లఘుశిలాలిపు లను పేరఁ బరఁగు మఱి రెండు శాసనముల ప్రతులుమూఁడు మైసూరు సంస్థానమున మూఁడు చోట్ల గలవు. వానిలో నొక శాసనపు ప్రతి మాత్రము మాస్కి (రాయచూరు జిల్లా: నిజాం రాజ్యము), సహస్రామ్ (షాహాబాదు జిల్లా: బీహారు), రూపనాథ్ (జబల్‌పూరు జిల్లా: మధ్యపరగణాలు), వైరాట్ (జయపుర సంస్థానము: రాజపుత్ర స్థానము) లందు కలదు. స్తంభలిపు లన్నవి ఆఱు స్తంభముల మీఁదఁ గలవు. ఈ స్తంభములలో రెండిపుడు ఢిల్లీయం దున్నవి*. స్తంభ శాసనము లేడు. ఈ యేడును ఢిల్లీ (తోప్రా) స్తంభము మీఁదఁ జెక్కఁబడియున్నవి. ఈ స్తంభలిపులు ఢిల్లీ (మీరటు), అలహాబాదు (కౌశాంబి — ప్రయాగ), లౌరియా అరరాజ్ (రాధియ), లౌరియా నందన్‌గఢ్ (మాథియా), రామపుర్వా (— ఈ కడపటి మూఁడును ఉత్తర బీహారునందలి చాంపరాన్ జిల్లా యందుఁ గలవు) స్తంభములమీఁదఁగూడ కలవు. కాని వీనిమీఁద తోప్రా స్తంభముమీఁది మొదటి యాఱుశాసనము లకు మాత్రమే ప్రతులు కలవు. పదునాలుగు శిలాశాసనము లను, ఏడు స్తంభ శాసనములను ధర్మలిపు లందురు. ఇవి కాక, లఘు స్తంభ శాసనము లను పేర మఱికొన్ని కలవు. ఈ లిపులు చెక్కిన స్తంభములు అలహాబాదు, సాంచి (భోపాలు సంస్థానము), సార్నాథ్, రుమ్మిందే (లుంబినీ), నిగ్లీవ (నేపాలు) అను చోట్ల కానవచ్చినవి. అశోక గుహాశాసనము లనునవి గయ కుత్తరముగ పదునాఱుమైళ్లు దూరమున నున్న బారాబర్ కొండ గుహాలందుఁ గానవచ్చినవి. ఈ గుహాశాసనముల ననుస

* ఈ స్తంభములు రెంటిని పదునాలుగవ శతాబ్దిని ఢిల్లీ సుల్తాన యిన ఫిరూజ్ తుఘ్లక్ పాదుషా ఢిల్లీకి తెప్పించెనని చెప్పుదురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రించి అశోకుఁడాగుహాలను తన పదుమూఁడవ, ఇరువదవ పరిపాలనవత్సరములందు ఆజీవికులను నొక జైనమత శాఖవారి కొఱకుఁ దొలిపించి యొసంగినట్లు తెలియుచున్నది. అశోకుఁడు తన యిరువదియొకటవ రాజ్యసంవత్సరమున బుద్ధధర్మ

అశోకుని రుమ్మిందే స్తంభశాసనము

(బ్రాహ్మీ లిపి)

౧. దేవానపియేన పియదసిన లాజిన వీసతివసాభిసితేన

౨. అతన ఆగాచ మహీయితే హిదబుధే జాతే సక్యమునీతి

౩. సిలావిగడభీచా కాలాపిత సిలాథభేచ ఉసపాపితే

౪. హిద భగవం జాతేతి లుంమినిగామే ఉబలికేకటే

౫. అఠభాగియే చ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్షేత్రములను సందర్శింప యాత్ర వెడలెను. స్తంభలిపు లేడును అశోకుని యిరువదియాఱవ, ఇరువదియేడవ సంవత్సరము లందుఁ జెక్కఁబడినవి. అశోకచక్రవర్తి యీ శాసనము లన్నియు ప్రాకృతభాషయం దున్నవి. ప్రాకృతమే యప్పటి ప్రజాసామాన్యముయొక్క వ్యవహారభాషగఁ గన్పట్టును. దీని గ్రాంథికరూపమే పాలి — బౌద్ధులమతభాష. శాసనలిపి కొన్నిట ఖరోష్ఠి; మఱికొన్నిట బ్రాహ్మి. వాయవ్యదిశఁ గాన వచ్చు శాసనములు ఖరోష్ఠిలిపి యందును, తదితరప్రాంతములఁ గానవచ్చు శాసనములు బ్రాహ్మీలిపియందును వ్రాయఁబడి నవి. అరబ్బీ, ఫారసీ, ఉర్దూలిపులవలె ఖరోష్ఠిలిపిని కుడివైపున నుండి యెడమవైపునకు వ్రాయుదురు. బ్రాహ్మీలిపి నిప్పుడు మనము వ్రాయునట్లే ఎడమవైపుననుండి కుడివైపునకు వ్రాయుదురు. భారత వర్షీయలిపు లన్నియు అశోకునినాఁటి బ్రాహ్మీలిపినుండియే పరిణామము చెందిన వని శాసన పరిశోధకు లందురు.

ఈ విధముగ జగత్తు నంతయు ధర్మమయము గావించుటకు అశోకవర్ధనుఁడు తన రాజ్యాధికారమును, దనయర్థ ప్రాణములను సర్వము వినియోగించి పాటుపడెను. అశోకుని రాజ్యము ధర్మరాజ్య మయ్యెను. అశోకుఁడు ధర్మాశోకుఁ డయ్యెను. సైనికమయిన దిగ్విజయము పవిత్రమైన ధర్మవిజయమునకు దారియొసంగెను.

తన సామ్రాజ్యముననే కాక నేల నాలుగు చెఱఁగుల బుద్ధుని దివ్యసందేశము మారు మ్రోఁగవలె నని, బౌద్ధమతము వ్యాపనము కావలె నని, సర్వలోకములు సుఖింపవలె నని అశోకుఁ డాశించెను. అందులకు మున్ముందు బౌద్ధసంఘమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంస్కరించి, బౌద్ధధర్మమును యథాస్థితిని వెలయఁజేయుట యావశ్యకమయ్యెను; ఏలయన, వైశాలీనగరమున బౌద్ధుల ద్వితీయసంగీతి జరగిననాఁటనుండియు కొన్ని యాచార నియమముల విషయమునను, సూత్రార్థముల విషయమునను బౌద్ధసంఘమున నభిప్రాయభేదములు సంభవించి చీలిక యేర్పడుచుండెను. అశోకుని నాఁటికీచీలిక పెద్దదియై బౌద్ధసంఘము థేరవాదులు (వృద్ధులు), మహాసాంఘికులు (నవీనులు) అని రెండు కక్షలయ్యెను. సాంఘికులలోఁ గలిగిన వివాదములను బరిష్కరించి యుభయ కక్షలవారికి నైకీభావము కలిగించు తలంపుతో అశోకవర్ధనుఁడు మరల నొక బౌద్ధసంగీతిని సమావేశపఱిచెను. మొగ్గలిపుత్త్రుఁడయిన తిష్యుఁడీసంగీతి కధ్యక్షుఁడు. బౌద్ధభిక్షువు లనేకులు పాటలీపుత్త్రమున సమావేశమైరి. బౌద్ధధర్మప్రవచనము కావింపఁబడెను. శిక్షాసూత్రార్థసమన్వయమున థేరవాదులకును మహాసాంఘికులకును ఏకీభావము కుదురలేదు. థేరవాదులు (స్థవిరవాదులు) సంగీతినుండి బహిష్కృతులైరి. అశోకుఁడు మహాసాంఘికపక్షపాతిగ సంశయించి థేరవాదులు మగధ విడిచి కాశ్మీరాద్యుత్తరదేశముల కరిగి, యచ్చట తమమతమును వ్యాపింపఁజేయుచుండిరి. పాటలీపుత్త్రమున సంగీతి తొమ్మిదిమాసములు సాగెను. ఈ తృతీయసంగీతి యనంతరము పాటలీపుత్త్రమునందలి కుక్కుటారామము మహాసాంఘిక నిలయమై, బౌద్ధధర్మపీఠముగ ప్రాముఖ్యము నందెను.

ఈ సంగీతి యనంతరము బౌద్ధమతమును దశదిశలందు వ్యాపింపఁజేయుట కశోకచక్రవర్తి వేఱువేఱు ప్రాంతములకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మతబోధకుల నంపెను. బౌద్ధమతవ్యాపనము విషయమున దేశమున నపూర్వోత్సాహము రేకెత్తెను. అశోకవర్ధన చక్రవర్తి యాదరము నూతగాఁ గొని బౌద్ధభిక్షువు లనేకులు శీతవాతాతపములకుఁ గాని, కష్టపరంపరలకుఁ గాని వెనుదీయక, లోకహితైషులై యపూర్వము, నసదృశమునైన యుత్సాహముతో సాత్వికమూర్తియైన బుద్ధభగవానుని దివ్యబోధామృతమును సంసారార్తులైన లోకుల కందింప దశదిశలకుఁ గొనిపోయిరి. ఈ విధమున బుద్ధుని దివ్యసందేశము చక్రవర్తి యాదరణమున దూరస్థములైన సిరియా, ఈజిప్టు, మాసిడోనియా మొదలగు పశ్చిమ దేశములందును, ఇరుగు పొరుగుల నున్న సింహాళ, చోళ, పాండ్యాది దక్షిణదేశములందును, వాయవ్యదిశను యవన, కాంబోజ దేశములందును, మగధకు దక్షిణమున నున్న ఆంధ్ర, పుళింద, భోజాది జనపదములందును మారుమ్రోఁగెను. అశోకచక్రవర్తి ప్రయత్నములవలనను, పూనికవలనను బౌద్ధము విశ్వమత మయ్యెను.

అశోకవర్ధనునిచే ఆంధ్ర, మహిష (మైసూరు) మండలములకుఁ బంపఁబడిన మతబోధకుఁడు మహాదేవభిక్షువు. ఇతఁడు మగధమహాసాంఘికులకు నాయకుఁడు. అశోకుని కీతఁ డనిన నత్యంత గౌరవము. మహాదేవభిక్షు వాంధ్రదేశమున కరుదెంచి 'చైత్యవాద' మనునొక పంథ నేర్పఱిచెను. ఈ పంథ నవలంబించిన బౌద్ధాంధ్రభిక్షువులకు బౌద్ధవాఙ్మయమున 'చైత్యకు' లనియు, 'చైత్యకనికాయ' మనియు పేర్లు కలవు. కృష్ణానదీతీరస్థమయిన ధాన్యకటకము (అమరావతి) ఈచైత్యకుల ప్రధాన నివాసస్థలము. కాలక్రమమున ధాన్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కటకమున నొకచైత్యము వెలసినది. ఇది ప్రాచీనశాసనము లందు 'మహాచైత్య' మని పేర్కొనఁబడినది.

బింబిసారుని నాఁటనుండి వచ్చుచుండిన మగధరాజకీయవిజృంభణమునకు కళింగవిజయ మాశ్వాసాంత మయ్యెను. మాగధుల క్షాత్రతేజస్సు అశోకునిధర్మవిజిగీషలో మాటు వడి మాసిపోయెను. అశోకునికిఁ బిదప, దేశముపైఁ బడి భరతవర్ష సంపద హరింపఁ బశ్చిమమున తటివేచియుండిన యవనుల విజృంభణము నరికట్ట, ఉడుకు రక్తములేని దేశీయులకు కష్టతర మయ్యెను. అశోకచక్రవర్తి చేసిన ప్రయత్నము ఆధ్యాత్మికముగ దేశీయులకు క్రొత్తయూర్పు పోసినను రాజకీయముగ దౌర్బల్యమునకుఁ గొంత కారణ మయ్యెను.

అయినను అశోకవర్ధనుఁడు మహాచక్రవర్తులలో నొకఁడు. ప్రకృతియం దడఁగియున్న హిందూప్రతిభ కాతఁడు ప్రత్యక్షమూర్తి. అతఁడు మహావీరవతంస మనుటకు కళింగయుద్ధమే తార్కాణము. తద్యుద్ధానంతర మాతఁ డిఁక కత్తి దూయనని ప్రతినవట్టెను. మరల నతఁ డెన్నఁడును కత్తిమీఁదఁ జేయి వైచినది లేదు. అతఁడు ధర్మవ్యాపనమునకై సర్వశక్తులను ధారవోసెను. వృత్తియందు నిష్కపటుఁడు. న్యాయరతుఁడు. శాంతిప్రియుఁడు. తా నవలంబించినది బౌద్ధ మయినను సర్వమత సమత్వ మంగీకరించి, యన్నిమతములను సమానముగ నాదరించి, గౌరవించెను. ఆతని ధర్మానురాగము, శ్రద్ధ, కార్యవ్యగ్రత, పట్టుదల, సంతత ప్రయత్నము — వీని యన్నిటివలన స్థానికముగ విలసిల్లుచుండిన బౌద్ధమతము హిందూదేశమున నలుమూలల వ్యాపించి సర్వజనాదరపాత్ర మగుటయే కాక, విశ్వపరివ్యాప్తమయి, ప్రపంచమునందలి గొప్ప మతములలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొకటిగ పరిఢవిల్లెను. అశోకుని ధర్మకార్యములు రూపటి పోయినను, ఆతని స్సామ్రాజ్యమే విచ్ఛిన్నమయినను, నిరుప మానమయిన స్వార్థరహితమగు నాతని కృషికి ఫలముగ జగ ద్వ్యాప్తమయిన బౌద్ధము మాత్రము అతనికిఁ బిదప వందల కొలఁది సంవత్సరములవఱకు జీవన్మృతమై నిలసిల్లెను. అశోకుని నాఁడు నాటఁబడిన కల్యాణగుణబీజములు హిందూసంఘ మున నేఁటికిని ప్రబలియున్న ధర్మానురక్తికిని, ఆముష్మిక చింతకును, జీవితము పట్లఁగల తత్త్వదృష్టికిని కొంతవఱకు కార ణములు. అశోకుఁడు ప్రపంచమున సాటిలేని మహాచక్రవర్తి. ఎచ్చటనో అరుదుగఁ గాని, అట్టి చక్రవర్తిని గాంచఁగలిగిన మహాభాగ్య మన్నిజాతులకు, నన్ని యుగములకుఁ గలుగదు. అశోకుని ధర్మకార్యములు వందలకొలఁది సంవత్సరములవఱకు విదేశీయులకుఁగూడ నాశ్చర్యమును గలిగించినవి. అశోకుని తరువాతి మహారాజు లెందఱో తమ ధర్మలక్ష్యమున కతని నా దర్శముగఁ జేసికొనిరి. ప్రాచీన భరతవర్షమున కశోకుఁడు ధర్మాపరావతార మయ్యెను.

ధర్మప్రవర్తకుఁడుగ మాత్రమే కాక అశోకుఁడు బహు విధనిర్మాణ కుశలుఁడుగకూడ పేర్కొనఁదగినవాఁడు. అతఁడు దేశమునం దెల్లెడల సంఖ్యాతీతములైన చైత్యములను నిర్మిం చెను. అద్భుత 'వాస్తుకృతు' లగు కీర్తిస్తంభములను బ్రతిష్ఠించెను. కొండలు దొలిపించి గుహలు మలిపించెను. పాటలీపుత్రమున విదేశీయులకుసైత మచ్చెరువు కలిగించు నతి రమ్యమయిన మహాహర్మ్యమును గట్టించెను. చంద్రగుప్తుని నాఁట నారంభమయిన కాఠియవాడయందలి సుదర్శనసరో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వరసేతు నిర్మాణమును అతఁడు పూర్తిచేయించెను. చిరస్మరణీయుఁడుకదా యశోకవర్ధనుఁడు!

అశోకవర్ధనుఁడు ప్రజల యైహిక సౌఖ్యమునకును, ఆత్మోన్నతికిని జేసిన ప్రయత్నములు ప్రజల విజ్ఞానాభివృద్ధికిఁ దోడ్పడినవి. ఉత్సాహముతోఁ బ్రయత్నించినయెడల ఉద్ధతుఁడు మాత్రమే కాక క్షుద్రుఁడును స్వర్గమును పొందఁగలఁడని చాటి అశోకుఁడు ప్రజాసామాన్యమునకు ఆశను, ఉత్సాహమును బోసెను. ప్రజల యాశయములు గొప్పవయ్యెను. ప్రజలదృష్టికి ధర్మము లక్ష్యమయ్యెను. ప్రజల యభిరుచి సంస్కృతిఁ గాంచినది. అశోకుని నాఁటి ప్రజాసంస్కృతి ప్రశస్త కళారూపమున వ్యక్తమయినది.

## మౌర్యకళ

అశోకవర్ధనుని నాఁటి కళను ముఖ్యముగ మూఁడు విధముల విభజింపవచ్చును: (౧) స్తూపములు (౨) స్తంభములు (౩) గుహలు.

స్తూప మనఁగా ఇటుకతోఁ గాని, రాతితోఁ గాని కట్టిన అర్ధగోళాకారమగు సమాధివంటి గట్టి నిర్మాణము. స్తూపములందు ఎముకలు మొదలగు బుద్ధుని శరీరావశేషములను కాని, భిక్షాపాత్ర మొదలగు నా మహనీయుని స్మారకవస్తువులను గాని భద్రపఱుచుట వాడుక. సాధారణముగ చైత్య మనునిట్టి స్మారకనిర్మాణమునకే స్తూప మనుపేరు రూఢియైనది. స్తూపములను బుద్ధునికే కాక గొప్ప బౌద్ధ భిక్షువులకును, చక్రవర్తులకునుగూడఁ గట్టువారు. రాను రాను బుద్ధుని జీవితముతో సంబంధముగల పవిత్ర స్థలములందును: వట్టి స్మారకచిహ్నము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లుగ స్తూపములు వెలసినవి. భారతీయ శిల్పకళ స్తూపము తోనే యారంభ మగుచున్నది. సాధారణముగ స్తూపములలో అడు గెత్తు, అడుగు వ్యాసము (Diameter) గల చిన్న నిర్మాణములు మొదలు అంత కేఁబది రెట్లు, నూఱు రెట్లు పెద్దవియగు నిర్మాణములవఱకుఁ గలవు. అశోకుని కాలమున బుద్ధుని మహా పరి నిర్వాణమునకు స్తూపము సంకేతమై బౌద్ధసంఘమున కది యారాధ్య మయినది. బుద్ధుని జననమునకు పద్మమును, బుద్ధుని పరమ జ్ఞానప్రబోధమునకు బోధివృక్షమును, మృగదావమున మొట్టమొదటిమాఱు బుద్ధుఁడు కావించిన ధర్మబోధకు ధర్మచక్రమును సంకేతములై, బౌద్ధకళయందు నాయావిషయములను తెలియఁజేయుట కివి చిహ్నితము లగుచుండెను. నిర్వాణానంతరము బుద్ధుని శరీరావశేషము లెనిమిది స్తూపముల భద్రపఱుపఁబడినవి. తరువాతి కాలపు గాథల ననుసరించి అశోకుఁడు వానిలో నేడు స్తూపములను తెఱపించి, ధాతువులను దీయించి, వానిని ౮౪,౦౦౦ ల భాగములుచేసి, అన్నిటిమీఁద దేశమునందలి వేర్వేరు భాగముల నన్ని స్తూపములను గట్టించినట్లు తెలియుచున్నది. ఇన్ని స్తూపములను నిర్మించుట యతిశయోక్తియని త్రోసివేసినను, తరువాతి కాలమున హిందూదేశమునకు వచ్చిన చీనా బౌద్ధయాత్రికులు తాము చూచిన పెక్కు స్తూపములు అశోకుఁడు కట్టించినవని ప్రతీతి యుండినట్లు వ్రాసియుండుటచేత, అతఁడన్ని కాకపోయినను పెక్కింటిని గట్టించి యుండుననుట నిస్సంశయము. కాని నేడు అశోకుఁడు కట్టించినదని నిశ్చయ జ్ఞానముతోఁ జెప్పఁదగిన స్తూపమొకటియు లేదు. కాల మన్నిటిని వినాశము కావించినది. ఇప్పుడు మనకుఁ దెలియవచ్చిన స్తూపములలో సాంచీ, భార్హూత్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



సాంచి స్తూపము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తూపములు కడు ప్రాచీనములు. వీనిలో సాంచీ స్తూపము నశోకుఁడు నిర్మించియుండునని చరిత్రకారులు విశ్వసింతురు. సరిగా అశోకుని నాఁటిది కాకపోయినను మన అమరావతీ స్తూపము* (ధాన్యకటక చైత్యము) కూడ మౌర్యచక్రవర్తుల కాలమునాఁటి దగును. సాంచీ స్తూపమున కొంచె మించుమిం చుగ అర్ధగోళాకారమగు నండ (Dome) నిర్మాణమును, దిగువ దానిని చుట్టి యున్నతమైన వేదికయుఁ గలవు. ఈ యున్నత వేదిక ప్రాచీనకాలమున బౌద్ధుల ప్రదక్షిణవీథిగ నమరినది. ఈ వేదికపై కెక్కుటకు దక్షిణదిశను సోపానము లుండెను. నేలమట్టమున దీనిచుట్టును గల వేఱొక ప్రదక్షిణవీథి నావరించియుండు శిలాప్రాకారమును, ప్రాకారము నాలుగువైపుల అద్భుతచిత్ర కళాసంశోభితములైన తోరణములును అశోకునికిఁ దరువాతి కాలమున వచ్చిన చేర్పులు. ఆరంభదశలో అసంస్కృతముగ నుండిన స్తూపము కాలక్రమమున కళాకుశలుల సిద్ధహస్తము లందు అత్యంతమనోహరములును, మధురములునైన తీర్పు తీరువలను బొంది అద్భుత చిత్రకళాధామ మయ్యెను.

అశోకుఁడు ప్రతిష్ఠించిన కీర్తిస్తంభము లెన్ని యుండెనో కాని కాలముయొక్క రాటుపోటుల కాఁగి యిప్పటికి మనకుఁ దెలియవచ్చినవి మాత్రము చాలకొలఁది. అయినను ఇవి నాఁటి శిల్పులు స్తూపరచనమునందుకంటె నీ కీర్తిస్తంభ రచనమునందే గడితేఱినవారని చాటుచున్నవి. ధ్వజస్తంభము

---

* ఈ స్తూపపురాఁతిమీఁద మౌర్యలిపితో శాసనము లుండుట, బౌద్ధ మతబోధకై యాంధ్రజనపదమున కశోకప్రేషితుఁడై వచ్చిన మహాదేవ భిక్షువు స్థాపించిన చైత్యకసంఘకు అమరావతీమహాచైత్యము ప్రధానా వాసమగుట పై యూహకు పోషకములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుకరించు నీ స్తంభరచనమున శిల్పకళ జంతురూపమున వ్యక్తమయినది. ప్రతిస్తంభమును పాదమని (Shaft), చూళిక



సారనాథ్ స్తంభచూళిక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(Capital) అనఁగా స్తంభాగ్రభాగమని రెండు భాగములుగ విభజింపవచ్చును. చిత్ర మేమన, పాదభాగ మంతయు నును పులు దేఱునట్లు మలిచి మెఱుఁగు పెట్టిన యొక పేరాయి. లౌరియా నందంగఢమునందలి స్తంభ మున్నవానిలో అతిమనో హరమైనది. ఇందలి పాదభాగము ముప్పది రెండడుగులకు మించి యున్నది. పాదమువలెనే చూళికయు నేకాండపుఱాయియే. ఈ జాతిని జీవకళ యుట్టిపడునట్లు విలాసవంతములును, మనో హరములునగు జంతుచిత్రములుగఁ దీర్చినారు. రాంపుర్వ, సంకిస స్తంభములమీఁది సింహ, గజచూళికలు చక్కని కృతులు. చూళిక లన్నిటిలో సార్నాథ్ (సారంగనాథము) స్తంభచూళిక కడు ప్రశస్తమును, ప్రభావంతము నయినది. హిందూదేశమునఁ గానవచ్చిన శిల్పకృతు లన్నిటిలో నిది సురుచిరమని, మనోహరమని చెప్పుదురు. ఈ చూళిక దిగువభాగము బోరఁగిలఁబెట్టిన తామరపువ్వు ఆకృతి నున్నది. దీనిని కొందఱు ఘంటాకృతి యందురు. పుష్పాకారభాగముమీఁద నొక దిమ్మె కలదు. దీనిచుట్టు, నడుమ నడుమ చక్రములతో, సింహము ఏనుఁగు గుఱ్ఱము వృషభము చెక్కఁబడినవి. దిమ్మెమీఁద కడు గంభీరములును, తేజస్వంతములునయిన వెన్నులు కలసిన నాలుగు సింహములు కలవు. వీనినడుమ ధర్మచక్ర చిహ్నము—పెద్ద శిలాచక్రము కలదు. ఇదివఱలో నుడివి నట్లు ఈ చూళికయంతయు ఒకటే ఏకాండపుఱాయి. ఇట్టి యేకాండపురాలను దీసికొనివచ్చి, అంత చక్కఁగ మలిసించి ప్రతిష్ఠించుటచూడ అశోకుని కాలమునాఁటి వాస్తుకళాకుశలులగు శిల్పులు ఏకాలమునఁ గాని, యే దేశమునఁ గాని యున్నవారి కంటె నేర్పరితనమునను, ఉపాయమునను తీసిపోవువారు కార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియు, ఇంతటి చక్కని శిల్పకృతులను మించినట్టి కాని, తుదకు వానికి దీటువచ్చునట్టి కాని ప్రాచీనజంతుచిత్రముల కుదాహరణము లేదేశముననైనఁ గానవచ్చుట కష్టమనియు కళాతత్త్వవిదుల యభిప్రాయము.



లోమశఋషిగుహ ముఖభాగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుహాలయములు నిర్మించుట కారంభించిన మొదటిచక్రవర్తి యశోకుఁడు. ఇతఁడు గయసమీపమున నున్న బారాబర్ కొండలలోని 'లోమశఋషి గుహ'ను నిర్మించి ఆజీవికయతులకు దానముచేసెను. ఈ గుహాలయముఖము గోడకొనభాగము (Frieze) చక్కని యేనుఁగు చిత్రములతో శోభిల్లుచున్నది. చూచినంతనే యీ చిత్రపుఁబని కఱ్ఱపని ననుసరించి చేసినట్లు స్పష్టమగును. దీని ననుసరించి యంతకు పూర్వపు నిర్మాణములకు కళానిష్ణాతలు దారువునే సాధనముగఁ గైకొనుచుండి రనియు, రీతి విభూతులు చెడకుండ ఆ కళనే అంతటి విన్నాణముతోను శిలమీఁదికి దింపుచుండి రనియు కళాకోవిదుల మతము. బౌద్ధమతము దేశమున సాంద్రముగ నల్లుకొనిన అశోకానంతరకాలమున భిక్షువులు, యతులు మొదలగువారు వర్షాకాలము నాలుగు నెలలు (చాతుర్మాస్యము) అధ్యయనాదుల గడపుటకు ఇట్టి గుహాలయములను నిర్మించి వారికి దానముచేయుట యాచారమయ్యెను. పర్వతగుహాలయములు లోపలి భాగమున అద్దమువలె నునుపుగను, శోభాయమానములుగను ఉండి, నాటి కర్మకరుల నేర్పును, నేర్పును, అనంతపరిశ్రమాభిరతిని విశదము చేయుచున్నవి.

ఆకాలపు వాసగృహములను గుఱించి తెలిసికొనుట కిప్పటికిని నిలిచియున్న యుదాహరణము లేవియు లేవు. కాని వైశ్వర్య మొలుకుచు అవి నేత్రపర్వ మొనరించుచుండెనని మెగాస్థనీసును; చీనాయాత్రికుఁడు ఫాహియానును వ్రాసియున్నారు. అప్పటి కింకను పాటలీపుత్రనగరమధ్యమున నుండిన రాచనగళ్లను, రాజమండపములను అశోకుఁడు దేవతలచేతను, దయ్యములచేతను గట్టించెనని ప్రతీతియని ఫాహి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాను వ్రాసెను; అనఁగా అట్టివి నిర్మించుటకు మనుష్యమాత్రులకు సాధ్యము కాదని ప్రజల యభిప్రాయ మని తేలుచున్నది. ఈవిధమున అశోకుని కాలముననే అంతటి గుణాధిక్యమును బడసిన భారతీయకళ తరువాతి కాలమున నింకను వర్ధిల్లి దేశమున కళాసంపద వెల్లి విరియించెను.

అశోకవర్ధనుఁడు రమారమి నలువది సంవత్సరములు రాజ్య మేలి క్రీ. పూ. ౨౩౨-వ సంవత్సరమున కాలధర్మము నొందెను.

## కడపటి మౌర్యభూపతులు

అశోకుఁ డవలంబించిన రాజనీతి సామ్రాజ్యము నొక్కటిగింపునం దుంచుట కంతగఁ దోడ్పడలేదు. కళింగసంగ్రామానంతరము యుద్ధశిక్షణము విషయమున నశోకుఁ డశ్రద్ధ వహించెను. అంతటి సామ్రాజ్యమును రక్షించుట కావశ్యకమయిన సైన్యముపోషణము విషయమున అలక్ష్యము చూపెను. స్థానికప్రభువులకు స్వతంత్రాధికారము లొసంగుటచేత సామ్రాజ్య ధర్మబంధనములు సడలినవి. దూరస్థ రాష్ట్రములందు ప్రతినిధిపరిపాలనము ప్రజాకంటక మయ్యెను. సామ్రాజ్యము నంతను సమముగా స్వవశమున నుంచుకొనుటకు రాజధాని కేంద్రమున నుండకపోయెను. ఇన్నిటికిని దోడు అశోకునికిఁ బిదప సామ్రాజ్యాధిపత్యము వహించినవారికి అశోకుని సామర్థ్యము కాని, పరాక్రమము కాని, రాజ్యతంత్రనైపుణ్యము కాని లేక పోయినది. ఈ కారణములవలన అశోకునికిఁ బిదప మౌర్య సామ్రాజ్య మెంతోకాలము వర్ధిల్లి యుండలేదు.

అశోకుని యనంతర మతని పుత్రులు సింహాసన మాక్రమించుకొనుట కొండొరులపై కత్తి దూసినట్లు కనఁబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తత్ఫలముగ సామ్రాజ్యమున వేర్వేఱు భాగములకు కాశ్మీరము, ఉజ్జయిని, పాటలీపుత్రము స్వతంత్రరాజధాను లయ్యెను. అశోకుని యనంతరము దశరథుఁడు, సంప్రతి మొదలగు నతని సంతతివారు కొందఱు రాజ్య మేలిరి. వీరిలోఁ గొందఱు బౌద్ధమతమును, మఱికొందఱు జైనమును, వేఱొకకొందఱు వైదికమతమును పోషించిరి. వీరిలో సంప్రతి గొప్ప జైనమతాభిమానియై ఆంధ్రము మొదలగుదేశములందు జైనమతమును వ్యాపింపఁజేసెను. మగధ నేలిన యీ కడపటి రాజుల దౌర్బల్యమువలన అశోకమరణానంతర మనతికాలముననే కళింగము స్వతంత్రరాజ్య మయ్యెను. ఆంధ్రులు స్వతంత్రులైరి. సింధునదికిఁ బశ్చిమమున నున్న రాజ్యములు స్థానికనాయకులక్రింద స్వాతంత్ర్యమును బడసినవి. ఈ విధమున పతనము నొందుచుండిన మౌర్యసామ్రాజ్యమును విదేశీయులగు యవనుల దండయాత్రలు మఱింత శీఘ్రగతిని భగ్న మొనర్చినవి. అశోకుని కేడవతరమువాఁడగు బృహద్రథుఁడు మగధసింహాసనము నధిష్ఠించిన కడపటి మౌర్యభూవల్లభుఁడు. ఈతనికాలమున యవనులు హిందూదేశముపై నెత్తివచ్చిరి. పుష్యమిత్రుఁడు బృహద్రథుని సైన్యాధిపతి. దేశమంతయు రాజకీయముగ సంక్షోభము చెందియున్న తఱి అదియే తగినయదనని పుష్యమిత్రుఁడు కుట్రలు పన్ని, తన ప్రభువగు బృహద్రథుఁడు సైన్యములను బరిశీలించుచుండ ఆతనిని సంహరించెను. ఈవిధమున మౌర్యవంశము, రమారమి నూటముప్పదియేడు సంవత్సరముల పరిపాలనముననంతరము, క్రీ. పూ. ౧౮౪-వ సంవత్సర ప్రాంతమున తుదముట్టెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## దక్షిణాపథ రాజ్యములు

మౌర్య సామ్రాజ్యము భగ్నమగు నాఁటికి దక్కను దేశము నాక్రమించినవారిలో నూతన స్వాతంత్ర్య లబ్ధప్రతిష్ఠు లయిన ఆంధ్ర, కళింగ దేశీయులు ముఖ్యులు. శ్రీముఖుఁడు ఆంధ్రరాజ్య సంస్థాపకుఁడు. శిలాశాసనములందు వీరు సాత వాహనులనుపేర వ్యవహరింపఁబడుచున్నారు. వీరినే శాలివాహ నులందురు. శ్రీముఖుని యనంతరము కృష్ణుఁడు, మల్లశాతకర్ణి మొదలగువారు అనేకులు జగద్ధితముగ రాజ్యమును పాలించి కీర్తిఁ గాంచిరి.

ఆంధ్రులతోపాటు రాష్ట్రికులు, భోజులు మొదలగు వారుకూడ దక్కను నివాసులే యైనను వారిని గుఱించి మన కేమియుఁ దెలియదు.

మౌర్యపతాకచ్ఛాయనుండి విడిపోయిన మఱియొక దక్కను రాజ్యము కళింగము. స్వతంత్రరాజ్య మయిన కళింగ మున కధిపతిగఁ దెలియవచ్చినవాఁడు మహామేఘవాహన ఖారవేలుఁడు*: చేతి రాజవంశ వర్ధనుఁడు. ఈవంశమునందలి ప్రభువులలో నీతఁడు తృతీయుఁడు. మొదటి యిరువురను గుఱించి యేమియుఁ దెలియదు. ఖారవేలుఁడు పదునైదేండ్లు వచ్చు వఱకు విద్యావినోదములఁ గడపి, పిదప తొమ్మిది సంవత్సర ములు యౌవరాజ్యమును శాసించి, తన యిరువదినాలుగవ యేట కళింగరాజ్యమున కభిషిక్తుఁ డయ్యెను. ఈతఁడు జైన

* ఖారవేలుని రాజ్యకాల విశేషములను దెలుపు నొక ప్రాకృత భాషాశాసనము ఒరిస్సా, పూరీ జిల్లాయందలి భువనేశ్వరమునకు మూఁడు మైళ్లదూరమున నున్న యుదయగిరికొండ గుహలయందు కలదు. 'హాథీ గుంఫా' శాసన మని దీనికిఁ బేరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మతావలంబకుఁడు: మహాపరాక్రమశాలి. రాజ్యమునకు వచ్చిన రెండవయేటనే ఆంధ్రభూపతిని లక్ష్యముచేయక రథగజాశ్వపదాతిబహుళమైన సేనను పశ్చిమమున కంపెను; నాలుగవయేట సర్వరాష్ట్రిక, భోజకపతులను నిర్జించెను. ఈతఁడు రెండు మూఁడు తడవలు ఉత్తరదేశములపై దండెత్తి వెళ్లి తద్రాజన్యులను సాధించెను. పుష్యమిత్రు నోడించి, మగధప్రజలకు భీతిఁగొలిపి మగధరత్నసంపదలనేకాక నందరాజాపహృతమైన కళింగజినవిగ్రహమునుకూడ మరల స్వదేశమునకుఁ గొనివచ్చెను. పాండ్యభూవల్లభునివలన



ఉదయగిరి కొండయందు ఖారవేలుఁడు తొలిపించిన జైనగుహావిహారము—ముఖభాగము

విస్తారమేనుఁగులను, గుఱ్ఱములను, మణులను, రత్నములను, ఓడలను కానుకలుగఁ బడసెను. అట్టిది కళింగాధిపతియైన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖారవేలుని శౌర్యసంపద. ఇతఁ డుదయగిరి కొండలలో జైన యతీంద్రుల యావాసమునకై చక్కని గుహావిహారములను నిర్మించి, వారివలననుండి జైనధర్మమును దెలిసికొని జైన మతము నాదరించి పోషించెను.

దక్కనుకు దక్షిణమున నుండిన రాజ్యములు అశోక వర్ధనుని పరిపాలనముక్రిందికి వచ్చియుండలేదు. అశోకుని శిలాశాసనములం దుదాహృతులైన చేర, చోళ, పాండ్యులు దక్షిణహిందూదేశమున స్వతంత్రులుగ పాలించుచుండిరి. చేరరాజ్యమున ప్రధానమైన నది పెరియారు. ఈ నదీతీరము ననే రాజధానియైన వంజినగరము కలదు. ఈ రాజ్యమునకు 'ముజిరిస్' ముఖ్యమయిన రేవు. చేరదేశీయు లశోకుని శాసన ములందు కేరళపుత్రులని పేర్కొనఁబడిరి. తిరుచనాపల్లి, తంజావూరుజిల్లా లాక్రమించిన దేశము చోళరాజ్యము. కావేరి యిందలి ప్రధానవాహిని. చోళరాజ్యమునకు ఒరయూరు రాజధాని. కావేరి యుత్తరతటమునఁగల పుహారను కావేరిపట్ట ణము చోళరాజ్యమునకు ముఖ్యమయిన రేవు. మధుర, రామ నాథము, తిరునెల్వేలి జిల్లా లాక్రమించిన దేశము పాండ్య రాజ్యము. తామ్రపర్ణి, వైగైనదు లిందుఁ బ్రవహించు చున్నవి. కొర్కై, మధురానగరములు రాజధానులు. పాండ్యు లుత్తరదేశముననుండి వచ్చినవారనియు, వీరికిని పాండవులకును సంబంధము కలదనియుఁ గొంద అందురు. దక్షిణహిందూదేశ వర్తకము పూర్వమువలెనే ఉత్తరహిందూదేశములోను, పార సీకము అరాబియా ఈజిప్టు గ్రీసు మొదలగు పశ్చిమ దేశ ములతోను, బర్మా మలయాద్వీపకల్పము సయామ్ చీనా మొదలగు ప్రాగ్దేశములతోను, జావా (యవ) సుమత్ర మొద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లగు ప్రాగ్ద్వీపములతోను సాగుచుండెను. బ్రాహ్మణ, బౌద్ధ, జైన సన్యాసులు తమిళదేశమున వ్యాపించుచుండిరి. యవనులు, రోమనులు పాండ్యదేశపు ముత్యములతో వ్యాపారము నడపుచుండిరి.

---

## యవన, శక, పహ్లవులు

మౌర్యసామ్రాజ్యము క్షీణించుచుండినప్పుడు అదను వేచి యవనులు హిందూదేశముపై దాడివెడలివచ్చి, వాయవ్య దిశయందున్న రాజ్యములను కబళింపఁ బ్రయత్నించుచుండిరి. వీరు బాక్ట్రియా దేశీయులు. బాక్ట్రియా యనునది సెల్యూకస్ స్థాపించిన సిరియాసామ్రాజ్యమునందలి ముఖ్యరాష్ట్రములలో నొకటి. ఇది ఆక్సస్‌నది యుత్తరపుసరిహద్దుగాఁ గల యిప్పటి ఉత్తర అఫ్గానిస్థాన మనవచ్చును. ఇదియే ప్రాచీన బాహ్లికదేశ మని కొంద ఱందురు. అలెగ్జాండరు విజయానంతరము సభ్యతకును, సంస్కృతికిని బేరొందిన యవను లనేకులు ఈ దేశమున స్థిరనివాసముల నేర్పఱుచుకొనిరి.

క్రీ. పూ. ౨౫౦వ సంవత్సరము ప్రాంతమున యవన ప్రతినిధియగు డయొడోటస్‌నాయకత్వముక్రింద బాక్ట్రియా సెల్యూకస్‌వంశజులపైఁ దిరుగఁబాటు సలిపి, స్వతంత్ర రాజ్య మయ్యెను. ఈరాజ్యమును డయొడోటస్‌ను, అతని కుమారుఁడును పరిపాలించిన యనంతరము యూథిడిమస్ అను వేఱొకయవనవీరుఁడు విక్రమించి, బాక్ట్రియా సింహాసనము నాక్రమించుకొనెను. ఇతని కుమారుఁడు డెమిట్రియస్ మహాపరాక్రమశాలి. ఈతఁడు హిందూకుష్ పర్వతములకు దక్షిణమునయున్న దేశములను జయించి తన రాజ్యమును విస్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శింపఁజేయు తలంపుతో కాబూలు, పంజాబు, సింధుదేశములపై దండెత్తి వెళ్లి వానిని జయించెను.

హిందూదేశమున నిట్లు డెమిట్రియస్ నూతనరాజ్యములను జయించుచుండినకాలమున బాక్ట్రియారాజ్యమున యూక్రెటైడీస్ అను మఱియొకయవనవీరుఁడు విప్లవము రేపి తుదకారాజ్యము నాక్రమించుకొనెను. స్వరాజ్యమును గోలుపోయిన డెమిట్రియస్ తాను జయించిన హిందూదేశరాజ్యములను కట్టుదిట్టపఱుచుకొని శాకల (పంజాబునందలి సయాల్కోట) రాజధానిగ పరిపాలనము నెఱపెను. బాక్ట్రియాను స్వాధీనపఱుచుకొనుటతో తృప్తినొందక యూక్రెటైడీస్ కాబూలుప్రాంతముపై దండెత్తివచ్చి డెమిట్రియస్ హిందూదేశరాజ్యమయిన గాంధారమున (ప్రకృతపు రావల్పిండి, పెషావరు జిల్లాలు) కొంతభాగమునుగూడ జయించి లోఁబఱుచుకొనెను.

ఇంతటినుండి హిందూదేశము వాయవ్యదిశయందు డెమిట్రియస్, యూక్రెటైడీస్ వంశజులవి యవన రాజ్యములు రెండు — ఒకటి తూర్పు పంజాబునందును, మఱియొకటి దిగువ అఫ్గానిస్థానమునందును ఏర్పడినవి. డెమిట్రియస్ వంశము వారి రాజ్యమున శాకలయు, యూక్రెటైడీస్ వంశమువారి రాజ్యమున కపిశ, తక్షశిల, పుష్కరావతులును ముఖ్యనగరములుగ నుండెను.

డెమిట్రియస్ పిదప హిందూదేశయవనాధిపతులలోఁ ప్రసిద్ధుఁడు మినాండరు. ఈతని నాణెము లుత్తరహిందూస్థానమున అసంఖ్యాకములుగ దొరకినవి. ఈతఁడు పశ్చిమమున కాబూలువఱకును, తూర్పున యమునానదీతీరస్థమయిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మథురానగరముపఱకును జయించెను. శాకల యీతని రాజధాని. ఇతఁడు ధర్మము తప్పక న్యాయముగ ప్రజలను బాలించెనని ప్రతీతి కలదు. 'మిళిందపన్హో' (మిళిందప్రశ్న) యను పాలీ బౌద్ధ వేదాంతగ్రంథమునఁ బేర్కొనఁబడిన మిళిందుఁడితఁడే యని చరిత్రకారులు గుర్తించినారు. స్థవిరుఁడయిన నాగసేనుఁడను బౌద్ధాచార్యుఁ డీతనికి సమకాలికుఁడు. ఈతని బోధలవలన మిళిందుఁడు బౌద్ధమతము నవలంబించెనని చెప్పుదురు.

డెమిట్రియస్, మినాండరుల పరాక్రమమువలన మాళవ, సౌరాష్ట్ర, భరుకచ్ఛములుకూడ యవనరాజ్యము లయ్యెను.

మనకుఁ దెలియవచ్చు కడపటి యవన భూపతి తక్షశిలాధిపతియగు అంతియల్కిదస్. ఇతఁడు హీలియోదోరస్ అనువానిని విదిశాధిపతియు, శుంగవంశజుఁడునైన కాశీపుత్ర భాగభద్రునియొద్దకు దూతగ నంపెను. ఈ దూత జాతికి యవనుఁ డయినను మతమునకు భాగవతుఁడయి (వైష్ణవుఁడయి) వాసుదేవప్రీత్యర్థము గ్వాలియరు సంస్థానమునందలి 'బీస్నగర్'నందు ఒక గరుడధ్వజమును బ్రతిష్ఠించి దానిమీఁద నొక శాసనమును జెక్కించెను. నాఁటికె ప్రజలందు వాసుదేవ మతరూపమున భక్తిమార్గ మేర్పడుచుండె ననుట కీ శాసనమే ప్రమాణము. క్రమక్రమముగ భారతభూమిని యవనులు హిందూత్వము నాదరించి, హిందువులమతముల నవలంబించుచుండిరని మినాండరు, హీలియోదోరస్‌ల యుదాహరణముల వలన విశద మగుచున్నది.

దేశాంతరాగతులైన శకు లనఁబడు నొక తెగవారు గుంపులు గుంపులుగ వచ్చి బాక్ట్రియా దేశమునఁ జొరఁబడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాని నాక్రమించుకొనిన పిదప యూక్రటైడీస్ వంశజు లచట నిలువనీడఁ గానక తమ ప్రాగ్దేశరాజ్యములందు తల దాఁచుకొనిరి. హిందూదేశమునకును పారసీకమునకును నడుమ నున్న దేశమును శకులు తమ స్థిరనివాసభూమిగఁ జేసికొనుటవలన నా ప్రదేశమునకు 'శకస్థానము' (ప్రకృతపు 'సెయిస్థాన్') అని పేరు కలిగెను. కొంతకాలమునకుఁ బిదప బాక్ట్రియాయవనులవలెనే శకులుకూడ తమ దృష్టిని హిందూదేశముపై బఱపి తక్షశిల, పంజాబు, సింధుదేశములపై దండెత్తి వచ్చిరి. కట్ట తెగిన ప్రవాహమువలె వచ్చుచుండిన యీ శకవాహిని ధాటికాఁగలేక పూర్వోక్తములైన హిందూదేశ యవనరాజ్యములు నామరూపములు లేక యంతరించినవి.

యవనులు పంజాబు ప్రాంతములందు రమారమి రెండు శతాబ్దులకాలము పరిపాలించినను వారి ప్రభావము హిందూదేశ సభ్యతమీఁదఁ గాని, సంస్థలమీఁదఁ గాని ముద్రితము కాలేదు. వారి పరిపాలనమునకు చిహ్నములుగ నిలిచినవి వారి రాగి, వెండి, బంగారు నాణెములు మాత్రమే. దాదాపుగ నీ హిందూదేశయవన భూధవులందఱు వారి నాణెములవలనఁ దెలియవచ్చినవారలే. ఈవిధమున కాలగర్భమున పూడిపోయిన హిందూదేశచారిత్రమునందలి యొక శకలమును త్రవ్వి పైకెత్తుటకు సంపూర్ణముగ నాణెములే సాధనములైనవి.

హిందూదేశ యవనాధిపతులు తమ నాణెములమీఁద గ్రీసుదేశాధిపతుల పద్ధతి ననుసరించి ప్రత్యేక చిహ్నములను, దమ ప్రతిరూపములను ముద్రించుటయే కాక, గ్రీకు పాలీభాషలందుఁ దమ పేరులనుగూడ కొట్టించినారు. ఈ పాలీభాషానామములు కొందఱ నాణెములమీఁద ఖరోష్ఠీలిపియందును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొందఱు నాణెములమీఁద బ్రాహ్మీలిపియందును గలవు. ఈ భాషా ద్వివిధత్వమే ఈ నాణెములవలనఁ దెలియవచ్చు రాజులు యవన, హిందూదేశరాజ్య విభాగములు రెంటిని పరిపాలించి యుండిరని స్పష్టపఱుచుచున్నది.

పైని చెప్పిన శకులనువారు ఇల్లు వాకిలి లేక యూరూరఁ దిరుగుచుండు నొక జాతివారు; జక్సార్టీసునది యుత్తరతట ప్రాంతమున మధ్య ఆసియా ఖండమునందు నివసించుచుండిరి. ఇట్లుండ క్రీ. పూ. ౧౬౦-వ ప్రాంతమున 'యూచీ'లను మఱియొక తెగవారు చీనాదేశముననుండి వచ్చి శకులు నివసించుచుండిన ప్రాంతము నాక్రమించుకొని, వారి నచటనుండి తఱిమివైచిరి. అంతట శకులు దక్షిణ దిశగ వచ్చి, బాక్ట్రియా యవన రాజ్యముమీఁదఁబడి దానిని విధ్వస్తముఁగావించి, పిదపఁ గొంతకాలమునకు పార్థియను సామ్రాజ్యమున పెరిషియా, హిందూదేశములకు నడుమనున్న హెల్మండులోయప్రదేశమున స్థిర నివాసములను గుదుర్చుకొనిరి. ఈ కారణమున నా ప్రాంతమునకు 'శకస్థానము' (సెయిస్థాౝ) అని పేరు కలిగెను. పార్థియనులు వీరితోఁ బోరాడి వీరి నచటనుండి వెడలఁగొట్టుటకుఁ జాల ప్రయత్నించిరి. కాని సంపూర్ణముగ కృతార్థులు కాలేకపోయిరి. ఈ శకులలోఁ గొందఱు హిందూదేశముపయి దాడివెడలి పంజాబు, సింధు దేశముల నాక్రమించుకొని, అందందు రాజ్యములను స్థాపించి, క్షత్రపులను పేర పరిపాలనము నెఱపిరి. 'క్షత్రప' పదము పార్థియను బిరుదముగుటవలన వీరు పార్థియా సామ్రాట్టులకు ప్రతినిధులని చరిత్రకారు లూహింతురు. ఒకవేళ వీరు నామ మాత్రముగ ప్రతినిధులుగనే యుండినను స్వతంత్రులుగనే రాజ్య మేలినట్లు కన్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ట్టును. ఇదివఱలో నుడివినట్లు వీరి ధాటికాగలేకయే హిందూ యవన రాజ్యములు మణిగిపోయినవి.

క్రీస్తుశకారంభకాలముననే యుత్తర హిందూస్థానమున శక రాజ్యములు వెలసినవి. శకులలోఁ గొందఱు తక్షశిల రాజధానిగ తత్ప్రాంతమును, మఱికొందఱు మథుర రాజధానిగ దానిచుట్టుపట్లనుండు దేశమును పరిపాలించిరి. హిందూ దేశ చారిత్రమున నీ రాజ్యముల నేలినవారిని ఉత్తర క్షత్రపు లందురు. కాలాంతరమున శకులలోఁ గొందఱు పశ్చిమ హిందూదేశమున కాఠయవాడ (సురాష్ట్రము) మొదలు మాళవమునందలి యుజ్జయినీ నగరమువఱకుఁగల దేశమును సాధించి యచ్చటఁ దమ రాజ్యములను నెలకొల్పిరి. హిందూ దేశ చారిత్రమున వీరు పశ్చిమ క్షత్రపులని పేర్వడిరి. వీరికి నాసిక, ఉజ్జయినీ నగరములు రాజధానులుగ నుండినవి. శాసనముల వలనను, నాణెములవలనను ఉత్తర క్షత్రపుల పేర్లు కొన్ని తెలియవచ్చినను వారి రాజ్యకాలము, పరస్పర సంబంధము మొదలగు విశేషము లేవియుఁ దెలియకపోవుటచేత వారి చరిత్ర మింకను సుబోధము కాకయున్నది. శకులకుఁ బిదపఁ గొంత కాలమున కుత్తర హిందూదేశమును సాధించిన 'యూచీ'ల యందలి 'కుషాణు' లనెడియొక తెగవారి విజృంభణమువలన ఉత్తర క్షత్రప రాజ్యములు చితికిపోయినవి. పశ్చిమ క్షత్రపులలో రాజ్యమేలిన వారు ఇరువది మందికి పైని కలరు. వీరు రమారమి మూఁడు శతాబ్దుల కాలము తమ రాజ్యాధికారమును నిలుపుకొని, తుదకు క్రీస్తు శకము నాలుగవ శతాబ్దియం దుత్తర హిందూ స్థానమున మహాసామ్రాజ్యమును స్థాపించిన గుప్తవంశజులతోఁడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోరాటమునఁ దమ రాజ్యమును గోలుపోయిరి. ఆంధ్రవంశ్యు లయిన శాతవాహనుల చరిత్రమును జదువునప్పుడు వీరిని గుఱించి యింతకంటె నెక్కువగఁ దెలియఁగలదు.

పూర్వోక్తములయిన యవన, శకజాతులతోపాటు మన పురాణములందు పేర్కొనఁబడినవారు పహ్లావులు. పార్థియా దేశమునందలివారగుటవలన వీరికి పార్థియను లనియు నామాంతరము కలదు. కాస్పియను సముద్రమున కాగ్నేయదిశయందున్న పర్వత దేశమునకు పార్థియాయని పేరు. ఇది సెల్యూకస్ సామ్రాజ్యమునందలి దేశములలో నొకటి. డయొడోటస్ బాక్ట్రియా యవన రాజ్యమును స్థాపించిన కాలముననే క్రీ. పూ. ౨౪౮ ప్రాంతమున అర్సకీస్ అను నతఁడు అపుడు ప్రభుత్వము నెరపుచుండిన సెల్యూకస్ వంశజులపయి తిరుగఁబాటు సలిపి స్వతంత్ర రాజ్యమును స్థాపించెను. సెల్యూకస్ సామ్రాజ్యముయొక్క అంతిమ దశయం దీరాజ్యము పురికొని క్రమముగా బలపడి ప్రాముఖ్యము గడించెను. పార్థియా నేలిన ప్రభువులలో మొదటి మిత్రదతీస్ (మిత్రదత్తుఁడు) చాల గొప్పవాఁడు. ఇతని కాలముననే (క్రీ. పూ. ౧౭౦—౧౩౮) పార్థియా రాజ్యము నలువైపుల వ్యాప్తిఁగాంచినది. ఇతఁడు సింధునదికిఁ బశ్చిమమునఁగల రాజ్యములను జయించి తన సామ్రాజ్యమునఁ గలుపుకొనుటయేకాక సింధు, జీలము నదులకు నడుమ నివసించుచుండిన జాతులనుగూడ సాధించినట్లు చెప్పుదురు. ఇతని కాలముననే శకు లుత్తర దేశమునుండి మహానదీ ప్రవాహమువలె వచ్చి పార్థియా రాజ్యమునఁ బ్రవేశించి బహు సంక్షోభము కావించిరి. మొదటి మిత్రదతీస్ ప్రభువును, అతని తరువాత రాజ్యభారమును వహించిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారును ఈశకవిప్లవము నడఁచుటకు మహా ప్రయత్నములు కావించి, తుదకు కొంతకాలమునకుఁ బిదప నీ మహా వాహిని నరికట్టుటలో సఫలులయిరి. అనంతరము పార్థియనులనఁబడు నీ పహ్లావులకును, శకులకును కాలక్రమమున వైరానలము చల్లారినది; సన్నిహిత సంబంధమును, అన్యోన్యతయు హెచ్చినది. హిందూదేశమున కరుదెంచిన శకులును, పహ్లావులును ఒండొరులతోఁ గలసిపోవుటచేతను, శక, పహ్లావ నామము లొక్కరీతి నుండుటచేతను హిందూదేశపు సరిహద్దులందు రాజ్యముచేసిన పహ్లావరాజు లెవరో, శకరాజు లెవరో వేర్పఱిచి చెప్పుటకుకూడ వీలుకాక యున్నది. మొదటి మిత్రదత్తీస్ విజయము కారణముగ హిందూదేశము వాయవ్యదిశయందును, పంజాబు సింధు దేశములందును పహ్లావరాజ్యములు కొన్ని యేర్పడినను తత్పరిపాలకులను గుఱించికాని, రాజ్యకాలమును గుఱించికాని చక్కఁగ తెలియరాక పోవుటవలన హిందూదేశపు పహ్లావరాజుల యనుస్యూత చారిత్ర మింకను అజ్ఞాత యుగముగనే యున్నది. హిందూదేశమున రాజ్యమేలిన యీ పార్థియారాజులలో క్రీస్తు శకము మొదటి శతాబ్దియం దుండినగాండ్రోఫెర్నీస్ అనువతఁడు సుప్రసిద్ధుఁడు. ఇతని కాలమున అపొస్తలులలో నొకఁడయిన థామస్ అను క్రైస్తవాచార్యుఁడు అతని యాస్థానమున కరుదెంచి అతనికిని, అతని కుటుంబమునకును మతమిచ్చి క్రైస్తవులను గావించినట్లు క్రైస్తవ గాథలు తెలుపుచున్నవి. 'కుషాను' లనువారి దండయాత్రలలో అప్పటికిఁ గొన యూపిరితోనుండిన హిందూదేశమునందలి యీ పార్థియను రాజ్యములు నలిగిపోయి యంతరించినవి. తరువాతి కాలమున హిందూదేశమునకు వచ్చిన యవన, శక,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పహ్లావులు హిందువుల మతాచారముల నవలంబించి, కడకు హిందూ సంఘమునఁ గలసిపోయిరి.

క్రీస్తునకు పూర్వమునను, పరమునను గల యొకటి రెండు శతాబ్దులలో హిందూదేశ వాయవ్యప్రదేశ మీరీతిని విదేశీయ వాహినుల త్రొక్కుడువలన రొంపిమైపోయినది. వాయవ్యదిశయందలి పర్వతపు కనుమలు విదేశీయుల హిందూదేశాగమనమునకు రాజమార్గములయి, హిందూరాజ్య విభవము నాహరించుటకు త్రోవ చూపినవి. నిరంతర దండయాత్రలవలనను, యుద్ధములవలనను పంజాబు, సింధు దేశములందు విదేశీయులు గొప్పరాజ్యమును వెలయింపఁజాలకపోయిరి. విదేశీయ రాజ్యములయినను ఇసుకనేలను గట్టిన మట్టికోటలవలె ఒక్కటియు స్థిరముగ నుండక త్వరలోనే శిథిలములగుచు వచ్చినవి. సైనికమైన విజయమే లక్ష్యముగాఁ గలిగినవారగుటవలన యవన, శక, పహ్లావులు యవన సంస్కృతియందును, సభ్యతయందును మెఱుఁగెక్కిన వారలేయైనను వారి వలన హిందూసంఘ, విద్యాదికములయందు గుర్తింపఁదగినంత మార్పేదియుఁ గలుగలేదు. వారి చారిత్రము చాలవఱకు వారి నాణెములవలననే బహిర్గతమయినది. వారి పరిపాలనమునకు హిందూదేశమున చిహ్నములుగ నిలిచిపోయినవి ఒక్క యీ నాణెములే. ఇవి యవన, రోమక నాణకరీతుల ననుసరించి సుందరములుగ నుండుటవలన దేశీయములగు నాణెములందుఁ గొంతమార్పు తెచ్చిపెట్టినవి. అంతవఱకు నుత్తర హిందూస్థానమున వాడుకయందుండిన 'పురాణము'లనెడి నాణెములు అపరిష్కృతములుగ నుండినవి. విదేశీయ నాణెములవలన దేశీయములయిన యీ నాణెములకుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెచ్చిపెట్టినవి. అంతవఱకు నుత్తరహిందూస్థానమున వాడుకయం దుండిన 'పురాణము' లనెడి నాణెములు అపరిష్కృతములుగ నుండినవి. విదేశీయనాణెములవలన దేశీయములయిన యీ నాణెములకుఁగూడ అందచందములు కొంతవఱకు కలవడినవి. వాయవ్యహిందూదేశము యవన సంస్కృతిని, యవన కళారీతులను జీర్ణించుకొని భారతీయశిల్పకళా విన్యాసమున 'గాంధారకళ' యను పేరఁ గాలాంతరమునఁ బ్రసిద్ధమయిన యొక నూతన రీతిని వెలయించినది.

---

## శుంగ, కాణ్వవంశములు

హిందూదేశ వాయవ్యప్రాంతమును విడిచి మరల నిఁక నొకమాఱు మగధకుఁ బోవుదము. బృహద్రథమౌర్యునివధతో మగధయందు మౌర్యవంశపరిపాలన మంతరించినది. ఆతనిని గడతేర్చిన యతని సైన్యాధిపతి పుష్యమిత్రుఁడు శుంగవంశజుఁడు. బ్రాహ్మణుఁడు. ఈ శుంగవంశ బ్రాహ్మణు లెప్పుడు ఏకారణమున బ్రాహ్మ్యమును విడిచి క్షాత్రము నవలంబించిరో మనకుఁ దెలియరాదు. వీరి పరిపాలనము క్రీ. పూ. ౧౮౪ ప్రాంతమున నారంభమయి క్రీ. పూ. 23. వఱకు సాగినది. మొత్తముమీఁద నీవంశమువారు పదిమంది మగధను నూటపండ్రెండువత్సరములు పాలించిరని పురాణములు వాకొనుచున్నవి.

శుంగవంశ్యులలో మొదటివాఁడయిన పుష్యమిత్రుఁడు మహాపరాక్రమశాలి. కడపటి మౌర్యవంశజుల పరిపాలనము దుర్భరమగుటవలననేమో, ప్రజలు రాచఱికమునఁ గలిగిన యీ మార్పునకు హర్షించి పుష్యమిత్రునికి బాసటయైరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుష్యమిత్రుని కుమారుఁ డగ్నిమిత్రుఁడు తండ్రికి ప్రతినిధిగా తూర్పుమాళవదేశమునందలి విదిశానగరము రాజధానిఁ గావించుకొని మగధ దక్షిణరాజ్యమును పాలించుచుండెను. పుష్యమిత్రుని కాలమున మగధసామ్రాజ్యము పూర్వపు విస్తృతి తక్కఁగిపోయినదనుట నిశ్చయమయినను దాని హద్దులు నిర్ణయించి చెప్పుట కష్టము. అయినను పుష్యమిత్రునిరాజ్యము దక్షిణమున నర్మదవఱకు వ్యాపించియుండె ననుట ధ్రువము. దాని పడుమటి సరిహద్దు తిన్నగా తెలియదు. కాని విదేశీయుల దండయాత్రలవలన సంక్షోభించుచుండిన పంజాబు మగధ సామ్రాజ్యమున నుండి విడిపోయినట్లు నిశ్చయింపఁదగును. పాటలీపుత్రమే మగధకు రాజధానిగ నుండెను.

పుష్యమిత్రుని కాలమున జరిగినవని తెలిసిన విషయములలో ముఖ్యమయినవి రెండు కలవు. అందు మొదట పేర్కొనఁదగినది కళింగాధీశుఁడయిన మహామేఘవాహన ఖార వేలుని దండయాత్ర. ఖారవేలుఁడు రెండు మూఁడు తడవలు మగధరాజ్యముమీఁదికి దండెత్తి వెళ్లి మగధాధిపతి నోడించెను. ఖారవేలునిచేత నోడింపఁబడిన మగధభూవల్లభుఁడు శుంగ వంశ్యుఁడయిన పుష్యమిత్రుఁడే యని పలువురు చరిత్రకారుల యభిప్రాయము. ఇందులకు వ్యతిరేకముగఁ దలంచువారును గొందఱు కలరు. పుష్యమిత్రుని కాలమున నిశ్చయముగ జరిగినట్లు చెప్పఁదగిన రెండవ విషయము యవనదండయాత్ర. వాయవ్యహిందూదేశము యవనులదాడికి కంపిల్లి యలజడి నొందుచుండిన కాలముననే పుష్యమిత్రుఁడు దేశసంరక్షణార్థ మొఱనుండి కత్తిదూసెను. ప్రజారంజకులు కాకపోవుటయే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాక యవనవిధ్వరము సరికట్టుటకు సమర్థులు కాకపోవుట చేతఁగూడఁ గావచ్చు దేశక్షేమము నభిలషించి పుష్యమిత్రుఁడు బృహద్రథుని వధించి తాను మగధరాజ్యమును గైవసముచేసి కొనుట సంభవించినది.

పుష్యమిత్రుని కాలమున యవనులు హిందూకుష్ పర్వతములను దాఁటివచ్చి సింధునదీపరిసరప్రాంతమును, సురాష్ట్రమును, పశ్చిమతీరస్థదేశములను గొన్నిటిని జయించిరి. అంతియ కాక మథురానగరమును, రాజపుత్రస్థానమునందలి మాధ్యమికనగరమును (చిత్తూరి కుత్తరముగ నెనిమిది మైళ్ల దూరమున నున్నది), సాకేతమునుగూడ నాక్రమించుకొని తుదకు మగధరాజధానియైన పాటలీపుత్రముపై దృష్టిఁ బఱపిరి. వెంటనే పుష్యమిత్రుఁడు బలములం గూర్చుకొని యవన సైన్యముల నెదుర్కొని ఘోరసంగ్రామమున వారి నోడించెను. ఈ విధమున పుష్యమిత్రుఁడు మగధను సంరక్షించెను కాని యవన విజితములయిన పశ్చిమరాజ్యములు మాత్రము పుష్యమిత్రునికి స్వాధీనపడలేదు. ఇట్లు పుష్యమిత్రుని కాలమున దండెత్తి వచ్చిన యవన భూధవుఁ డెవఁడను విషయమున చరిత్రకారులలో నభిప్రాయభేదములు కలవు; కొందఱు డెమిట్రియస్ అందురు; మఱికొందఱు మినాండరు (మిళిందుఁడు) అని చెప్పుదురు. వీరిలో నెవరయినను, భూమార్గమున హిందూదేశముపయి దండెత్తివచ్చిన యూరోపియను రాజులలో నీతఁడే కడపటివాఁడు. తరువాతి కాలమున హిందూదేశమునకు వచ్చిన యూరోపియనుదేశీయు లెల్లరు సముద్రము మీఁదుగ వచ్చినవారలే. పుష్యమిత్రుఁడు యవనులను జయిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుచుండిన కాలమున అగ్నిమిత్రుఁడు విదర్భరాజ్యమును జయించి తన జనకునికి సమ్మోదముఁ గూర్చెను.

ఈ విజయములు కలిగిన యనంతరము పుష్యమిత్రుఁడు తన సార్వభౌమత్వము స్థాపించుకొనుటకయి అశ్వమేధయాగమును దలపెట్టెను. సవనాశ్వము వెంట పుష్యమిత్రుని మనుమఁడును, అగ్నిమిత్రుని కుమారుఁడును అగు వసుమిత్రుఁడు అశ్వసంరక్షణార్థము వెడలి, మధ్యేమార్గమున అశ్వమును బాధించి తన్నెదిరించిన యవనాదిభూధవులను జయించి, దానిని విడిపించి, నిర్ణీతకాలమున కశ్వముతో పాటలీపుత్రమునకుఁ జేరుకొనెను. అనంతరము యాగము యథావిధిగ నిర్వర్తింపఁబడినది. చారిత్రకకాలమున వైదికక్రతునయిన యశ్వమేధము నొనరించినవారిలో పుష్యమిత్రుఁడే ప్రథముఁడు. జంతుహింస కూడదని మౌర్య చక్రవర్తియయిన అశోకవర్ధనుఁడు నిషేధించిన పాటలీపుత్రమహానగరమున నీ వైదికక్రతువు జరగుటవలననే అచట బౌద్ధమున కాదరము సన్నగిల్లి వైదికమయిన బ్రాహ్మణమతము మరల రేకెత్తుచుండె నని విశదము కాఁగలదు. వైదికక్రతుపునరుద్ధరణముఁ గావించిన యీ పుష్యమిత్రుఁడు వైదికబ్రాహ్మణమతాభిమాని యనియు, బౌద్ధవిహారముల ననేకము నాశనము కావించి బౌద్ధు లనేకులను సంహరించె ననియు బౌద్ధగాథలు తెలుపుచున్నవి. పాటలీపుత్రమునందలి కుక్కుటారామమునుగూడ విధ్వంసమొనర్పఁ బుష్యమిత్రుఁడు ప్రయత్నించెనఁట. ఎట్లయినను వైదిక బ్రాహ్మణమతాభిమానులయిన శుంగవంశజుల కాలమున పాటలీపుత్రము బౌద్ధవిద్యాపీఠముగ నంతరించి బ్రాహ్మణమతమునకు పట్టుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొమ్మ యయినది. రక్షణాశ్రయములను వెదకికొనుచు బౌద్ధము రాజ్యాంతరముల పాలయినది.

వైదిక ధర్మపునరుద్ధరణముతో సంస్కృతవిద్య చివురు తొడిగినది. ఈ కాలముననే, ప్రకృతము కనఁబడురీతిని రామాయణ, మహాభారతములు విరచింపఁబడిన వనియు, ధర్మశాస్త్ర గ్రంథమయిన మనుసంహిత సంధానింపఁబడిన దనియు, నాట్యశాస్త్రము విరచితమయిన దనియుఁ జెప్పెదరు. పుష్యమిత్రుని కాలమున, నతని యాదరణముననే విద్వద్వర్యుఁడయిన 'పతంజలి' వ్యాకరణ మహాభాష్యమును విరచించెను. యోగసూత్ర కర్తయయిన పతంజలియు, మహాభాష్యకర్తయయిన పతంజలియు నొక్కరా వేఱా యని చరిత్రకారులలో వివాద మున్నను మహాభాష్యకర్త పతంజలి పుష్యమిత్రుని సమకాలికుఁడే యని పలువురి యభిప్రాయము. పుష్యమిత్రునిచేత అశ్వమేధము చేయించినది పతంజలియే యని కొంద ఱందురు.

పుష్యమిత్రుఁడు ముప్పదియాఱు సంవత్సరములు పరిపాలించి దివంగతుఁడయినయనంతరము అతని తనూభవుఁడయిన అగ్నిమిత్రుఁడు మగధ సింహాసనము నధిష్ఠించెను. కాళిదాస మహాకవి తన మాళవికాగ్నిమిత్ర నాటకమున నీ యగ్నిమిత్రుని నాయకునిఁ గావించి యతనిని చిరయశస్వంతునిఁ గావించియున్నాఁడు. అగ్నిమిత్రునియొక్క — కాని అతని తరువాతి శుంగవంశప్రభువులయొక్క — కాని — పేర్లు తక్క — చరిత్రమేమియుఁ దెలియవచ్చుటలేదు. శుంగవంశజులు పరిపాలించుచుండిన కాలముననే విదిశానగర భాగభద్రాస్థానమునకు తక్షశిల యవనభూపతియయిన అంతియల్కిదస్ దగ్గఱనుండి హీలియోడోరస్ అను యవనుఁడు దూతగ నేతెంచెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బీస్నగరునందు ప్రతిష్ఠితమయిన గరుడధ్వజముమీఁది శాసనము భాగభద్రుని పంద్రెండవ పరిపాలనవర్షమునఁ జెక్కఁబడినది. శుంగవంశజులలోఁ గడపటివాఁడు దేవభూతి. ఇతఁడు దురాచరణపరాయణుఁడును, స్త్రీలోలుఁడును అగుటచేత నితని యమాత్యుఁడయిన వాసుదేవుఁ డను బ్రాహ్మణుఁడు కుట్ర పన్ని తన ప్రభువును సంహరింపించి తాను మగధ రాజ్య మాక్రమించుకొనెను. ఈ రీతిని క్రీ. పూ. ౭౩ ప్రాంతమున మగధ శుంగవంశ పరిపాలనము కడముట్టినది.

నిజప్రభువధానంతరము వాసుదేవుఁడు మగధరాజ్యము నాక్రమించుకొని పరిపాలనము నెఱపెను. ఈతఁడు కణ్వ వంశజుఁ డగుటవలన ఈతని వంశమువారికి కాణ్వులని, కాణ్వాయనులని చరిత్రమందు పేరు కలిగినది. పురాణముల ననుసరించి చూడ మగధను పాలించిన కాణ్వాయనులు నలువురు. వీరు నలువదియైదేండ్లు పరిపాలించిరి. పురాణములందు వీరు శుంగభృత్యులనియు పేర్వడిరి. వీరి చారిత్రముకూడ మన కేమియుఁ దెలియరాదు.

శుంగవంశజులు మగధను పాలించుచుండిన కాలమున ఆంధ్రవంశ్యులయిన సాతవాహనులు దక్షిణమున గొప్ప రాజ్యమును నిర్మించి ప్రబలు లగుచుండిరి. కాణ్వాయనులు నిర్వీర్యులును, నిరంతర రాజ్యకలహసంసక్తులును అయిన కారణమునఁ గావచ్చును సాతవాహనులు తమ రాజ్యము నుత్తర దిశగ వ్యాపింపఁజేసికొన మంచి యవకాశము లభించెను. ఆంధ్రావనీపతులలో నొకఁడు తరుణము చూచి కాణ్వాయనులలోఁ గడపటివాఁడయిన సుశర్మను బరిమార్చి పాటలీపుత్ర సింహాసనము నధిరోహించి మగధరాజధానీనగరమున ఆంధ్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విజయపతాక నెలకొల్పెను. నాఁటనుండి మగధ ఆంధ్రరాజ్య రమకు విహారభూమి యయినది. కాణ్వాయనుల పరిపాలన మంతరించినది.

---

## ఆంధ్రులు

ఆంధ్రరాజ్యసంస్థాపకుఁడు శ్రీముఖుఁడని యిదివఱకే తెలుపఁబడినది. ఇతని వంశమువారికే సాతవాహను లని, శాతవాహను లని, శాలివాహను లని పేరు. చాలమంది యను కొనునట్లు శాలివాహనపదము ఒక రాజనామముగఁ గాక శ్రీ ముఖునిచేత సంస్థాపింపఁబడిన యొకవంశమునామముగ గ్రహిం పఁదగును. ఈ వంశమున ముప్పదిమంది భూపతులు ౪౬౦ సంవత్సరములు పాలించిరి. వా రెవరెవ రెన్నెన్ని వర్షములు రాజ్యపాలనము చేసినది పురాణములవలనఁ దెలియును.

కృష్ణ, శ్రీ శాతకర్ణు లను శ్రీముఖుని తరువాతి రాజు లిరువురు ఆంధ్రరాజ్యమును తూర్పున కృష్ణానదీముఖ ద్వారము మొదలు పశ్చిమమున నాసికవఱకు వ్యాపింపఁ జేసిరి. ధాన్యకటకము వీరి రాజధాని; పశ్చిమరాజ్యమునకు గోదావరీ నదీతటమునఁ గల ప్రతిష్ఠానము ముఖ్యపట్టణముగ నుండెను. యువరాజు రాజప్రతినిధియై పశ్చిమరాజ్యము నేలుచు నిచట నుండువాఁడు. శుంగ, కాణ్వవంశజుల చారిత్రమువలెనే ఆంధ్ర వంశచరిత్రముకూడ అంధకారగహ్వరమునఁ బడి తెలియ రాకయున్నది. ఈ వంశమునందలి మూఁడవరాజగు శ్రీశాత కర్ణి కళింగాధిపతియగు మహామేఘవాహన ఖారవేలునికి సమ కాలికుఁడని చరిత్రకారుల యభిప్రాయము. ఖారవేలుఁడు శాతకర్ణికాలమున ఆంధ్రరాజ్యముపై దండెత్తివచ్చి ఆంధ్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామంతులయిన రాష్ట్రికులను, భోజులను జయించెను. ఈ వంశమునందలి తొలుతటి రాజులలో నెవరో యొకరు సుశర్మ యను కాణ్వాయనుని వధించి మగధను స్వాధీనపఱుచుకొనిరి. ఇంతకుఁ దక్క ఈ వంశమునందలి తొలుతటి రాజులను గుఱించి యేమియుఁ దెలియదు.

ఈ వంశమునందలి పదునేడవరాజు హాలశాతవాహనుఁడు. ఇతఁడు గొప్పకవియు, విద్యాప్రియుఁడునయి పెక్కురు కవి పండితుల కాశ్రయ మొసంగెను. ఇతఁడు 'సప్తశతి' యను పేర నేడువందల శృంగారపద్యములుగల ప్రాకృతభాషా గ్రంథము నొకదానిని రచియించెను. 'శాలివాహనసప్తశతి' యనియు దానికిఁ బేరు. బాణుఁడు మొదలయిన తరువాతి కాలపు సంస్కృతకవులు ఈ కృతిని బహువిధములఁ బ్రశంసించి యున్నారు. దీనిని ఆంధ్రకవిసార్వభౌముఁడయిన శ్రీనాథుఁడు 'నూనూఁగు మీసాల నూత్నయౌవనమున' తెనిఁగించి నట్లు తన గ్రంథములందుఁ జెప్పుకొన్నాఁడు. సప్తశతి కీ తెలుఁగు అనువాద మింతవఱకు దొరకలేదు. హాలుఁడు క్రీ. శ. ౭౮లో సింహాసన మధిష్ఠించె నని, ఈతఁడే (శాలివాహన) శకము స్థాపించె నని కొంద ఱందురు.

ఆంధ్రులయిన శాతవాహనభూపతులలో శ్రేష్ఠుఁడుగ పరిగణింపఁదగినవాఁడు గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి. ఈతని కాలము నాఁటికే యవన, శక, పహ్లవు లుత్తరహిందూస్థాన రాజ్యములను విధ్వంసముఁ గావించి సైన్యములతో నెత్తివచ్చి దక్షిణాపథమునుగూడ కలగుండువఱుచుచుండిరి. వీరిలోఁ గొందఱు సురాష్ట్రము, మాళవము మొదలయిన కొన్ని యాంధ్ర సామ్రాజ్య భాగములను హస్తగత మొనరించుకొని, స్వరాజ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములను స్థాపించుకొని, నాసిక, ఉజ్జయినీ నగరములు రాజధానులుగ పాలించుచు, చరిత్రమున పశ్చిమక్షత్రపు లను పేరఁ బ్రసిద్ధులయిరి. నాసిక రాజధానిగఁ బాలించిన క్షత్రపులలో చరిత్రకుఁ దెలిసినవారు భూమక, నహపాను లిరువురు మాత్రమే. వీరు క్షహరాతవంశజులు. ఈ విదేశీయ విప్లవము వలన ఆర్యధర్మమున కుపద్రవము కలిగినది. దానిని రక్షించి యుద్ధరింపవలసిన బాధ్యత యాంధ్రులపయిఁ బడినది. ఉత్తర హిందూస్థానమున నాఁడు పుష్యమిత్రునివలెనే యిచట నేఁడు ఆంధ్రవంశావతంసమయిన గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి పరాక్రమతేజోవిరాజితుఁడయి, దక్షిణమునకుఁ జొఱుచుకొని వచ్చుచుండిన విదేశీయవాహినికి చెలియలికట్టవలె నడ్డుపడి ఆర్యధర్మపరిరక్షణార్థ మొఱనుండి కత్తిదూసెను. అనేకసంగ్రామములందు శాత్రవకోటిని దునుమాడెను; క్షత్రియుల దర్పమును, మానమును మర్దించెను; యవన, శక, పహ్లవులను నిర్జించెను; క్షహరాతవంశమును నిరవశేషముఁ గావించెను. పూర్వ, పశ్చిమ, దక్షిణ సముద్రములందు ఆతనినాఁడు ఆంధ్రుల సంగ్రామాశ్వములు జలములు త్రావినవి. ఈవిధమున గౌతమీపుత్రశాతకర్ణి మరల శాతవాహనవంశయశస్సును ప్రతిష్ఠాపించి వన్నెకెక్కెను. బ్రాహ్మణులకును, బౌద్ధులకును మహాదానము లనేకములు గావించి ఆంధ్రుల కీర్తివల్లికను దిగంతములఁ బ్రాకించెను. ఈతనికాలమున ఆంధ్రరాజ్యముత్తరమున గుజరాత్, రాజపుత్రస్థానములవఱకును, దక్షిణమున మైసూరుమండలమువఱకును, తూర్పున బంగాళాఖాతమునుండి పశ్చిమమున అరాబియాసముద్రమువఱకును వ్యాపించినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇరువదియైదుసంవత్సరము లఖండ వైభవమున ఆంధ్ర సామ్రాజ్యమును పరిపాలించి గౌతమీ పుత్రుఁడు దివంగతుఁ డయినయనంతరము అతని తనయుఁడయిన వాసిష్ఠీపుత్ర శ్రీపులుమాయి రాజ్యమునకు వచ్చెను. ఈతని కాలమునఁగూడ ఆంధ్రులకును, విదేశీయులకును ఘోరసంగ్రామము లెన్నియో జరగినవి. ఈ తడవ ఆంధ్రవంశ్యుల యధికారమును ధిక్కరించి వారి నెదుర్కొనినవారు ఉజ్జయినీనాథులయిన శక భూపతులు-చాష్టనవంశజులు. ఈ వంశమునందలి రుద్రదాముఁ డనుభూపతి పులుమాయి నోడించి ఆంధ్రసామ్రాజ్యమునందలి పశ్చిమ, ఉత్తరభాగముల నాడిచికొని, ప్రబలుఁ డయ్యెను. పెక్కుయుద్ధములు జరగినయనంతర ముభయవంశములకు సఖ్యము కుదిరినది. రుద్రదాముఁడు తన కుమారిని పులుమాయి కిచ్చి పరిణయముకావించి, ఆంధ్రులతో వియ్యమును, నెయ్యమును పాటించెను. గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణి, వాసిష్ఠీపుత్ర శ్రీ పులుమాయిల పరిపాలనకాలము నిదమిత్థమని తేల్చుట కింకను వీలుకాక యున్నది. గౌతమీపుత్రుఁడు క్రీ. శ. ౧౦౬ ప్రాంతముననను, పులుమాయి క్రీ. శ. ౧౩౦ ప్రాంతముననను ఉండియుండుననని చరిత్రకారులు కొందఱ యభిప్రాయము. గౌతమీపుత్రుఁడు క్రీ. శ. ౭౮ లో రాజ్యమునకు వచ్చె ననియు, ఈతఁడే (శాలివాహన) శకకర్త యనియు మఱికొంద ఱందరు. ఈవిధమున ఆంధ్రరాజుల పరిపాలనకాల నిర్ణయముకూడ భిన్నాభిప్రాయములకు లోనయి వివాదాస్పదముగ నున్నది.

తరువాత నీవంశమున పేరెన్నికఁగన్నవాఁడు గౌతమీపుత్రయజ్ఞశ్రీశాతకర్ణి. ఈతఁడు పరాక్రమవంతుఁడయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తన పూర్వులు గోలుపోయిన రాజ్యమును మరల సంపాదించి యాంధ్రరాజ్యమును నలువైపుల విస్తరిల్లఁజేసెను. ఈతనివి రెండుమ్రద్రగల నాణెములు గానవచ్చుటచేత ఈతనికాలమున సముద్రవాణిజ్యము విరివిగ సాగుచుండె ననియు, రాజ్యమును విస్తరింపఁజేయ నాంధ్రసైన్యములు సముద్రములనుగూడ దాఁటియుండు ననియు చరిత్రకారు లూహించుచున్నారు. ఈ వంశమునఁ బేర్కొనఁదగిన యితరభూపతులీక నెవ్వరును లేరు.

క్రీ. శ. ౨౨౮ ప్రాంతమున ఆంధ్రమహాసామ్రాజ్యము భగ్నమయి పోయినది. శకవంశజులు దక్కను ఉత్తరభూములను స్వాధీనపఱుచుకొని, రమారమి నూటయేఁబది సంవత్సరములవఱకు పరిపాలనము నెఱపిరి. ఆంధ్రులకు సామంతులుగను, సేనాధిపతులుగను ఉండిన మండలాధిపతులు స్వతంత్రులయిరి. ఆంధ్ర సామ్రాజ్యభూమిని కదంబ, పల్లవ, ఇక్ష్వాకునామాంకితములయిన వంశములు నూతనరాజ్యములను వెలయఁజేసినవి. కదంబులు దక్కను పీఠభూమియందలి దక్షిణ, పశ్చిమ విభాగములను స్వాధీనపఱుచుకొనిరి. కృష్ణానదీతీరస్థమయిన యాంధ్రదేశము ఇక్ష్వాకువంశజుల పరిపాలనముక్రిందికి వచ్చెను. కాంచీపురమును, దానికుత్తర, పశ్చిమములందుఁ గల యాంధ్రదేశభాగములను పల్లవులాక్రమించుకొనిరి. దక్షిణ హిందూదేశమునందలి పాండ్య, చోళ, చేర రాజ్యములు ఆంధ్రసామ్రాజ్యమునకు లోఁబడియుండినవేమో తెలియదు కాని, తత్ సామ్రాజ్యపతనానంతరమవి స్వతంత్రములుగనే యుండినట్లు తెలియవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దక్షిణాపథమున విలసిల్లిన ప్రథమ మహాసామ్రాజ్య మాంధ్రులది. విదేశాగతులయిన యనాగరికజాతుల నిర్వక్ర విక్రమధాటివలన ఆర్యధర్మమునకు విపర్యయము కలుగ కుండ పరిరక్షించి, దక్షిణాపథమునంతను ఒక్క రీతిని శాసించి దాక్షిణాత్య సంస్కృతి, శిల్పములకు పునాదులు వేసినవారు ఆంధ్రులు. నూతనమత, సంస్కారోద్యమముల కాటపట్టయిన మగధతోడి సంపర్కము ఆంధ్రులకు క్రొత్త యూర్పు పోసినది. ఆంధ్రజీవనము ధర్మపరతంత్ర మయినది. సాతవాహన భూపతులు కొందఱు తాము చాతుర్వర్ణ్య సాంకర్యము నివర్తింపఁజేసితి మని తమ శాసనములందు దర్పముతో చెప్పుకొనిరి. కాని వర్ణవ్యవస్థ యిప్పటివలె నంత శిలాకాఠిన్యముఁ దాల్చియుండ లేదు. అనేకవిషయములయందువలెనే సంఘమునఁగూడ మార్పులు కలుగుచుండిన కాలమది. హిందూసంఘము విదేశీయ విప్లవమునలన కలగుండువడి ఘూర్ణిల్లుచుండెను. ఈ సమయమున హిందూ జాతీయధర్మమును, సంస్కృతియు ఆనాగరికులగు విదేశీయులవలని విప్లవమును బొరయకుండ ఆత్మరక్షణపరత్వమున వర్ణవ్యవస్థకు ధర్మసూత్రములతో హద్దులు నిర్ణయించి యుంచినను, సంఘక్షేమము ననుసరించి, బ్రాహ్మణు లది కొయ్యబాఱకుండ జాగ్రత్తపడుచునే వచ్చిరి. సిద్ధాంతమున ఈ వర్ణవ్యవస్థాసూత్రములు చాల బిగువుగనే యుండినను వ్యవహారమున వదులు వదులుగనే యుండి హిందూసంఘ శరీరవిస్తృతి కెడమిచ్చుచు వచ్చినవి. ఈకారణముననే మొదటినుండు చల్లారి యిచట స్థిరపడిపోయిన విదేశీయులు దేశీయులతో సంబంధ బాంధవ్యములు కలిపి, హిందూసంఘమునఁ జేరిపోవుటయే కాక దేశీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యములయిన మత సంప్రదాయములకు రక్షకులును, ఆశ్రయులునయి విఖ్యాతి నందుచు వచ్చిరి. శకనృపతులయిన రుద్రదామ, ఉషవదాత్తాదులు యజ్ఞ యాగాదిపోషకులు, బ్రాహ్మణ జనాశ్రయులు, సంస్కృతవాఙ్మయోద్ధారకులు అయి గణన కెక్కిరి! క్రీస్తుశకము మొదటిశతాబ్ది నీదేశము నకు క్రొత్తగా వచ్చి యిచ్చట స్థిరపడిపోయిన కుషాణవంశజు లను విదేశీయులు కొందఱు బౌద్ధమతవల్లికకు ప్రధానాలంబ మయి నిలిచిరి!

సంఘు మీవిధమున నూతన పరిస్థితులకు సరిపుచ్చుకొను చుండిన కాలమున, శుంగవంశజుల యాదరణమున మగధ బ్రాహ్మణమతమునెడ నభిమానము చూపిన నాటనుండియు నిలువ నీడకొఱకు బౌద్ధము దేశాంతరములను వెదకికొను చుండెను. పీతాంబరధారులును, ముండిత శిరస్కులును అయిన బౌద్ధభిక్షువులు మగధను విడిచి కొందఱు వాయవ్యదేశముల కరిగిరి. మఱికొందఱు దక్షిణాపథమునందలి మహాచైత్యక్షేత్ర మయిన ధాన్యకటకమున కరుదెంచి, దానిని ప్రధానపీఠముగ గావించుకొని బౌద్ధమతప్రచారము కావించుచుండిరి. శ్రమ యెఱుంగనివారి ప్రయత్నములవలన అనతికాలముననే ఆంధ్రదేశ జనసామాన్యము బుద్ధభగవానుని చరణకమలములకు శిరస్సు వొగ్గినది. కృష్ణానదీతీరమున అందందు స్తూపరాజములు వెలసినవి. దక్షిణమున, మగధకుఁ బిదప ఆంధ్రదేశము బౌద్ధము నకు ప్రధానపీఠ మయినది. ఆంధ్రనృపతులగు సాతవాహనులు బ్రాహ్మణమతము నభిమానించినను ప్రజాహృదయస్పందన మును గమనించి బౌద్ధమును పోషించి బౌద్ధభిక్షువులను దానా దికములచేతఁ దనుపుచువచ్చిరి. మహారాజులు, రాజప్రతినిధులు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహాసైన్యాధిపతులు, వర్తకులు—వీరు వారననేల, సంపన్ను లయిన మహాదానపతులెల్లరు బౌద్ధస్తూపవేదికలపయి ప్రణమిల్లి, బౌద్ధభిక్షువుల యుపయోగార్థము పర్వతములను దొలిపించి గుహాలయములను, విహారములను నిర్మింపించి, పూజాకుసుమ ములుగ సమర్పించుచుండిరి. మౌర్యచక్రవర్తుల నాఁ డారంభ మయిన హిందూ వాస్తుశిల్పకళ లీనిర్మాణములందు పొంగారి నిండుజీవము దాల్చినవి. ఇట్టి గుహాలయములు నాసిక, కార్లి, అజంతా మొదలగు ప్రదేశములం దనేకములు కలవు. బౌద్ధ భిక్షువులు వర్షకాలము నాలుగు నెలలు గుహాలయము లందు నివసించుచు, బౌద్ధధర్మాధ్యయనమునందును, ప్రార్థన ములందును దమ కాలమును వెళ్లఁబుచ్చువారు. బౌద్ధుల ప్రార్థనమందిరములకు చైత్యశాలలని పేరు. ఇట్టివానిలో కార్లీగుహాచైత్యమందిరము హిందూదేశమందంతటనే కాక ప్రపంచమునందంతటను కడు సొబగయినదని వాసికెక్కినది.

ఆంధ్రరాజుల పరిపాలనకాలమున వర్తక వ్యాపారముసఁ గూడ గొప్ప యభివృద్ధి చూపట్టెను. అంతవఱకు వర్తకము మెట్టదారిని పర్వతారణ్యభూములగుండ, ఎడారులగుండ సాగు చుండెను. వేసవికాలపు ఎండ వేడిమివలన ఈప్రయాణము కడుదుర్భరముగ నుండెడిది. మెట్టప్రయాణ మిటులుండ దారి తెన్నులులేని సముద్రముమీఁది ప్రయాణ మింకను కష్టతరముగ నుండెను. అందువలన నావికులు నడిసముద్రముల మీఁదుగఁ బోవ వెఱచి సూయజునుండి హిందూదేశమునకు చాల చుట్టును, ప్రయాస సాధ్యమునయినను సముద్రతీరమునం టియే ఓడలను నడపికొని వచ్చుచుండిరి. సూయజునుండి హిందూదేశమునకు వచ్చుటకు మొట్టమొదట యవనులనాఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముప్పది నెలలు పట్టుచుండెను. యవనులకుఁబిదప హిందూదేశ ముతో తీవ్రముగ వర్తకము సాగించినవారు క్రీస్తుకుపూర్వము రెండుమూఁడు వందల సంవత్సరములలో ఈజిప్టు దేశమును బరిపాలించిన 'టాలెమీ'లనువారు. వీరు ప్రాగ్దేశవర్తకుల సౌకర్యార్థము సూయజు, ఎఱ్ఱసముద్రములమీఁద పెక్కు రేవుల నేర్పాటుచేసి ప్రాగ్దేశవర్తకమునకు గొప్ప ప్రోత్సాహము నొసంగిరి. ఈజిప్టు ఉత్తరతీరమున నైలునదీముఖద్వారమునఁ గల అలెగ్జాండ్రియా గొప్ప రేవుపట్టణము. అక్కడినుండి హిందూదేశపు సరకులు యూరోపుదేశములకుఁ బోవుచుండెడివి. కాని యీ ప్రాగ్దేశవర్తకమునంతను ఈజిప్టు స్వయముగఁ గాక అరబ్బులద్వారా జరపుచుండెను. క్రీస్తుకు పూర్వము మొదటి శతాబ్దియందు ఈజిప్టు రోముసామ్రాజ్యమునకు లోఁబడిన రాష్ట్రమయినది. నాఁటనుండి హిందూదేశ వర్తకము రోమనుల హస్తగతమయినది. రోమనులీవర్తకము నింకను పెంపొందించిరి; ఓడదొంగల నణఁచివైచిరి. వర్తకమార్గములను సురక్షితముఁ గావించిరి. చీనానుండి పట్టు, హిందూదేశముననుండి మల్లు సెల్లాలు, ఆభరణములు ముఖ్యముగ వైడూర్యములు, ముత్యములు, మూలికలు, సుగంధద్రవ్యములు, మిరియములు మొదలయిన వ్యంజనములు, అంగరాగములు రోము దేశమునకెగుమతి యగుచుండెడివి. ఇన్నిటిలో ఎక్కువగ చెల్లుబడి యగుచుండిన సరకు మిరియములు. క్రీస్తు శకము మొదటి శతాబ్ది నిది పౌను పదునైదుదీనారముల కమ్ముచుండెను. హిందూదేశ మీ సరకుల నన్నిటిని ఎగుమతిచేసి బంగారమును గొనుచుండెడిది. ఈ ప్రాగ్దేశవర్తకమువలన హిందూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశము, చీనా, అరేబియాలకు రోము దేశమునుండి యేఁటేఁట పదునొకండు లక్షల పౌనుల బంగారము వెళ్లుచుండెడిదఁట! అందు సగముపాలు హిందూదేశమునకే. ఈ వర్తకము మొదటిమైదుగురు రోమనుచక్రవర్తుల కాలమున అతివిస్తరించి సాగుచుండె ననుటకు హిందూదేశమున దొరకిన యాచక్రవర్తుల నాణెములే తార్కాణము. రోమకసామ్రాజ్యముతో జరగిన యీ వర్తకాభివృద్ధికి ఫలితముగ హిందూదేశభూస్వరూపమును వర్ణించుచు పెక్కు గ్రంథములు పుట్టినవి. ఇట్టి భూస్వరూప శాస్త్రకారులలో స్ట్రాబో అను యవనయాత్రికుఁడు మొదటివాఁడు. తరువాత ప్లినీ యనునతఁడు క్రీ. శ. ౭౭ ప్రాంతమున నొక గ్రంథమును రచియించెను. ఈ కాలముననే మఱియొక నావికుఁడు 'పెరిప్లస్ ఆఫ్ ది ఎర్రిత్రియన్ సి' అని మఱియొక గ్రంథమును రచించెను. హిందూదేశ భూస్వరూపమునుగుఱించి వ్రాసిన వారిలో క్రీ. శ. ౧౫౦ ప్రాంతముననుండిన టాలెమీ కడపటివాఁడు. రోముతోడి యీ వర్తకమువలన హిందూదేశమున నుండి దేశీయప్రభువులు రోమనుచక్రవర్తులకు రాయబారముల నంపుచుండిరి. ఈ వర్తక మిట్లు సాగుచుండినకాలమున నడిసముద్రములమీఁదుగ హిందూదేశమునకు వర్తకపు టోడలను నడపఁ బ్రయత్నములు జరగినవి. అరబ్బుల వలనఁ దెలిసికొని కాఁబోలు హిప్పాలస్ అను నతఁడు అరేబియా సముద్రముమీఁదుగ హిందూదేశవర్తక నౌకాయానమున కనుకూలపడు వర్షవాయువులు వీచునని కనిపట్టెను. అప్పటి నుండి ఆ వర్షవాయువుల నుపయోగించుకొని హిందూదేశపు రేవుల నతిశీఘ్రకాలమునఁ జేరుటకు ప్రయత్నములు జరగినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీనికి ఫలితముగ అలెగ్జాండ్రియా హిందూదేశమునకు రెండు నెలల దూరమునకు వచ్చినది. 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరెత్రియన్ సి' అను గ్రంథమువలన ఆఫ్రికానుండి హిందూదేశము, మలయాద్వీపకల్పముల మీఁదుగ దూరస్థమయిన చీనాతో సాగుచుండిన అంతర్జాతీయవర్తకమును గూర్చి తెలియఁగలదు. ఎఱ్ఱసముద్రముననుండి వచ్చుచుండిన వర్తకనౌకలు నర్మదానదీ తీరమునఁగల భరుకచ్ఛము (Broach) నౌకాశ్రయమునకుఁ జేరుకొనుచుండెడివి. దక్కను దేశమునందు మెట్టను బండిన పంట పశ్చిమదేశముల కెగుమతి యగుకొఱకీరేవునకు వచ్చుచుండెను. భరుకచ్ఛము, సోపారము, తాగరపురము, ప్రతిస్థానము, కల్యాణములు దక్షిణాపథమునందలి వర్తకప్రసిద్ధములయిన నగరములు. మధ్య హిందూదేశపు పంట ఈ నగరములకు వచ్చుచుండెను. తామ్రలిప్తినగరము, మసాలియా (? మోసలపురము—మోటుపల్లి) ప్రాక్సముద్రతీరస్థములగు రేవు పట్టణములలో ప్రసిద్ధములయినవి.

పశ్చిమ దేశములతోడి వర్తకము అరబ్బులు మొదలగువారివశమున నుండ ప్రాగ్దేశములతో వర్తకమును హిందువులే సాగించుచుండిరి. ఇది కారణముగ బర్మా, సయాము, కాంబోడియా మున్నగు ప్రాగ్దేశములందును, యవ, సువర్ణ (Sumatra) ద్వీపములందును హిందువు లధినివేశములను నిర్మించుకొనిరి. యవద్వీపమునకు (Java) వలసపోయిన మొదటి సాహసులు కళింగ దేశీయులు. ప్రాగ్దేశ వర్తకము చూపిన మార్గముననే హిందూ సంస్కృతియు, సభ్యతయు ప్రాగ్దేశములకుఁ బ్రాఁకినవి. అచట హిందూ, బౌద్ధమతములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాదులు కల్పించుకొనినవి. గొప్ప దేవాలయములు, విహార ములు వెలసినవి. సంస్కృత, ప్రాకృత వాఙ్మయము లగారముల నేర్పఱుచుకొనినవి. హిందూ వాస్తు, శిల్పకళలు దూరస్థములయిన యీ ప్రాగ్దేశాంతరములందును వేఱు తన్ని వర్ధిల్లినవి. సయాము, కాంబోడియా, దక్షిణ ఆనాం మొదలగు ఇండో-చీనా దేశములందు ఇప్పటికిని హిందూ, బౌద్ధ వాస్తు శిల్పకళావశేషములను గాంచనగును. యవద్వీప మున కరిగిన హిందూశిల్పకళ కాలక్రమమున మెఱుఁగులు దేరి, హిందూపౌరాణిక విగ్రహరచనమునందును, 'బోగ్గా బొడోర్' బౌద్ధస్తూప నిర్మాణమునందును చక్కని పరి ణతిఁ బొంది, అసదృశమును, అదృష్టపూర్వము నని పెక్కురు కళావిదులచేత ప్రాగల్భ్యముఁ గాంచినది. ఈ విధమున హిందూ సభ్యతయు, హిందూ సంస్కృతియు ప్రాచ్యదేశములపయిఁ దమ విజ్ఞానముద్ర నచ్చొత్తి, ప్రాచ్యనాగరకతా పరిణామము నకుఁ దోడ్పడినవి. వర్తకముకారణముగ చేపడిన సంబంధ మును బోఁగొట్టుకొనక, చీనాదేశ మిటుతరువాత అనతికాల మునసే మెట్టదారులను, సముద్ర మార్గములనుగూడ నుపయో గించుకొని, హిందూదేశముతోడి తన సంస్కృతిబంధమును బిగువుపఱుచుకొనెను. ఈరీతిని ఆంధ్రులు పరిపాలించిన కాల మున దేశమునం దన్ని విషయములయందును అపూర్వమయిన యుత్సాహము వెల్లివిరిసినది. నూతనమయిన యొక దివ్య చైతన్యము విద్యుత్ప్రకంపనమువలె సంఘమును గదలించి వైచినది. హిందూదేశము తన యంచులను మించి విస్తరిల్లి, తన సంస్కృతి, సభ్యతలను దూరస్థములయిన ప్రాగ్దేశములం దును, ప్రాగ్ద్వీపములందును పైరువెట్టిన దీకాలముననే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈకాలమున వర్తకమును, పరిశ్రమలును బాగుగ వర్ధిల్లుటచేత దేనికి దానికే చక్కనికట్టుబాటులకు లోనయిన ప్రత్యేక సంస్థ లుండెడివి. వీనికి శ్రేణులని పేరు. ఒక్కటే వృత్తిని గాని, ఒక్కటే పరిశ్రమను గాని, ఒక్కటే రకమునకుం జెందిన వర్తకమును గాని యవలంబించు పరస్పరసహకారజనసంఘమును శ్రేణియందురు. పరిశ్రమలు, వృత్తులు, వర్తకము—వీని క్షేమాభ్యుదయములకు భంగము కలుగకుండ ఈశ్రేణులు కాపాడుచుండెడివి. ప్రతి శ్రేణికి కార్యనిర్వాహకవర్గమును, తీర్చి దిద్దిన కార్యవిధానము నుండెడిది. సువర్ణకారులు, వర్ధకులు (Carpentors), గాంధికులు (Druggists), తంతువాయులు (Weavors) మొదలగు వృత్తులవారి శ్రేణు లెన్నో ఆంధ్రరాజుల కాలము నాంటి శాసనములందు పేర్కొనంబడినవి. అన్ని ప్రయోజనములకంటె ముఖ్యముగ ఈశ్రేణులు స్థానికనిధులుగ (Local Banks) నుపచరించుచుండెడివి. ప్రజలు వీనియందు తమ ధనమును దాచం బెట్టువారు. నిలువవేసిన ధనముమీంద నూటి కయిదు మొదలు ఏడునఱువలకు వడ్డీ వచ్చుచుండెను. ఇది యొకతరముననుండి మఱియొకతరమునకు, నిట్లు తరముల క్రమమునను ముట్టుచుండెను. ఒక్కొకప్పుడు శ్రేణులందు నిలువవేసిన ధనముమీంద వచ్చు వడ్డీని ప్రతిసంవత్సరము ప్రత్యేకప్రయోజనముల నిమిత్తము వినియోగపఱుపంగూడం గట్టడు లుండెను. ఈ పద్ధతివలన ఆయాపరిశ్రమలును, వర్తకమునుమాత్రమే కాక దానధర్మములు, పౌరహితకార్యములు కూడ నిరంతరాయముగ చక్కంగ సాగుచుండెడివి. శ్రేణు లిట్టి పద్ధతిని సాగించుచుండెడి వన్న దేశపరిపాలన మెంత పటిష్ఠముగ నుండెనో, శ్రేణు లెంత బాధ్యతామహితములయి పని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయుచుండెనో, ప్రజలకుఁ దమసంస్థలయం దెంతటి విశ్వాస ముండెనో యూహింపనగును. ఇట్లే నగరవ్యవహారములను జక్కఁబెట్ట నిగమసభ లనుపేర నగరసంఘములును, గ్రామ వ్యవహారములకు గ్రామసంఘములు నుండెను.

పూర్వోక్తవిషయములందువలెనే భాషావిషయమునను చక్కని యభివృద్ధి చూపట్టినది. శాతవాహనభూపతులు విద్యాప్రియులును, భాషాపోషకులు నయి నెగడియున్నారు. వారిలో నొకనికి మంత్రిగ నుండిన గుణాఢ్యుఁడు ప్రాకృతభాష లలో నొకటియగు పైశాచీప్రాకృతమున 'బృహత్కథ'యను పేర నొక గొప్ప కథాకోశమును రచియించెను. వే ఱొకశాత వాహననృపాలునికి మంత్రిగ నుండిన శర్వవర్మ 'కాతంత్రవ్యాక రణ' మనుపేర తన ప్రభువు నుపయోగమునకై ఒక సం స్కృతవ్యాకరణమును రచియించెను. క్రీస్తు శక మేడవ శతా బ్దిని హిందూదేశమునకు వచ్చిన యువాన్‌చాంగ్ ఇది ౨,౫౦౦ ల శ్లోకముల గ్రంథమని, సరిహద్దురాష్ట్రములం దన్నిట విస్తారము వాడుకయం దుండె నని వ్రాసియున్నాఁడు. హాలుఁ డను శాతవాహననరపతి 'సప్తశతి' యనుపేర నొక గ్రంథమును విరచించె నని యీవఱకె తెలుపఁబడినది. ఈ విధ మున దక్షిణాపథమున ఆంధ్రరాజులు పరిపాలించిన కాలము సర్వతోముఖాభివృద్ధి గలిగి చిరస్మరణీయ మగుచున్నది.

---

## కుషాణ సామ్రాజ్యము

దక్షిణాపథమునందలి ఆంధ్రులు హిందూసంస్కృతి సభ్యతలకు ప్రాగ్దేశములందు పందిళ్లు వైచి తోరణములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కట్టుచుండిన కాలమున బౌద్ధమతచారిత్రమున ప్రధాన పాత్రమును వినిపింపవలసియున్న కుషాణు లనువారు వాయవ్య దిశగ హిందూదేశమునఁ బ్రవేశించుచుండిరి. వీరు క్రీ. శ. ౧౬౦ ప్రాంతమున చీనా దేశముననుండి వచ్చి శకులను దఱిమి వైచి వారు నివసించుచుండిన ప్రాంతము నాక్రమించుకొనిన 'యూచీ' లనఁబడు తెగవారిలో నొక కులమువా రని యిది వఱకే తెలుపఁబడినది. శకులను దఱిమివైచిన యనంతరము కాలక్రమమున బాక్ట్రియాదేశమునఁ బ్రవేశించి యచట స్థిర పడిపోయి, వారు తమ దేశాటనజీవన పద్ధతులను మార్చు కొని నాగరకు లయిరి.. ఈతెగవా రచట నుండిన కాలమున ఐకమత్యము లేక అయిదు కులములుగ చీలిపోయిరి. ఏకుల మున కాకులమే యొక్కొక నాయకునిక్రింద ప్రత్యేకరాజ్యము లను వెలయించుకొనినది. ఈ యయిదింటిలో నొకకులము వారగు కుషాణులు అటుపిమ్మట వందసంవత్సరముల యనం తరము తమ నాయకుఁడగు మొదటి కుజులకడఫీస్ అధి కారముక్రింద విజృంభించువఱకు వారి చారిత్ర మేమియు తెలి యదు. క్రీస్తు శకము మొదటిశతాబ్ది నడిమిభాగమున కుజుల కడఫీస్ ప్రబలుఁడయి యూచీకులముల నన్నిటిని ఏకీకరించి కుషాణరాజ్యము స్థాపించెను.

కుజులకడఫీస్ హిందూకుష్‌పర్వతములను దాఁటి విజి గీషువయి హిందూదేశముపయి దండెత్తి వచ్చెను. ఇతఁ డెత్తి వచ్చిన కాలము కాని, అప్పుడు హిందూదేశ వాయవ్యప్రాంత ములందు రాజ్య మేలుచుండిన రాజులపేరులు కొన్ని తెలిసినను వారి చారిత్రము కాని యింకను నిశ్చయముగ తెలియరాలేదు. శీఘ్రకాలముననే యీతఁడు కాబూలులోయప్రదేశమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జయించి, యచ్చటి యవనాధికార శేషము నంతరింపఁ జేసెను. అచ్చట నఱుదుగ నుండిన పార్థియనురాజ్యములుకూడ నీతనికి పాదాక్రాంతము లయినవి. ఈతఁడు తన జీవితకాలము నంతను సంగ్రామములందుఁ గడపి, తుదకు బొఖారా బలూచిస్థానములకును, సింధు పారసీకములకును నడుమ నుండు దేశమునంతను జయించి గొప్ప రాజ్యమునకు పునాదులు వైచి తన యెనుబదవయేఁట విధివశుఁ డయ్యెను.

ఇతని తరువాత రాజ్యమునకు వచ్చినవాఁ డితని కుమారుఁడు వేమకడఫీస్ అను రెండవ కడఫీస్. ఇతఁడు తండ్రి చూపిన మార్గమునే యనుసరించి తూర్పున వారణాసివఱకు, దక్షిణమున సింధువఱకుఁగల హిందూదేశమును జయించి స్వాధీనపఱుచుకొని, తాను జయించిన హిందూదేశరాజ్యములను బరిపాలింపఁ దన ప్రతినిధుల నేర్పాటు కావించి కుషాణసామ్రాజ్యమును వెలయించెను. ఈతఁడుకూడ చాల కాలము రాజ్యము పాలించి దివంగతుఁడయిన యనంతరము కుషాణసామ్రాజ్యమున కాధిపత్యము వహించినవాఁడు కనిష్కుఁడు.

కుషాణభూపతు లందఱిలో మిగుల కీర్తివహించిన వాఁడు కనిష్కుఁడు. కనిష్కుని కీర్తి ఈతని విజయములవలన కాక, ముఖ్యముగ నీతఁడు బౌద్ధమునకుఁ జేసిన సేవనుబట్టి వచ్చినది. ఈ కారణమున నీతనిచుట్టు నసంఖ్యాములయిన బౌద్ధగాథ లల్లుకొన్నవి. వానిననుసరించి యీతఁడు పార్థియా, చీనా చక్రవర్తులను సంగ్రామములందు జయించె ననియు, ఈ విజయములకు ఫలితముగ యార్కండ్, ఖోటాను, క్యాష్ గరు లతని సామ్రాజ్యమునఁ గలసిన వనియుఁ దెలియుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చారిత్రకముగ నివి యెంతవఱకు సత్యములో తెలియదు కాని యీతని హిందూదేశరాజ్యము కాశ్మీరముననుండి తూర్పున వారణాసివఱకు, దక్షిణమున వింధ్యమువఱకు వ్యాపించియుండె ననుట వాస్తవము. ఇట్లొకప్పుడు మగధ రాజధానిగ నుండిన పాటలీపుత్రదుర్గముపయి కుషాణపతాక ప్రతిష్ఠితమైనది. ఇతని సామ్రాజ్యమునందలి ప్రాగ్భాగమును మహాక్షత్రప ఖరపల్లాన, క్షత్రప వనష్పరులు పరిపాలించుచుండిరి. కనిష్కునికి పురుషపురము (ఇప్పటి పెషావరు) రాజధాని. ఇతఁడు తన వార్ధక్యదశయందుత్తరదేశమునకు సైన్యములను నడపించుకొనిపోయి, గాంధారము, ఖోటానులకు నడుమఁగల పర్వతపంక్తిని దాటఁ బ్రయత్నించునప్పుడు కాలవశుఁ డయ్యెనని ప్రతీతి.

బౌద్ధమత చారిత్రమున నీతని రాజ్యకాల మొక ముఖ్యఘట్టము. ఇతని నాణెముల ననుసరించి చూచిన నీతఁడు బౌద్ధమతము నవలంబించినట్లు కనఁబడును. ఆ మతమును స్వీకరించిన పిదపఁ గావచ్చు నీతఁడు రాజధానియయిన పురుషపురమునను, దక్షిణమున మధురయందును పెక్కుస్తూపములను, ఇతర నిర్మాణములను రచియించెను. ఇట్టివానిలో పురుషపురమున నీతఁడు కట్టించిన నాలుగు వందల యడుగుల యెత్తుగల ధాతుచైత్యము తరువాతి కాలపు చీనా యాత్రికులకును, అరబ్బీయాత్రికులకును విస్మయమును గొలుపుచుండెను. కాలాంతరమున విశీర్ణమయిన యీ నిర్మాణము శిథిలావశేషము లిటీవలనే బయలుపడినవి. తక్షశిల, పెషావరునగరములం దిటీవల జరగిన పురావస్తుఖననపరిశోధనము (Archaeological excavations) వలన కుషాణులకాలమునాఁటి శిథిలావ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శేషము లెన్నో వెలుఁగులోనికి వచ్చినవి. ఈ నిర్మాణములకు కనిష్కుఁ డొసంగిన ప్రోత్సాహముకతమున శిల్పకళ వర్ధిల్లినది.

కనిష్కుఁడు గొప్ప బౌద్ధమతాభిమాని; అయినను ఇతర మతములనుగూడ కడుగౌరవించి మతసహనము చూపినవాఁడు. ఇతని యాస్థానము పండితబృందముతో విరాజిల్లుచుండెను. ఇట్టి విద్వద్వతంసములలోఁ జేర్పఁ-నవలసినవారు అశ్వఘోష, వసుమిత్ర, ధర్మత్రాత, పార్శ్వులు. వీరిలో అశ్వఘోషుఁడు పాటలీపుత్రనివాసి యయిన బ్రాహ్మణుఁడు; మొదట వేదశాస్త్రముల నభ్యసించి, పిదప బౌద్ధాగమము నధ్యయనముఁ గావించి, బౌద్ధమతమును స్వీకరించెను. పాటలీపుత్రమును జయించినప్పుడు కనిష్కుఁ డీతనిని తన రాజధానికిఁ గొనిపోయి తన యాస్థానమున కొక యలంకారము గావించెను. అశ్వఘోషుని గ్రంథములలో మిక్కిలి ముఖ్యమయినది 'బుద్ధచరిత' మను మహాకావ్యము; వాల్మీకి కాళిదాసుల గ్రంథములతో సరిసమాన మయినదని పేర్వడినది. సౌందరనంద కావ్య మను మఱియొక గ్రంథము కావ్యరీతికి చక్కని యాదర్శము. ఇతఁడు రచియించిన మూఁడవ మహా గ్రంథము సూత్రాలంకార మను గద్యపద్యాత్మకమయిన కథాగుచ్ఛము. 'సారిపుత్రప్రకరణ' మను ఈతఁడు రచియించిన నాటిక ఈ నడుమనే బయలుపడినది. ఈతఁడు కావ్యనాటకాదులను రచియించి ప్రసిద్ధికెక్కిన మహాకవియే కాక గాయకుఁడు, విద్వాంసుఁడు, గొప్ప దార్శనికుఁడు అని కీర్తి గడించెను. బౌద్ధ గ్రంథములవలన అశ్వఘోషుఁడు కనిష్కుని కుపదేశకుఁడుగ నుండెనని తెలియుచున్నది. వాసికెక్కిన సుశ్రుత మను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైద్యగ్రంథమును రచియించిన చరకుఁడు కనిష్కుని యాస్థాన వైద్యశిరోమణి. మిగిలిన వసుమిత్రాదులు బౌద్ధాగమపారంగతులయిన భిక్షుశిరోమణులు.

కనిష్కుని రాజ్యము మధ్యఆసియాఖండమునఁగూడ వ్యాపించుటచేత ఈ చక్రవర్తి యాదరణమున బౌద్ధము మధ్య ఆసియాఖండదేశములందు వ్యాపించినది. అటనుండి యది చీనాదేశమునకును, అచ్చటనుండి కొరియామీఁదుగ జపాను దేశమునకును జాలువారినది. ఈ కారణముననే బ్రాహ్మీ, ఖరోష్ఠీలిపులే కాక ప్రాకృత, సంస్కృత బౌద్ధ వాఙ్మయములును మధ్యఆసియాఖండదేశములందు స్థావరము కల్పించుకొనినవి. ప్రాగ్దక్షిణ తుర్కిస్థానము మొదలయిన మధ్య ఆసియాఖండదేశములందు జర్మనీ, ఫ్రాన్సు, రష్యా, బ్రిటను, జపాను దేశములందలి ప్రాచ్యవిజ్ఞాన పరిశోధకపండితులు జరపిన పరిశోధనములకు ఫలితముగ క్రీస్తుశక మయిదాఱు శతాబ్దులనాఁటివే కాక మొదటిశతాబ్దినాఁటి సంస్కృత ప్రాకృత బౌద్ధమత గ్రంథములు, క్రీస్తుశకము మొదటిశతాబ్దులనాఁటి వైద్య, గణిత, చారిత్రక గ్రంథములు—భూర్జపత్రములమీఁద వ్రాసినవి, అనేకములు దొరకినవి. వీనివలన హిందూదేశ మాకాలమున పశ్చిమోత్తరముగ నెట్టి యాధ్యాత్మికవిజయమును జేకూర్చుచుండెనో తెలియఁగలదు.

కనిష్కచక్రవర్తికాలమున ఉత్తరహిందూదేశమునందు కాశ్మీర, గాంధారములు బౌద్ధమునకు ప్రధానపీఠము లయినవి. కనిష్కుని కాలమునాఁటికి బౌద్ధసంఘమునందు చీలికలెక్కువయి, పదునెన్మిది సంప్రదాయము లేర్పడినవి. హిందూదేశమున వైదికబ్రాహ్మణమతము పొందుచుండిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మార్పుల ప్రభావమునను, హిందూదేశమునకుఁ బశ్చిమమునఁ గల దేశములందలి మతసంప్రదాయముల సన్నివేశమునను బౌద్ధమతమునఁగూడ మార్పులు కలుగుచుండెను. ఈ మార్పున కనుగుణముగ బౌద్ధమును సవరింప పూర్వోక్తపంథలలో సర్వాస్తివాదు లను నొకపంథవారు కనిష్కచక్రవర్తి యాదరణమున కాశ్మీరమునందలి జాలంధరసంఘారామమున నొకసంగీతిని సమావేశపఱిచిరి. అయిదువందలమంది బౌద్ధభిక్షువులు సమావేశమయిరి. వసుమిత్రుఁ డధ్యక్షుఁడు. ఈ సంగీతియందు సూత్ర వినయాభిధర్మములకు ఉపదేశ విభాషాశాస్త్రము లని మూఁడు వ్యాఖ్యానములు రచియింపఁబడినవి.

కనిష్కుని యనంతరము వాసిష్క, హువిష్క, వాసుదేవు లను వారు కుషాణరాజ్యమును పాలించిరి. వారిని గుఱించి మన కంతగఁ దెలియదు. వాసుదేవపరిపాలనానంతరము కుషాణుల యధికారము క్రమక్రమముగ సన్నగిల్లి, పిదప విభిన్నమయినది. కుషాణసామ్రాజ్యపతనచారిత్రము దురవగాహమయిన ప్రకరణములలో నొకటి. సామ్రాజ్యము భిన్నమయిన పిదప కుషాణవంశజు లింకను గొంతకాలమువఱకు అందందు చిన్నరాజ్యములను గట్టుకొని యేలుచువచ్చిరి. కొందఱు కుషాణనాయకులు క్రీస్తుశక మయిదవశతాబ్దిని హూణులు దండెత్తివచ్చునఱకు కాబూలులోయలో పరిపాలనము సాగించుచునే యుండిరి.

కుషాణభూపాలుర రాజ్యపాలనకాలనిర్ణయ మింకను వివాదగ్రస్త విషయముగనే యున్నది. కనిష్కచక్రవర్తి శాసనములందు వత్సరసంఖ్య యొసంగఁబడినది. ఈవత్సరములు (శాలివాహన)శకవర్షములా, విక్రమశకవర్షములా యని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చరిత్రపరిశోధకులలో మీమాంస కలదు. విక్రమశకవర్షము లని కొందఱు; (శాలివాహన)శకవర్షము లని కొందఱు. (శాలి వాహన)శకకర్త యితఁడే యని కొందఱ యభిప్రాయము. ఇది సరియగుచో నితఁడు క్రీ. శ. ౭౮ లో రాజ్యమునకు వచ్చి యుండవలెను. ఎట్లయినను ఈకుషాణులు వందసంవత్సరము లకు పైఁగా రాజ్యముచేసి రనుట తథ్యము.

కుషాణుల నాణెములందు వేఱువేఱు జాతులవారి నాణె ముల లక్షణము లన్నియుఁ గన్పట్టును. ఆకారము రీతి రోమను లది; వానిమీఁది పేరులు ఖరోష్ఠీలిపిలోనో గ్రీకులిపిలోనో యుండును: భాష గ్రీకు, పారసీకములలో నేదో యొకటి. నాణెముల కొకవైపున గ్రీకు, జొరాష్ట్రియను, హిందూదైవ ములలో నేదో యొకటి యుండును; రెండవవైపు రాజుబొమ్మ యుండును. ఇట్లు వీరి నాణెములమీఁద గ్రీకు, రోమను, హిందూప్రభావము కన్పట్టును.

## మతపరిణామము

బౌద్ధమతము:— బౌద్ధసంఘమున పదునెనిమిది సం ప్రదాయము లేర్పడిన వని యీవఱకే తెలుపఁబడినది. సం ఘమునఁ గలిగిన యీ భిన్నపంథలవలన బౌద్ధము లక్ష్య మున మార్పు కలుగుచుండెను. మార్పు నంగీకరించిన బౌద్ధమునకు మహాయాన మని, అంగీకరింపని బౌద్ధమునకు హీనయాన మని పేరు. బౌద్ధమత పరిణామమునఁ గలిగిన మార్పులలో నిదియే చాల గొప్పది. హీనయాన, మహా యానములకు ముఖ్యముగ నాలుగు విషయములందు గొప్ప భేదము కలదు. అవి యేవన: (౧) హీనయానమున సర్వసంగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిత్యాగముఁ గావించి భిక్షుకుఁడయి అర్హాతపదము నొందిబుద్ధుని దైవముగ నమ్మిననే నిర్వాణము. మహాయానమున నిర్వాణము నొందుటకు భిక్షు వగుట యనావశ్యకము. గృహస్థుగ నుండియే బుద్ధులను, బోధిసత్త్వులను భక్తి విశ్వాసములతోఁ గొలిచినయెడల నిర్వాణము దొరకును; అనఁగా శీల ప్రధానమయినది హీనయానము; భక్తి ప్రధానమయినది మహాయానము. ఇట్లు నిర్వాణోపలబ్ధికి భక్తులకుఁ దోడ్పడుటకై మహాయానమున బుద్ధులును, బోధిసత్త్వులును అసంఖ్యముగ వెలసిరి. బుద్ధపదము నింకను బడయకపోయినను దాని చేరికకు వచ్చి యీ జన్మముననో భవిష్యజ్జన్మముననో దానిని బడయనున్నవారు బోధిసత్త్వులు. వీరికి వృత్తాకారములు నిర్ణీతములయి, గొప్ప బౌద్ధపురాణవాఙ్మయ ముద్భవిల్లినది. ఈరీతిని మహాయానమున భక్తి కవకాశ మేర్పడుటచేత విగ్రహారాధనము, మంత్ర తంత్రాదులు అతిశయించినవి; (౨) హీనయానము దేవుఁడు, జీవుఁడు, ప్రపంచ సత్యత్వాసత్యత్వములు అను వేదాంత విషయములనుగుఱించి బుద్ధుఁడు బోధింపనే లేదని అట్టి విషయచర్చ కెడమీయదు. బుద్ధుని బోధలందిట్టి విషయములకు సూచనలు నిగూఢముగ నున్నవని, అట్టివానిని గుఱించిన తర్కమును పెంపొందించి మహాయానము గొప్ప బౌద్ధ దర్శనమును స్థాపించెను; (3) మహాయానబౌద్ధులున్నవి యున్నయట్లు త్రిపిటకముల ప్రామాణ్యము నంగీకరింపక వానియందుఁ బెక్కు మార్పులు చేర్పులు కావించిరి. ఇట్లు బౌద్ధవేదగ్రంథముల విషయముననే మహాయాన, హీనయాన బౌద్ధు లిరుతెగలవారికి చాల భేదము కలిగినది; (౪) హీనయానవేదగ్రంథములగు త్రిపిటకముల భాష పాలీ. మహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యానబౌద్ధులు తమ వేదగ్రంథములకు పాలీని విడిచి సంస్కృతమును గైకొనిరి.

మహాయానబౌద్ధమునకు ప్రధానకారకుఁ డాంధ్రరాజుల యాశ్రయమున వర్ధిల్లిన ఆర్యనాగార్జునుఁడు. ఇతఁడు మహావిద్వాంసుఁడు; పెక్కు గ్రంథరాజములను రచియించెను; బౌద్ధదర్శనమున 'మాధ్యమిక వాద' మని యొక వాదమును బయలు దేఁదీసినవాఁడు. ప్రజలలో నుత్సాహమును రేకెత్తించి యాకర్షింపలేక క్షీణదశకు వచ్చుచుండిన బౌద్ధమునకు క్రొత్త జీవము పోసి, క్రొత్తరూపము నిచ్చి నాగార్జునాచార్యుఁడు దాని కొక క్రొత్తవికాసము కలిగించెను. కనిష్కునినాఁడును, కడపటి యాంధ్రచక్రవర్తులనాఁడును హిందూదేశమున పాలపొంగువలె పొంగారిన బౌద్ధ మిదియే.

నాగార్జునాచార్యుఁడు ఆంధ్రుఁ డని ప్రతీతి. ఆంధ్రచక్రవర్తుల యాదరాశ్రయముల వర్ధిల్లినవాఁడు; ఆంధ్రచక్రవర్తి కొఱకు సుహృల్లేఖ యను నీతికావ్యమును రచించెను. ఇతఁడు పల్నాఁటియందలి నాగార్జునునికొండమీఁద నివసించె నని చెప్పుదురు. శ్రీపర్వతమని దీని పురాతననామము. నాగార్జునునికొండదగ్గఱ త్రవ్వఁగా నిటీవల పెక్కు స్తూపరాజములు, చైత్యశాలలు, ఇతర బౌద్ధ నిర్మాణములు కానవచ్చినవి. నాగార్జునాచార్యుల శిష్యుఁడు ఆర్యదేవుఁడును, ధర్మపాలుఁడును దక్షిణాదిని బౌద్ధము నెక్కువగ వ్యాపింపఁజేసిరి.

మహాయానము శీఘ్రకాలముననే ప్రజాహృదయము నాకర్షించినది. ఇది యుత్తరహిందూదేశముననే కాక కనిష్కపరిపాలితమయిన మధ్యఆసియాదేశములందుఁ గూడ అతిశీఘ్రముగ వ్యాపించినది; అటనుండి చీనా, జపాను, కొరియా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొదలగు దేశములకుఁ బ్రాఁకినది. ఇది యిటు లుండ, హీన యాన ముత్తరదేశములందు నిలువ నీఁడ లేక దక్షిణమున సింహ ళమున కరిగి యచ్చట నెల వేర్పఱుచుకొనెను. అటనుండి యది బర్మా, సయాం, కాంబోడియా మొదలగు దేశములకును, జావా మొదలగు ద్వీపములకును వ్యాపించినది. హిందూ దేశమున బౌద్ధము కాలక్రమమున అంతరించిపోయినది కాని యిప్పటికిని పూర్వోక్తములయిన యుత్తరదేశములందు మహా యానమును, దక్షిణదేశములందు హీనయానమును ప్రధాన మతములు.

బౌద్ధకళ:— మహాయాన బౌద్ధముతో బౌద్ధకళయం దును మార్పులు కలిగినవి. బోధిసత్త్వులకారణమున బౌద్ధ పౌరాణికవిగ్రహ నిర్మాణ మొకకళగ వికసించినది. హీనయా నమున బౌద్ధశిల్పమున బుద్ధుని కాకృతి లేదు. శిల్పమున శూన్య తలమును జూపుటయే బుద్ధభావమునకు సూచనగ నుండెడిది. ఈ కారణముననే సాంచీ, భార్హూత్ స్తూపములందు తచ్ఛిల్ప మున బుద్ధవిగ్రహము కానరాదు. కాని మహాయానము వర్ధిల్లిన నాఁటి స్తూపశిల్పమున బుద్ధమూర్తిని సృష్టించిరి. స్తూపములందు శిల్పరచనము విస్తరిల్లినది. మహాయానమునలన పొందిన క్రొత్త ప్రోత్సాహమువలన బౌద్ధకళ వసంతారామము విధమున నేత్ర పర్వముగ వికసించి, పెక్కు రీతులను (Styles) వెలయించెను. వానిలో అమరావతీ, గాంధారరీతులు పేర్కొనఁదగినవి. ఆంధ్ర దేశమునందలి అమరావతి, గోలి, జగ్గయ్యపేట, నాగార్జునుని కొండ మొదలగు స్తూపములందలి శిల్పమున విప్పారినది అమ రావతీరీతి. కనిష్కపరిపాలితమైన గాంధారదేశమున ఆవి ష్కారము చెందినది గాంధారరీతి; గాంధార కళ యనియు దీనిని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కేర్కొందురు. గాంధారము యవన, రోమకాది పాశ్చాత్యుల యొక్కయు, హిందువులు మొదలగు ప్రాచ్యులయొక్కయు సంస్కృతికి సంగమప్రదేశ మగుటవలన గాంధారరీతియందు— ఇతివృత్తము దేశీయ మయినను—రూపలేఖనమున యవనప్రభావము స్ఫుటముగఁ గాన్పించును. గాంధారకళయందలి మంచిని గ్రహించి దేశీయముగ దానిని సవరించి అమరావతీరీతియందు చక్కని పంథ త్రొక్కినవా రాంధ్రులు. మహాయానము వర్ధిల్లిన యీ దినములందే అమరావతీస్తూపము పెంపుగాంచినది. ఈ స్తూపముచుట్టు ఆర్యనాగార్జునుఁడు దివ్యచిత్రకళాసంపదతో నొప్పారు శిలాప్రాకారమును గట్టించెను. అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జునునికొండ స్తూపములందలి శిల్పమున బుద్ధజీవితకథలును, జాతకకథలును విశేషముగ చిత్రిత మయినవి.

భాగవత మతము:— జైన, బౌద్ధమతము లీరీతిని దేశమున వ్యాపించుచుండ దేశీయుల మతదృష్టిలో మార్పు కలుగుచుండెను. సన్న్యాసప్రధానమయిన జైన, బౌద్ధములమీఁదను, వైదికక్రతు ప్రధానమయిన బ్రాహ్మణమతము మీఁదను ప్రజలకు విశ్వాసము తగ్గుచుండెను. దీనికి ఫలితముగ క్రీస్తుకు పూర్వ మయిదవశతాబ్దియందు మధురాప్రాంతమున తొలుదొల్త స్థిరపడిన యాదవులందలి సాత్వతు లను తెగవారు మతసంస్కారమునకు దారితీసి భాగవతమత మనుపేర నొక నూతనసంప్రదాయమును స్థాపించిరి. దేవదేవుఁడయిన సర్వేశ్వరుఁ డొకఁడు కలఁడని, ఆ సర్వేశ్వరునిమీఁది భక్తివలననే మోక్షము కలుగునని భాగవతమతసిద్ధాంతము. భాగవతులు సర్వేశ్వరునికి వాసుదేవుఁ డని, హరి యని పేరిడిరి. ఈ సంప్రదాయమువారి తత్త్వము భగవద్గీతయందు పొందుపఱుపఁబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అమరావతీస్తూపాకృతి

(స్తూపమున ఒక రాతిపై చెక్కినది)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రీస్తుశకము మూఁడవశతాబ్దినాఁటికే యీ మతము బాగుగ పురికొనినది. వృష్ణికులసంజాతుఁడగు కృష్ణుఁ డీమతమునకు గొప్పప్రోత్సాహము నొసంగెను. ఈ కారణమున నితనిచుట్టు అనతికాలముననే పెక్కుగాథ లల్లుకొన్నవి. ఇట్టి గాథలు కొన్ని క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దినాఁటికే ఆర్మీనియాప్రాంతమునకుఁ బ్రాఁకినవి.

జైన, బౌద్ధములవలె ఈ నూతనమతము జంతుహింసను గర్హించెను; కాని వానివలె వేదముల ప్రామాణ్యమును నిరసింపలేదు. కేవలము కూడదని నిరాకరింపకపోయినను ఇది బ్రాహ్మణమతమువలె వైదికక్రతువులకు ప్రాధాన్యమొసంగలేదు. జైన, బౌద్ధములు నాస్తికమతములు కాఁగా, ఈ మతము సర్వేశ్వరుఁడు కలఁడని చెప్పి ఆస్తిక మయినది. మోక్షావాప్తికి సన్యాసము, తపస్సు అప్రధాన మని, భక్తియే సాధన మని చాటి వాసుదేవారాధనను ప్రోత్సహించెను. బ్రాహ్మణమతమువలెఁ గాక ఇది జైన, బౌద్ధములవలె నాలుగు వర్ణములవారినే కాక విదేశీయులనుగూడఁ దన యావరణమునఁ జేర్చుకొనుచువచ్చెను. ఈ కారణమున విదేశీయులుకూడ ఈ మతము నవలంబించుచుండిరి. యవనదూత హీలియోదోరస్ భాగవతుఁడయి, వాసుదేవగారవార్థము బీస్నగరునందు గరుడధ్వజమును ప్రతిష్ఠించెను.

ఏవిధముననో, ఏకారణముననో తెలియదు కాని యీ భాగవతమతము క్రీస్తుశక మొకటి, రెండు శతాబ్దులనాఁటికే బ్రాహ్మణమతమునఁ జేరిపోయెను. బ్రాహ్మణమతమునం దిది యొకసంప్రదాయ మయినపిదప వాసుదేవ, కృష్ణులను వైదికదేవత లయిన నారాయణ విష్ణు లనిరి. ఇది బ్రాహ్మణమతమునఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలసిపోయి యా మతము నెక్కువగ మార్చుటయే కాక తానుగూడ చాల మార్పు నొందెను. కాలాంతరమున నిదియే వైష్ణవ మను పేరఁ బ్రఖ్యాతమయినది.

బ్రాహ్మణమతము ప్రాపున ఈ మతము బాగుగ వర్ధిల్లి జైన, బౌద్ధములకు గొప్ప ప్రతిస్పర్ధి యయినది. జైనమతమున తీర్థంకరులవలెను, బౌద్ధమున పురాణబుద్ధులవలెను ఈ వైష్ణవమతముననను అవతారగాథలు కల్పితములయినవి. భక్తిపూజాప్రపత్తులయందును, పురాణగాథలయందును బౌద్ధ, వైష్ణవము లొకదాని నొకటి తీసిపోవక ప్రజాహృదయమును వశపఱుచుకొనుటకు దేని కదియే తీవ్రముగఁ బ్రయత్నించినవి. క్రీస్తు శకము రెండు మూఁడు శతాబ్దులనాఁటికి వైష్ణవ ముత్తరహిందూస్థానముననే కాక దక్షిణ హిందూదేశమునఁ గూడ వ్యాపించినది.

శైవమతము:— భాగవతమతముతో సమముగ ఈ కాలమున విస్పారినమతము శైవము. భాగవతమతమువలెనే ఇదియు ఆస్తికమతము. శివుఁడే సర్వేశ్వరుఁ డని, భక్తిసాధనమున శివు నారాధించిన మోక్షము కలుగు నని ఈ మతము సిద్ధాంతము. వైష్ణవమువలెనే యిదికూడ భక్తిప్రధానమయిన మతము. అట్లగుట నిదియు వైదికకర్మకు ప్రాధాన్యము నొసంగలేదు. ఋగ్వేదదేవతలలో నొకఁడగు రుద్రుఁడే వేదపరిణామ కాలమున శుభంకరుఁడయి, సర్వేశ్వరుఁడయి శివనామమునఁ బ్రస్తుతుఁ డయ్యెను. ఇట్లితఁడు ప్రత్యేక మొక తెగవారికిఁ గాక సామాన్యముగ ఆర్యజనులకెల్లరకు పూజ్యుఁ డయ్యెను. హిందూదేశమున శైవ మాదికాలముననుండియు వర్ధిల్లుచుండె ననుటకు మోహెంజోదారో, హరప్ప ప్రాంతములందలి పురావస్తు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖననపరిశోధనలే తార్కాణము. వేదమతపరిణామమున శివారాధనముకూడ పురికొని, కాలక్రమమున క్రీస్తునకు పూర్వము రెండవ శతాబ్దినాటికే దేశమున పెక్కు శైవసంప్రదాయములు చిగిర్చినవి. భాగవతమతమునకు కృష్ణునివలెనే లకులీశ్వుడు శైవమునకు సమయ, సిద్ధాంతముల నేర్పఱిచి దానిని కట్టుదిట్ట పఱిచెను. క్రీస్తుశకము రెండు మూఁడు శతాబ్దులనాఁటికి శైవ, పాశుపత, కాలాముఖ, కాపాలికము లని బాగుగ వికసించి, ప్రాముఖ్యమునందిన శైవసంప్రదాయములు నాలుగుండెను. శివునికి త్రిశూల మాయుధమును, నంది వాహనమునై, శైవమున కివి సంకేతము లయినవి.

బౌద్ధ, భాగవతులవలెనే శైవులును దమమతద్వారములను హిందూసంఘమునందలి చతుర్వర్ణములవారికే కాక విదేశీయులకునైతము తెఱచియుంచిరి. ఈకారణమున విదేశీయులును గొంద ఱీమతము నభిమానించి యవలంబించిరి. కుషాణభూపతులలో కనిష్కునికి పూర్వుఁడయిన రెండవ వేమకడ్ఫిసీస్ శైవమతావలంబకులగు విదేశీయులలో నొకఁడు. ఇతని నాణెములమీఁద నొకప్రక్క త్రిశూలధారియైన శివుఁడు నందితో ముద్రితుఁడయినాఁడు.

కాలక్రమమున వైష్ణవముతోపాటి శైవమతమును ప్రబలి, నేఁటికిని హిందువుల కిది సామాన్యమతముగ నున్నది.

ఇట్లే బౌద్ధమతము వర్ధిల్లుచుండిన కాలమున, మతమున భక్తి ప్రాధాన్యము వహించుటతో ఇంకను కొన్నిమతములు మొలకలెత్తినవి. గణపతి, కార్తికేయుఁడు, సూర్యుఁడు, శక్తి మొదలగువారు ఆరాధ్యులయి, నూతనమతసంప్రదాయముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కధిదేవత లయిరి. కాని యీమతములు శైవ వైష్ణవములవలెం దరువాత నెప్పుడును భారతభూమిని గొప్పగ వర్ధిల్లి యుండలేదు.

---

## గుప్తసామ్రాజ్యము

కుషానుసామ్రాజ్య మస్తమించిన వెనుక రమారమి యొకశతాబ్దివఱకుం గల హిందూదేశచారిత్ర మజ్ఞాతయుగ మని చెప్పఁదగును. దేశ మరాజక మయ్యెను. చిన్ననాయకు లందందు చిన్న చిన్న రాజ్యములను గట్టుకొని స్వతంత్రులయి పరిపాలించుచుండిరి. రాజ్యలోభమున వీరు తఱచుగ నొం డొరులతో మాత్సర్యము పెంచుకొని కలహించుచుండిరి. బౌద్ధాచార్యులకు రాజుల రాజ్యకాంక్ష నరికట్టి వారిదృష్టిని దేశహితమునకై మరల్పఁగల పటుత్వము కొఱవడినది. బౌద్ధ సంఘమునకు ప్రజలలో ధర్మాసక్తి నుద్దీపింపఁజేయఁగల శక్తి కుంటువడినది. బౌద్ధభిక్షువులును, రాజులునుగూడ ఆత్మలాభ పరాయణులై ప్రవర్తించుచుండిరి. బౌద్ధమతమున బాహ్య పూజోత్సవాడంబరము లధిక మయినవి; ఆచార్యులకు ప్రజలను మతమునఁ జేర్చుటయే పరమార్థ మయినది. ఆర్యధర్మమునకు భంగము వాటిల్లినది. ఆర్యవిజ్ఞానతేజము చెన్నుమాసినది. ధర్మవిప్లవము సంభవించిన యీ తరుణముననే గుప్తసామ్రాజ్య ముదయించినది.

మౌర్యులకుఁ బిదప నుత్తరహిందూదేశమున నొక మహాసామ్రాజ్యమును స్థాపించినవారు గుప్తవంశజులు. వీరిలో ప్రథముఁడు శ్రీగుప్తుఁడు. ఇతని కుమారుఁడు ఘటోత్కచుఁడు. ఘటోత్కచ తనయుఁడైన చంద్రగుప్తుఁడే గుప్తరాజ్యసంస్థా పకుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చంద్రగుప్తుఁడు క్రీ. శ. 320 లో సింహాసనారూఢుఁడయ్యెను. ఇతఁడు రాజ్యమునకు వచ్చినవెంటనే క్రొత్తశకమును స్థాపించెను. గుప్తశకమని దీనికిఁ బేరు. విక్రాంతమయిన యార్యధర్మము మరల భారతభూమిని ప్రవర్తితమైనది గుప్తశకారంభమువనుండియే. గుప్తరాజ్యమునకు పాటలీపుత్రము రాజధాని.

చంద్రగుప్తుఁడు వైశాలి లిచ్ఛవీవంశసంజాతయైన కుమారదేవిని పరిణయమాడెను. బలవంతులయిన లిచ్ఛవులతోడి యీ సంబంధమువలన చంద్రగుప్తునిస్థితి మఱింత భద్రపడి, రాజకీయముగ నాతఁడు ప్రబలుఁడయ్యెను. తన రాజకీయస్థితి కీసంబంధ మంతటి గట్టితనమును చేకూర్చినదగుటచేత నతఁడు తన నాణెములమీఁద తన ముద్రనే కాక, తన రాణిముద్రను, లిచ్ఛవీదేవతయైన లక్ష్మి ముద్రనుగూడ కొట్టించెను. మహారాజాధిరాజబిరుదాంచితుఁ డయిన యితని పరిపాలన మెప్పుడు ముగిసినదియుఁ దెలియదు.

తరువాత సింహాసన మెక్కినవాఁడు చంద్రగుప్తుని తనయుఁడగు సముద్రగుప్తుఁడు. తండ్రి సంపాదించిన రాజ్యముతో తనివినొందక, యాతఁడు సేతుశీతనగముపర్యంతముఁ గల దేశము నేకచ్ఛత్రముక్రిందకుఁ దీసికొనిరావలెనని సైన్యముల నాయత్తముచేసి శుభముహూర్తమున జైత్రయాత్రకు బయలుదెడలెను. హరిసేనుఁడను నీతని యాస్థానకవి రచియించిన యీతని దిగ్విజయకథ ప్రయాగయందలి అశోకశిలాశాసనస్తంభముపై చెక్కఁబడియున్నది. దానివలన సముద్రగుప్తుఁడు ఆర్యావర్తమునందలి భూపతులను, దక్షిణాపథపు రాజులను, మధ్యహిందూదేశమునందలి ఆటవికరాజ్యములను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జయించి, సరిహద్దురాజ్యముల రాజులవలననుండి కప్పము లను గైకొనెనని తెలియుచున్నది. సముద్రగుప్త విజయములు దక్షిణమున కాంచీపురమువఱకుమాత్రమే వర్ణిత మగుటచేత, ఏ కారణముననైన నేమి, సముద్రగుప్తుఁడు కాంచీపురముననుండి వెనుకకు మరలియుండుననని చరిత్రకారుల యూహ. ఈవిజ యములవలన గుప్తసామ్రాజ్యము సముద్రగుప్తుని కాలమున తూర్పున హుగ్లీనుండి పడుమట చంబల్ వఱకును, ఉత్తరమున హిమాలయమునుండి దక్షిణమున నర్మదవఱకును వ్యాపించి నది. ఈ విజయధాటి ముగిసినవెనుక సముద్రగుప్తుఁడు తన దిగ్విజయమునకు సూచకముగ అశ్వమేధయాగము నొనరిం చెను.

సముద్రగుప్త విజయాంకితములయిన దక్షిణాపథరాజ్య ములలో కళింగ, ఆంధ్ర, పల్లవరాజ్యములు కొన్ని. సముద్ర గుప్తుని దండయాత్రనాఁటికి కళింగమున చిన్నరాజ్యము లనే కములు వెలసినవి. మహేంద్రగిరి, పిష్ఠపురము (పిఠాపురము), ఏరండపల్లి మొదలయిన వట్టివానిలోఁ గొన్ని. ఇవి యన్నియు సముద్రగుప్తుని విజయధాటికి మ్రొగ్గతిల్లినవి. పిఠాపురమునకు దక్షిణమున కృష్ణా, గోదావరీ నదులకు నడుమఁ గల యాంధ్ర దేశమునకు వేఁగి యని పేరు. పెదవేఁగి రాజధానిగ దీని నేలు చుండిన శాలంకాయన సగోత్రజుఁడయిన హస్తివర్మయు, కాంచీ పురము రాజధానిగ కృష్ణకు దక్షిణమున నుండిన దేశమును పాలించుచుండిన విష్ణుగోపుఁడును సముద్రగుప్తునికి సమకాలి కులు. కళింగరాజ్యాధిపతులవలెనే హస్తివర్మ, విష్ణుగోపులు కూడ సముద్రగుప్తు నెదుర్కొనిరి కాని తుదకు పరాభూతు లైరి. సముద్రగుప్తుఁ డార్యావర్తభూపతులను జయించి వారి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యముల నాక్రమించుకొనెను గాని దక్షిణాపథపు రాజుల పట్ల ధర్మవిజయమును మాత్రమే పాటించి, మరల వారి రాజ్యములను వారి కిచ్చివేసెను. ఈకారణమున సముద్రగుప్తుని కాలముననే దరువాతకూడ వేంగిదేశమును శాలంకాయన వంశజులును, కాంచీపురమును పల్లవవంశజులును స్వతంత్రులయి పరిపాలించిరి.

సముద్రగుప్తుడు మహారాజాధిరాజు: ఎంతటి మహాయోధుడో అంతటి విద్యాప్రియుడు. సంగీత, సాహిత్యములను రెంటిని సమానముగ లాలించినవాడు. కవిరాజబిరుదాంచితుడు: గానకళాప్రవీణుడు. ఈతడు సింహాసనోపవిష్టుడయి వీణ మీటుచున్నట్లు ముద్రితములయిన ఈతని నాణెములు చాల దొరకినవి. ఈరాజచూడామణి పాలనమున దేశము కళాసంపదకు, భాగ్యభోగ్యములకు తావల మయినది. దూరస్థదేశముల నేలుచుండిన ధరణీశ్వరులుకూడ కానుకలతో నీ చక్రవర్తికి రాయబారముల నంపిరి. ఇట్టివారిలో సింహళద్వీపాధిపతియగు మేఘవర్ణు డొకడు. ఇతడు సముద్రగుప్తుని యనుమతిం బడసి సింహళద్వీపాగతులయిన బౌద్ధయాత్రికుల యుపయోగార్థము బుద్ధగయలో నొక చక్కని మహావిహారమును గట్టించెను.

అనంతరము సముద్రగుప్తుని కుమారులలో నొకడగు రామగుప్తుడు రాజయ్యెను. ఇతడు కడుభీరువు: అసమర్థుడు. ఈకారణమున పశ్చిమక్షత్రపులయిన శకవంశజులు గుప్తసామ్రాజ్యముపయి దాడివెడలిరి. రామగుప్తుడు తనభార్య ధ్రువదేవిని శకభూపతి తృష్ణ కెరచేసి రాజ్యమును కాపాడుకొనఁగోరి వారితో సంధి కావించుకొనెను. సముద్రగుప్త తనయులలో మఱి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డొకఁడగు రెండవ చంద్రగుప్తుఁ డీవిషయము నెఱింగి వంశ గౌరవమును గాపాడుకొన సాహసాంకుఁడు స్త్రీవేషమును ధరించి స్త్రీరూపధారులగు మఱికొందఱు యోధవరులతో రహస్యముగ శకభూపతి నగరము సొచ్చి, రాజాంతఃపురమునఁ బ్రవేశించి తుదకు శకనృపాలుని కడముట్టించెను. ఈవిషయము విశాఖదత్త కవి విరచిత మనఁబడు 'దేవీ చంద్రగుప్త' మను నాటకమువలనఁ దెలియుచున్నది. ఎట్లో తెలియదు కాని, రామగుప్తుఁడు శీఘ్రకాలముననే కడతేఱుటయు, రెండవ చంద్రగుప్తుఁడు రాజ్యమునకు వచ్చి, ధ్రువదేవిని పరిణయ మాడుటయు జరగెను.

రెండవ చంద్రగుప్తుఁడు తండ్రివలె వీరశిఖామణి; విద్యాప్రియుఁడు. ఈతఁడు తన తండ్రి సంపాదించిన రాజ్యమును సమర్థతతోఁ బరిపాలించుటయే కాక దక్షిణమునఁ దన పొరుగు రాజ్యమగు కుంతలమున కధీశ్వరుఁడయిన వాకాటకవంశజుఁడు మొదటి పృథ్వీసేనుని కుమారుఁడగు రుద్రసేనునికిఁ దన కూఁతురు ప్రభావతీగుప్త నొసంగి వాకాటకనృపాలురతో సంబంధబాంధవ్యములు నెఱపి తన రాజ్యస్థితిని బలపఱుచుకొనెను. పిదప నితఁడు పశ్చిమక్షత్రపులగు శకులపయి దాడి వెడలి, తద్వంశమును నిర్మూలముఁ గావించి, గుప్తరాజ్యమును పశ్చిమమున అరాబియాసముద్రమునకంట విస్తరింపఁజేసెను. ఈ విజయముతో పశ్చిమసముద్రతీరమునందలి గొప్ప రేవు పట్టణములు గుప్తసామ్రాజ్యస్థము లయినవి. ఈవిధమున పశ్చిమదేశవర్తకవ్యాపారముతో గుప్తసామ్రాజ్యమునకు ప్రత్యక్ష సంబంధము కలిగినది. క్షత్రపరాజ్యవిజయానంతర ముజ్జయిని గుప్తవంశజులకు ద్వితీయరాజధాని యైనది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తన సాహసపరాక్రమములచేత చంద్రగుప్త విక్రమాదిత్యుఁడని పేరందిన యితఁడు పరమభాగవతుఁడు. అయినను మతసహనము కలవాఁడు. ఈతని కాలమున జైన బౌద్ధములును, శైవ వైష్ణవములును సమానముగ రాజాదరణము నొందినవి. ఈతని కొలువున గొప్ప యధికారముల నియోజితులైన బౌద్ధులును, శైవులు నుండిరి. ఈతనికాలమున బౌద్ధయాత్రికుఁడయిన ఫాహియాన్ చీనాదేశముననుండి వినయపిటకగ్రంథములను సంపాదింప హిందూదేశమునకే తెంచెను.

చీనాదేశమున బౌద్ధభిక్షువుల ప్రచారమువలనను, చీనాభాషకు బౌద్ధగ్రంథముల ననువదించుటవలనను బౌద్ధము చీనాయందు వ్యాపించినపిదప తద్దేశవాసులు పూజాతత్పరులై బౌద్ధక్షేత్రములను సందర్శింపను, బౌద్ధపిటకగ్రంథములను సంపాదింపను హిందూదేశమున కరుదెంచుచుండిరి. ఇట్టివారిలో ఫాహియాను మొదటివాఁడు. ఇతఁడు క్రీ. శ. 3౯౯లో చీనానుండి బయలుదేఱి తక్షశిల, పురుషపురములమీఁదుగ ౪౦౧ నాఁటికి హిందూదేశమునకు వచ్చెను. ఇచ్చట ముఖ్య బౌద్ధక్షేత్రములను సందర్శించుచు, పిటకగ్రంథములను సంపాదించుచు ౪౧౧ వఱకు నుండి, పిదప తామ్రలిప్తినగరమున నోడ యెక్కి సింహళమునకుఁ బోయి, యచట రెండేండ్లు గడపి, పిదప జావామీఁదుగ చీనాదేశమున కరిగెను. ఫాహియాను వ్రాసియుంచిన వృత్తాంతమువలన చంద్రగుప్త విక్రమార్కుని నాఁటి మత, సాంఘిక, రాజకీయస్థితి కొంత తెలియుచున్నది.

చంద్రగుప్త విక్రమాదిత్యుఁడు క్రీ. శ. ౪౧౩ లో గతించిన యనంతరమున అతని కొడుకగు మొదటి కుమారగుప్తుఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజయి క్రీ. శ. ౪౫౫ వఱకు రాజ్యమేలెను. తన తాతవలె నితఁడును అశ్వమేధయాగము చేసెను. ఈతని రాజ్యకాలము మొత్తముమీఁద శాంతముగనే గడచినను కట్టకడపట మాత్రము పుష్యమిత్రులను శత్రువులవలన గుప్తరాజ్యమున కుపద్రవము సంభవించినది. ఈశత్రువిజృంభణకాలమున నీతఁడు పరమపదించెను.

పిదప అతని కుమారులలో నొకఁడగు స్కందగుప్తుఁడు క్రీ. శ. ౪౫౫ లో రాజ్యరక్షణభారము వహించి పుష్యమిత్రుల నోడించి రాజ్యమును గాపాడెను కాని త్వరలోనే గుప్త సామ్రాజ్యవిధ్వంసమునకు కారణములయిన హూణదండయాత్ర లారంభ మయినవి.

హూణులు మధ్యఆసియాఖండవాసులు. గుంపులు కట్టి వీరు హిందూదేశము వాయవ్యదిశ నున్న పర్వతపు కనుమలగుండ సింధునది పల్లపు మైదానములయందు ప్రవేశించి పంటలను పాడొనరించి, పల్లెలను, పట్టణములను కొల్లగొట్టి స్తూపారామదేవాలయాదులను నాశము గావించుచుండిరి. ఈకారణమున గుప్తులనాఁటి కలాసంపద యెంతయో మంటఁ గలసినది. స్కందగుప్తుఁడు సైన్యసమేతుఁడయి పోయి వారిని జయించి, విజయసూచకముగ విష్ణువిగ్రహాధిష్ఠితమయిన విజయస్తంభమును బ్రతిష్ఠించెను. ఈవిజయమువలన గుప్తసామ్రాజ్యమునకు తాత్కాలికముగ హూణోపద్రవ ముపశమించినను అది పూర్తిగ తొలఁగినదికాదు. ఈకష్టకాలముననే క్రీ. శ. ౪౬౭ లో స్కందగుప్తుని పరిపాలనము ముగిసినది.

స్కందగుప్తుని యనంతర మతని సోదరుఁడు పురగుప్తుఁడును (క్రీ. శ. ౪౬౭-౪౭౬), పిదప అతని తనయుఁడు నర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సింహగుప్త బాలాదిత్యుఁడును (క్రీ. శ. ౪౬౭ - ౪౭౩), అటు వెనుక అతని కుమారుఁడు రెండవ కుమారగుప్తుఁడును (క్రీ. శ. ౪౭౩ - ౪౭౭) గుప్తసామ్రాజ్యమును పాలించిరి. కాని సముద్రతరంగములవలె నొకదాని నొకటి వెన్నంటి వచ్చు చుండిన హూణదండయాత్రలవలన స్కందగుప్తుని కాలమున నుండియే గుప్తసామ్రాజ్యమునకు క్షీణదశ యారంభ మయినది.

కుమారగుప్తానంతరము పేర్కొనఁదగిన గుప్తభూపతి బుధగుప్తుఁడు (క్రీ. శ. ౪౭౭ - ౪౯౬). ఇతనికాలమున కింకను గుప్తాధికారము తూర్పున బంగాళమునుండి పడమట నర్మదను మాళవమువఱకుఁ జెల్లుచుండెను. శాసనములవలనను, నాణెములవలనను బుధగుప్తునికిఁ బిదప కొందఱు గుప్తరాజులు తెలియవచ్చెదరు కాని వారి రాజ్యకాలపరిమితియు, వారికిఁ గల పరస్పరసంబంధమును అజ్ఞాతవిషయములు. క్రీ. శ. ౫౧౦ ప్రాంతమున నుండిన భానుగుప్తునికాలమున హూణులు తోరమానుఁడను వాని నాయకత్వమున కాబూలు, గాంధారములను జయించి, గుప్తసామ్రాజ్యపశ్చిమభాగములపైఁ గవిసి, తుదకు వానిని కబళించిరి. పురుషపురము మొదలు మధ్యహిందూదేశమునందలి మాళవమువఱకుఁ గల దేశము హూణుల యధికారముక్రిందకు వచ్చినది. పంజాబునందలి శాకలనగరము వారికి రాజధాని. తోరమానుని యనంతరము హూణుల కధిపతియైనవాఁడు మిహిరకులుఁడు. రాజ్యతృష్ణతో ప్రాగ్దక్షిణహిందూదేశములను వశపఱుచుకొన హూణులు మిహిరకులుని కాలమున నింకను గొప్ప ప్రయత్నములు చేసిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ సందర్భమున ఆర్యధర్మపరిరక్షణమున కొఱనుండి కత్తిఁ దీసి ప్రసిద్ధిఁ గన్నవారు ముఖ్యముగ నిరువురు వీరశిఖామణులు కలరు. అం దొకఁడు సంయుక్తపరగణాలు, మగధ, గయప్రాంతముల రాజ్యమును నిర్మించుకొని మెల్లఁగ తలయెత్తుచుండిన మౌఖరివంశజుఁడగు ఈశానవర్మ. ఈతఁడును, ఈతని తనయుఁడు శర్వవర్మయు తూర్పు హిందూదేశమును హూణులబారిఁ బడకుండఁ గాపాడిరి. రెండవవాఁడు యశోధర్ముఁడు. ఇతని వంశమునుగుఱించి కాని, తలిదండ్రులనుగుఱించి కాని యేమియుఁ దెలియదు. ఇతఁడు హూణోపద్రవమునుండి దేశమును రక్షింపనే యవతరించినట్లు కన్పట్టును. క్రీ. శ. ౫౩౦ ప్రాంతమున నితఁడు వారిని భయంకరసంగ్రామమునఁ దలయెత్తకుండఁ గొట్టి యోడించి పాఱఁదోలెను. ఇతఁడు హిమాలయము మొదలు పశ్చిమసముద్రమువఱకుఁ బరిపాలించిన మధ్యహిందూదేశవీరుఁ డని తెలియును. ఇతనినిగుఱించిన యితరవిశేషములు కాని, యితని తరువాతివారిని గుఱించి కాని యేమియుఁ దెలియదు.

మిహిరకులుఁడు పరాజితుఁడును, పరాభూతుఁడునై కాశ్మీరమున కరిగి, తుద కచ్చటనే కాలవశత నొందెను. అతని యనంతరము హూణులు కోఱలు తీసినపాము లైరి. పంజాబు, రాజపుత్రస్థానములందటుతరువాత నందందు కొందఱు హూణులు మిగిలియున్నను వారు కాలక్రమమున హిందూసంఘమునఁ గలసిపోయిరి.

గుప్తసామ్రాజ్యము విచ్ఛిన్నమైన యనంతర మాశిథిలములమీఁద లేచిన రాజ్యములలో వలభీ, థానేశ్వరరాజ్యములు మాత్రమే పేర్కొనఁదగినవి. వలభీనగరము రాజధాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసికొని మైత్రకవంశజులు సురాష్ట్రమును (కాఠయవాడద్వీప కల్పము) పాలించిరి. వలభీరాజ్యము విద్యలను బోషించి, వర్తకమును వృద్ధినొందించినది. సింధుదేశమునుండి అరబ్బులు దండెత్తి వచ్చునంతవఱకు మైత్రకవంశజులు రమారమి మూఁడు వందలయేండ్లు తమ యధికారమును సాగించుచుండిరి.

గుప్తులయనంతరము త్తరహిందూదేశచరిత్రనాటకరంగమున ప్రధానపాత్రమును వినిపించినవారు థానేశ్వరభూపతులయిన ప్రభాకరవర్ధనాదులు. వీరినిగుఱించి తరువాతఁ దెలిసికొనఁగలము.

## దక్షిణాపథ రాజ్యములు

తామ్ర శిలాశాసనములు, నాణెములు మొదలయిన చరిత్రసాధనములు పట్టుదలతో దక్షిణాపథచారిత్రము నింకను అల్లుచునే యున్నవి. చరిత్రపటమునకు కొసలు కానవచ్చుచున్నను సమగ్రమును, అనుస్యూతమునయిన చారిత్ర మింకను కొఱఁతగనే యున్నది. ఒక్క విషయము మాత్రము స్పష్టము. ఉత్తరమున గుప్తసామ్రాజ్యమువలె, ఆంధ్రసామ్రాజ్యమునకుఁ బిదప, క్రీస్తుశకము మొదటిశతాబ్దులందు దక్షిణాపథము నొక్క ఛత్రచ్ఛాయకుఁ దీసికొని రాఁగలరాజ్య మేర్పడలేదు. ఆంధ్రసామ్రాజ్యభూమిని కదంబ, పల్లవాది వంశములు స్వతంత్రరాజ్యములను వెలయించినవని యీవఱకే తెలుపఁబడినది.

ఇక్ష్వాకులు:— ఆంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్నమయిన యనంతరము ప్రాగాంధ్రదేశమును ఇక్ష్వాకులు, పల్లవులు, శాలంకాయనులు ఆక్రమించుకొనిరి. వీరిలో ఇక్ష్వాకులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణ కుత్తరమునఁ గల దేశమున కధిపతు లయిరి. కాలక్రమమున వారి రాజ్యము గుంటూరుజిల్లా వాయవ్యభాగమునకును వ్యాపించినది. వైదికమతాభిమానులయి వేదోక్తమహాదానములను, క్రతువులను గావించినను వీరు జనాదరణపాత్రమై వర్ధిల్లు చుండిన బౌద్ధమతము నాదరించి పోషించిరి. జగ్గయ్యపేట, నాగార్జుననికొండ మొదలగుచోట్లఁ గానవచ్చిన స్తూపరాజములు, విహారములు మొదలయినవి ఈ యిక్ష్వాకువంశజుల కాలమున నిర్మితములైనవి. ఆంధ్రులకాలమునం దమరావతి వలె నాగార్జుననికొండ ప్రాంతము ఇక్ష్వాకుల కాలమున బౌద్ధమహాక్షేత్రముగఁ బ్రసిద్ధిఁ గాంచి, దూరస్థములయిన కాశ్మీర, గాంధార, చీనా, వంగ, వనవాసి, యవన, ద్రమిళాది దేశములనుండి యాత్రికుల నాకర్షించినది. చరిత్రమునకు శాంతిమూల, వీరపురుషదత్తాదులగు నిక్ష్వాకునృపాలురు కొందఱు తెలియవచ్చినను వారిని గుఱించి విశేషము లేవియుఁ దెలియవు.

పల్లవులు:—వీరు కృష్ణానదికి దక్షిణమున నుండు ప్రాక్సముద్ర తీరస్థదేశము నాక్రమించుకొని కాంచీపురము రాజధానిగ రాజ్యమేలిరి. సముద్రగుప్తునిచేత నోడింపఁబడిన విష్ణుగోపుఁడు పల్లవవంశజుఁడే. దక్షిణాపథమున పల్లవులు బ్రాహ్మణమతము నుద్ధరించి వైదికధర్మమును బోషించిరి. క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దిని చోళు లాక్రమించుకొనునంతవఱకు కాంచీపురప్రాంతము పల్లవులవశముననే యుండెను. ఏడవ శతాబ్దికి పూర్వము వీరి చారిత్రమున విశేషము లేవియుఁ దెలియవు.

శాలంకాయనులు :— వీరు క్రీస్తుశకము నాలుగవ శతాబ్ది మధ్యనుండి వేఁగి¦యనుపేరఁ బరఁగు కృష్ణా, గోదావరీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మధ్యస్థమయిన సముద్రతీరస్థాంధ్రదేశమును పాలించిరి. ఈ వంశమునందలి హస్తివర్మను సముద్రగుప్తుఁడు తన దక్షిణ దిగ్విజయయాత్రయం దోడించి మరల నాతనిరాజ్యము నాతని కిచ్చివేసెను. హస్తివర్మకుఁ బిదప శాలంకాయనవంశజు లొక శతాబ్దికాలము వేఁగిదేశమును పాలించిరి. పెదవేఁగి వీరికి రాజధాని. వీరి యనంతరమున వేఁగిదేశము వాకాటకుల సాయమున విజృంభించిన విష్ణుకుండివంశజుల వశమయినది.

వాకాటకులు:— క్రీస్తుశకము నాలుగవ శతాబ్ది యారంభమున వాకాటకవంశపతాకమైన వింధ్యశక్తి కుమారుఁడు మొదటిప్రవరసేనుఁడు బేరారుప్రాంతమున వాకాటకరాజ్యమును స్థాపించెను. ఇతఁ డశ్వమేధాదియాగములుచేసిన మహారాజు. ఈవంశమునందలి మొదటి పృథ్వీసేనుఁడు కుంతలమును జయించి రాజ్యమును దక్షిణమున కృష్ణానదివఱకు విస్తరిల్లఁజేసెను. పశ్చిమక్షత్రపరాజ్యము వాకాటకరాజ్యమునకు పడుమటి యెల్లయైనది. మొదటి పృథ్వీసేనుని కొడుకగు రెండవ రుద్రసేనుఁడు గుప్తచక్రవర్తియగు రెండవ చంద్రగుప్తవిక్రమాదిత్యుని కూఁతురు ప్రభావతీగుప్తను పరిణయమాడెను. వాకాటకరాజ్య మాఱవ శతాబ్దిన స్తమించినది. వర్థిల్లిన రెండు శతాబ్దులకాలము నీ వంశమువారు వాఙ్మయమును సాఁకి, కళలను పోషించి సుందరములయిన గుహాలను, ఆలయములను గట్టించిరి.

కదంబులు:— బెళగాం, ధార్వాడ, మైసూరు సంస్థానపు వాయవ్యప్రదేశముల నేలినవారు వీరు. వీరికి వైజయంతి (ఇప్పటి వనవాసి) రాజధాని. బ్రాహ్మణుఁడయిన మయూరశర్మ వేదవిద్య నభ్యసింప కాంచీపురమున కరుగ, నచ్చట పల్లవులతోఁ గలిగిన వివాదమున నవమానితుఁడయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రాహ్మణ్యమునఁ బగతీర్చుకొనలేక, శాస్త్రములను విడిచి శస్త్రములను జేపట్టి క్షాత్రము నవలంబించి కదంబరాజ్యమును స్థాపించెను. ఇతఁడే కదంబవంశమునకు మూలపురుషుఁడు. వీరికి పల్లవులతో నొకవైపు, వాకాటకులతో నొకవైపు పెక్కు సంగ్రామములు జరిగినవి. అయినను వీరికి వాకాటకులతోను, పడుమటి గంగవంశజులతోను సంబంధ బాంధవ్యములును కలవు. ఆఱవశతాబ్దిని విజృంభించిన చాళుక్యవంశమువలన ఈకదంబ రాజ్యమున కాఘాతము తగిలినది. నాఁటనుండి వీరు చాళుక్యులకు సామంతులయిరి. బ్రాహ్మణులయినను కదంబులు జైనమతమును పోషించి, జినాలయములకు పెక్కు దానములు కావించిరి.

గాంగులు:— దక్షిణాపథమున పరిపాలనము నెఱపిన గాంగవంశములు రెండు. వీనిలో నొక వంశమువారు కళింగమునకును, మఱియొక వంశమువారు మైసూరుదేశమునకు నేలికలైరి. కళింగగాంగులను తూర్పుగాంగులని, మైసూరు గాంగులను పశ్చిమగాంగు లని చరిత్రమున వ్యవహరింతురు. కళింగగాంగులకు కళింగనగరము (గంజాం జిల్లా, పర్లాకిమిడి తాలూకా, ముఖలింగము) రాజధాని. గాంగశకమని కళింగ గాంగు లొకశకము స్థాపించిరి. ఈ శక మెప్పుడారంభమైనదో ఇంకను తేలలేదు. తూర్పుగాంగులు క్రీస్తుశకము పదునైదవ శతాబ్దివఱకు కళింగమును పాలించుచుండిరి.

పశ్చిమగాంగరాజ్యము మైసూరి కుత్తరమువనుండి దక్షిణమున కావేరివఱకు వ్యాపించినది. వీరి రాజ్యారంభకాలము కూడ ఇంకను నిశ్చితము కాలేదు కాని వీరు కదంబులకు సమకాలికు లనుట ధ్రువము. పశ్చిమగాంగదేశమునకు గంగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాడియని పేరు. కావేరీ తీరమునఁ గల తలకాడు పశ్చిమ గాంగులకు మొదటి రాజధాని. వీరు జైన, బ్రాహ్మణమత ములు రెంటిని సమానముగ ఆదరించిరి.

విష్ణుకుండి వంశజులు:— వీరు శాలంకాయనులకుఁ బిదప వేఁగిదేశము నేలినవారు. అశ్వమేధాదియాగములను జేసి బ్రాహ్మణమతమున కాశ్రయ మొసఁగిరి. ఈ వంశమునఁ దెలియవచ్చువా రెనమండ్రు రాజులు కలరు. వాకాటకసం బంధముప్రభావమున వీరుకూడ సుందరములయిన గుహాలయ ములను దొలిపించిరి. బెజవాడ, మొగల్రాజపురము, ఉండవల్లి గ్రామములందలి గుహాలయములను నిర్మించినవా రీవిష్ణుకుండి భూపతులని చరిత్రకారుల యభిప్రాయము. ఏడవశతాబ్దిని చాళుక్యవంశజులు ప్రాగ్దేశములపై దండెత్తివచ్చి, విష్ణుకుండి ప్రభువుల నోడించి, వేఁగిదేశమున చాళుక్యపరిపాలనమును ప్రతిష్ఠాపించిరి.

చాళుక్యులు:— క్రీస్తుశక మయిదవశతాబ్దియంతము ననో ఆఱవశతాబ్ది యారంభముననో చాళుక్యరాజ్యము స్థాపిత మయినది. వీరికి వాతాపి (నిజాము రాజ్యమునందలి బాదామి) రాజధాని. ఈ వంశమునందలి మొదటి పులకేశియు, అతని కుమారులు కీర్తివర్మ, మంగళేశులును రాజ్యమును విస్తరింపఁ జేసిన మొదటి ప్రభువులు.

పాండ్య, చోళ, కేరళులు:— క్రీస్తుశక మూఁడవ శతా బ్దులకుఁ బూర్వము వీరి చరిత్రమునుగుఱించి తెలిసికొనుటకుఁ గల ప్రధానాధారము క్రీస్తు శకము మొదటిశతాబ్దుల నాఁటి వనఁబడు 'సంగము'గ్రంథములు. ఈ గ్రంథములవలనఁ దెలియ వచ్చు పాండ్యరాజు లిరువదిమందివఱకుఁ గలరు. అట్లే కరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలచోళుఁడు మొదలగు చోళరాజులును పేర్కొఁరు గలరు. శాసనప్రమాణలబ్ధము లయిన పాండ్య, చోళవంశజుల చారిత్రములు క్రీస్తుశక మూఁడవ, యేడవ శతాబ్దులనుండి కాని తెలియరావు.

## గుప్తులనాఁటి హిందూదేశము

"ఇంతటనుండి బుద్ధపదము నందువఱకు నేను
భారతేతర దేశమున జన్మింపకయుందును గాక."

ఫాహియానుతో హిందూదేశమున కరుదెంచిన యొక చీనాదేశబౌద్ధభిక్షువు పలుకు లివి. హిందూదేశమునందలి బౌద్ధ వాఙ్మయమును జూచి నివ్వెరపోయి, తన దేశమునఁ గల వాఙ్మయదారిద్ర్యమునకు వెతచెంది నిర్వేదముతో, నిట్టూర్పులతోఁ బలికిన మాట లివి. పుట్టిన నిచ్చటనే పుట్టవలె నని విదేశీయులచేతఁ గూడ నిర్వేదముతోఁ బలికించిన కాల మది యెంతటి ప్రభావమహితమో కదా! పరాక్రమసంపన్ను లయిన రాజులు దిగ్విజయసూచకముగ అశ్వమేధయాగము చేసి మహారాజు లయిరి. మహారాజులు కవిరాజు లైరి. శైవ, వైష్ణవ మతముల కీకాలము తల్లివేరు; బౌద్ధ, బ్రాహ్మణ వాఙ్మయముల కది ముమ్మరమయిన పూఁతకాఁరు. గుప్తుల నాఁటి హిందూదేశ సౌభాగ్య మట్టిది: స్వర్ణయుగ మది.

మతము:— ఈకాలమున యజ్ఞ యాగాదులకు వెనుకటి ప్రాముఖ్యము తగ్గినది భక్తిప్రధానములయిన శైవ, వైష్ణవములు వైదికమతము లయినవి. శివ, విష్ణువులతో పాటు బ్రహ్మకును, సూర్యునికినిగూడ పూజ యేర్పడినది. త్రిమూర్తులగు బ్రహ్మ,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విష్ణు, శివులకు సంబంధించిన గాథలు గ్రంథస్థములయి పురాణ వాఙ్మయము ప్రబలినది. శక్తిపూజకూడ విస్తరిల్లినది. పూజావిధివిధానాదులకు వైష్ణవమునకు 'పాంచరాత్ర సంహితలు'ను, శైవమునకు 'శైవాగమములు'ను, శాక్తమునకు 'తంత్రములు'ను ప్రమాణగ్రంథము లయినవి. భక్తికి దక్షిణహిందూదేశము సారవంతమయిన క్షేత్ర మయినది. ద్రవిడదేశమున శివభక్తులు, విష్ణుభక్తులు అనేకు లుదయించి శైవ, వైష్ణవ గాథలను పాడి శివ, కేశవులను సంస్తుతిచేసిరి. భక్తశిఖామణులుగ చెప్పఁదగినవారు శైవమున అఱువదిమువ్వురును (అఱువత్తుమూరు), వైష్ణవమున పండ్రెండుగురును (పన్నిద్దఱు) గలరు. అఱువదిమూవురు శైవ భక్తులకు నయనారు లని, వైష్ణవభక్తులకు ఆళ్వారు లని పేరు. వీరిలోఁ గొంద ఱీకాలపువారు. తమిళభాషను గల పన్నిద్దఱాళ్వారుల వైష్ణవ స్తోత్రములు 'ద్రవిడవేద' మనఁబడు 'నాలాయిర దివ్య ప్రబంధము'న సంకలితము లయినవి. కొందఱు శైవభక్తులు రచియించిన శివస్తోత్రములు 'తిరుత్తొండర్ తొఘై', 'తిరుప్పాట్టు', 'తేవారము', 'తిరువాచకము' లనుపేరఁ బరఁగుచున్నవి. తరువాతికాలమున పైవిధమున మార్పులు చెంది పునరుద్ధృతమయిన బ్రాహ్మణమత మిప్పటి హిందూమతముగ పరిణమించినది.

ఉత్తరహిందూదేశమున పర్యటనము సలిపిన ఫాహియాను ఈకాలమున నచట బౌద్ధ మెట్లుండినది తెలిపినాఁడు. బుద్ధుఁడు శిరోజములు, గోళ్లు కత్తిరించుకొనినచోట్లని, ఆహారము గైకొనినచో టని, నిద్రించినచో టని, తుదకు బుద్ధుని నీడ పడినచో టని — ఇట్లేదో యొకకారణమున పెక్కుస్థలములు పవిత్రములుగ పరిగణింపఁబడి, బౌద్ధక్షేత్రము లనేకములు వెలసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవి. ఈ స్థలపవిత్రతకు కేవల మొకబుద్ధుఁడే కాక, ప్రత్యేక బుద్ధులు, బోధిసత్త్వులు, తుదకు బుద్ధుని శిష్యులుఁ కూడ కారణ భూతు లయిరి. అట్టిస్థలము లన్నిట స్తూపములు వెలసి, ఉత్తర హిందూస్థానము బౌద్ధస్తూపారామ మయినది. హీనయాన, మహాయానములు రెండును సమముగ వర్ధిల్లినవి. మహారాజులు, వైశ్యులు మున్నగువారు బౌద్ధభిక్షువులకు విహారములు కట్టించి వాని పోషణమునకు గృహారామక్షేత్రాదులను దాన మొసఁగుచుండిరి. సన్న్యాసులు, భిక్షువులు, యతులు మొదలగువారిని సత్కరించుటకు ధర్మశాలలు పుట్టినవి. బుద్ధ, బోధిసత్త్వులకు పూజలే కాక పర్వ, రథోత్సవాదులు మొదలైనవి నియతములైనవి. ఈవిధమగు పూజోత్సవాదికల్పనమువలన బాహ్యముగ హిందూ, బౌద్ధమతముల కంతరము తగ్గి యవి రెండును పరస్పరము సన్నిహితము లగుచుండెను. హిందూమతముకూడ ప్రజాకర్షణమునకు బౌద్ధము ననుకరించి, అందలి గుణవిశేషముల నేరి తనలోఁ గలుపుకొనుచుండెను. దక్షిణ హిందూదేశమున శైవ, వైష్ణవములకుఁ, జైనమునకును తీవ్రమయిన పోరాటము సంభవించినది.

భాష, విద్య:—బౌద్ధయుగమున ప్రాకృతభాషలు వర్ధిల్లినవి. అశోకవర్ధనునినాఁటనుండి ఇక్ష్వాకువంశజుల కాలమువఱకు రాజశాసనములుకూడ ప్రాకృతభాషయం దుండెను. మొదటి పల్లవ, శాలంకాయనరాజుల శాసనములును ప్రాకృతమున నే కలవు. కాని గుప్తులనాఁటనుండి మార్పు కలిగినది. బ్రాహ్మణ మతపునరుద్ధరణముతో సంస్కృతభాషకు ప్రాముఖ్యము కలిగినది. సముద్రగుప్తుని దక్షిణదిగ్విజయకాలమె ప్రాకృతభాషా శాసనములకు కడపటిమెల్ల యని శాసనపరిశోధకుల యభి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాయము. కావ్యరచనమున కళ్యఘోషుఁడు వైచిన పంథ గుప్తుల కాలము నాఁటికి రాచబాటయై యీ కాలమున గొప్ప కావ్యవిలసనము కన్పట్టినది. సంస్కృతమున మేలయిన కావ్య, నాటక, శాస్త్రాదు లీకాలముననే యుదయించినవి. బాలచరితము, ఊరుభంగము మొదలయిన పెక్కునాటకములు రచియించిన భాసమహాకవియు, మృచ్ఛకటిక మనునాటకమును రచియించిన శూద్రకమహాకవియు నీకాలమువారు. ఈనాటకములకు తరువాత వచ్చినవి కాళిదాసమహాకవి విరచితములయిన శాకుంతల, మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయములు. కాళిదాసమహాకవి రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యునియొక్కయు, అతని తనయుఁడు కుమారగుప్తునియొక్కయు ఆస్థానాలంకారముగ నుండి పైనాటకములనే కాక, రఘువంశ, కుమారసంభవ కావ్యములనుగూడ రచియించెను. ఆర్యభట్టుఁడు గణితశాస్త్రమును, వరాహమిహిరుఁడు 'బృహత్సంహిత' యను పేర ఖగోళశాస్త్రమును రచియించినది క్రీస్తుశకమాఱవశతాబ్దికి పూర్వముననే. వైద్యశాస్త్రవిజ్ఞానముకూడ గుప్తులకాలమున వృద్ధిచెందినది. దక్షిణాపథమునందలి రాజవంశములుకూడ గుప్తరాజప్రభావమున నూతనహిందూమతమున కండయై నిలిచి, ఆర్యసంస్కృతిని, సంస్కృతవాఙ్మయమును పోషించినవి. కిరాతార్జునీయకర్తయగు మహాకవి భారవి కాంచీపురపల్లవుల యాస్థానకవి.

బౌద్ధవిహారములును, సంఘారామములును గొప్ప విద్యాపీఠములు. విద్యాపీఠముగఁ దనపేరు నిప్పటికి నిలఁబెట్టుకొనుచు వచ్చినది తక్షశిల. వారణాసి, ఉజ్జయిని, వలభి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాలందలు ఈ కాలమునాఁటి పేరు మోసిన విద్యాపీఠములలో నగ్రగణ్యములయినవి.



అజంతా చైత్యమందిర ముఖభాగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిత్రకళ:— భారతభూమిని బౌద్ధమతము చిగురించిన నాఁటనుండి ఆ క్రౌంజివురులోని రాగ మయి రంజిల్లినది చిత్రకళ. దాని ప్రారంభదశనుగుఱించి మన కేమియుఁ దెలి యదు కాని, క్రీస్తుశకము కన్నువిచ్చి చూచునాఁటికే అది యాంధ్రుల యాదరణమున గడికట్టి యేపారినది. అజంతా (నిజాంరాజ్యమునందలి ఫరీద్పురసమీపమునఁ గలదు), బాఘ్ (గ్వాలియరు రాజ్యములోనిది) విహారములయందుఁ గానవచ్చు ఆలేఖ్యములే హిందూదేశమున ఇప్పటివఱకు మనకు మిగిలి యున్న ప్రధానబౌద్ధచిత్రకళావశేషములు. అజంతా, బాఘ్ గుహాలయందలి గోడలమీఁదఁ గల చిత్రములు కాలము రాపిడి చేత నలిగి చాలవఱకు నశించినను, నాఁటి చిత్రకారు లతిప్రతి భావంతు లని, చిత్రకళ కడు ప్రశస్త మయినదని యనుట కాయుదాహరణములే చాలును. అజంతాగుహాల గోడల మీఁద ఆంధ్రుల యాదరమున వ్రాయఁబడిన చిత్రములు (కుడ్యచిత్రములు) కొన్ని రీతియందు ప్రధానముగ అమరా వతీశిల్పము ననుకరించుచున్నవి. ఆంధ్రులకుఁ బిదప నీ గుప్త యుగముననే చిత్రకళ పురివిప్పి నాట్యము చేసినది. ఈ కాల మున వాకాటకులు మొదలయినవారు గుహాలు దొలిపించి కుడ్యచిత్రములు వ్రాయించి, చిత్రకళను నవయౌవనసంపూర్ణ నుగా దిద్దిరి. క్రీస్తుశకము నాలుగైదు శతాబ్దులనాఁటి కుడ్య చిత్రములు (Frescoes) అజంతాగుహాలయం దనేకములు కాన వచ్చును. బాఘ్‌చిత్రము లింకను గొంత కాలమునకుఁ దరు వాతి వని చిత్రకళావిదుల యభిప్రాయము.

వాస్తు, శిల్పములు:— దేశమునఁగలిగిన మతవిషయకసం చలనమునకును, ప్రజలలోఁ గలిగిన భక్తితృష్ణకును ఫలితముగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుందరశిఖరాలంకృతములయిన దేవాలయములు, సంఘా రామములు, పర్వతగుహాలయములు అనేకములు నిర్మితమయి నవి. గుహాలయనిర్మాణమునందలి విన్నాణ మతిశయించి, తీర్పు తీరువలను మధురిమ యబ్బి తదాలయములు మనోజ్ఞము లయినవి. తత్ శిల్పమునకు సౌకుమార్యపుజిగి కలిగి యది మనోహరమయినది. రాజాదరణమున గుప్తయుగమున దేవా లయవాస్తు, శిల్పకళ లభివృద్ధి చెందినవి. ఆ నాఁటి కళాని ధానము లనేకములు హూణులు మొదలగు విదేశీయుల విధ్వంసకతృష్ణకు బలియయినవి. అయినను సార్నాథ్ మొదల యిన యుత్తరహిందూదేశమునందలి పెక్కు స్థలములను త్రవ్వఁగా 'గుప్తకళాసంప్రదాయ'ముద్రితము లయినశిల్ప కృతు లనేకములు బయలుపడినవి. నాఁటిదేవాలయనిర్మాణ మున శిఖర మొక విశిష్టలక్షణము.

సాంఘిక స్థితి:—ఫాహియాను హిందూదేశమున కరు దెంచిననాఁటికి హిమాలయప్రాంతమునందలి నగరములు నిర్జ నము లైనవి. కపిలవస్తు, కుసినారము, రాజగృహము, గయల యం దెవ్వరో కొందఱు బౌద్ధభిక్షువు లున్నను సాధారణముగ నవి జనవిహీనములే యనవచ్చును. కాని భాగ్యభోగ్యములతో తులతూగు పెక్కునగరములతో విలసిల్లుచుండినది మగధ. రాజపరిపాలనము సౌష్ఠవము గలిగి యొప్పుచుండెను. మార్గ ములు చోరభయము లేక సుగమము లయినవి. నేరముతీవ్రత ననుసరించి దండుగ విధింపఁబడుచుండెను. ఉరిశిక్షయే లేదు. రాజుపై తిరుగఁబాటునకు మాత్రము శిక్షగ కుడిచేతిని ఖండించు వారు. వర్ణవ్యవస్థ చిక్కఁబడినది. సంఘ మభిమానింపక పోయినను అంతర్వర్ణవివాహములు జరగుచునే యుండెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజులు, సంపన్నులు మొదలయినవారు విహారములకు, భిక్షువులకు గృహారామక్షేత్రములను దాన మొసఁగువారు. ఇట్టి దానశాసనములను రాగిపట్టాలమీఁద వ్రాయుచుండిరి. విహారములకు, శ్రమణులకు దానములు చేయుట పుణ్యకార్య మయినది. దేశమున జీవహింస అంతరించినది. కసాయిదుకాణములు గగనకుసుమము లయినవి. పాటలీపుత్రమున ప్రజలును, భాగ్యవంతులును నెలకొల్పిన ధర్మవైద్యశాల లుండెడివి. కుల, వర్ణ వివక్ష లేక రోగుల నందుఁ జేర్చుకొనువారు. వారి కాహారమును, వైద్యమును ఉచితము. వైద్యులు శ్రద్ధతో వైద్యము చేయుచుండిరి. వ్యాపారము వృద్ధిచెందినది. వర్తకశ్రేణుల సంఖ్య పెరిఁగినది. దేశము గుప్తపరిపాలనకాలమున పాడి పంటల కిరవయినది.

---

## హర్ష సామ్రాజ్యము

క్రీస్తుశక మాఱవశతాబ్దియందలి హూణదండయాత్రలవలన ఉత్తరహిందూస్థానమునందలి రాజకీయవాతావరణము చాల కలవరము చెందినది. ప్రాంతరాజ్యము లంతరించినవి; క్రొత్తవి మొలకలెత్తినవి. పంజాబు, రాజపుత్రస్థానము, ప్రాచి మొదలయిన దేశములయందు హూణులు స్థిరపడి, స్వతంత్రరాజ్యములను స్థాపించుకొనిరి. వీరు కాలక్రమమున హిందూవాతావరణమునఁ జేరి, సుక్షత్రియులుగ పరిగణింపఁబడి దేశీయులలోఁ గలసిపోయిరి

మగధ, మాళవములం దింకను గుప్తవంశజు లచ్చటచ్చట తమ యేలుబడిని సాగించుచుండిరి కాని యీ కడపటి గుప్తభూపతుల చారిత్రము మనకు బాగుగఁ దెలియదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తుదకు వారి కేకొంచెమో యధికార, బల, గౌరవము లిఁకను మిగిలి యుండిన నవి క్రమముగ రాజకీయరంగమున ప్రాముఖ్యమును బడయుచుండిన మౌఖరి, గౌడభూపాలురవలన భగ్నములయినవి. మౌఖరులును, గౌడులునుగూడ మొదట గుప్తవంశజులకు సామంతులుగ నుండి, వారి బలాధికారములు సన్నగిల్లుచుండిన కాలమున ప్రబలు లయిరి. తమ రాజ్యమును పెంపుచేసికొనుసందర్భమున మౌఖరులకు బంగాళమునందలి గౌడులతోను, మాళవమునందలి గుప్తులతోను పెక్కుసంగ్రామములు జరగినవి. మౌఖరివంశమున నాలవరాజు ఈశానవర్మ. ఇతఁడు ప్రబలుఁడయి మహారాజాధిరాజబిరుదమును వహించెను. ఇతఁడును, ఇతని కుమారుఁడగు శర్వవర్మయుఁగూడ హూణులతోడి సంగ్రామములందు పాలుగొని పేరువహించిరి.

క్రీస్తుశక మాఱవశతాబ్ది చివరిభాగమున స్థానేశ్వరమున నొక స్వతంత్రరాజ్య ముదయించినది. దీనిని పాలించిన రాజులలో ప్రభాకరవర్ధనుఁడు ప్రముఖుఁడు. పరాక్రమవంతుఁడయిన యితఁడు పూర్వ, పశ్చిమములుగఁ దన రాజ్యమును వ్యాపింపఁజేసికొని మహారాజాధిరాజబిరుదమును ధరించెను. ఇతనికి రాజ్యవర్ధనుఁడు, హర్షవర్ధనుఁడు అని యిరువురు కుమారులును, రాజ్యశ్రీ యని యొకకూఁతురు నుండిరి. ప్రభాకరవర్ధనుని కాలమునఁగూడ హూణులు రాజ్యతృష్ణ తీరక ప్రాగ్రాజ్యములపయి దండెత్తి వచ్చుచుండిరి. ఈ దండయాత్రలయందు రాజ్యవర్ధన, హర్షవర్ధను లిరువురు తండ్రికి బాసటయయి హూణులతోఁ బోరాడి కడు పరాక్రమవంతు లని పేరు గాంచుచుండిరి. తన రాజ్యమునకు బలిమియు, భద్రతయుఁ జేకూరుటకయి ప్రభాకరవర్ధనుఁడు తన తనయ రాజ్యశ్రీని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మౌఖరి శర్వవర్మ వంశజుఁడయిన గ్రహవర్మ కిచ్చి పరిణయము కావించి పొరుగు రాజులయిన మౌఖరులతో సంబంధము కలిపెను. తమ శత్రువయిన గ్రహవర్మ స్థానేశ్వరప్రభువులతో సంబంధము కలిపి బలవంతుఁ డగుటఁ గాంచి గౌడభూపతియయిన శశాంకుఁడు మాళవమున పరిపాలనము నెఱపుచుండిన దేవగుప్తునితో నెయ్యము కలిపెను. క్రీస్తుశక మేడవశతాబ్ది ఆరంభమున ఈ రెండుపక్షములే రాజకీయముగ ప్రాముఖ్యము వహించినవి.

క్రీ. శ. ౬౦౪ ప్రాంతమున హూణు లింకొకమాఱు విజృంభించి, తన రాజ్యమును వాయవ్యదిశను మార్కొనిన నప్పుడు ప్రభాకరవర్ధనుఁడు హర్షవర్ధనుని తోడిచ్చి రాజ్యవర్ధనుని వారిపైఁ బంపెను. రాజ్యవర్ధనుఁడు శత్రువులతోఁ బోరాడుచుండినకాలమున ప్రభాకరవర్ధనుఁడు వ్యాధిగ్రస్తుఁ డయ్యెను. ఈ సమాచారము తెలిసి హర్షుఁడు రాజధాని కరుదెంచెను. తన సోదరుఁడు తిరుగ వచ్చువఱకు తండ్రిమరణానంతరము హర్షుఁడే రాజ్యవ్యవహారములను జక్కఁబెట్టుచుండెను. శత్రువు నోడించి రాజ్యవర్ధనుఁడు స్థానేశ్వరమునకు వచ్చి రాజ్యభారమును వహించిన కొలఁదికాలమునకే మాళవ దేవగుప్తుఁడు ప్రభాకరవర్ధనుని మరణవార్త విని నిర్భయముగ మౌఖరిరాజధానియయిన కన్నోజను ముట్టడించి, గ్రహవర్మను కడతేర్చి, సంకెలలువైచి రాజ్యశ్రీని కారాగారమున నుంచెను. వెంటనే, రాజ్యవర్ధనుఁడు తన సోదరి రాజ్యశ్రీకి జరగిన యవమానమునకు పగఁదీర్చుకొనఁదలఁచి సైన్యముల నాయత్తపఱచుకొని వెళ్లి మాళవాధీశునితోఁ దలపడి ఆతని నోడించెను కాని యింతలో దేవగుప్తునికి సాయముగ వచ్చిన శశాంకుఁడు మాయోపాయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున రాజ్యవర్ధనుని జంపించెను. భర్తయు, సోదరుఁడును గతించుటం జేసి యాశాకిరణమును గానక రాజ్యశ్రీ యెట్లో చెఱనుండి తప్పించుకొని వింధ్యాటవుల కరిగెను.

రాజ్యవర్ధనుని మరణానంతర మతని మంత్రివర్గము వారతని సోదరుఁడయిన హర్షవర్ధనునికి సింహాసన మొసఁగిరి. క్రీ. శ. ౬౦౬ లో సింహాసన మెక్కిన వెంటనే హర్షవర్ధనుని దృష్టి తన సోదరివైపు తిరిగినది. ఆటవికుల సాయమున హర్షుఁడు వింధ్యాటవులం దొక్కయెడ అగ్నిప్రవేశముఁ గావించి యాత్మహత్య చేసికొనుటకు సంసిద్ధముగ నున్న రాజ్యశ్రీ నన్వేషించి పట్టుకొని తీసికొని వచ్చెను. నాఁటనుండి కన్నోజ, స్థానేశ్వరరాజ్యములు రెంటికి హర్షుఁడే యధిపతి యయ్యెను. పరిపాలనకార్యమున రాజ్యశ్రీ హర్షునికిఁ దోడ్పడుచుండెడిది.

పిదప హర్షుఁడు తన సోదరుని మరణానంతరమున రాజ్యమునఁ గలిగిన యల్లరుల నణఁచి పరిపాలనమును జక్కఁ దిద్ది పిదప మాళవ, గౌడ భూపతులనే కాక ఉత్తరహిందూస్థానమునందలి మేటియోధులగు రాజుల నందఱ జయించి యేకచ్ఛత్రముగ పరిపాలనము నెఱపవలెనను కోరికతో ౫,౦౦౦ ల గజబలమును, ౨౦,౦౦౦ ల అశ్వసైన్యమును, ౫౦,౦౦౦ ల కాల్బలమును సిద్ధముచేసి రణభేరి మ్రోఁగించెను. ఆఱు సంవత్సరములకాల మాతఁ డెత్తినకత్తి దింపకుండ పోరాడెను. ఈ కాలమున ఆతఁడు సాధింపనిదుర్గము లేదు; జయింపని సంగ్రామము లేదు. అట్టిది ఆతని మగఁటిమి. ఆతని యనుపమానప్రతాపమునకు వాయవ్యదిశ పంజాబునుండి తూర్పున అస్సామునఱకుఁ గల యుత్తర హిందూదేశము పాదక్రాంతమయినది. ఇట్లాతఁడు రాజ్యమును విస్తరింపఁజేసి గజదళము నఱు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పదివేలవఱకును, కాల్బలమును లక్ష వఱకును హెచ్చించెను. దూరస్థములయిన నేపాళము, కామరూపము (అస్సాము), కాఠియవాడద్వీపకల్పము నందలి వలభి మొదలగు రాజ్యములు – అన్నియు హర్షచక్రవర్తి యధికారమున కెఱఁగి, కప్పములు చెల్లించినవి. ఉత్తరహిందూస్థానము నీవిధమున నేకచ్ఛత్రముగఁ బరిపాలించిన కడపటిచక్రవర్తి యీతఁడే.

ఉత్తరహిందూస్థానముతోఁ దనివి సనక హర్షుఁడు దక్షిణాపథమునుగూడ సాధింప దండు వెడలి, క్రీ. శ. ౬౨౦ ప్రాంతమున వాతాపి(బాదామి) రాజధానిగ దక్కను దేశము నేలుచుండిన చాళుక్య కీర్తివర్మ కుమారుఁడగు సత్యాశ్రయ రెండవ పులకేశిమహారాజు నెదుర్కొనెను; కాని పరాజితుఁడయి నర్మదానదిని తన రాజ్యమునకు దక్షిణపు టెల్లగ నంగీకరింపవలసినవాఁ డయ్యెను. రాజ్యమేలినకాల మంతటిలో హర్షునికిఁ గలిగిన పరాజయ మిది యొక్కటియే. క్రీ. శ. ౬౪౩ ప్రాంతమున హర్షుఁడు ప్రాక్సముద్రతీరస్థమయిన గంజాము మండలముపై దండెత్తి వెళ్లెను.

ఇట్లు ఖడ్గబలమున సంపాదించిన రాజ్యమును హర్షుఁడు తన బుద్ధిబలమున నిలుపుకొని రాజ్యతంత్రమును జక్కఁ దిద్దెను. పరిపాలనము చక్కఁగ సాగుచున్నది లేనిది కనుఁగొనుటకు హర్షచక్రవర్తి రాజ్యమునం దంతట నొక్క వర్షకాలమునఁ దక్క ఎల్లపుడు తఱచుగ పర్యటనము సలుపుచుండువాఁడు. రాజపర్యటనావసరమున నొక్కొక మజిలీయందు చక్రవర్తికొఱకు తాత్కాలికముగ పర్ణశాలలు నిర్మించువారు. చక్రవర్తి నిర్గమనానంతరమున వానిని తగులఁబెట్టువారు. వేఱువేఱు రాష్ట్రములను సామంతరాజులు పాలించుచుండిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజున కాదాయము ప్రధానముగ భూమివలననుండి వచ్చుచుం డెను. రాజు పండిన పంటలో ఆఱవవంతు పన్ను గ్రహించువాఁడు. వేతనములకు బదులుగ రాజకీయోద్యోగులకు భూము లిచ్చు వారు. పన్నులు భారముగ నుండెడివి కావు. కొన్ని కొన్ని నేర ములకు దోషికి మరణపర్యంతము కారాగృహవాస శిక్ష విధించు వారు. నేరముతీవ్రత ననుసరించి అవయవఖండనదండనము నుండెను. గుప్తులకాలమునాఁటికంటె కొంచెము కఠినముగ నుండి నను మొత్తముమీఁద హర్షచక్రవర్తి పరిపాలనము న్యాయ్య మయి జనోపకారకముగ నుండెను.

హర్షచక్రవర్తికాలమున విద్య బాగుగ విస్తరిల్లినది. బౌద్ధసంఘారామములు విశ్వవిద్యాలయము లయినవి. నాలంద, ఉజ్జయిని, తక్షశిల, విక్రమశిలలు నాఁడు పేరెన్నికఁ గన్న విద్యా పీఠములు. బౌద్ధవిద్యకు నాలంద ప్రధానస్థానము. ఉజ్జయిని ఖగోళవిద్యాపీఠము. తక్షశిల వైద్యవిద్యాప్రధానపీఠము. హర్షచక్రవర్తి విద్యావిశారదుఁడు; లింగానుశాసనమను వ్యాకరణసంబంధమగు గ్రంథమును, రత్నావళి, నాగానందము, ప్రియదర్శిక యను మూఁడునాటకములను సంస్కృతభాష యందు రచియించి విఖ్యాతి కెక్కెను; పండితకవుల నాదరించి యశస్సు నార్జించెను. బాణభట్టు హర్షుని యాస్థానకవి. ఇతఁడు హర్షచరిత్రమును రచియించెను. హర్షుని కాలమున చీనాదేశ మునుండి హిందూదేశమునకు బౌద్ధక్షేత్రములను సందర్శిం పను, బౌద్ధమతగ్రంథములను సంపాదింపను యువాన్‌చాంగ్ అను బౌద్ధయాత్రికుఁ డరుదెంచెను. బాణభట్టవిరచితమయిన హర్షచరిత్రమును, యువాన్‌చాంగ్ వ్రాసియుంచిన వృత్తాంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములును హర్షచక్రవర్తి పరిపాలనమును గుఱించి తెలిసికొనుటకుఁ గల ప్రధానాకరములు.

యువాన్‌చాంగ్ క్రీ. శ. ౬౨౯ లో చీనాదేశమున బయలుదేఱి ౬౩౦ నాఁటికి గాంధారమునకు వచ్చెను. నాఁట నుండి పదునాఱేండ్లకాలము క్రీ. శ. ౬౪౩ వఱకు హిందూదేశమునం దంతట పర్యటనము కావించి, పెక్కు బౌద్ధమత గ్రంథములను, విగ్రహములను, ధాతువులను (Relics) దీసికొని ౬౪౫ నాఁటికి చీనా చేరెను. ముఖ్యముగ నితఁడు ౬౩౫ మొదలు ౬౪౩ వఱకు నెనిమిదేండ్లకాలము హర్షరాజ్యముననే గడపి యా చక్రవర్తి గౌరవాదరణములను పొలుగొనెను. దక్షిణాపథమున వాతాపిచాళుక్యరాజ్యమునందును, ఆంధ్ర, కళింగాది దేశములందును దిరిగి యచ్చటి ప్రజలు, మతము, భాష మొదలగువానిని గుఱించి వ్రాసెను.

హర్షవర్ధనుఁడు శైవుఁడయినను మతభేదమును పాటింపక సూర్యుని, బుద్ధునిగూడ నారాధించువాఁడు. తన రాజ్యపాలనమునఁ గడపటికాలమున గొప్ప బౌద్ధమతాభిమానియై యామతము నెక్కువగ నాదరించి పోషించెను; రాజ్యమునం దంతట జీవహింస కూడ దని ప్రజలు మాంసాహారమును నిషేధింపవలె నని శాసించెను. రాజశాసనము నుల్లంఘించినవారికి దండనము మరణమే. హర్షవర్ధనుఁడు గంగాతీరమున వేలకొలఁది స్తూపములనే కాక, బౌద్ధక్షేత్రములందు పెక్కు సంఘారామములను, రాజ్యమునం దంతట బాటసారులకు విశ్రాంతి గృహములను గట్టించెను. స్వమత మేది యయినను హర్షవర్ధనుఁడు పరమతసహనముఁ గలిగి అన్నిమతములవారిని సమానముగ నాదరించి, గౌరవించి, తాను గడించిన ధనము నైదేండ్ల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొక మాఱు పెద్ద సభలు కావించి, అందు జైన, బౌద్ధ, హిందూమతాచార్యులకును, విద్వాంసులకును, బీదలకును పంచిపెట్టుచుండువాఁడు.

సామ్రాజ్యమునకు రాజధాని కనోజ; కన్యాకుబ్జ మనియు దీనికి నామాంతరము కలదు. హర్షచక్రవర్తి కాలమున నిది నాలుగుమైళ్ల పొడువును, మైలు వెడల్పును గలిగిన నగర రాజము. అది రమ్యములయిన భవన, ప్రాసాదములతోను, గొప్ప దుర్గముతోను, పెక్కు తటాకారామములతోను, అనేక సంఘారామ, దేవాలయములతోను విరాజిల్లుచుండెను. సిరి, సంపదల కిరవయిన యీ రాజధానీనగరమున హర్షవర్ధనుఁడు యువాన్‌చాంగ్‌ను గలసికొనినప్పు డాతని గౌరవార్థ మిప్పవలకు చెప్పినయట్టి మహాసభ నొకటి కావించెను. ఈ మహాసభ నిరువదిమంది సామంతరాజు లలంకరించిరఁట.

హర్షవర్ధనుఁడు క్రీ. శ. ౬౪౭ లో కాలధర్మము నొందెను. సంతానవిహీనుఁడయిన యాతని యనంతరమున రాజ్యమునకు వచ్చు వారసులులేక రాజ్య మరాజక మయినది. రాజ్యబంధములు సడలి యాచక్రవర్తి మరణించిన కొలఁదికాలమునకే సామ్రాజ్యము భిన్న మయినది. ఎప్పటి రీతినే యీ శిథిలములమీఁద చిన్నరాజ్యము లనేకములు లేచినవి.

హర్షవర్ధనుఁడు హిందూదేశమును బరిపాలించుచుండిన కాలమున ఆసియాఖండపశ్చిమదేశములందు గొప్ప మతపరివర్తనము సంభవించుచుండెను. శతాబ్దులతరబడి బౌద్ధభిక్షువులు బౌద్ధమతవ్యాపనముసకయి చేసిన ప్రయత్నములకు ఫలితముగ సిరియావఱకుఁ గల దేశములందు బౌద్ధము వ్యాపించినది. పారశీకము మున్నగు దేశములందు హీనయాన బౌద్ధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునకు సంబంధించిన సంఘారామము లనేకములు వెలసినవి. బౌద్ధభిక్షువుల యీమతప్రచారము అరబ్బులలో నొక సంచలనమును గలిగించినది. నిరాడంబరమయిన హీనయానము వారి హృదయముల నుత్తేజపఱిచినది. నూతనమతాభిప్రాయముల ప్రాబల్యమున అరాబియా దేశమునను సంచలనము కలిగి, మత సంస్కర్త లనేకు లుదయించిరి. కాని క్రీస్తుశక మాఱవశతాబ్దిని గాని నూతనమతస్థాపనము చేయఁగల ప్రతిభాశాలి యుదయింపలేదు. క్రీ. శ. ౫౭౦-వ సంవత్సరమున మక్కాయందు జన్మించిన ముహమ్మదు ఇస్లాముమతమును స్థాపించెను. 'దేవుఁ డొక్కఁడు. అతఁడు సర్వాధికుఁడు. అతఁడే అల్లా. దేవుని కంటె నితరుఁడు పూజార్హుఁడు కాఁడు. విగ్రహారాధనము కూడదు' అని ప్రవక్తయైన ముహమ్మదు బోధించెను. ముహమ్మదు బోధించిన బోధ లన్నియు కురానునందు పొందుపఱుపఁ బడినవి. అట్లగుట కురాను ముహమ్మదీయులకు హిందువులకు వేదమువంటిది. ముహమ్మదు ప్రచారము కావించిన మతమునకే ఇస్లామని పేరు. ఇస్లాముమతావలంబులను ముసల్మాను లందురు. ముహమ్మదుబోధల ననుసరించువా రగుటచేత వారికి ముహమ్మదీయు లనియుఁ బేరు. విగ్రహారాధనతత్పరులయిన అరబ్బుల కీబోధలు సరిపడక వారు ముహమ్మదును, అతని యనుచరులను చాల హింసించి బాధించుటయే కాక తుదకు వారిని మక్కానుండి తఱిమివైచిరి. ప్రాణరక్షణమునకై ముహమ్మదు క్రీ. శ. ౬౨౨-వ సంవత్సరమున మదీనాకు పాఱిపోయెను. ముహమ్మదీయులు ఈ ముహమ్మదునిర్గమనమునే 'హిజ్రాత్' అందురు. 'హిజరా' అను పేరుఁబరఁగు మహమ్మదీయశక మీసంవత్సరముననుండియే యారంభమగుచున్నది. ముహమ్మదు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మదీనాయందుఁ దన మతమును బోధించి చాలమంది శిష్య వర్గమును గూర్చుకొని మరల మక్కాకు వచ్చెను. కాలక్రమమున అరబ్బులు ముహమ్మదు బోధలకు సుముఖులయి ఇస్లాము నవలంబించిరి. ముహమ్మదు క్రీ. శ. ౬౩౨ లో నిర్యాణము నొందెను. ముహమ్మదు తరువాత వచ్చిన ఇస్లాము మతగురువులకు ఖలీఫా లనియు, ఇస్లాముమత గురుపీఠము నకు ఖిలాఫత్తనియు పేరు. ముహమ్మదు ఉద్బోధలవలన నుత్తేజము నొందిన అరబ్బులు ముహమ్మదుసందేశమును నలుదెసల ఖడ్గబలమున వ్యాపింపఁజేయ నెడారిదేశముననుండి, గుహనుండి వెలికి వచ్చు కొదమసింగములవలె, బయలు వెడలిరి. బలిష్ఠులు, సాహసవంతులు, నూతనమతాభినివేశపూరితులు అయిన వారి ఖడ్గము ఖలీఫాలనాయకత్వమున ముహమ్మదు నిర్యాణము నొందిన యిరువదిసంవత్సరములకే సిరియా, పాలస్థానము, ఈజిప్టు, పెరిషియా దేశములను జయించి యచ్చట ఇస్లాము మతమును వ్యాపింపఁజేసెను. యూరోపునందలి స్పెయిను, కార్తేజి మొదలగు దేశములుకూడ ముసల్మానుల కనతికాలముననే వశమయినవి. ఈ విజయములవలననే తరువాతి కాలమున హిందూవిజ్ఞానము యూరోపుఖండమున అరబ్బీవాఙ్మయమురూపమునఁ బ్రవేశించుట కవకాశము కలిగినది.

## అరబ్బుల సింధుదేశవిజయము

హర్షవర్ధనుని మరణానంతరమున జరగిన ముఖ్యవిషయములలో అరబ్బులు సింధుదేశమును జయించుట యొకటి. పెరిషియాను బిదప ముహమ్మదీయులు ప్రాగ్దేశమునుగూడ జయింపఁ బ్రయత్నములు చేసిరి. హిందూదేశ మైశ్వర్యవంతమయిన దని హిందూదేశముతో వర్తకముచేయు పారసీక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వర్తకులవలన విని ఓమర్ ఖలీఫాగనున్న కాలమున క్రీ. శ. ౬౩౬-౩౭ లో హిందూదేశసముద్రతీరస్థదేశమును దోచుకొన అరబ్బులు దండెత్తివచ్చిరి. కాని యిట్టి ప్రయత్నములు కష్టసాధ్యములని ఖలీఫా నివారించుటచేత నాగిపోయినవి. కాని, ఓమరు తరువాత వచ్చిన ఖలీఫాలట్లు నివారింపక యట్టి ప్రయత్నములకు ప్రోత్సాహ మొసఁగుటచేత నేఁటేఁట అరబ్బులు నూతనప్రదేశసముపార్జనమునకు బయలుదేఱుచు వచ్చిరి.

వారికి శీఘ్రకాలముననే సింధుదేశ దండయాత్రకుఁ దగిన మిషకూడ దొరకెను. సింహళమునుండి ఖలీఫాకు అమూల్యములయిన కానుకలను కట్నములను గొనిపోవుచుండిన యొక అరబ్బీనౌకను సింధుదేశతీరమున నోడదొంగలు దోచుకొనిరి. నష్టపరిహార మొసంగవలసిన దని ఖలీఫాప్రతినిధి సింధుదేశాధిపతికి వర్తమాన మంపెను. ఓడదొంగలు తన రాజ్యమునందలివారు కారను కారణమున పరిహారము నొసంగ నతఁడు నిరాకరించెను. ఇది సాకు చేసికొని అరబ్బులు సింధుదేశముపయి దండెత్తివచ్చిరి; కాని వచ్చిన అరబ్బీసేనానాయకుని, ఆతని బలమును సింధుదేశీయు లోడించి, నాయకుని బట్టుకొని వధియించిరి. ఈ పరాభవము ఖలీఫాలహృదయమును దహించివైచెను. తత్ఫలముగ సింధుదేశీయులపయిఁ బగఁ దీర్చుకొనుటకు తగినంత సేనతో మహమ్మదు బిన్ కాసిమ్ సింధుదేశముపయిఁ బంపఁబడెను.

మహమ్మదు బిన్ కాసిము నాయకత్వము వహించి హిందూదేశమునకు వచ్చునాఁటికి పదునేడేండ్ల పచ్చిజవ్వనమున నుండెను. అతఁడు పిత్రికిక్కండ లేని మేటి శూరుఁడు; ఒక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చక్కనైనను తొణికిపోవని నిండయిన యావేశోత్సాహములు కలవాఁడు. అట్టివానితో, హిందూప్రభువులచే సామాన్య సంఘగౌరవములకు దూరులయి పరాభవింపఁబడిన జాట్లు మొదలగు దేశీయులయిన కొన్ని తెగలవా రదియే తరుణ మని చేయి కలిపిరి. దీనికి ఫలముఁగ అనతికాలముననే సింధునదీముఖ ద్వారము మొదలుకొని ఎగువ ముల్తానువఱకుఁ గల దేశమంతయు అరబ్బీనాయకునికి పాదాక్రాంత మయినది. దాహీరు మొదలగు దేశీయప్రభువులు మహమ్మదు బిన్ కాసిమునకు సులభముగ దేశమును వశము కానీయక అడుగడుగునకు ఘోరరణ మొనరించి యుదుకు నెత్తురు ధారవోసిరి. కాని విధి ప్రతికూలముగ నుండెను. దాహీరుమరణానంతర మాతని భార్య రాణిబాయి మున్నగు సతీమతల్లులు దుర్గాంతరముల కరిగి కతిపయసైన్యములకు నాయకత్వము వహించి, కరాళ మూర్తులయి, కరవాలము ధరియించి, ఆత్మగౌరవ దేశగౌరవములను గాపాడుకొనఁ దెంపరితనముతోఁ బోరాడిరి. ఇంక సర్వప్రయత్నములును వితథము లయి, వా రాశోపహతులయినతరుణమున ఆత్మగౌరవ, శరీరములు శత్రుకలుషితములు కాకుండ, చిచ్చుదరికొల్పికొని మంటఁబడి సమసిరి. తుదకు సింధుదేశము ఖలీఫాలసామ్రాజ్యమున నొకరాష్ట్ర మయినది.

మహమ్మదు కాసిము మొదట మహమ్మదీయమతము స్వీకరింప నొల్లని విమతస్థులయిన హిందువుల నందఱను కత్తి కెఱఁ జేసి, దేవాలయములను గూలఁద్రోసి, మసీదులను గట్టించి యుద్ధతిఁ జూపినను సంపూర్తిగ మతవినాశనముఁ గావించుట దుర్లభ మని తుద కాపద్ధతి విడిచిపెట్టి క్రొత్త త్రోవ ద్రొక్కెను. బ్రాహ్మణులను రాజకార్యములు నడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుటకు నియోగించెను; ఎవరిమతమును వా రవలంబించుట కును, తమ తమ దేవాలయములను నిలుపుకొని పూజలు నెఱపుటకును అంగీకరించెను. కాని విమతస్థులపయి తల పన్ను విధించి ఇస్లాముమతమును స్వీకరించినవారి కాపన్ను తీసివేయుటయే కాక ఇతరలాభములను గూడఁ జేకూర్చెను.

సింధుదేశమునకుఁ దూర్పుదెసను, ఉత్తరదిశను శక్తి మంతములయిన రాజ్యము లుండుటచేత మహమ్మదు బిన్ కాసి మునకు పిదప, ఖలీఫాలపక్షమున సింధుదేశమును బరిపాలించిన అరబ్బీనాయకులు తమరాజ్యమును ప్రాగుత్తరదిశలుగ విస్త రింపఁ జేసికొనఁ జాలరైరి. మహమ్మదు కాసిము మరణానంతర మున సమర్థులయిన అరబ్బీనాయకులు రాజప్రతినిధులుగ రాకపోవుటచేత సింధుదేశపరిపాలనమున సౌష్ఠవము తగ్గెను. సింధుదేశమున స్థిరపడిన అరబ్బీ తెగలవారు అరాబియాయందు వలెనే శాంతికాలమున నిరంతరము కలహించుచు వచ్చిరి. ఈరాజ్యమును దగినంత యదుపున నుంచుటకు సైన్యముల నంపుటకుఁ గాని, యితరవిధముల సాయపడుటకుఁ గాని ఖలీ ఫాలకు కష్టసాధ్య మయినది. అదియునుఁ గాక, సింధు బీద దేశ మగుటవలనను, భూమి బీదది యగుటవలనను ఈ దేశము ఖలీఫాల కనుకొనినంత లాభకారి కాకపోయినది. ఇన్నిటికిని దోడుగ ఖలీఫాల యధికారముకూడ క్రమముగ క్షీణించినది. వారి దౌర్బల్యమును వీలుగాఁ గొని దూరస్థరాజ్యములు స్వతంత్రము లయినవి. క్రీ. శ. ౮౭౧ నుండి సింధుదేశము ఖలీఫాల సామ్రాజ్యముననుండి విడిపోయినది. తరువాత శీఘ్ర కాలముననే ఆ దేశమున పెక్కురు నాయకులు చిన్న చిన్న రాజ్యములను గట్టుకొని స్వతంత్రులయి పాలించిరి. ఈవిధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున అరబ్బుల సింధుదేశవిజయ మిస్లాముమతచారిత్రమున నొక ఘట్టమే యైనను అది ఫలరహితమైన యొకవిజయ గాథగమాత్రమే పరిణమించినది. సాంఘికముగ అరబ్బుల తెగలు కొన్ని యచ్చట నిలిచిపోయిన వనువిషయము తక్క సింధుదేశమున వారి పరిపాలనమునకుఁ గాని, విజయమునకుఁ గాని సూచకముగఁ గానవచ్చున దేమియు లేదు. వారు పాడొ నరించిన దేవాలయముల శిథిలావశేషములును, వారిచేత నిర్మితములయి, కాలము రాపిడికి విశీర్ణములయిన మసీదులును మాత్రమే ఆ యరబ్బుల పరమతాసహిష్ణుతకు, స్వమతా భినివేశమునకు స్మారకచిహ్నములుగ నిలఁబడి, పూఁడిపోయిన కంఠముతో నాఁటి సైనికవిజయము నభివర్ణించుచుండును.

రాజకీయముగ ప్రాముఖ్యము లేకపోయినను అరబ్బుల సింధుదేశవిజయము భారతీయసంస్కృతిచారిత్రమున ఆంధ్ర, కుషాణయుగములవలెనే యొకసంస్మరణీయమైన ప్రకరణము. భారతీయసంస్కృతి, సభ్యత లాంధ్రులకాలమున ప్రా, గాగ్నే య దేశములకును, కుషాణులకాలమున ఉత్తర, ఈశాన్య దేశ ములకును వ్యాపించినట్లే అరబ్బుల సింధుదేశవిజయముతో నవి పశ్చిమ, వాయవ్యదేశములకు జాలువారినవి. ఆకాలమున కళలయందును, విద్యలయందును హిందూదేశ మితరదేశము లన్నిటికంటె మిన్నయై తేజరిల్లుచుండెను. అరబ్బులకు హిందూ విజ్ఞాన మన్న గౌరవమును, ఆశ్చర్యమును గలిగినవి. వారు బౌద్ధ, బ్రాహ్మణ విద్వాంసుల పాదసన్నిధి నుపవిష్టులయి తర్కము, వేదాంతము, జ్యోతిషము, గణితము, వైద్యము మొదలగు శాఖలకు సంబంధించిన హిందూవిజ్ఞానము నభ్య సించుటయే కాక, వారి తోడ్పాటుతో నాయాశాఖలకు సం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బంధించిన సంస్కృతగ్రంథము లనేకముల నరబ్బీభాష కనువదించిరి. హిందూవైద్యు లనేకులు ఖలీఫాల రాజధానియైన బాగ్దాదునగరమున కరిగి వైద్యశాలలను, వైద్యవిద్యాలయములను స్థాపించిరి. వాస్తు, శిల్పకళాకుశలులు, చిత్రకళానిపుణులుకూడ ఖలీఫారాజ్యమున కరిగి యచ్చటి దేశీయకళకు మెఱుఁగులు దిద్దిరి. ఖలీఫా హారూన్ అల్‌రాశ్చిదుకాలమున (క్రీ. శ. ౭౮౬-౮౦౯) ఖలీఫాల యాస్థానమున హిందూ సాహిత్య, విజ్ఞానముల కాదరాశ్రయములు హెచ్చినవి. హిందూవిద్వాంసులు బాగ్దాదునకుఁ గొనిపోయిన బ్రహ్మగుప్తవిరచితమగు బ్రహ్మసిద్ధాంతాదుల కరబ్బీయనువాదములు వెలసినవి. ఇవియే యరబ్బుల ఖగోళశాస్త్రజ్ఞానమునకు మూలాధారములు. హిందువుల కడనుండి తాము సముపార్జించిన యీ విజ్ఞానము నంతను అటుతరువాతికాలమున అరబ్బులు యూరోపుదేశమున పైరుపెట్టిరి. ఇందువలన యూరోపీయవిజ్ఞానమునకు క్రొత్తచేవ కలుగుటయే కాక, యూరోపుఖండమున ఆయాశాస్త్రములయందలి పరిశోధనకు క్రొత్తప్రోత్సాహమును గలిగినది. ఈవిధమున భారతీయ విజ్ఞానము మధ్యయుగారంభమున శైశవదశయందుండిన యూరోపీయవిజ్ఞానమునకు తోడ్పడి దాని పెంపునకుఁ గారణమై, ఆధునిక విజ్ఞానమునకుఁ గొన్ని విషయములందు పునాదులు వైచినది.

## దక్షిణాపథరాజ్యములు

క్రీస్తుశక మేడవశతాబ్దినాఁటికి దక్కనుదేశమునందును, దాని కిఁకను దక్షిణమున నున్న దక్షిణహిందూదేశమునం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దును ఏయేరాజవంశములు పరిపాలించుచుండినదియు నిది వఱకే తెలుపఁబడినది.

గాంగులు:— క్రీస్తుశక మేడవ, ఎనిమిదవ, తొమ్మిదవ, పదవశతాబ్దములందు కళింగమును గంగవంశజులు పాలించినట్లు తెలియుచున్నను వారిచరిత్రవిశేషము లేవియుఁ దెలియరావు. అనేకములుగ దొరకిన ఈ వంశజులశాసనములవలనఁ జాల మంది రాజుల నామములుమాత్రము వెల్లడియైనవి.

వాతాపిచాళుక్యులు:— క్రీస్తుశక మేడవశతాబ్ది ప్రథమ భాగమున దక్కనుదేశమునందు వాతాపి చాళుక్యరాజ్యము కీర్తివర్మ, మంగళేశుల ప్రయత్నములవలన చాల ప్రాముఖ్య మును బడసినది. వారిరువురియనంతరమున సింహాసనము నెక్కిన కీర్తివర్మ కుమారుఁడు సత్యాశ్రయవల్లభుఁ డను రెండవ పులకేశి చాళుక్యకులాలంకారము. ఈతఁడు తన యనుజుఁ డయిన పృథివీవల్లభ విష్ణువర్ధనుని తోడ్పాటుతో ప్రాక్పశ్చిమ రాజ్యములను జయించుటయే కాక కనోజిరాజయిన హర్ష వర్ధను నోడించి చాళుక్యకీర్తిపతాకను నెలకొల్పెను. వేంగీ, కళింగములు చాళుక్యశౌర్య ప్రతాపములకుఁ దలలు వాల్చి నవి. విజయానంతరము రెండవ పులకేశి సోదరుఁడయిన విష్ణు వర్ధనుఁడు వేంగియందు చాళుక్యరాజ్యమును స్థాపించెను. చరిత్రమున నీ వేంగీచాళుక్యులు తూర్పుచాళుక్యు లనియుఁ జెప్పఁబడిరి. వీరికి పెదవేఁగి, రాజమహేంద్రవరములు రాజధా నులు. రెండవ పులకేశి కీర్తి పశ్చిమమున దూరస్థమయిన పారసీకము(పెరిషియా)వఱకు వ్యాపించినది. పారసీకదేశాధి పతి కానుక, కట్నములతో పులకేశియాస్థానమునకు రాయ బారి నంపెను. ఈ రాయబారమునకు సంబంధించినచిత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొకటి అజంతాకుడ్యచిత్రములలోఁ గలదు. క్రీ. శ. ౬౪౨ ప్రాంతమున కాంచీపుర పల్లవాధిపతియైన మొదటి నరసింహ వర్మ వేసిన వాతాపి ముట్టడియందు రెండవ పులకేశి నిహతుఁ డయ్యెను. ముప్పదిరెండేండ్లయనంతర మతని కుమారుఁడు మొదటి విక్రమాదిత్యుఁడు పల్లవరాజధానియయిన కాంచీపురమును ముట్టడించి పగతీర్చుకొనెను. పల్లవ, చాళుక్య సంగ్రామము ఈరీతిని పెక్కుసంవత్సరములు సాగినవి. ఒకప్పు డొకరును, ఇంకొకప్పుడు మఱియొకరును జయించుచు వచ్చిరి. ఈ వంశమునందలి కడపటి చాళుక్య భూధవుఁడు కీర్తివర్మ. ఈతనికాలముననే రాజ్యాధికార మీ వంశముననుండి తొలఁగి పోయినది. రాజ్యరమ రాష్ట్రకూటులను వరించినది. రాష్ట్రకూటరాజ్యమును క్రీస్తుశక మెనిమిదవశతాబ్ది నడిమిభాగమున (౭౫౭) స్థాపించినవాఁడు దంతిదుర్గుఁడు. ప్రధానవంశ మంతరించినను చాళుక్యశాఖ లనేకము లటుతరువాతికాలముఁగూడ విలసిల్లినవి. ఈ శాఖలవారు రాష్ట్రకూటభూపతులకు సామంతు లయిరి.

మతసహనముఁ గలిగి మతముల నన్నిటిని సమానముగ నాదరించినను చాళుక్యులు ప్రధానముగ హిందువులు. వీరి కాలమున రమ్యములయిన దేవాలయములు నిర్మితము లయినవి. దేవాలయవాస్తువునకు వీ రొసంగిన ప్రోత్సాహము కతమున తత్కళయందు చాళుక్యసంప్రదాయమొకటి యేర్పడినది. జైన, బౌద్ధులవలెనే వీరును గుహాలయములను దొలిపించిరి. వాతాపి(బాదామి)యందలి ఆఱవశతాబ్దినాఁటి హిందూగుహాలయములందలి శిల్పము మనోహరమయి యిప్పటికిని సుస్థితియం దున్నది. బౌద్ధము మహారాష్ట్రదేశమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్తిగ నంతరింపకపోయినను చాల క్షీణించినది. దక్షిణ మహారాష్ట్రమున జైనము వర్ధిల్లినది. జైనదేవాలయములకును, జైనపండితులకునుగూడ చాళుక్యులు దానములుచేసి కీర్తి గడించిరి.

వేంగీ చాళుక్యులు:— పూర్వచాళుక్యరాజ్యమును స్థాపించిన సత్యాశ్రయ రెండవపులకేశిమహారాజు సోదరుఁడగు విష్ణువర్ధనునికిఁ బిదప అతని వంశమువారు వాతాపిచాళుక్యవంశముతోడి సంబంధమును విడనాడి స్వతంత్రులయి అవిచ్ఛిన్నముగ నయిదువందలసంవత్సరము లాంధ్రదేశమును బరిపాలించిరి. వీరిలో నరేంద్ర మృగరాజ రెండవ విజయాదిత్యుఁడు, గుణగ విజయాదిత్యుఁడు, మొదటి చాళుక్యభీముఁడు, అమ్మరాజ రాజమహేంద్రుఁడు, అమ్మరాజ విజయాదిత్యుఁడు అనువారు ప్రసిద్ధులు. నరేంద్రమృగరాజవిజయాదిత్యునినాఁటికి మూలవంశమువా రయిన వాతాపిచాళుక్యుల రాజ్యము కూలిపోయినది. దానిస్థానమున నూతనముగ రాష్ట్రకూటరాజ్యము సంస్థాపితమయినది. నూతనరాజ్యము వెలసిన కొలఁదికాలముననుండియే రాష్ట్రకూటులకును, పూర్వచాళుక్యులకును మహాసంగ్రామము లారంభమయినవి. ఈసంగ్రామాగ్ని కొంచె మించుమించుగ రాష్ట్రకూటరాజ్య మంతరించువఱకుఁ జల్లారలేదు. నరేంద్రమృగరాజవిజయాదిత్యుఁడు రాష్ట్రకూటులతో ద్వాదశవర్షములు పోరాడి నూటయెనిమిది సంగ్రామములందు వారిని గెలిచి, యా స్థలములందుఁ దనపేర నూటయెనిమిది శివాలయములను గట్టించి ప్రసిద్ధిఁ గాంచెను. గుణగవిజయాదిత్యుఁ డతని పౌత్రుఁడు. వీరాధివీరుఁ డితఁడు; తొమ్మిదవశతాబ్ది యుత్తరార్థమున నుండినవాఁడు; పాండ్య, కళింగ, డాహల (రాధామం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డల)ములను జయించెను; చక్రకూటమును(బస్తరు) గాల్చెను; నొలంబుల నోడించెను; బోయరాజుల మద మడఁచెను. ఈ తనికాలమునుండియే మనకుఁ దెలుఁగుబాసను పద్యములు కనఁబడుచున్నవి. మొదటి చాళుక్యభీముఁడుకూడ రాష్ట్ర కూటయుద్ధములందు పేరువహించిన వీరుఁడు. ఇతఁడే తనపేర చామర్లకోట (తూర్పుగోదావరి జిల్లా)యొద్దఁ గల చాళుక్యభీమేశ్వరాలయమును గట్టించెను. అమ్మరాజరాజమహేంద్రుఁడు చాళుక్యభీమ పౌత్రుఁడు: రాజమహేంద్రవర నిర్మాత. ఇతని సోదరుఁ డయిన రెండవ చాళుక్యభీముని తనయుఁడు అమ్మరాజ విజయాదిత్యుఁడు బాలుఁడుగ నుండఁగనే సింహాసన మెక్కి జనరంజకముగ నాంధ్రావనిఁ బాలించి పెక్కుదానములు చేసెను. ఈతని సోదరుఁడు దానార్ణవుని కుమారుఁడగు శక్తి వర్మకాలమునాఁటికి తంజావూరి చోళరాజులు ప్రబలు లయిరి. శక్తివర్మయనుజుఁడయిన విమలాదిత్యుఁడు చోళ రాజరాజు కూఁతురగు కుందవాంబను వివాహమాడెను. ఈ దంపతుల ప్రేమఫలము రాజరాజనరేంద్రుఁడు: నన్నయభట్టారకకవి విరచితమయిన మహాభారతకృతికి పతి. చాళుక్యులు ముఖ్యముగ శైవులయి శైవమతమును పోషించిరి. అయినను మతసహనముఁ గలిగి జైనమునుగూడ ఆదరించిరి. పూర్వచాళుక్యుల కాలమున ఆంధ్రదేశమునందు బౌద్ధమతము క్షీణించినది. నామమాత్రముగ అమరావతీస్తూపక్షేత్రమున బుద్ధపూజ జరగుచుండెను.

పల్లవులు:— క్రీస్తుశక మేడవశతాబ్దిని కాంచీపుర పల్లవ రాజ్యమును సింహావిష్ణువంశజులు పాలించిరి. సింహావిష్ణువు కుమారుఁడు మహేంద్రవర్మ. దక్షిణాదిని వాస్తు, శిల్పకళలను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పందిరికిఁ బ్రాఁకించిన దీతఁడు. విష్ణుకుండిప్రభువులవలననుండి గుహాలయనిర్మాణాభిజ్ఞానమును బడసి యీ కళను ద్రవిడ దేశమున వ్యాపింపఁజేసె నని చరిత్రకారు లందురు. ఈతఁడు వాతాపి చాళుక్యవంశజుఁడయిన రెండవ పులకేశిచేత నోడింపఁ బడెను. ఇతని యనంతర మితని కుమారుఁడు నరసింహవర్మ రాజ్యమునకు వచ్చెను. ఇతనికాలమున నుండి వాతాపిచాళుక్యులకు, నీ వంశమువారికి నెడతెగని సంగ్రామములు జరగినవి. నరసింహవర్మ వాతాపినగరముపై నెత్తివెళ్లి దానిని ముట్టడించి, పులకేశిని వధియించెను. మామల్లపుర మనఁబడు మహాబలిపురమును గట్టించిన దితఁడు. ప్రసిద్ధములయిన యిచ్చటి ధర్మరాజాది సప్తశిలారథములు నితని యాదర ప్రోత్సాహములవలన నిర్మితము లయినవి. ఒక్కొక్కరథ మొక్కొక్క పెద్దఱాతిబండను దొలిచి మలిచి చేసినది. ఇందలి శిల్పము కడురమణీయము. నరసింహవర్మ యనంతరము మహేంద్ర, పరమేశ్వర, నరసింహ, పరమేశ్వరవర్మలు రాజ్య మేలినపిదప కాంచీపురరాజ్యమును సింహవిష్ణుసోదరుఁడయిన భీమవర్మసంతతివా రాక్రమించుకొనిరి. వీరిలో కాంచీపురము నేలిన మొదటిప్రభువు పల్లవమల్లబిరుదాంచితుఁడగు నంది వర్మ. క్రీస్తుశక మెనిమిదవశతాబ్ది ప్రథమపాదమున రాజ్య భారము వహించెను. అనంతర మితని సంతతివారు మువ్వురు రాజ్య మేలిన వెనుక కాంచీపురప్రాంతమును తొమ్మిదవశతాబ్ది కడపటికాలమున చోళులు వశపఱచుకొనిరి.

పల్లవరాజ పరిపాలనము బహుధా ప్రసిద్ధమయినది. సంఘారామములు బౌద్ధవిద్యాపీఠములయినయట్లు ఈకాలమున ఘటికాస్థానములు వైదికవిద్యాస్థానము లయినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అట్టివానిలో కాంచీపుర ఘటికాస్థానము ప్రధానమయినది. సంస్కృతవిద్య బాగుగ వర్ధిల్లినది. కిరాతార్జునీయమును రచియించిన భారవి సింహవిష్ణువు ఆస్థానకవి. దశకుమారచరిత్రాది గ్రంథములకు కర్తయగు నాతని ప్రపౌత్రుఁడు దండి. రెండవ మహేంద్రవర్మ కుమారుఁడయిన రాజసింహుఁ డను రెండవ నరసింహవర్మ యాస్థానమున నుండినట్లు చెప్పుదురు. మొదటి మహేంద్రవర్మ కడురసికుఁడు; సకలకలాభిజ్ఞుఁడు; గానసాహిత్యమునఁ జతురుఁడు; మత్తవిలాస మను నొక సంస్కృత ప్రహసనమును రచియించెను.

భారతీయ దేవాలయవాస్తు, శిల్పములు దక్షిణహిందూ దేశమున క్రీస్తుశక మాఱవశతాబ్ది అంతమున పల్లవుల కాలమున మాఱాకుతొడిగి క్రమముగ వికసించినవి. ద్రవిడదేశమునందలి మొదటి పర్వతగుహాలయములు మొదటి మహేంద్రవర్మకాలమునాఁటివి. ఇతని తనయుఁడు మహామల్ల బిరుదాంచితుఁడగు మొదటి నరసింహవర్మ గుహాలయములను నిర్మించుటయే కాక ఏకాండపుఱాలను ఇప్పుడు రథము లనుపేరఁ బరఁగు విడివిడి దేవమందిరములుగ మలిపించెను. గుహాలయ, దేవమందిరముల పద్ధతిని రాజసింహుఁ డిటుకతోను, ఱాతితోను దేవాలయములను గట్టించెను. ద్రవిడదేశమున నిట్టి యాలయములను నిర్మించుట కిదే యారంభము. వినశ్యములగు పరికరములతో నిర్మించిన అంతకుపూర్వపు నిర్మాణము లిప్పుడు కానరాకపోవుట సహజము. భారతీయ దేవాలయవాస్తు, శిల్ప సంప్రదాయములలో పల్లవసంప్రదాయము కడు హృదయాకర్షకమయినది. పల్లవులకాలమున చిత్రకళకూడ పెంపొందినది. కాంచీపుర కైలాసనాథాలయమునను, పుదుక్కోట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమీపమునఁ గల శిత్తానవాసిల్ గుహాలయందునుగల యాలేఖ్యములు పల్లవ యుగమునాఁటి చిత్రకళకుఁ దార్కాణములు.

రాష్ట్రకూటులు:— దంతిదుర్గుఁడు మొదట చాళుక్య వంశజుఁడయిన రెండవ కీర్తివర్మ సామంతుఁడుగ నుండి పిదప నాతని యధికారమును ధిక్కరించి రాష్ట్రకూటరాజ్యమును స్థాపించెను. అనంతరమున రాజ్యమునకు వచ్చినవాఁ డతని సోదరుఁడు మొదటి కృష్ణభూవిభుఁడు. ఇతఁడు నిజాంరాజ్యము నందలి ఎల్లోరాకొండలలో నొకకొండచఱియను మలిపించి సుందరాతిసుందరమయిన కైలాసాలయమును గట్టించెను. శిలావిద్ధములయిన యాలయములలో నింతటి గొప్పదియు, శిల్పసౌందర్యమున కంతగఁ బేరెక్కినదియు హిందూదేశమున మఱియొకటి కానరాదు. కృష్ణభూపతిపౌత్రుఁ డయిన మూఁడవ గోవింద రాజేంద్రుఁడును (క్రీ. శ. ౭౯౪-౮౧౪), అతని కుమారుఁడు అమోఘవర్షుఁడును (క్రీ. శ. ౮౧౪ – ౮౭౭) రాష్ట్రకూట రాజన్యులందఱిలోఁ జాల గొప్పవారు. అమోఘవర్షుఁడు దిగంబరజైనపోషకుఁడు. జైనమతవ్యాపనమున కితఁడు కావించిన ప్రయత్నములవలననే దక్షిణాపథమున బౌద్ధము కడు శీఘ్రముగ క్షీణించినదని చెప్పుదురు. ఒకవైపు వేంగీ చాళుక్యులతోను, మఱియొకవైపు పశ్చిమగాంగులతోను, వేఱొకవైపు పల్లవులతోను రాష్ట్రకూటులు కావించిన సంగ్రామము లనేకములు. వానినిగుఱించి యిట తెలుపుట అనావశ్యకము. కక్కరాజను కడపటి రాష్ట్రకూటభూపతిని చాళుక్య వంశజుఁడయిన తైలపుఁడు క్రీ. శ. ౯౭౩ ప్రాంతమున యుద్ధమున జయించి మరల చాళుక్యవంశమును స్థాపించెను. చారిత్రమున నీతని వంశజులను కల్యాణిచాళుక్యు లందురు. రాష్ట్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూటులకు ప్రథమమున నాసికయు, పిదప మాల్యఖేటమునను రాజధానులు. ఈ కారణమునఁ జరిత్రకారులు వీరిని మాల్యఖేటరాష్ట్రకూటులని వ్యవహరింతురు.

రాష్ట్రకూటులకాలమున హిందూపౌరాణిక దేవతారాధనమున కదివఱకుకంటె ప్రాముఖ్య మతిశయించినది. రాష్ట్రకూటులతో పర్వతములను, శిలలను దొలిచి, మలిచి గుహలను, ఆలయములను గట్టించుయుగ మంతరించినది. వానికి బదులుగ మనోహరములయిన శైవ, వైష్ణవాలయము లనేకములు నిర్మితము లగుచువచ్చినవి. ఒక ప్రత్యేకమతముగ బౌద్ధము తన ప్రాధాన్యమును గోలుపోయినది. జైనమతము చాళుక్యులకాలమునకంటెను విస్తరిల్లినది. రాష్ట్రకూటరాజ్యమున దిగంబర, శ్వేతాంబర శాఖలలో ప్రధానముగ వ్యాపించినది దిగంబరజైనము. అంతరించి పోవకుండ నిప్పటికి నిలిచియున్నదిగంబరశాఖవారి మతగ్రంథము లనేకము లీరాష్ట్రకూటులకాలమున రచియింపఁబడినవే.

---

## రాజపుత్రయుగము

హర్షవర్ధనుని మరణానంతరమున ఆ చక్రవర్తి తన బాహువుల బలిమిని, బుద్ధికలిమిని నిర్మించుకొనివచ్చిన మహాసామ్రాజ్యము శిథిలముకాఁగా, దేశమున అరాజకము ప్రబలినది. ఈరాజకీయ సంక్షోభ సమయ మొకవిధముగ మార్పుకాలము. రాజకీయముగ మాత్రమే కాక యింక ననేక విషయములందును మార్పు కలిగిన కాలమిది. ఈసంక్షోభ సమయమున పైకివచ్చినవారు రాజపుత్రులు. క్రీస్తుశక మేడవశతాబ్ది నడిమిభాగముననుండి పంద్రెండవ శతాబ్ది కడపటివఱకు వీరి ప్రాబ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ల్యమును, ప్రాముఖ్యమును అధికముగ నుండినందున హిందూ దేశ చారిత్రమున నీకాలమునకు రాజపుత్రయుగమని పేరు కలిగినది. ఈకాలమున ఉత్తర, దక్షిణ హిందూదేశములందు విలసిల్లిన రాజ్యములన్నియు రాజపుత్రులవే. ఈరాజ్యములలో దేని కదియే స్వతంత్రమును, సార్వభౌమపదవి కాశించి యిరుగు పొరుగు రాజ్యములతో నిరంతరము కలహించుచు వచ్చినది. రాజపుత్రుల యీ నిరంతర కలహములవలన మహమ్మదీయుల కిటుతరువాత హిందూదేశమును జయించుట కడుసుకరమయినది. మహమ్మదీయ యుగమునందుఁగూడ రాజపుత్ర రాజ్యములు కొన్ని మధ్య హిందూదేశమునందును, మాళవ, రాజపుత్ర స్థానములయందును దమ స్వాతంత్ర్యమును నిలుపుకొనుచు వచ్చినవి. ఈరాజ్యములనుగూడ కబళింప నాఁకలిగొన్న మహమ్మదీయులకును, ప్రాణమును పణముగ నొడ్డియైనను దమ స్వాతంత్ర్యమును నిలుపుకొన వీరకంకణము కట్టిన రాజపుత్రులకును జరగిన భయంకరసంగ్రామము లసంఖ్యములు. ఈసందర్భమున రాజపుత్రులు చూపిన అనుపమాన శౌర్యపరాక్రమములును, ఆత్మగౌరవ, స్వదేశ, స్వాతంత్ర్యాభిమానములును అక్కజముఁ గొలుపు వీరగాథలయి రాజపుత్రస్థానము వీరకథానకములకు పంటపొల మయినది.

ఈరాజపుత్రు లెవ రన్నవిషయము చరిత్రకారులకు నేటికిని చిక్కువిడని కఠినసమస్యలలో నొకటి. కానయితే, రాజపుత్రులు తాము చంద్రవంశ క్షత్రియుల మని, సూర్యవంశ క్షత్రియుల మని, పాండవుల సంతతివార మని, రాముని సంతతివార మని చెప్పుకొందురు. పూర్వకాలమున భూలోకము మ్లేచ్ఛసంబాధితము కాఁగా, తన్నివారణమునకయి ఆబూపర్వతశిఖ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రముమీఁదఁ గల తన యగ్నికుండముననుండి వసిష్ఠమహర్షి వరుసగా పరమారులను (ప్రమారులు), పరిహారులను (ప్రతీహారులు), సోలంకులను (చాళుక్యులు), చౌహాణులను (చాహమానులు) సృజియించె నను పరంపరాగతముగ వచ్చు నొక యైతిహ్యము కారణముగ పరమార, పరిహార, సోలంకి, చౌహాణులను నాలుగు రాజపుత్రవంశములవారుమాత్రము తాము అగ్నికులక్షత్రియుల మని విశ్వసింతురు. ఎవ్వ రెట్లు చెప్పు కొన్నను సాధారణముగ రాజపుత్రుల వంశగాథలు క్రీస్తుశక మెనిమిదవ శతాబ్దికి వెనుకకుఁ బోవు. అవలకయినను బోవునవి చాల తక్కువ. రాజపుత్రులు వేదకాలపు క్షత్రియులసంతతివారని చరిత్రకారులలోఁ గొందఱ యుద్దేశమయినను వారు క్రీస్తుశకమునకుఁ బూర్వము రెండవశతాబ్దినుండి హిందూదేశముపయి దండెత్తివచ్చి యిచ్చట స్థిరపడిపోయిన విదేశీయులగు యవన, శక, పహ్లవ, హూణాదుల సంతతివారని చాల మంది సిద్ధాంతీకరించినారు. పైని పేర్కొనిన విదేశీయులు దేశీయులతో సంబంధ బాంధవ్యములు నెఱపి క్రమముగా హిందూమతావరణమునఁ బ్రవేశించిన వెనుక వారిలో గొప్ప వారు క్షత్రియులుగ పరిగణింపఁబడుచువచ్చి రనుటకును, విదేశీయులనుండియే కాక, దేశీయములయిన యాదిమజాతులనుండియుఁ గొన్ని రాజపుత్రవంశము లేర్పడియుండు ననుటకును అవకాశములు కలవు. రాజపుత్రవంశములలోఁ గొన్ని శక, కుషాణజాతులనుండి యేర్పడిన వనుటకుఁ గాకపోయినను, హూణులయందలి గుజారు లను తెగనుండి యేర్పడిన వనుట కాధారములు కలవు. ప్రతిహారులవంటి ప్రసిద్ధ రాజపుత్ర వంశములు కొన్ని గుజారులనుండి యేర్పడినవే. ఈ కారణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున నే ప్రతిహారులను గూర్జర ప్రతిహారు లనియు వ్యవహరింతురు. గోండులు, భారులు అను మధ్యహిందూదేశము నందలి యాదిమజాతులనుండి చందేలు రాజపుత్రవంశ మేర్పడినదని చరిత్రకారుల యూహ. దక్షిణాపథమున వర్ధిల్లిన రాష్ట్రకూట, గాంగ, చోళ, చాళుక్యాది వంశములుకూడ ఇట్లు దేశీయములయిన యాదిమ జాతులనుండి పరిణామమును జెంది రాజత్వము నందినవే. హిందూమతమును, హిందూ సంస్కృతిని పునరుద్ధరింప దీక్షాకంకణము కట్టిన బ్రాహ్మణులీవంశముల యుత్పత్తికథనమున పౌరాణికవంశ సంబంధము నతుకుపఱిచి, తద్వంశజులకు క్షత్రియత్వము నాపాదించి, వారి యాశ్రయ, ప్రాపకములఁ దమమతమును వ్యాపింపఁజేసినట్లు కన్పట్టును. అంతటనుండి యీ వంశములవారు సూర్యవంశజులుగనో, చంద్రవంశజులుగనో పరిగణింపఁబడుచు వచ్చిరి.

ఈ కాలమున వర్ధిల్లిన ముఖ్యములయిన రాజపుత్ర రాజ్యములనుగుఱించి, వంశములనుగుఱించి యించుక తెలిసికొనవలసియున్నది. హిందూదేశమునకు సరిహద్దుల నున్న రాజ్యములలో ముఖ్యమయినవి కాశ్మీరము, నేపాళము, అస్సాము.

కాశ్మీరము:— రాజపుత్రయుగమునఁ బ్రసిద్ధినహించిన రాజ్యములలో కాశ్మీర మొకటి. ఇది యశోకచక్రవర్తి కాలమున మౌర్యసామ్రాజ్యమునను, పిదప కుషాణులకాలమున కుషాణసామ్రాజ్యమునను జేరియుండె ననుట తక్క, హర్షవర్ధనుని కాలమువఱకు దాని ప్రాచీనచరిత్ర మేమియుఁ దెలియదు. క్రీస్తుశక మేడవశతాబ్దినుండి యీ దేశచరిత్రమును దెలిసికొనుటకు పండ్రెండవ శతాబ్దిని కల్హణుఁ డను విద్వాంసుఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రచియించిన 'రాజతరంగిణి' యను గ్రంథమే యాధారము. హర్షవర్ధనుని కాలమున కర్కోటక వంశస్థాపకుఁడయిన దుర్లభవర్ధనుఁ డీదేశమును బాలించుచుండెను. అతనికిఁ బిదప పరిపాలించిన రాజు లనేకులు కలరు. వారిలో లలితాదిత్యుఁడు, జయాపీడుఁడు, అవంతివర్మ యున్నగు వారు ప్రసిద్ధులు. కాశ్మీర రాజచరిత్రము చదువుట కింపుగ నుండును గాని చాలవఱకది స్థానిక ప్రాముఖ్యము మాత్రమే కలిగినది. లలితాదిత్యుఁడు మొదలయిన పరాక్రమవంతులగు ధరణీశులు కొండఱు చుట్టుపట్టుల నుండు దేశమును జయించి రాజ్యవిస్తృతి నెఱపుచువచ్చినను, రాజకీయముగ కాశ్మీరదేశచారిత్రమునకును, మొత్తముమీఁద హిందూదేశచారిత్రమునకును గల సంబంధము చాల కొలఁది.

రాజకీయముగ నెటు లున్నను హిందూసంస్కృతిచారిత్రమున కాశ్మీరమునకుఁ గొంత ప్రాధాన్యము కలదు. అది పూర్వకాలమున హిందూదేశము నుత్తరదేశములతోఁ గలుపు కొక్కెముగ నుండినది. అశోకుని కాలముననుండియు కాశ్మీరము సంస్కృత విద్యకు ప్రసిద్ధికెక్కినది. హిందూ, బౌద్ధ మతములు రెండును ఈదేశమున బాగుగ వ్యాపించినవి. ఇచ్చట ప్రసిద్ధములయిన హిందూ, బౌద్ధక్షేత్రము లనేకములు కలవు. దేవాలయనిర్మాణమున నిచట నొక ప్రత్యేకరీతి వెలసినది. దీని కుదాహరణముగ లలితాదిత్యునిచేత నిర్మితమయిన మార్తాండాలయమును బేర్కొనవచ్చును. హిందూసంస్కృతియు, కళయు నుత్తరదేశముల కరుగుటలో వానికి కాశ్మీరము మధ్యమజిలీ యైనది. దీనివలన నుత్తరదేశములందలి మతమును, కళలును చాల మార్పు చెందినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేపాళము:— ప్రాచీననేపాళరాజ్య మిప్పటిదానికంటె చాల చిన్నది. కాట్మండు దానికి రాజధాని. ఇది మొదట అశోకచక్రవర్తి మౌర్యసామ్రాజ్యమునం దంతర్భాగముగ నుండినట్లు తెలియును. దీని ప్రాచీనచరిత్రము మనకు సరిగాఁ దెలియదు; తెలిసినదయినను, స్థానికముఁగ మాత్రమే ప్రాముఖ్యము కలది. ఇప్పు డీరాజ్యమును బాలించు గూర్ఖాలు క్రీ. శ. ౧౭౬౮ లో నీ దేశమును జయించినవారు. ప్రాచీన కాలమున నుండియు నిచ్చట వ్యాపించియున్న ప్రధానమతము బౌద్ధము. ఇప్పు డీదేశమును బాలించువారు హిందూమతము నాదరించుటవలన క్రమముగ బౌద్ధము సన్నగిలుచున్నది. సన్నిహితదేశము లగుటవలన నేపాళము, టిబెత్తుదేశములకు కళవిషయమున నెక్కువ దగ్గఱ సంబంధము కలదు. బౌద్ధ విగ్రహములను దయారుచేయుటలో నేపాళదేశపు కర్మకరులు చతురులు.

అస్సాము:— ప్రాచీనకాలమున నిది కామరూప మను పేరఁ బరఁగిన దేశము. పర్వతారణ్యమయ మగుటవలన శత్రుజన దుస్సాధమయి చాలకాల మిది తన స్వాతంత్ర్యమును నిలుపుకొనినది. దీని చరిత్రముకూడ మనకు సరిగా తెలియదు. హర్షవర్ధనుని కాలమున ఈదేశపురాజా చక్రవర్తికి లోఁబడిన సామంతుఁడు కాకపోయినను, ఒకవిధముగ నాతనికి విధేయుఁడయి కన్నోజరాజాస్థానము నలంకరించుచుండువాఁడు. ఎగువ బర్మాదేశమునుండి వచ్చిన ఆహోము లనువారు పదుమూఁడవశతాబ్ది నీదేశముపయి నెత్తివచ్చి దీనిని క్రమముగా వశపఱుచుకొని పాలించిరి. వీరు మొదట విమతస్థులే యైనను క్రమముగా హిందూమతము నవలంబించి హిందువు లైరి. మహమ్మదీయు లీదేశమును జయింప పెక్కు శతాబ్దులు ప్రయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్నించి విఫలులయిరి. పందొమ్మిదవ శతాబ్ది ప్రథమభాగమున అహోములను జయించి బర్మావారును, వారిని జయించి బ్రిటీషు వారును ఈదేశమున కధిపతులయిరి. ఇచట శక్తిదేవతా ప్రధానమయిన తాంత్రికహిందూమతము బాగుగ వర్ధిల్లినది. ఈతాంత్రికసంప్రదాయమునకుఁ జెందిన యాలయములలో నెల్ల గౌహతీసమీపమున నున్న కామాఖ్యాలయము మిక్కిలి ముఖ్యమయినది.

కన్నోజ:— ఈ రాజపుత్ర యుగమున రాజకీయముగ మున్ముందు ప్రాముఖ్యమును బడసినది కన్నోజ. హర్షుని యనంతరమునుండి మహమ్మదుఘోరి విజయకాలము నాఁటివఱకు, మౌర్యవంశజుల కాలమున పాటలీపుత్రము వలెనే, కన్నోజ హిందూస్థానమున కంతకు రాజధానిగ నుండుటయే కాక అరబ్బీ చరిత్రకారులచేత నిది భాగ్యవంతమయినదని, చక్కనిదని సంస్తుతు లందినది.

హర్షచక్రవర్తి యనంతరమునఁ గొంతకాలమువఱకు కన్నోజ చారిత్రము చీఁకటి పొరలలోఁ బడి కప్పవడిపోయినది. క్రీ. శ. ౭౩౦ ప్రాంతమున మరల దాని భాగ్యరేఖను బయలుపఱచినవాఁడు యశోవర్మ. ఇతఁడు విద్వత్ప్రియుఁడు; చీనాదేశమునకు రాయబారము నంపి ఘనత వహించెను. మహావీర, మాలతీమాధవ, ఉత్తరరామచరిత్రము లను నాటకములను రచియించి పేరెన్నికగన్న భవభూతిమహాకవి యీతని యాస్థానకవి. క్రీ. శ. ౭౪౦ ప్రాంతమున కాశ్మీర దేశాధిపతియయిన లలితాదిత్యుఁడు కన్నోజపయి దండెత్తివచ్చి యశోవర్మ నోడించెను. ఇట్లే యిరుగు పొరుగుల నుండిన శత్రురాజుల యొత్తిడివలన యశోవర్మరాజ్యము చాల సలిగి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయినది. యశోవర్మ యనంతరమున రాజ్యమేలినవారు బలహీను లగుటచేత క్రమముగ వారి ప్రాభవాధికారములు సన్నగిల్లినవి. ఇటు లుండ, క్రీ. శ. ౮౧౬ ప్రాంతమున ప్రతిహార వంశజుఁడయిన నాగభటుఁడు యశోవర్మ సంతతివారి నోడించి తఱుమఁగొట్టి కన్నోజ నగరమును గైవసము కావించుకొనెను. నాఁటనుండి కన్నోజ ప్రతీహార వంశజులకు రాజధానియైనది.

ప్రతీహారులు:— వీరు క్రీస్తుశక మెనిమిదవ శతాబ్దిని దక్షిణ రాజపుత్రస్థానమునఁ దమ రాజ్యమును నిర్మించుకొని భిన్మాల్ రాజధానిగఁ బరిపాలించిరి. పరిహారులని వీరికి నామాంతరము కలదు. వీరిలో మొదటి ప్రభువు మొదటి నాగభటుఁడు అరబ్బులు సింధుదేశమునుండి ప్రాగ్దేశముల పయి దండెత్తి వచ్చినప్పుడు వారి నోడించి ప్రాముఖ్యమును బడసెను. రెండవ నాగభటుని కాలమున (క్రీ. శ. ౮౧౬) వీరు కన్నోజ రాజ్యమును వశపఱచుకొనిరి. ఈ వంశమున మిక్కిలి పరాక్రమవంతుఁడు మిహిరభోజుఁడు (క్రీ. శ. ౮౪౦-౮౯౦). ఇతఁడు చాల గొప్పవాఁడు. బహుసంగ్రామవిజేత యయిన యీతని కాలమున కన్నోజ ప్రతీహారసామ్రాజ్యముత్తరమున హిమవత్పర్వతమువఱకును, నైరృతదిశను కాఠియవాడవఱకును, తూర్పున అలహాబాదువఱకును, పడుమట పంజాబువఱకును వ్యాపించినది. 'హిందూదేశమునందంతటిలో ఉత్తమమయిన యాశ్వికదళమును, గొప్ప యుష్ట్రదళమును శౌర్యపరాక్రమములకు పేరువడిన మిహిర భోజుని సైన్యమునఁ గలదు. భోజుఁడత్యంత భాగ్యవంతుఁడు. ఈతని రాజ్యమువలె చోరరహితమయిన రాజ్య మేదియు హిందూదేశమున మఱియొకటి కనఁబడదు' అని అల్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మసూది యను అరబ్బీయాత్రికుఁడు క్రీ. శ. ౮౫౧ లో వ్రాసినాఁడు. కడపట చెప్పిన యంశము ననుసరించియే యాతని రాజ్యపాలన మెంతటి కట్టుదిట్టముగ నుండెనో తెలియఁగలదు. మిహిరభోజుని కుమారుఁడు మహేంద్రపాలుఁడు (క్రీ. శ. ౮౯౦-౯౦౮) తండ్రివలెనే కడు సమర్థుఁడు. పంజాబుననుండి బీహారమువఱకు నీతని రాజ్యము విస్తరిల్లినది. సాహిత్యప్రపంచమునఁ బ్రసిద్ధిఁ గాంచిన రాజశేఖరమహాకవి మహేంద్రపాలుని కుపాధ్యాయుఁడు. ఇతఁ డాతని యాస్థానకవియై యాతని యాదర ప్రోత్సాహములవలన చక్కని నాటకములను, సాహిత్యగ్రంథములను విరచించి వినుతికెక్కెను. బాలరామాయణము, బాలభారతము, విద్ధసాలభంజిక, కర్పూరమంజరి యను నీ కవికృతములయిన నాలుగు నాటకములలో కడపటిది మాత్రము ప్రాకృతభాషయం దున్నది; మిగిలినవి సంస్కృతమునఁ గలవు. ఈ కవి రచియించిన కావ్యమీమాంస పేరు పడ్డ సాహిత్యగ్రంథములలో నొకటి. మహేంద్రపాలుని యనంతరమున మహీపాలుని కాలమునందు క్రీ. శ. ౯౧౬ లో రాష్ట్రకూటరాజయిన మూఁడవ యింద్రభూపతి పరాక్రమించి కన్నోజపయి నెత్తి వచ్చెను. ఈ సమయముననే అంతవఱకు స్వాతంత్ర్యతృషార్దితములయిన సామంతరాజ్యములు సామ్రాజ్యముననుండి చీలిపోయినవి. రాష్ట్రకూటదండయాత్ర ఫలితముగ కన్నోజరాజ్యము చితికిపోయినది. క్రమముగ నీ ప్రతిహార వంశజుల రాజ్యాధికారములు సన్నగిల్లినవి. క్రీ. శ. ౧౦౧౯ లో హిందూదేశముపయి దండెత్తి వచ్చిన ఘజినీ మహమ్మదు కన్నోజను ముట్టడించి యందలి యేడుకోటల నొక్క దివసమునఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బట్టుకొని విస్తారము కొల్లతో మరలిపోయెను. పిటికివాఁడయిన ప్రతిహారవంశజుఁడు రాజ్యపాలుఁడు కన్నోజను విడిచిపెట్టి గంగ కావలిదరి నున్న బారిగ్రామమున కరిగి దానిని రాజధానిఁ గావించుకొనెను. మఱుసటిసంవత్సరమున మహమ్మదు మరల చందేలురాజ్యమునిూఁదికి దాడి వెడలుచు, బారిని పట్టుకొనెను. క్రీ. శ. ౧౦౯౦ కి పూర్వమే, యేవిధముననో తెలియదు కాని, కన్నోజ పరిహారవంశ మంతరించినది. తరువాత కన్నోజను పాలించినవారు గహార్వారు లనఁబడు గధవాలవంశజులు.

గధవాలులు:— వీరు మొదటఁ దమ రాజ్యమును అయోధ్య, వారణాసి ప్రాంతముల స్థాపించిరి. ఈ వంశజుల పరిపాలన యొక శతాబ్దికి పైఁగ సాగినది. ఈ వంశస్థాపకుని పౌత్రుఁడయిన గోవిందచంద్రుఁడు (క్రీ. శ. ౧౧౦౦ — ౧౧౬౦) చాలకాలము పరిపాలించి కన్నోజరాజ్య ప్రతిష్ఠను హెచ్చరిల్లఁజేసెను. కథాకలాపములయందు పృథ్వీరాజునకు గర్భశత్రువని పేరుకెక్కిన జయచంద్రుఁడు గోవిందచంద్రుని మనుమఁడు. పృథ్వీరాజుతోఁగల గర్భవిరోధమున ఆతని నణఁచివైచుటకు జయచంద్రుఁడు మహమ్మదుఘోరి నాహ్వానించెనని కొంద ఱందురు కాని దీని కాధారములు కానరావు. క్రీ. శ. ౧౧౯౪ లో మహమ్మదుఘోరి కన్నోజపయి దండెత్తి వచ్చినప్పుడు జయచంద్రుఁడు అత్యంత శౌర్యపరాక్రమములను జూపి కడు తెంపరితనముతోఁ బోరాడెను కాని ప్రయోజనము లేకపోయెను. జయచంద్రుని కాలమున రాజధానిగ నుండిన వారణాసికూడ మహమ్మదీయుల వశమయినది. అడ్డ మాఁకలు లేక వారు రాజ్యమునందలి నగరముల నన్నిటిని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొల్లగొట్టిరి. చేపడిన గొల్లను గొనిపోవుటకు ౧,౪౦౦ ల యొంటెలు కావలసి వచ్చినవఁట! ఈ సంగ్రామముతో కనోజ స్వాతంత్ర్య మంతరించినది. హిందువులకు పవిత్రములయిన గంగా, యమునా నదీతీర ప్రదేశములయందు కడకు విమతస్థులయిన మహమ్మదీయుల చంద్రధ్వజము రెపరెపలాడినది.

పాల, సేన వంశములు :— హర్షచక్రవర్తి మరణానంతర మాతని సామ్రాజ్యమునందలి ప్రాగ్రాష్ట్రము లన్నియు చిన్న చిన్న స్వతంత్ర రాజ్యములుగ చీలిపోయినవి. హర్షమరణానంతర మొకశతాబ్దికాలము బంగాళాదేశచారిత్రమును దెలిసికొనుట కాధారములు లేవు. ఈ ప్రాంతమును గౌర్ లేక లక్ష్మణావతి రాజధానిగ క్రీస్తుశక మెనిమిదవశతాబ్దిని ఆదిశూరుఁడను నొకరాజు పాలించె ననియు, ఆతఁడు బౌద్ధమత ప్రాబల్యమున క్షీణించిన సనాతనహిందూమతము నుద్ధరింప కనోజనుండి యైదుబ్రాహ్మణకుటుంబములను రావించె ననియు, వీరే యిప్పటి రాఢీయ, వారేంద్ర బ్రాహ్మణుల పూర్వులనియు నిప్పటికిని బంగాళాదేశమున గాథలు కలవు. ఆదిశూరుని మాట యెటు లున్నను, ఒకప్పుడు కడపటి గుప్తవంశజుల పరిపాలనముక్రింద నుండిన యీప్రాంత మరాజకముతో బాధపడుచుండిన కాలమున గోపాలుఁడను నతఁడు రాజకీయ రంగమున కవతరించి పశ్చిమబంగాళము, దక్షిణబీహారము లందుఁ దనయధికారమును స్థాపించెను. ఇతఁడు బౌద్ధమతావలంబకుఁడు; బీహారునగర సమీపమునఁ గల యుద్దండపురమున నొక బౌద్ధవిహారమును నిర్మించెను. ఇది యానాఁటి పేరువడిన గొప్ప విద్యాపీఠములలో నొకటి. గోపాలునికిఁ బిదప నతని సంతతివారి కీపురము రాజధానియయినది. గోపా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లుని కుమారుఁడు ధర్మపాలుఁడు (క్రీ. శ. ౭౭౫ – ౮౧౫), పరాక్రమవంతుఁడయి బంగాళము, బీహారములనే కాక యుత్తర హిందూస్థానమునఁ జాలభాగమును జయించి రాజ్య మేలెను. ఇతని సంతతివా రందఱు 'పాల'నామాంచితు లగుటచేత వీరికి 'పాలరాజు' లని వ్యవహారనామము కలిగినది. తండ్రివలెనే ధర్మపాలుఁడును బౌద్ధమతము నవలంబించి దానిని పోషించెను; విక్రమశిలయను బౌద్ధవిహారమును నిర్మించెను. నాలందకుఁ బిదప నాఁటి విద్యాపీఠములలో నిదియే గొప్పది; ౧౦౭ దేవాలయములతోను, ఆఱు కళాశాలలతోను విరాజిల్లుచుండిన యిది తాంత్రికవిద్యకే కాక వ్యాకరణ, న్యాయశాస్త్రములకును ప్రధానపీఠముగ నుండెను. తిబెత్తుదేశపు విద్యార్థు లెందఱో యిచ్చట విద్య నభ్యసింప వచ్చుచుండిరి. ఈవిద్యాపీఠమున నెన్నియో సంస్కృతగ్రంథములు తిబెత్తుభాష కనువదింపఁబడినవి. భాగల్పూరుజిల్లాయందలి పాథర్ఘాటే ప్రాచీన విక్రమశిల యని పురాతత్త్వపరిశోధకులు గుర్తించి యున్నారు. ధర్మపాలుఁ డీవిద్యాపీఠమున కనేక దానధర్మములను గావించి వినుతి కెక్కెను. ధర్మపాలుని కాలమున ఆచార్య బుద్ధజ్ఞానపాదుఁ డీవిద్యాపీఠమున కధిపతి. క్రీ. శ. ౧౨౦౩ ప్రాంతమున నీదేశముపయి దండెత్తివచ్చిన బఖ్త్యార్ ఖిల్జీ యీ విద్యాపీఠమును విధ్వంసము గావించెను. పాలవంశజు లందఱిలో కడు పరాక్రమవంతుఁడగు దేవపాలుఁడు అస్సాము, కళింగ రాజ్యములను రెంటెని జయించెను. కాంబోజు లనుకొండజాతివారీపాలవంశజులను జయించి తమ యధికారమును స్థాపించి కొంతకాలము రాజ్యమేలిరి; కాని మహీపాలుఁ డనునతఁడు పదవశతాబ్ది యుత్తరార్ధమున విజృంభించి నష్టమయిన రాజ్య,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును సంపాదించి మరల పాలవంశాధికారమును స్థాపించెను. ఇతఁడు గొప్ప బౌద్ధమతాభిమానియై తన్మతవ్యాపనమున కెక్కువ పనిచేసెను. ఇతఁడు రాజ్యమేలుచుండిన కాలమున క్రీ. శ. ౧౦౨౩ ప్రాంతమున ద్రవిడదేశాధిపతియైన రాజేంద్ర చోళుఁడు గంగాతీరమువఱకుఁ గల యుత్తరదేశములపయి దండెత్తివచ్చి, యాతని నోడించెను. మహీపాలునికిఁ బిదప రాజ్యమునకు వచ్చిన నయనపాలుఁడుకూడ గొప్ప బౌద్ధమతాభిమానియై విక్రమశిలావిద్యాపీఠాధిపతియయిన అతీశుని బౌద్ధమతప్రచారము కావింప తిబెత్తుదేశమున కంపెను. క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దిచివర, మహమ్మదీయులు బీహారమును జయించునంతవఱకు పాలవంశజుల పరిపాలనము సాగుచునే యుండెను.

హిందూదేశమున బౌద్ధము నాదరించిన కడపటిదేశీయప్రభువులు పాలవంశజులు. వీరు బౌద్ధము నెక్కువగ నభిమానించిరి. ధర్మపాల, దేవపాలుర కాలమున సాహిత్యము, శిల్పము, చిత్రకళ బాగుగ వర్ధిల్లినవి. పాలరాజులు శిలా, లోహశిల్పకళల నాదరించియు, తటాకములను కాలువలను త్రవ్వించియు పేరుగాంచిరి.

ప్రాయికముగ దక్కను దేశముననుండి వచ్చిన సామంతసేనుఁ డను సేనాని పాలవంశజుల యధికారము క్షీణదశకు వచ్చుచుండిన కాలమున వారి రాజ్యమును గొంత యాక్రమించుకొని క్రీ. శ. ౧౦౫౦ ప్రాంతమున, చరిత్రమునందు 'సేనవంశ' మనఁ బ్రసిద్ధమయిన యొక నూతనవంశమును స్థాపించెను. సామంతసేనుని పౌత్రుఁడయిన విజయసేనుఁడు పదునొకండవశతాబ్ది ... పండ్రెండవశతాబ్ద్యారంభ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునను స్వాతంత్ర్యపతాక విప్పి, రాజ్యాధికారమును విస్తరిల్లఁ జేసి వంశమునకు కీర్తి తెచ్చెను. ఇతని యనంతరమున క్రీ. శ. ౧౧౧౯ లో సుప్రసిద్ధుఁడయిన బల్లాలసేనుఁడు రాజ్యమునకు వచ్చి నాదియా (నవద్వీపము) రాజధానిఁ గావించుకొని, పిత్రార్జితమయిన రాజ్యమును భద్రముగఁ గాపాడుటయే కాక సాహిత్యమును, గళలను వృద్ధి నొందించెను; వర్ణవ్యవస్థను జక్కఁదిద్దెను; మగధ, ఆరకాన్ మొదలగు దేశములకు హిందూమత ప్రచారకులను బంపి హిందూమతమును వ్యాపింపఁజేసెను. అతని కుమారుఁడు లక్ష్మణసేనుఁడు క్రీ. శ. ౧౧౧౯ ప్రాంతమున రాజ్యమునకు వచ్చెను. తండ్రి కుమారు లిరువురును విద్వాంసులు; విద్వత్పోషకులు. లక్ష్మణసేనుని కాలమున జయదేవకవి గీతగోవిందమును రచియించెను. ఇతని మరణానంతరముననుండియే బీహారముపయి మహమ్మదీయుల దండయాత్ర లారంభమయినవి. పండ్రెండవ శతాబ్ది యంతమున మహమ్మదు బిన్ బఖ్త్యారు బీహారముపయి దండెత్తివచ్చి, పాల సేనవంశముల రాజధానులగు లక్ష్మణావతి (గౌర్), నాదియాలను బట్టుకొనెను. ఈ సందర్భమున అనేకులు బ్రాహ్మణులును, బౌద్ధభిక్షువులును మహమ్మదీయులకత్తి కెరయై, యసువులు గోలుపోయిరి. కత్తివాతఁ బడకుండ తప్పించుకొనిన బౌద్ధభిక్షువులు తిబెత్తు, నేపాళదేశములకు పారిపోయి ప్రాణములు దక్కించుకొనిరి. పట్టపగ్గములు లేని మహమ్మదీయ క్రోధ, మతావేశములకు ఎన్నియో బౌద్ధవిహారములు నేలఁ గూలినవి. ఈ విధమున బంగాళాదేశమున మహమ్మదీయ పరిపాలనమున కంకురార్పణమయినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలచురివంశజులు:— త్రిపురి (జబ్బల్‌పూరుదగ్గఱ నున్న తేవారు) రాజధానిగ నర్మదానదికి దక్షిణమునను, గోదావరి నది కుత్తరమునను గల చేదిదేశమును బరిపాలించిన వీరు కార్తవీర్యార్జునుని సంతతి క్షత్రియులు; హైహయు లనుపేరం బ్రసిద్ధులయిరి. వీరు కొంచె మించుమించుగ తొమ్మిదవ శతాబ్ది నడిమిభాగముననే రాజకీయముగ గొప్ప ప్రాముఖ్యమును గడించిరి. పదునొకండవ శతాబ్దినుండి చేదిరాజ్యమునందలి ప్రాగ్భాగమును ఈ వంశమునందలి యొక శాఖవారు విడివడి వేఱుగ పాలించిరి. చేది హైహయులలో గాంగేయదేవుండును (క్రీ. శ. ౧౦౧౫-౧౦౪౦), అతని కుమారుండు కర్ణదేవుండును (క్రీ. శ. ౧౦౪౦-౧౦౭౦) ప్రసిద్ధులయిన భూపతులు. గాంగేయదేవుం డిరుగు పొరుగు రాజ్యములను జయించి చేది రాజ్యమును విస్తరింపంజేసెను. కర్ణదేవుండు బంగాళాదేశపు పాలవంశజులను మార్కొనెను. మాళవదేశపు భోజు నోడించెను. ఈతని కాలమున చేదిరాజ్యము బీహారమునంగూడ వ్యాపించినది; కాని తుద కితండు చందేల రాజగు కీర్తివర్మచేత పరాజితుం డయ్యెను. ఈ వంశము పండ్రెండవశతాబ్ది కడపటిభాగమునం దన రాజకీయ ప్రాముఖ్యమును గోలుపోయినది.

చందేలు వంశము :— జెజాకభుక్తి (ఇప్పటి బుందేలుఖండము)చందేలువంశము పాలవంశమంత యుచ్చస్థితిని పొందకపోయినను హిందూదేశ రాజకీయరంగమున మూండు శతాబ్దులకాలము ముఖ్యపాత్రమును వినిపించినది. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దిని చందేలురు ప్రాముఖ్యమునకు వచ్చిరి. వీరు మొదట హిందూమతావలంబకులయిన గోందునాయకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లసి, ప్రతిహారులకు సామంతులుగ నుండి రని చెప్పుదురు. పదవశతాబ్ది పూర్వార్ధమున వీరు తమ సామంతశృంఖలములను ఛేదించుకొని స్వతంత్రులయి పరిపాలనము నెఱపిరి. ఈ వంశమున ప్రసిద్ధి గడించిన మొదటిప్రభువు యశోవర్మ (క్రీ. శ. ౯౨౫–౯౫౦) బలములను గూర్చుకొని కన్నోజపై నెత్తివెళ్లి, దానిని పాలించుచుండిన ప్రతిహారవంశజుని జయించి యానగరముననుండి విజయోపాయనముగ అమూల్యమును, సుందరము నయిన విష్ణువిగ్రహమును గొనివచ్చి దానిని కృతిరమణీయ మయిన ఖజురాహోయాలయమునఁ బ్రతిష్ఠించెను. జెజాకభుక్తిరాజ్యమున ఖజురాహో, మహోబా, కాలింజరులు ప్రధాననగరములు. యశోవర్మ కొమారుడు ధంగభూపతి (క్రీ. శ. ౯౫౦–౯౯౯) చందేలు వంశజులలో మిక్కిలి గొప్పవాఁడు. ఇతని రాజ్య ముత్తరమున యమునానదినుండి దక్షిణమున చేదిరాజ్యపు సరిహద్దువఱకును, తూర్పున కాలింజరు మొదలు పశ్చిమమున గ్వాలియరు, భిల్సాలవఱకును వ్యాపించెను. ఘజినీమహమ్మదు తండ్రియయిన అమీర్ సబక్తజీన్ హిందూస్థానముపై నెత్తివచ్చినప్పుడు ధంగభూపాలుఁడు రాజపుత్రవీరులతోఁ గలసి విమతవీరుల నెదిరించెను. అతని కుమారుఁడు గండభూపతి (క్రీ. శ. ౯౯౯–౧౦౨౫) తండ్రిమార్గము ననుసరించి, క్రీ. శ. ౧౦౦౮ ప్రాంతమున ఘజినీమహమ్మదు లాహోరు రాజ్యముపయి దండెత్తి వచ్చినపుడు అనందపాలుఁడు మొదలగు రాజపుత్రవర్గముతోఁ గలసి యాతనిని ప్రతిఘటించి పోరాడెను. అటు మహమ్మదీయుల యొత్తిడివలనను, ఇటు పొరుగురాజ్యములతోడి సంగ్రామములవలనను చందేలుర ప్రాభవము కొంత చెన్ను మాసినది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని యనతికాలముననే కీర్తివర్మదేవుఁడు (క్రీ. శ. ౧౦౪౯–౧౧౦౦) దాని నుద్ధరించెను. కృష్ణమిశ్రుఁడను ఈతని యాస్థానకవి యీ రాజు నాదరణముననే వేదాంతతత్త్వప్రతిపాదకమయిన ప్రబోధచంద్రోదయమను రూపకము నొకటి సంస్కృతమున రచియించెను. క్రీ. శ. ౧౦౬౫ న ఈ నాటకము రాజసమ్ముఖమున ప్రయుక్తమయినది. కీర్తిసాగర మనుపేర నొక తటాకమును త్రవ్వించి కీర్తివర్మ జనస్తుతుఁ డయ్యెను. పరమర్ది యను పర్మాలుఁడు (క్రీ. శ. ౧౧౬౫–౧౨౦౩) చందేలు వంశజులలోఁ గడపటివాఁడు. చౌహాణవంశజుఁడయిన పృథ్వీరాజు క్రీ. శ. ౧౧౮౨-౮౩ న చందేలు రాజ్యముపయి దండెత్తి వచ్చి దాని నణఁచివైచెను. అటువెనుక మహమ్మదీయుల సమరాశ్వములు చందేలురాజ్యమును గ్రమ్మివేసినవి. శత్రువీరుల యీ దండయాత్రలలో చందేలుర యధికార, ప్రాభవములు పూర్తిగ నలిగి చూర్ణమయినవి. క్రీస్తుశకము పదునాఱవ శతాబ్దివఱకు చందేలువంశజులు కొందఱు నామమాత్రముగ నేస్వల్పప్రదేశమునో పరిపాలించుచుండినను పరమర్దిదేవుని యనంతరమువనుండి రాజకీయముగ వారి ప్రాముఖ్య మంతరించినది.

చందేలురు బహుతటాక నిర్మాతలు. సాధారణముగ నీ తటాకతటములు రమణీయశిఖరాలంకృతములయిన యాలయములతో శోభిల్లుచుండును. ఈ యాలయములలో మేలయినవి క్రీస్తుశకము పదవశతాబ్ది యుత్తరార్ధమున ధంగ భూపాలుని యభిమానాదరముల నిర్మింపఁబడినవే. నేఁడు చందేలురాజ్యమున జైన మంతరించినను క్రీస్తుశకము పదు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొకండవ, పండ్రెండవ శతాబ్దులం దది యిచట బాగుగ వ్యాపించినది. ప్రాచీన జైనదేవాలయములు చందేలురాజ్యమునందలి పెక్కు గ్రామములందుఁ గానవచ్చును.

పరమారులు:— అగ్నికుల క్షత్రియులమని చెప్పుకొను తెగలవారిలో పరవారులను నామాంతరము గల యీ పరమారు లొకరు. వీరు మాళవదేశమునఁ దమ రాజ్యమును స్థాపించిరి. చంద్రావతి, ఉజ్జయిని, ధారానగరములు వీరి రాజ్యమునందలి ముఖ్యపట్టణములు. అందు ధారానగరము వీరి రాజధాని. నర్మదానది వీరి రాజ్యమునకు దక్షిణపు టెల్ల. ఈ వంశమువారు స్వయముగ కవులును, విద్వాంసులు నయి గొప్ప గ్రంథములను రచియించియే కాక కవి, పండితలోకమున కాదరాశ్రయముల నొసంగి యితర రాజపుత్రవంశజులకన్న గొప్ప కీర్తి గడించిరి. ఈ వంశమున వాక్పతి యను ముంజరాజును (క్రీ. శ. ౯౭౩-౯౯౭), భోజుఁడును (క్రీ. శ. ౧౦౧౮-౧౦౬౦) చాల ప్రసిద్ధులు. ఇరువురును సంగ్రామ, సాహిత్యములందు కడుప్రవీణులు. పద్మగుప్త, హలాయుధ, ధనపాలాది విద్యావిశారదులు ముంజరాజు ప్రాపున వర్ధిల్లినవారు. ముంజరాజుకంటెను పేరుపడ్డవాఁడు భోజమహారాజు. ఇతడు కావ్యగీతిప్రియుఁడయి కవితావధూటి నక్షరలక్షల సత్కరించి వాసిగాంచెను. యోగాలంకార వ్యాకరణాది పెక్కు శాస్త్రములం దితఁడు నిధియగుటయే కాక తత్తద్విషయములనుగుఱించి యుద్గ్రంథములను రచియించి కీర్తికెక్కెను; ధారానగరమున నొక సంస్కృతకళాశాల స్థాపించి, సంస్కృతవిద్యకు చలువ పందిళ్లు కప్పెను. మహమ్మదీయు లీరాజ్యమును జయించిన యనంతరమున నీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కళాశాల మసీదుగా మారినది. భోజరాజకృతమయిన సాహిత్యగ్రంథము సరస్వతీకంఠాభరణము ప్రసిద్ధమయినది. సాహిత్యరంగమున నెంతటి చతురుఁడో ఇతఁడు సంగ్రామరంగమున నంతటి ప్రజ్ఞానిధి. పరమారరాజ్య మత్యంతౌన్నత్యము నందినది యీ భోజునికాలముననే. తుదకు గూర్జరులును, చేది హైహయులును గలసి మాళవరాజ్యముపయి దండెత్తి వచ్చినప్పుడు వారితోడి జరగిన సంగ్రామమున నీతఁడు వీరశయనము నలంకరించెను. భోజునికిఁ బిదప రాజ్యమునకు వచ్చిన వారలు కడు బలహీను లగుటచేత క్రమముగా నీ రాజ్యము క్షీణదశకు వచ్చినది. పండ్రెండవశతాబ్ది నీపరమారరాజ్యమును సోలంకులు జయించిరి. తరువాత నిది పెక్కు సంస్థానములుగ చీలిపోయినది. పండ్రెండవశతాబ్ది కడపటిభాగమున సోలంకి వంశమందలి యొక శాఖవారగు వాఘేలులు పరమారదేశ ప్రాగ్భాగమున స్థిరపడి నేటి రీవాసంస్థానమును నిర్మించుకొనిరి.

ముంజ, భోజరాజు లిరువురును పెక్కు సరస్సులను, ఆలయములను నిర్మించి వినుతికెక్కిరి. వీనిలో భోజరాజ నిర్మితమయిన భోజసరస్సును, ఉజ్జయినియందలి మహాకాలాలయమును ప్రసిద్ధములయినవి. పదుమూఁడవశతాబ్ది పూర్వార్ధమున అల్తమష్ దండయాత్రయందు మహాకాలాలయము విధ్వస్తమయినది.

సిసోదియాలు:— ఈ యుగమున వర్ధిల్లిన రాజపుత్ర వంశజులలో మేవాడను బరిపాలించిన గుహిలోటు లనుసిసోదియా లొకరు. వీరు సూర్యవంశజులు. ఈవంశమును స్థాపించిన వాఁడు బాప్పారావల్. మేవాడపయి అరబ్బులు దండెత్తివచ్చినప్పు డితఁడు భిల్లుల సాహాయ్యమున వారి నోడించి తఱుమఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొట్టెను. ఇతని కుమారుఁడు గుహిలుఁడు రాజపుత్రస్థానము నందలి చిత్తూరుదుర్గమును వశపఱుచుకొనెను. నాఁటనుండి యెనిమిదిశతాబ్దు లనఁగా అక్బరు రాజ్యకాలమునఱకు అదియే యీ వంశమువారికి రాజధానిగ నుండెను. క్రీస్తుశకము పదు మూఁడవశతాబ్దినుండి మాత్రమే యీ వంశమువారు మహమ్మదీయులతోడి సంగ్రామములందు రాజపుత్రవర్గమునకు నాయకులయి, రాజకీయముగ మిక్కిలి ప్రాముఖ్యమును బడసిరి.

చౌహాణులు:— రాజపుత్రస్థానమునందలి సాంభరు (సకంభరి), అజ్మీరులను బరిపాలించిన చౌహాణులు మహమ్మదీయుల యుత్తర హిందూస్థానపు దండయాత్రలయందు వారి నెదుర్కొని, శౌర్యప్రతాపములను గురిసి, తమ కీర్తిపటమున కంచులు దిద్దుకొనిరి. ఈవంశమునందలి విశాలదేవుఁ డనునాలుగవ విగ్రహరాజు కవి; నాటకరచయితగనే కాక, సంస్కృతవిద్య నాదరించియు పేరుగన్నవాఁడు. అజ్మీరునందలి ఱాతిపలకల మీఁదఁ జెక్కఁబడిన ఈతఁడు రచియించిన నాటకముఁనందలి కొన్నిభాగము లిప్పటికిని సుస్థితియం దున్నవి. ఈతఁడు అజ్మీరునం దొక తటాకమును నిర్మించి, సంస్కృతకళాశాలను స్థాపించెను. మహమ్మదీయులకాలమున నీ కళాశాల మసీదుగ మాఱినది. క్రీ. శ. ౧౧౫౩ ప్రాంతమున విశాలదేవుఁడు ఢిల్లీని పాలించుచుండిన తోమరవంశజులను జయించెను కాని తద్వంశముతో వియ్యము కలిపి, వారి రాజ్యమును వారికే పాలింప నిచ్చెను. ఈ చౌహాణ, తోమరవంశ సంబంధమునకు ఫలముగఁ గలిగినవాఁడు పృథ్వీరాజు. క్రీ. శ. ౧౧౮౫ ప్రాంతమున నితఁడు జయచంద్రతనూజ నెత్తికొనిపోయి పరిణయమాడుట చరిత్రప్రసిద్ధము. పృథ్వీరాజు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రీ. శ. ౧౧౮౨ లో చందేలులను జయించెను; క్రీ. శ. ౧౧౯౧ ప్రాంతమున మహమ్మదుఘోరి హిందూస్థానముపయి దండెత్తి వచ్చినపుడు రాజపుత్రవర్గమునకు నాయకత్వమును వహించి యాతని నోడించెను; కాని మొత్తముమీఁద పృథ్వీరాజ, జయచంద్రుల పరస్పరవిరోధమువలన రాజపుత్రులకు మహమ్మదీయవాహిని నరికట్టుటకు శక్తి చాలకపోయెను. మఱుసటి సంవత్సరమున (క్రీ. శ. ౧౧౯౨) ఘోరీతో జరగిన సంగ్రామమున పృథ్వీరాజు పరాజితుఁడయి శత్రువులకు బందీగఁ జిక్కి తుదకు వారిచేత వధియింపఁబడెను. పృథ్వీరాజ, జయచంద్రుల పతనముతో ఉత్తరహిందూస్థానమున హిందూ స్వాతంత్ర్యపతాక భగ్నమయినది.

తోమరులు:— హిస్సారు, ఢిల్లీలకు చుట్టుపట్టుల నున్న ప్రదేశము నేలినవారు తోమరవంశజులు. వీరిలో మొదటి ప్రభువయిన మొదటి అనంగపాలుఁడు క్రీ. శ. ౭౩౬ ప్రాంతమున ఢిల్లీని నిర్మించెనని ప్రతీతి. కాని దానిని గొప్ప దుర్గముగ కట్టుదిట్టపఱచిన రెండవ అనంగపాలునినాఁటివఱకు (క్రీ. శ. ౧౦౫౨) ఆనగరము ప్రసిద్ధిఁ గనలేదు. తోమర, చౌహాణ వంశజులకు నిత్యము పోరాటములు జరగుచుండెడివి. తుదకు క్రీ. శ. ౧౧౫౩ లో చౌహాణుల ఢిల్లీవిజయముతోఁ గాని యీ కలహ మంతరించినది కాదు.

సోలంకులు:— వలభీరాజ్యము పడిపోయినపిదప గుజరాట్, కాఠయవాడ దేశములను బరిపాలించినవారిలో సోలంకులు ముఖ్యులు. వీరికి చాళుక్యు లనియు వ్యవహారమున్నను దక్షిణ చాళుక్యులును, వీరును వేఱు. వీరికి అన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హిలవాడపట్టణము రాజధాని. ఈ వంశమును స్థాపించిన యతఁడు మూలరాజు (క్రీ. శ. ౯౬౧ - ౯౯౬). ఈ వంశము నందలి మొదటి భీమరాజు కాలమున (క్రీ. శ. ౧౦౨౨ - ౧౦౬౪) ఘజినీమహమ్మదు కాఠయవాడ పశ్చిమతీరమున ప్రభాసక్షేత్రమునందలి సుప్రసిద్ధమయిన సోమనాథపురపు దేవాలయమును ముట్టడించెను. జయసింహ సిద్ధరాజు (క్రీ. శ. ౧౦౯3 - ౧౧౪3) ఈ వంశపురాజు లందఱిలో చాల గొప్ప వాఁడు; కడుప్రసిద్ధుఁడు. ఇతఁ డనేక దేవాలయములను నిర్మించెను; మ్లేచ్ఛుల నోడించెను; కవులను, పండితులను అనేకుల నాదరించి పోషించెను. ఈతని యాస్థానము నలంకరించిన విద్యానిధు లందఱిలో సంస్కృత, ప్రాకృతభాష లందు పెక్కు గ్రంథములు రచియించిన హేమచంద్రుఁ డను జైనపండితుఁడు చాల గొప్పవాఁడు. సిద్ధరాజుననంతరమున రాజ్య మేలినవారిలో ముఖ్యముగ పేర్కొనవలసినవాఁడు కుమారపాలుఁడు (క్రీ. శ. ౧౧౪3 - ౧౧౭3). ఇతఁడు మొదట శైవుఁ డయినను తన పరిపాలనకాలము కడపటి భాగమున జైనుఁడయి పెక్కు జైనవిహారములను, ఆలయములను గట్టించె నని చెప్పుదురు. కుమారపాలునికిఁ బిదపఁ గొంతకాలము వఱకు రాజ్యమునకు వచ్చినవారలు బలవంతులయి మహమ్మదీయ దండయాత్రల నెదుర్కొని వారించుచు వచ్చిరి కాని కాలక్రమమున నీ రాజ్యము క్షీణదశకు వచ్చి తుదకు క్రీ. శ. ౧౨౯౭ లో అలాయుద్దీనుసేనానాయకుల వశమయినది.

పంజాబు బ్రాహ్మణవంశములు:— పంజాబును, కాబూలు చుట్టుపట్లనుండు దేశమును క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్ది కడపటి భాగమువఱకు కుషాణవంశజులయిన బౌద్ధుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిపాలనముక్రింద నుండెను. అప్పు డీరాజులలో నొకఁడు కడు దుర్మార్గుఁడయి ప్రజలను బీడించుచుండిన కారణమున వారి కోరికమీఁద మంత్రిగ నుండిన బ్రాహ్మణుఁ డొకఁడు వానిని బట్టుకొని కారాగారమున నుంచి, తుదకు రాజ్యలోభమునఁ దానే సింహాసనము నాక్రమించుకొని బ్రాహ్మణవంశమును స్థాపించెను. ఈ వంశమువారికి మొదట అట్టాక్ నగరమున కెగువ, సింధునదిమీఁద నున్న ఓహిందును (ఉదభాండపురము), పిదప లాహోరునగరమును రాజధానులు. నూతనరాజ్యము స్థాపితమయిన కొలఁదికాలముననే కాబూలురాజ్యము మహమ్మదీయుల వశమయినది. లాహోరురాజ్యమును స్వతంత్రులయి పరిపాలించిన కడపటి ప్రభువులు జయపాల, అనందపాల, త్రిలోచనపాలురు. వీరు ఘజినీరాజ్యమును స్థాపించిన పరాక్రమవంతులగు సబక్తజిన్, సుల్తాను మహమ్మదుల మహావాహిని హిందూస్థానమును ముంచివేయ వచ్చుచుండినపుడు ధీరులై మహాసాహసముతో నెదుర్కొని దానికి సేతువై నిలిచిరి. కాని సుళ్లుతిరుగుచు మహోద్ధతితో వచ్చుచుండిన దాని నాఁపుటకు వారికి శక్తి చాలక, తుదకుఁ దామే దానికి బలియైరి. క్రీ. శ. ౧౦౨౨ నాఁటికి లాహోరు మహమ్మదీయులకు వశమయినది. పంజాబు మహమ్మదీయరాజ్య మయినది. ఓహిందు, లాహోరురాజులు తమ భాగ్యరేఖ బాగున్న రోజులలో విద్యాపోషకులయి ప్రశస్తిఁ గాంచిరి.

## దక్షిణాపథరాజ్యములు

కళింగగాంగులు:— కళింగమును బరిపాలించిన గాంగులు క్రీస్తుశకము పదునొకండవశతాబ్దినుండి రాజకీయముగ ప్రాముఖ్యము వహించిరి. వీరిలో ప్రముఖుఁడుగ వెలియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చిన మొదటి ప్రభువు వజ్రహస్తదేవుఁడు (క్రీ. శ. ౧౦౩౮-౧౦౭౦). ఇతని పౌత్రుఁడును రాజరాజ కళింగగంగు కుమారుఁడును అగు అనంతవర్మ చోడగంగు (క్రీ. శ. ౧౦౭౮ — ౧౧౪౭) గాంగవంశజు లందఱిలో మిక్కిలి ప్రసిద్ధుఁడు; కడుపరాక్రమవంతుఁడు. ఇతఁడు ఉత్కళదేశమును జయించి, గాంగరాజ్యము నించుమించుగ గంగానదివఱకు వ్యాపింపఁజేసెను. ఇతని కాలమున గాంగవంశ మత్యున్నతస్థితికి వచ్చినది. పూరియందలి జగన్నాథాలయమును నిర్మించిన దీరాజే యని చెప్పుదురు. ఈ వంశమునందలి మూఁడవ అనియంకభీమ (క్రీ. శ. ౧౨౧౧-౧౨౩౮), మొదటి నరసింహదేవుల (క్రీ. శ. ౧౨౩౮ - ౧౨౬౪) కాలముననుండియే కళింగరాజ్యము పయి మహమ్మదీయదండయాత్ర లారంభమైనవి. కళింగము నేలిన కడపటి గాంగభూపతులు నరసింహదేవ, భానుదేవ నామాంకితులు. బంగాళాదేశము నేలుచుండిన లక్ష్మణావతి సుల్తానులయొక్కయు, ఢిల్లీరాజ్యమును పాలించుచుండిన తుఘ్లకుసుల్తానులయొక్కయు దండయాత్రల నలుగుడువలన కళింగరాజ్యము చితికిపోయినది. పదునైదవ శతాబ్దిని కళింగగాంగ - నాలుగవ భానుదేవునిఁ గూలఁద్రోసి యాతని హస్తమునుండి రాజ్యాధికారమును పుణికికొన్నవారు ఓఢ్రదేశపు గజపతివంశజులు. వీరిలో మొదటివాఁడు కపిలేశ్వరగజపతి.

గాంగవంశజులకాలమున కళింగ, ఉత్కలదేశములయందు శైవ, వైష్ణవమతములు రెండును ప్రబలినవి. సింహాచలము, ముఖలింగము, జగన్నాథము మొదలగు క్షేత్రములయందలి యాలయములకు పేరు ప్రతిష్ఠలు గలిగిన వీ కాలము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననే. కోణార్క-క్షేత్రమునందలి సూర్యాలయము గాంగవంశజుల కాలముననే నిర్మితమయినది.

ఆంధ్రమాండలికులు :—రాజరాజనరేంద్రుని యనంతర మతని కుమారుఁడు రాజేంద్ర-చోడుఁడను కులోత్తుంగుడు చోళరాజ్యమును వశపఱచుకొని రాజధానిని వేంగినుండి చోళదేశమునకు మార్చెను. పిదప నతఁడు చాళుక్య రాజ్యమును బాలింపఁ దన తనయులను ప్రతినిధులుగఁ బంపుచు వచ్చెను. అంతియే కాక, యతఁడు తనకు విశ్వాసపాత్రులయిన సేనానాయకులకు రాజలాంఛనముల నొసఁగి గౌరవించి వారిని మండలేశ్వరులను గావించెను. ఈ కారణమున నీ కాలమున ప్రాక్సముద్రతీరస్థ ఆంధ్రదేశమున మాండలికవంశము లనేకములు మొలకలెత్తినవి. ఆంధ్రదేశ చారిత్రమున నిది మాండలికయుగము. వెలనాఁటి చోడులు, కోటవారు, సాగివారు, కమ్మనాఁటి-చోళులు, పొత్తపి, విక్రమసింహపురపు చోళులు, కోనసీమ హైహయులు, నతవాటివారు, కొండపడుమటి రాజులు, పరిచ్ఛేదులు, కొలని నాయకులు—ఎల్లరు నీ కాలమున వర్ధిల్లినవారు. ఆంధ్రదేశమున నేఁడు గల సుప్రసిద్ధరాజకుటుంబముల మూలవంశము లనేకము లీకాలమున ప్రముఖత గడించినవే. మాండలికవంశము లన్నిటిలో తొలుదొల్త ప్రముఖులయి, పరాక్రమాధికారములు నెఱపినవారు వెలనాఁటిచోళులు. కళింగము మొదలు గుండ్లకమ్మవఱకును, పశ్చిమమున త్రిపురాంతకము మొదలు ప్రాగ్దిశ సముద్రము వఱకును వీరి రాజ్యము వ్యాపించినది. వీరు చాళుక్య - చోళ భూపతులకు సామంతులే యైనను క్రమముగ ప్రబలులయి యించుమించుగ స్వతంత్రులుగనే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యవహరించుచు వచ్చిరి. ఆయాప్రాంతములందు స్థానికముగ ప్రాముఖ్యము గడించిన యీ మాండలికవంశములు, రాజ్యాధికారలోభమున నిరంతరముఁ దమలోఁ దాము కలహించుచు నుండుటచేత స్వతంత్రులయి క్రమముగ విజృంభించుచుండిన యోరుగంటి కాకతీయులకు వీరిని జయించుట సుకరమయినది. ఈ విధమున ప్రాగాంధ్రదేశము కాకతీయసామ్రాజ్యమునఁ జేరుటతో నీ మాండలికుల ప్రభ యడఁగి వారు కాకతీయరాజన్యులకు విధేయసామంతు లయిరి. ఈ మాండలికయుగ మాంధ్రదేశచారిత్రమున స్మరణీయమయిన కాలము. భారత, రామాయణాదు లాంధ్రభాషను విరచింపఁబడిన కాల మిది. సుప్రసిద్ధాంధ్రకవిశేఖరులయిన మంత్రి భాస్కరుఁడు, కేతన, నన్నెచోడుఁడు, తిక్కన సోమయాజి మొదలయిన వారు విలసిల్లిన దీకాలమున. దాన, ధర్మాదులకు గణ్యత హెచ్చి, యవి స్వర్గప్రదములయిన పుణ్యకార్యములయినవి. మాండలికు లనేకులు తెలుఁగుకవిత నాదరించి సత్కవికీరసహకారము లని కీర్తికెక్కిరి.

కల్యాణిచాళుక్యులు :— రాష్ట్రకూటులలో కడపటివాఁడయిన కక్కభూపతికాలమున చాళుక్యవంశజుఁడయిన తైలపుఁడను యోధవరేణ్యుఁడు విక్రమించి రాష్ట్రకూటరాజ్యము నాక్రమించుకొని మరల క్రీ. శ. ౯23 లో చాళుక్యరాజ్యమును స్థాపించెను. ఈ వంశమువారికి కల్యాణి రాజధాని. ఈ కారణమున వీరిని కల్యాణిచాళుక్యు లనియు, తూర్పు చాళుక్యులకు పశ్చిమదిశ నుండుటచేత పశ్చిమచాళుక్యు లనియు వ్యవహరింతురు. తైలపుఁడు చాళుక్యసామ్రాజ్యమునకు పునాదులు వేయుచుండినకాలమున తంజా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూరి చోళులు ప్రబలులయి పశ్చిమోత్తరదిశలుగఁ దమ రాజ్యమును బెంపొందించుకొనఁ దీవ్రప్రయత్నములు చేయు చుండిరి. ఈ తృష్ణకు ఫలితముఁగ దక్షిణదేశము గొప్ప సం గ్రామరంగ మయినది. జగదేకమల్ల జయసింహుని (క్రీ. శ. ౧౦౧౮—౧౦౪౦) కుమారుఁడును, ఆహవమల్ల, త్రైలోక్య మల్ల బిరుదాంచితుఁ డయిన మొదటి సోమేశ్వరుని కాలము నను (క్రీ. శ. ౧౦౪౦ – ౧౦౬౮), ఆతని రెండవ కుమారుఁడు త్రిభువనమల్ల రెండవ విక్రమాదిత్యుని కాలముననను (క్రీ. శ. ౧౦౭౬ – ౧౧౨౬) చోళ, చాళుక్య సంగ్రామముఁలు ముమ్మర మయినవి. సోమేశ్వరుఁడు చోళుల నోడించి కాంచీనగర మును బట్టుకొనెను కాని యనతికాలముననే చోళ రాజాధి రాజు చాళుక్యరాజ్యముపయి దాడి వెడలి యందలి కొల్లిపాక మొదలయిన నగరములను దహించెను. తుదకు క్రీ. శ. ౧౦౫౨ లో జరగిన కొప్పముయుద్ధమున నతఁడు నిహతుఁ డయ్యెను. చోళు లీపగ పోనీయక రాజాధిరాజసోదరుఁడయిన వీరరాజేంద్రుని నాయకత్వమున సోమేశ్వరుని మొదట బెజ వాడయొద్దను, పిదప కూడలిసంగమము (కృష్ణా, తుంగభద్రా నదులు కలియుచోటు)నొద్దను సంపూర్ణముగ నోడించి విజయపతాక నెత్తిరి. చాళుక్యవంశజులలో ఆహవమల్ల సోమేశ్వరుని రెండవకుమారుఁడు త్రిభువనమల్ల విక్రమాది త్యుఁడు (క్రీ. శ. ౧౦౭౬ – ౧౧౨౬) చాల గొప్పవాఁడు. సింహాసనమునకు వచ్చినవెంటనే యితఁడు విక్రమశక మని తనపేర నొకశకమును స్థాపించెను. ఇతఁడు చోళుల నోడించి కాంచీపురమును బట్టుకొనుటయేకాక ద్రవిడ చోళ, వేంగీ చాళుక్యరాజ్యములకుఁ గలసంబంధమువలన వేఁగి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశముపయిఁగూడ దండెత్తి వెళ్లెను. బిల్హణుఁ డను కాశ్మీర దేశపండితుఁ డొకఁ డీతని యాస్థానకవియై విక్రమాంకదేవ చరిత మను పేర నీతనిచారిత్రమును రచియించెను. ఈ కాలపు చాళుక్య చరిత్రమును దెలిసికొనుటకుఁగల వాఙ్మయాధార ములలో నీగ్రంథము గొప్పది. మన దేశమున వ్యవహారము నం దుండిన హిందూధర్మశాస్త్రములలో పరమప్రమాణ మయినదిగ పరిగణింపఁబడుచున్న 'మితాక్షర' కర్తయగు విజ్ఞానేశ్వరుఁడు విక్రమాదిత్యుని యాస్థానాలంకారము. విక్రమాదిత్య తనయుఁడు భూలోకమల్ల సోమేశ్వరుఁడు (క్రీ. శ. ౧౧౨౬ – ౧౧౩౮) గొప్ప విద్వాంసుఁడు; 'మానసోల్లాస' మను పేర నొకసంస్కృతకావ్యమును రచియించెను. ఇతని యనంతరమున రాజ్యమునకు వచ్చినవారలు బలహీను లగుటచేత చాళుక్యరాజ్యము క్రమముగ క్షీణించినది. నుర్మడి తైలపుని కాలమున (క్రీ. శ. ౧౧౫౦ – ౧౧౮౫) అతని సైన్యాధిపతియైన బిజ్జలుఁ డను కాలచుర్యవంశజుఁడు రాజు పయి తిరుగఁబడి రాజ్యము నాక్రమించుకొనెను. వీరశైవమత స్థాపకుఁడయిన బసవదండనాయకుఁ డతని మంత్రి. బిజ్జలుఁడును, ఇతని కుమారులును గొంతకాలము రాజ్యము చేసిన వెనుక మరల చాళుక్యుల యధికారము స్థాపితమయినది కాని యప్పటికే కాకతీయ, హొయిసలాది చాళుక్యసామంత వంశములు ప్రముఖములై స్వతంత్ర రాజ్యములను స్థాపించుట చేత చాళుక్యసామ్రాజ్యము భిన్నమయినది. కల్యాణీ చాళుక్యులు సర్వమతములను సమానముగ నాదరించిరి. పెక్కు దేవాలయములను నిర్మించిరి. ఆలయనిర్మాణమున గొప్ప పరిణామముఁ గలిగి చాళుక్యసంప్రదాయము వెనుకటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంటె పరిణతిఁ గాంచినది. వీరి ప్రాపున కాలాముఖశైవము బాగుగ వర్ధిల్లినది. చాళుక్యులు విద్యాభివృద్ధికి పెక్కుదానములు కావించి విద్యాపోషకులయి వినుతి కెక్కిరి. దేవాలయములును, అగ్రహారములును ఈనాఁడు గొప్ప విద్యాసంస్థలయినవి.

దేవగిరియాదవులు :— కల్యాణిచాళుక్యులు బలహీనులయిన వెనుక వారి రాజ్యమును బంచుకొని ప్రముఖులయిన వారిలో వీ రొకరు. దేవగిరి వీరికి రాజధాని. వీరి రాజ్యమునకు సేవణదేశ మనియుఁ బేరు. ఈ వంశమున ప్రాముఖ్యము గన్నవారిలో భిల్లముఁడు (క్రీ. శ. ౧౧౮౭—౧౧౯౧) ప్రథముఁడు. ఈ కాలమున హొయిసలులకును, ఈ యాదవులకును పెక్కు సంగ్రామములు జరగినవి. తుదకు సింఘణుని కాలమునఁ (క్రీ. శ. ౧౨౧౦—౧౨౪౭)గాని యాదవులు హొయిసలరాజ్యమునఁ దమ ప్రతాపముద్రిక నచ్చొత్తఁజాలక పోయిరి. యాదవరాజచంద్రు లందఱిలో సింఘణుఁడు చాల గొప్పవాఁడు. ఈతనికాలమున దేవగిరి యాదవసైన్యముల కుత్తరమున గుజరాతునుండి దక్షిణమున మైసూరువఱకుఁ గల దేశము విహారభూమి యైనది. ఈతనికిఁ బిదప నీ వంశమున బ్రముఖులుగఁ జెప్పఁదగినవారు కృష్ణ (క్రీ. శ. ౧౨౪౭—౧౨౬౦), రామచంద్ర దేవులు (క్రీ. శ. ౧౨౭౧—౧౩౦౯). రామచంద్రదేవు పరిపాలించుచుండిన కాలమున (క్రీ. శ. ౧౨౯౪ లో) అలా-ఉద్దీన్ ఖిల్జీ మొదటిమాఱు దక్కనుపై దండెత్తి వచ్చి దేవగిరిని ముట్టడించి, యాప్రభువు నోడించి విస్తారము కొల్లఁ గొనిపోవుటయే కాక ప్రతివత్సరము నతఁడు ఢిల్లీ సింహాసనమునకు కప్పముఁ గట్ట నేర్పాటు కావించెను. అటు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిదప మాలిక్ కాఫరు, ముబారకుల దండయాత్రలవలన నీ రాజ్యము నేలఁగూలినది. కడపటి రాజయిన హరపాలదేవుని ముబారకు జీవముతోఁ బట్టుకొని, ౧౩౧౮ లో చర్మ మొలిపించి కడతేర్చెను.

దేవగిరి యాదవులకాలమున సంస్కృతవాఙ్మయము పెంపొందినది. సింఘణదేవుని కాలమున 'శ్రీకరణాధిపతి' (రాజ్యాంగ ప్రధానకార్యదర్శి)గ నుండిన సోఢలుని కుమారుఁడు శార్ఙ్గధరుఁడు 'సంగీతరత్నాకర' మను పేర నొకసంగీత గ్రంథమును రచియించెను. 'సిద్ధాంతశిరోమణి'ని రచియించిన భాస్కరాచార్యుని పౌత్రుఁడును, లక్ష్మీధరుని తనయుఁడు నగు చాంగదేవుఁడు సింఘణుని యాస్థానజ్యోతిషుఁడు. ఇతఁడు ఖాందేశ్ జిల్లాయందలి పాట్నాయందు ఒక జ్యోతిషవిద్యాపీఠమును స్థాపించెను. అందు సిద్ధాంతశిరోమణి మొదలగు గ్రంథముల నధ్యయనముచేయువారు. మహాదేవ, రామచంద్ర భూధవులకాలమున శ్రీకరణాధిపతి పదవి వహించిన హేమాద్రి గొప్ప సంస్కృత విద్వాంసుఁడు. ఇతఁడు బహుగ్రంథములను రచియించుటయే కాక గొప్ప విద్వాంసులను, కవులను సత్కరించి పోషించెను. హేమాద్రి విరచితమయిన గ్రంథము లన్నిటిలో 'చతుర్వర్గచింతామణి' సుప్రసిద్ధ మయినది. నాఁటి హిందూమతాచారాదు లిందు సప్రమాణముగ క్రోడీకృతములయి సమర్థింపఁబడినవి. ఇందు మోక్షప్రదాయకము లయినవ్రతములు, దానములు, యాత్రలు మొదలయిన వానినిగుఱించి తెలుపు వ్రత, దాన, తీర్థ, మోక్షఖండములు నాలుగు కలవు. వీనికి తోడు శ్రాద్ధ, ప్రాయశ్చిత్తాదులను గుఱించి తెలుపు పరిశేషఖండముకూడఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేర్పఁబడినది. మహారాష్ట్ర దేశమున నిప్పుడు వ్యవహారమున నున్న 'మోడి' వ్రాఁతపద్ధతి నితఁడే వాడుకలోనికిఁ దెచ్చినట్లు చెప్పుదురు.

కాకతీయులు:— వీరు మొదట పశ్చిమచాళుక్యులకు సామంతులుగ నుండిరి. వీరిలో ప్రముఖుఁడుగఁ దెలియ వచ్చిన మొదటిప్రభువు మొదటి ప్రోలరాజు కుమారుఁ డయిన బేతరాజు. ఇతఁడు త్రిభువనమల్లబిరుదాంచితుఁ డయిన విక్ర మాదిత్యుని సామంతమండలేశ్వరులలో నొకఁడు. ఈ వంశము వారికి మొదట అనుమకొండయు, పిదప ఓరుగల్లును రాజధానులుగ నుండెను. రెండవ ప్రోలరాజు కుమారుఁ డయిన మొదటి రుద్రదేవుఁడు స్వాతంత్ర్యపుబావుటా నిలిపి కాకతి వంశజుల కీర్తిలతకు పాదులు కట్టెను. గణపతిదేవుఁడు, ఇతని తనయ రుద్రమదేవి, ఈమె దౌహిత్రుఁడు ప్రతాప రుద్రదేవుఁడు అనువారలు సుప్రసిద్ధులయిన కాకతీయరాజ న్యులు. గణపతిదేవుఁడు మాండలికుల నందఱను జయించి యాంధ్రదేశము నొక్కఛత్రచ్ఛాయ క్రిందికిఁ దీసికొని వచ్చు టయే కాక చోళుల కాంచీపురమును బట్టుకొని యచట నాంధ్రపతాకఁ బాదుకొల్పెను. నౌకాయానము చేయు సాహ సికుల కభయశాసన మొసంగి, మాండలికయుగమునఁ దగి నంత రక్షణ లేక క్షీణదశకు వచ్చిన సముద్రవర్తకమునకు మరల గొప్ప ప్రోత్సాహము నొసంగెను. ఈ కాలమున మోటుపల్లి గొప్ప రేవుపట్టణము. ఈ రేవుస్థితి పూర్వమున కన్నచితికి పోఁగా, దానిని మరల చక్కఁబఱుచుటకు గణపతి దేవుఁడు సాహసికుల కొసంగిన యభయశాసన మిప్పటికి నా యూరిలోఁ గలదు. రుద్రమదేవి (క్రీ. శ. ౧౨౬౦ - ౧౨౯౫)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యమును కడుసమర్థతతో జనరంజకముగఁ బాలించి వినుతిఁ గాంచెను. ఈమె రాజ్యము చేయుచుండిన కాలమున వెనీసు దేశయాత్రికుఁడయిన మార్కోపోలో కాకతీయ రాజ్యమున కేతెంచి, యీమె రాజ్యపరిపాలనమును, దేశసౌభాగ్యమును బహువిధములఁ బ్రస్తుతించుచు వ్రాసినాఁడు. కాకతీయ ప్రభువులలోఁ గడపటివాఁడు ప్రతాపరుద్రుఁడు. ఈ చక్రవర్తి కాలమున నాంధ్రుల వీరఖడ్గము కాంచీపురముననే కాక దక్షిణమున జంబుకేశ్వరమునందుఁగూడ తళతళలాడినది. ఇతఁ డెంతటి పరాక్రమవంతుఁ డయినను ఇతని కాలముననే కాకతీయాంధ్రుల త్రిలింగసామ్రాజ్యము భగ్నమయినది. మొదటిమాఱు మహమ్మదీయు లాంధ్రదేశముపయి నెత్తివచ్చిన దీతని కాలముననే. అలా-ఉద్దీన్ ఖిల్జీ సేనానాయకుఁడయిన మాలిక్ కాఫరు దండయాత్రలవలన బీటలు వారిన కాకతీయరాజ్యసౌధము తరువాతికాలమున మహమ్మదు బిన్ తుఘ్లకు అనుపేరఁ బ్రసిద్ధుఁడయిన ఉలూగుఖాను 'తల్లి' వలన పూర్తిగ శిథిలమయి తుదకు క్రీ. శ. ౧౩౨౬ లో నామమాత్రావశిష్టమయినది. ఓరుగంటి కాకతీయుల తెలుంగాణెము మహమ్మదీయుల వశమయినది.

కాకతీయులు విద్యాప్రియులు. సంస్కృతమునను ఆంధ్రమునను ఈ కాలమున పెక్కు గ్రంథములు పుట్టినవి. ప్రతాపరుద్రీయ మనుపేర సంస్కృతమున అలంకారగ్రంథమును రచియించి ప్రతాపరుద్రదేవుని కంకితము కావించిన విద్యానాథకవియు, ఆంధ్రమున పండితారాధ్యచరితము, బసవపురాణము మొదలయిన కావ్యములను వ్రాసిన పాల్కురికి సోమనాథుఁడును, మార్కండేయపురాణమును రచియిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన మారనకవియు నీ కాలమున విలసిల్లినవారు. కాకతీయులు శైవులయి, శైవమతము నెక్కువగ నాదరించి వ్యాపింపఁ జేసిరి. ఈ కాలమున ఆంధ్రదేశమున పెక్కు శైవమఠములు వెలసినవి. ఇవి మతసంస్థలుగనే కాక విద్యాసంస్థలుగఁగూడ వాసికెక్కినవి. చాళుక్యు లందించిన కొస నందికొని కాకతీయులు దేవాలయవాస్తు, శిల్పకళలకు పురివోసిరి. కాకతీయుల యాదరమున నిర్మితమయిన యాలయములలో పాలంపేట దేవాలయమును, అనుమకొండయందలి సహస్ర స్తంభ మండపమును కళాభిజ్ఞుల ప్రత్యేకప్రశంసకు పాత్రములయినవి. కాకతీయులు గొప్ప తటాకములను నిర్మించిరి.

రెడ్లు:— మహమ్మదీయులకు వశము కాఁగా మిగిలిన యాంధ్రదేశమున అంతవఱకు కాకతీయులకు సామంతులుగను, సైన్యాధిపతులుగను నుండినవారు స్వతంత్రరాజ్యములను నెలయించిరి. అట్టి వానిలో రెడ్డి రాజ్యము ప్రధానమయినది. రెడ్డిరాజులకు మొదట అద్దంకియు, పిదప కొండవీడును రాజధానులు. వీరు రమారమి వందసంవత్సరములు రాజ్యమేలిరి. ప్రోలయ వేమారెడ్డి తన బాహుబలమున నిర్మించిన రాజ్యమును అతని కుమారులు అనపోత, అనవేమారెడ్లు చాల పెంపొందించిరి. విద్యలను బోషించియు, బ్రాహ్మణుల కగ్రహారముల నొసంగియు, పెక్కు ధర్మకార్యములు కావించియు రెడ్డిరాజులందఱిలో అనవేమారెడ్డి కీర్తి వహించెను. అనపోతారెడ్డికుమారుఁడయిన కొమరగిరి రెడ్డి కాలముననుండియే రెడ్డిరాజ్యమునకు క్షీణదశ యారంభమయినది. అటువెనుక పెదకోమటివేమారెడ్డి కొంతకాలము పరిపాలనము సాగించినను కొండవీటి రెడ్డిరాజ్యమంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టితో సమసిపోయినది. కొమరగిరి రెడ్డికి మంత్రియు, బావ మఱఁదియు నయినకాటయ వేముని బాంధవము న్యూత చేసికొని రెడ్లు రాజమహేంద్రవరమున నొక నూతనరాజ్యము నిర్మించిరి. అల్లయవేమ, వీరభద్రా రెడ్లు ఈ రాజ్య నేతలలో ప్రధానులు. ఈ రాజ్యము చిరకాలము నిలవలేదు. ఉత్తరమున కళింగ గజపతుల యొక్కయు, దక్షిణమున విజయ నగరాధీశులయొక్కయు, పడుమట బహమనీసుల్తానుల యొక్కయు నొత్తిడివలన రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము రూపుమాసిపోయినది.

రెడ్లు కవులను, పండితులను ఆదరించి, పోషించి పేరందినవారు. కవిత్రయమువారిలో నొక్కఁడుగ ప్రసిద్ధిని గన్న ఎఱ్ఱాప్రెగ్గడయు, కవిసార్వభౌమబిరుదమునే కాక రాజాస్థానములందు స్వర్ణాభిషేకమునుగూడఁ బడసిన శ్రీనాథుఁడును రెడ్డిమన్నిలయాస్థానము నలంకరించినవారు. పెద కోమటివేమ, కాటయవేమాదులు సంస్కృతసాహితీసంపన్నులు; చక్కని గ్రంథములను రచియించి పేరుగాంచిరి. రెడ్ల నాఁడు జ్యోతిషాది శాస్త్రవిద్యలు బాగుగ వర్ధిల్లినవి.

హొయిసలులు :— మొదట కల్యాణిచాళుక్యులకు సామంతులుగ నుండి త్రిభువనమల్ల విక్రమాదిత్యుని యనంతరమునుండి ప్రముఖులయి వీ రొక స్వతంత్రరాజ్యమును నిర్మించిరి. ద్వారసముద్రము వీరికి రాజధాని. దీనికే యిప్పుడు హాళెవీడని పేరు. హొయిసలులలో మొదట ప్రసిద్ధికి వచ్చిన వాఁడు బిట్టిదేవుఁడు (క్రీ. శ. ౧౧౧౧ - ౧౧౪౧). ఇతని పూర్వులు జైనులుగ నుండి, జైనమతము నాదరించి, జినాలయములను గట్టించిరి. బిట్టిదేవుని కాలమున రామానుజాచార్యులు చోళ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



తంజావూరు రాజరాజేశ్వరాలయ గోపురము

(క్లిక్ అండ్ పెయెరల్ కంపెనీవారి యనుమతితో)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజులు పెట్టిన బాధలకు సహింపలేక హొయిసలరాజ్యమునకు పాఱిపోయి వచ్చి యారాజు నాశ్రయించి తుద కాతనికి వైష్ణవ మతము నిచ్చెను. నూతనమతము నవలంబించినపిదప బిట్టిదేవుఁడు విష్ణువర్ధననామమును ధరించి, పెక్కు విష్ణ్వాలయములను గట్టించెను. దూరస్థరాజ్యములందుఁగూడ హొయిసలపతాకను బ్రతిష్ఠించినవాఁడు రెండవ బల్లాలుఁడు (క్రీ. శ. ౧౧౭౩ - ౧౨౨౦). ఇతఁ డనేక సంగ్రామములను జయించిన మహాయోధుఁడు. ఇతని కాలమున హొయిసలరాజ్యము త్తరమున కృష్ణానదిని దాఁటినది. రెండవ బల్లాలునికిఁ దరువాత రెండవ నరసింహ (క్రీ. శ. ౧౨౨౭-౧౨౩౫), సోమేశ్వరుల (క్రీ. శ. ౧౨౩౮-౧౨౬౨) కాలమున హొయిసలులు చోళరాజకీయ వ్యవహారములందు జోక్యము కలిగించుకొని ప్రబలులయిరి. హొయిసలరాజులలోఁ గడపటివాఁడు మూఁడవ బల్లాలుఁడు (క్రీ. శ. ౧౨౯౧ - ౧౩౪౨). ఇతనినే వీర బల్లాలుఁ డందురు. ఈతని కాలముననే క్రీ. శ. ౧౩౧౧ లో మాలిక్ కాఫరు హొయిసల, కర్ణాట రాజ్యములపయి దండెత్తి వచ్చి ద్వారసముద్రమును ముట్టడించి, రాజు నోడించి, కప్పము నిర్ణయించుకొని వెడలిపోయెను. అటుపిదప స్వతంత్రుఁడగుటకు బల్లాలుఁడు చేసిన ప్రయత్నములవలన మహమ్మదీయులు మరల మరల దండెత్తి వచ్చిరి. ఈదండయాత్రల సంఘర్షణముననే హొయిసలరాజ్యము కూలిపోయినది.

హొయిసలులు గొప్ప యాలయ నిర్మాతలు; హొయిసలసంప్రదాయ మను నొకవిశిష్టరీతికి కారకులైరి. హొయిసల దేవాలయములయందలి వెలుపలిగోడలు అత్యంతరమణీయమయిన జిలుగుశిల్పపుఁబనితో విరాజిల్లుచు కంటికి విం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దొనరించుచుండును. హోయిసలదేవాలయము లన్నిటిలో బేలూరు చెన్నకేశవస్వామియాలయమును, హాళెవీటి హోయిసలేశ్వరాలయమును అత్యంతప్రసిద్ధములు; శిల్పచాతుర్య, సౌందర్యములందు ప్రపంచమున వీనికి సాటియైనవి లేవని కళావిదులచేత ప్రస్తుతింపఁబడినవి.

చోళులు:— పల్లవులను జయించి కాంచీపురము నాక్రమించుకొనిన ఆదిత్యవర్మ చోళరాజ్యమును స్థాపించెను. మొదట వీరికి తంజావూరు రాజధాని. చోళరాజు లందఱిలో మొదటి రాజరాజును (క్రీ. శ. ౯౮౫ - ౧౦౧౩), అతని కుమారుఁడు మొదటి రాజేంద్రచోళుఁడును (క్రీ. శ. ౧౦౧౧ - ౧౦౪౨) చాల గొప్పవారు. వీ రిరువురికాలమున చోళుల యధికారము దక్షిణహిందూదేశముననే కాక సముద్రాంతర దేశములందును, ద్వీపములందునుగూడ వ్యాపించినది. వీరిలో రాజరాజు పెక్కు రాజ్యముల నాక్రమించుకొనెను; గొప్ప నౌకాదళము నేర్పఱిచి తనకాలమున పెక్కు దీవులు జయించెను; తంజావూరియందు రాజరాజేశ్వరాలయమును గట్టించెను. ఈ కాలమున కల్యాణి చాళుక్యులు క్రమముగా విజృంభించుచుండుట చూచి తూర్పుతీరమునఁ గల వేంగీరాజ్యముతో మైత్రి శ్రేయస్కరమని రాజరాజు శక్తివర్మ సోదరుడయిన విమలాదిత్యునికి కుందవాంబ నిచ్చి పరిణయము కావించెను. ఈ నీతినే యవలంబించి, రాజరాజు కుమారుఁడయిన మొదటి రాజేంద్రచోడుఁడును, అతని తనయుఁడు రెండవ రాజేంద్రచోడుఁడును దమ కూఁతుండ్రు అమ్మంగదేవి, మధురాంతకులను వరుసగా చాళుక్య రాజరాజనరేంద్రునికి, నతని కుమారుఁడు రాజేంద్రచోడునికి నిచ్చి వివాహము చేసి వేంగితోడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెయ్యమును చిక్కఁబట్టిచిరి. రాజరాజచోళుఁడు గతించు నాఁటికి నేఁటి చెన్నరాజధానియే కాక మైసూరు, సింహళములయందలి చాలభాగము చోళులవశ మయినది. మొదటి రాజేంద్రుఁడు తండ్రికంటెను సమర్థుఁడు. ఈతని నౌకాదళము ప్రాక్సముద్రస్థితమయిన సుమత్రాద్వీపమునందలి శ్రీవిజయ రాజ్యముపయి దండెత్తివెళ్లి (దానికి రేవుపట్టణముగ నుండిన) కడారమును ముట్టడించెను. నౌకాదళ మీరీతిని సముద్రాంతరములమీఁదుగ చోళుల యధికారమును వ్యాపింపఁజేయుచుండ అతని సైన్యములు క్రీ. శ. ౧౦౨౩ ప్రాంతమున ఉత్తరదేశములపయి దాడివెడలి బంగాళము, బీహారములను బరిపాలించుచుండిన పాలవంశజుఁడగు మహీపాలు నోడించినవి. ఈ దండయాత్రయనంతరమున దానికి స్మరణచిహ్నముగ రాజేంద్రచోడుఁడు గంగైకొండబిరుదమును దాల్చుటయే కాక, తిరుచునాపల్లిమండలమున గంగైకొండచోళపుర మనుపేర నొక నగరమును గట్టించి దానిని తన రాజధానిఁ గావించుకొనెను. ఇతనికిఁ బిదప నితని తనయులు రాజాధిరాజ (క్రీ. శ. ౧౦౧౮-౧౦౫౨), రెండవ రాజేంద్ర (క్రీ. శ. ౧౦౫౦ - ౧౦౬౩), వీరరాజేంద్రులు (క్రీ. శ. ౧౦౬౨ - ౧౦౭౦) చోళరాజ్యమును పాలించిరి. వీరరాజేంద్రునితో ఆదిత్యచోళవంశ మంతరించినది. పిదప చోళ సింహాసనము నాక్రమించుకొనినవాఁడు రాజరాజనరేంద్రుని కొడుకగు చాళుక్య రాజేంద్రచోడుఁడు.

మాతామహరాజ్యమయిన చోళరాజ్యమును వశపఱుచుకొనినపిదప రాజేంద్రచోడుఁడు తన రాజధానిని రాజమహేంద్రవరమునుండి గంగైకొండచోళపురమునకు మార్చి కులోత్తుంగచోడుఁ డను పేరు దాల్చి చాళుక్య చోళరాజ్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను రెంటిని బరిపాలించెను. ఇతని కాలముననుండి చోళ రాజ్యమును పాలించిన యితనిసంతతివారికి చరిత్రమున చాళుక్యచోళు లని పేరు. చాళుక్యచోళులలో నీ కులోత్తుం గుఁడు చాల గొప్పవాఁడు. ఇతనికిఁ బ్రతినిధులుగ నితని తనయులు వేంగీచాళుక్యరాజ్యము నేలుచువచ్చిరి. కులోత్తుం గుఁడు చాల పరాక్రమవంతుఁడయి, కుంతల, పాండ్య, కళింగ, కేరళ, గాంగాదిదేశములను జయించి తన యధికారమును దక్షిణమున కన్యాకుమారివఱకు వ్యాపింపఁజేసెను. భూము లను గొలిపించి పన్నులు నిర్ణయించెను. భారముగ నుండిన పన్నులను దీసివైచెను. ఈతఁడు రాజ్యమేలినకాలము చాల విధముల ముఖ్యమయినది. ఇతని కాలముననే విశిష్టాద్వైత మతస్థాపకుఁడయిన రామానుజాచార్యులవారు విలసిల్లిరి. శైవ భక్తుల చరిత్రమును దెలుపు పెరియపురాణము కులోత్తుంగుని కాలముననే రచియింపఁబడినది. ఈతని యాస్థానకవియగు జయంగొండార్ కులోత్తుంగుని కళింగదండయాత్ర నభివర్ణిం చుచు "కళింగట్టుపరిణి" యను పేర నొకతమిళకావ్యమును వ్రాసెను. కులోత్తుంగునికిఁ బిదప చోళరాజ్యమును బాలిం చినవారు విక్రమచోళుఁడు (క్రీ. శ. ౧౧౧౮ - ౧౧౩౫), రెం డవ కులోత్తుంగచోళుఁడు (క్రీ. శ. ౧౧౩౩ - ౧౧౪౫) మొద లగు వారు పెక్కురు కలరు. రెండవ కులోత్తుంగునికి తరు వాతికాలమున చాళుక్యచోళులకు వేంగీచాళుక్యరాజ్యము పయిఁ గ్రమముగా నధికారపుపట్టు జాఱిపోయినది. మూఁడవ రాజరాజుకాలముననుండి చోళులయధికారము చాల క్షీణ దశకు వచ్చినది. సామంతులు ప్రబలులయిరి. మధుర పాండ్యులు విక్రమించిరి. తుదకు చాళుక్యచోళులు పాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్యుల యధికారమునకు లోఁబడి, ప్రాముఖ్యమును గోలు పోయి రాజకీయరంగముననుండి యదృశ్యులైరి.

చోళుల పరిపాలనము చాల కట్టుదిట్టముగ నుండెను. పరిపాలనసౌధమునకు గ్రామము పునాది. అగ్రహారమను నది యొకగ్రామభేదము. చతుర్వేదిమంగల మని దానికి నామాంతరము. ఇందు బ్రాహ్మణులుమాత్రమే నివసించు వారు. గ్రామవ్యవహారములను జక్కఁబెట్టుటకు పంచాయతీ సభయు, అగ్రహారవ్యవహారములను జక్క దిద్దుటకు మహాసభయు నుండెడివి. ఆయావర్ణములప్రతినిధులు పంచాయతీసభయందు సభ్యులుగ నుండువారు. మహాసభా సభ్యు లెల్లరును బ్రాహ్మణులే. మహాసభకు లోఁబడి, యగ్రహారమునందలి ప్రత్యేకవిషయములను జక్కఁబెట్టుటకు ప్రత్యేక సంఘము లుండెడివి. సభ్యుల కుండవలసిన యోగ్యతలు, వారి నెన్నుకొనుపద్ధతి చోళశాసనములు కొన్నిట విపులముగ వర్ణిత మయినది. అగ్రహార వ్యవహారములమీఁద రాజునకుఁ బెత్తన ముండెడిది కాదు. పరిపాలనసౌష్ఠవమునకు చోళరాజ్యము పెక్కుమండలములుగ విభాగింపఁబడినది. పెక్కుకోట్టములు లేక వలనాడులు కలసి యొకమండలము గను, పెక్కు నాఁడులు కలసి యొకకోట్టముగను నేర్పడు చుండెను. చాల గ్రామములు కలసిన దొకనాడు. గ్రామమునకు వలెనే, 'నాడు వ్యవహారములను' బరిశీలించుటకు 'నాడు'సభ యుండెను. పండిన పంటలో ఆఱవవంతు రాజు పన్నుతీయువాఁడు. పన్ను ధాన్యము రూపమునను, నాణెముల రూపమునను చెల్లుచుండెను. చోళులు గొప్పదేవాలయనిర్మాతలు. ఉన్నతమయినగోపురము చోళదేవాల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యముల విశిష్టలక్షణము. ఛోళులకాలమున ఆలయవాస్తు, శిల్పములు చక్కఁగ వర్ధిల్లి తత్కళలందు చోళసంప్రదాయ మొకటి యేర్పడినది. చోళయుగము మతావేశము తీవరిం చిన కాలము. శైవ, వైష్ణవములు ముదిరి, వానికి సంబంధిం చిన గాథలును, పురాణములును ప్రజారంజకములయినవి. సంస్కృతవిద్యావల్లరి పల్లవించి వేదవిద్యాశాఖ నన లెత్తినది. తమిళభాషను రామాయణము మొదలయినవి రచియించిన కంబరు మొదలగుకవు లీకాలమువారు.

పాండ్యులు:— క్రీస్తుశక మాఱవ, యేడవశతాబ్దుల నుండి పాండ్యులు ప్రముఖులయి పదవశతాబ్దివరకు దక్షిణ హిందూదేశమున నొకచిన్నసామ్రాజ్యమును గట్టుకొని, తమ పొరుగున నున్న పల్లవులతోను, అధికారమునకు బారలు సాచుచుండిన చోళులతోను తఱచుగ కలహించుచు వచ్చిరి. తుదకు ఆదిత్యవర్మ చోళరాజ్యమును స్థాపించిన పిదప అతని కొమారుఁడగు మొదటి పరాంతకుఁడు విజృం భించి మూఁడుతడవలు పాండ్యరాజ్యముపయి దండెత్తి వెల్లి వారిని పూర్తిగ నోడించెను. రాజరాజచోళ, రాజేంద్ర చోళాదులకాలమున పదవ, పదునొకండవశతాబ్దులందు చోళులే పాండ్యరాజ్యమునకుఁగూడ నధికారులయిరి. పం డ్రెండవశతాబ్ది కడపటిభాగమున చోళుల యధికారము క్షీణదశకు వచ్చుచుండినపుడు పాండ్యులు తాము గోలు పోయినయధికారమును మరల సంపాదింప గొప్ప ప్రయత్న ములు కావించి, తుదకు కృతకృత్యులైరి. ఈ కాలమున జటావర్మ సుందరపాండ్యుఁడు, జటావర్మ వీరపాండ్యుఁడు, మారవర్మ సుందరపాండ్యుఁడు, మారవర్మ కులశేఖరుఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొదలగు ప్రతాపమహితులయిన పాండ్యరాజులు సమర్థతతో రాజ్యమును బరిపాలించిరి. వీరిలోఁ గొందఱకాలమున పాండ్యరాజ ప్రతాపవాహిని కాంచీపురమునే కాక నెల్లూరు, కడపమండలములనుగూడ నాక్రమించినది. ఈ పాండ్యరాజులెవరెవ రెంతెంత కాలము పరిపాలించినది యింకను స్పష్టముగ నిర్ణయము కాలేదు. పదుమూఁడవశతాబ్ది చివరిభాగమున మారవర్మ కులశేఖరుఁడు రాజ్య మేలుచుండినప్పుడు మార్కొపోలో పాండ్యరాజ్యమునకు విచ్చేసి యారాజ్యవృత్తాంతమును వ్రాసెను. ఆకాలమున పాండ్యరాజ్యమునకు కాయల్ ప్రధానమయిన రేవుపట్టణము. పశ్చిమమున హార్మజు, ఏడెను, అరాబియాలనుండి గుఱ్ఱములను, ఇతర వర్తకపుసరకును గొని తెచ్చునౌక లీరేవును జేరుచుండెడివి. పాండ్యరాజ్యము ప్రాచీనకాలముననుండియు మంచిముత్యములకుఁ బ్రసిద్ధికెక్కినది. ముత్యపు చిప్పలను బట్టుకొని ముత్యములను సంపాదించుట మార్కొపోలోనాఁటికే లాభకరమయిన గొప్ప పరిశ్రమగ నుండెను. పదునాలుగవశతాబ్ది ప్రారంభమున మారవర్మకులశేఖర తనయులు సుందరపాండ్య, వీరపాండ్యులకు సింహాసనమునకయి పోరాటము సంభవించినది. ఈ సోదరులు కలహించుకాలముననే మహమ్మదీయులు మాలిక్‌కాఫరు నాయకత్వమున పాండ్యరాజ్యముపయి దండెత్తి వచ్చిరి. నాఁటనుండియే పాండ్యరాజ్యాధికారములు క్షీణించినవి. మహమ్మదు బిన్ తుఘ్లకుకాలమున మహమ్మదీయులు మధురపాండ్యరాజ్యముపయి దాడి వెడలివచ్చి పాండ్యుల నోడించి మధురయందు మహమ్మదీయరాజ్యమును నెలకొల్పి తమ యధికారమును స్థాపించిరి. మధురరాజధానిగ పరిపాలించిన మహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ్మదీయ సుల్తానులలో అలాయుద్దీన్ హాసన్‌షా మొదటి వాఁడు. ఇటు తరువాతికాలమునఁగూడ పాండ్యులు కొంద ఱు చిన్న రాజ్యముల నేలుచువచ్చినను వా రెవరికో యొక రికి సామంతులుగనే యుండువారు.

## మత పరిణామము

రాజపుత్రయుగ మంతయు నెడ తెగని సంగ్రామము లతో నెంత సంక్షోభము చెందినను దేశ మంతయు నవజీవ ముతో తొనఁకులాడి, నవశక్తితో నుత్సాహిత లూఁగిన కాల మిది. హిందూమతమును నిండుశక్తితో పరువులు వారించిన యుగ మిది. దీనికి కారణము రాజపుత్రుల యాధిక్యము. రాజపుత్రులు స్వభావముచేత పౌరుష, పరాక్రమమహితులు. అట్టివారికి అహింసాప్రధానమయిన బౌద్ధమునకంటె రామా యణ, మహాభారత వీరగాథలను సంకీర్తనముచేయు హిందూ మత మెక్కువగ నచ్చినది. బౌద్ధముతో చిరకాలమునసుండి కావించుచున్న పోరాటమువలన బలహీనతను జెందిన హిం దూమతముకూడ ఆత్మరక్షణముకొఱకు కట్టివారి ప్రాపుకొఱకు వెదకుచుండెను. తుద కీయుగమున పరస్పరాశ్రయాలంబన ములచేత రాజపుత్రులకువలెనే హిందూమతమునకును మేలు చేకూరినది. రాజపుత్రు లుత్తమక్షత్రియులుగ పరికీర్తితులయి సాంఘికముగ చాల గౌరవాధిక్యములను బడసిరి. రాజపు త్రుల యాదరాశ్రయములవలన హిందూమతము బౌద్ధము నందలి నిగ్గంతయు వెలార్చుకొని తుదకు దానిని నామమాత్రా వశిష్టము కావించినది. క్రీస్తు శకము పండ్రెండవ శతాబ్దినాఁటికి బౌద్ధమతమునకు జన్మభూమియే పరభూమియై నిలువ నీడకొఱ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కదిదేశాంతరముల పాలయినది. జైన మతమ్మంతరింపక చాళుక్య, హొయిసలరాజ్యములందును, రాజపుత్రస్థానమునందును గొంతకాలము వర్ధిల్లినది కాని హిందూమతోద్ధారకులగు కుమారిలభట్ట, శంకర, రామానుజాదుల వాదపుఁబోట్లవలన తూట్లువడి క్రమముగా కృశించియు, తుదకు హిందూమత సాదృశ్యముల ననేకము స్వీకరించి జీవము నిలుపుకొనినది.

ఈ యుగమున వేదవిరుద్ధములయిన మతములను ఖండించి, వేదవిహితము లయినవాని నుత్కర్షించి వ్యాపింపఁ జేసిన యాచార్యులు పెక్కు రుదయించిరి. ఇట్టివారిలో కుమారిలభట్టు ప్రథముఁడు. భట్టపాదుఁ డని యీతనికి నామాంతరము. ఇతఁడు ఆంధ్రోత్కల సంధిప్రదేశమున గంజాముజిల్లా యందలి జయమంగలముగ్రామమున జన్మించెను; పూర్వమీమాంసాసూత్రములకు భాష్యమును రచియించెను. పూర్వమీమాంసకే కర్మమీమాంస యనియుఁ బేరు. తన భాష్యమున నీతఁడు సమర్థించిన సంప్రదాయమునకే భాట్టమత మని పేరు. యజ్ఞయాగాదికర్మలవలననే మోక్షము కలుగునని యీతని సిద్ధాంతము. కుమారిలభట్టుకడపటికాలమున వర్ధిల్లిన యాచార్యోత్తముఁడు శంకరాచార్యులు. ఇతఁడు మలయాళదేశమున బ్రాహ్మణకుటుంబమున జనియించెను. సకలవిద్యావిశారదుఁ డితఁడు. బ్రహ్మచారిగ నుండియే సన్యాసమును స్వీకరించెను; ఆసేతుహిమాచలము, సంచారముచేసి బౌద్ధ జైనములను ఖండించి హిందూమతము నుద్ధరించెను; ప్రస్థానత్రయమునకు భాష్యములువ్రాసెను. బ్రహ్మసూత్రములు, బాదరాయణసూత్రములు అను నామాంతరములఁ బరఁగు వేదాంతసూత్రములు, భగవద్గీత, ఉపనిషత్తులు (ముఖ్యమయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవి పది) — ఈ మూఁటికి ప్రస్థానత్రయ మని పేరు. ఏపేర నారాధించినను పరమేశ్వరుఁ డొక్కఁడే; అతఁడే శివుఁడు. ప్రపంచము మిథ్య. పరబ్రహ్మమే సత్యము. జీవాత్మ పరమాత్మకు భిన్నముగఁ గన్పట్టినను అవి యభేదము. జ్ఞానమువలననే మోక్షము. ముక్తి కలిగిన జీవాత్మ పరమాత్మలో లీనమయి యద్వైతసిద్ధి నందును. ఇది శంకరాచార్యమతము. అద్వైత మని దీనికి పేరు. శంకరాచార్యమతము నవలంబించినవారిని స్మార్తు లందురు. మతవ్యవస్థ కట్టుదిట్టముగ నుండుటకయి ఇతఁ డుత్తరమున బదరీకేదారమునను, తూర్పున జగన్నాథమునను, దక్షిణమున శృంగేరియందును, పశ్చిమమున ద్వారక యందును ఆదిని నాలుగుపీఠములను స్థాపించెను. ఇవి యిప్పుడు పెరిఁగినవి. కుమారిలభట్ట, శంకరాచార్యస్వాము లెప్పటివారనువిషయమున వివాదు కలదు. వారు చాల పూర్వకాలపువారని కొందఱు, చాల ఇటీవలి కాలపువారని మఱి కొందఱు చెప్పుదురు. ఆధునికచరిత్రకారు లీయాచార్యులిరువురు వరుసగా నేడవ, యెనిమిదవశతాబ్దులం దుండిరని నిర్ణయించుచున్నారు. అనంతరము విలసిల్లిన యతఁడు రామానుజాచార్యులు. ఇతఁడు చెంగలుపట్టు జిల్లాయందలి శ్రీపెరుంబుదూరు గ్రామమున జన్మించెను; శంకరాచార్యమతమును నిరసించి ఖండించి యొకనూతనమతమును స్థాపించెను. విష్ణువే పరమదైవమని, భక్తి ప్రపత్తులవలనఁ గాని మోక్షము రాదని, ఈశ్వరాంశసంభవుఁడయినను జీవునికి మోక్షకాలమున పూర్తిగ నీశ్వరత్వము సిద్ధింపదని యీతనివాదము. ఇతని మతమునకు విశిష్టాద్వైతమని పేరు. ఈపంథ నవలంబించినవారిని శ్రీవైష్ణవు లందురు. ఇతఁడుకూడఁ దన సిద్ధాంతమునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రస్థానత్రయమునే యాధారముగఁ గొని వానిపయి భాష్యములు వ్రాసెను. రామానుజాచార్యకృతమయిన బ్రహ్మసూత్రభాష్యమునకు శ్రీభాష్యమని పేరు. శంకరాచార్యమతమువలెనే ఈతని మతమును శీఘ్రకాలముననే ఆసేతుహిమాచలమును వ్యాపించినది. రామానుజాచార్యుఁడు పదునొకండవశతాబ్దిని వర్థిల్లెనని, అప్పుడు కాంచీపురమును బాలించుచుండిన చోళరాజు శివభక్తుఁడయి యాతనిని దఱుమఁగొట్ట అతఁడు కాంచీపురమును విడిచి, హొయిసల రాజ్యమునకుఁ బోయి, యా చోళరాజు మరణానంతరమున శ్రీరంగమున కరిగి, యచటనే తన జీవితావశేషమును గడపెనని చెప్పుదురు. ఇతఁడు శంకరాచార్యునివలెనే సన్యాసము స్వీకరించి, తన సంప్రదాయమునకు చక్కని వ్యవస్థ నొడఁగూర్చుటకయి మఠములను స్థాపించెను. రామానుజాచార్యులవలెనే మధ్వాచార్య లొక నూతనసంప్రదాయమును స్థాపించెను. ఇతఁడు పండ్రెండవ శతాబ్ది కడపటిభాగమున కర్ణాటదేశమునందలి యుడిపి గ్రామమున జన్మించెను. ఇతఁడుకూడ శంకరాచార్యమతమును ఖండించి ప్రస్థానత్రయమునకు భాష్యములు వ్రాసి, జీవేశ్వరుల కెప్పుడు నైక్యములేదను ద్వైతమత సిద్ధాంతమును ప్రతిపాదించెను. ఈతనిమతము నవలంబించిన వారిని మాధ్వు లందురు. వీరి ప్రధానాచార్యపీఠము ఉడిపి యందుఁ గలదు. శైవ, వైష్ణవ మాధ్వమతములకు ప్రాధాన్యము కలుగుటతో పౌరాణికగాథలకు చేవ యబ్బినది. భక్తికి ప్రాముఖ్యము కలిగి దేవతారాధనము హెచ్చినది. దేవోప దేవత లసంఖ్యు లైరి. దేవతావిగ్రహనిర్మాణము కళ యైనది. పూజాకర్మకాండము పెర్గినది. మొదట గర్భైకమాత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగ నావిష్కరించిన యాలయము ప్రస్తారము నొంది కల్యాణ, విద్యా, రంగమండపాదులతో విస్తృతి చెందినది. తీర్థయాత్రలు, వ్రతానుష్ఠానాదిబాహ్యమతాచారములు అతిశయిల్లినవి. ఆదిమజాతులయందలి వేలువేలు తెగలవారు హిందూమతాచారముల నవలంబించి గిజిగీసికొని యెవరికి వారే చిన్నకులములుగ నేర్పడుచుండిరి. నాలుగువర్ణము లకుఁ దోడుగ నిట్టి కులవిభాగము లధికమయినవి. సంఘమున ఏకత్వ మంతరించి ప్రత్యేకత్వ మతిశయించినది. ఒక్క మతమునే యవలంబించి బ్రాహ్మణునికిఁ గల గౌరవప్రపత్తులు బ్రాహ్మణేతరునికి లేకపోయినవి. అంతటఁ గాలక్రమమున సంఘమున అసంతృప్తి జనించినది. ఈ యసంతృప్తికి రూపునొసంగి విప్లవధ్వజమును లేవనెత్తి హెచ్చుతగ్గులు న్యూనతాధిక్యములు లేకుండ సమముచేసి సంఘమునం తను ఒక్కపాశమున బంధించి ఏకముచేయఁ బ్రయత్నించినవాఁడు బ్రాహ్మణుఁడయిన బసవేశ్వరుఁడు; కల్యాణమున కలచురి బిజ్జలరాయనికి మంత్రిగ నుండినవాఁడు. ఇతఁ డుపనయనసంస్కారమును పరిత్యజించి యుపనయనాది వైదికకర్మ లనవసరమని, శివునిమీఁది భక్తియే ప్రధానమని, శివలింగమును ధరించినవార లెల్లరు జాతి, కుల, వర్ణ వివక్ష లేక సమానగౌరవప్రపత్తులు కలవారలయి పూజార్హు లగుదురని బోధించెను. ఇట్లు భక్తికి గొప్ప ప్రాధాన్యము నిచ్చి తన్మూలమున నా కాలమున వర్ణభేద, వర్ణాధిక్యములను దొలఁగింపఁ బ్రయత్నించిన గొప్ప సంస్కర్త యతఁడు. ఇతని మతమునకు జంగమమతమని, లిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాయతమతమని, వీరశైవమని పేరు. కర్ణాటదేశమున నిప్పటికి నీ మతము నవలంబించిన వారెక్కువగఁ గలరు.

కళలు వర్ధిల్లినవి. సంస్కృత, దేశీయవాఙ్మయస్రవంతులు పొంగినవి. సంఘము నవజీవముతో, నూతన చైతన్యముతో పులకరించినది. రాజపుత్రయుగ మట్టిది కావుననే యెనిమిదవశతాబ్దినుండి పండ్రెండవశతాబ్దివఱకు నాలుగు శతాబ్దులకాల మెడతెగక ప్రయత్నించినపిదపఁ గాని మహమ్మదీయులకు హిందూస్థానమున స్థావరము చిక్కలేదు. హిందూస్థానము చంద్రధ్వజమునకు లోఁబడినపిదపఁగూడ దక్షిణాపథస్థములయిన యాదవ, కాకతీయాదిరాజ్యములు చాలకాలము హిందూసంస్కృతి, సభ్యతల నఱచేతఁ బెట్టుకొని పూజించుచు, తుదకుఁ దమప్రాణముల నొడ్డియుఁ గాపాడుటకు ప్రయత్నించినవి. ఈ ధర్మసంరక్షణమునఁ, గట్టకడపట భస్మీభూతమయినది కాకతీయాంధ్రుల త్రిలింగ సామ్రాజ్యము. ఈ పవిత్రభస్మము నభిమంత్రించి, తపశ్శాలియయిన విద్యారణ్యమునీంద్రుఁడు తుంగభద్రానదీతీరమున విజయనగరసామ్రాజ్యవిభూతిని నూలుకొల్పెను.

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7850


Jangamwadi Math Collection. Digitized by eGangotri

